# ఆంధ్రపత్రిక

## ఆఱవ సంవత్సరాది సంచిక

ఇందు

## ఐరోపా మహాసంగ్రామ చరిత్రము

విశేషాంశము

సంగ్రామచరిత్రము విద్వాంసులగు ఆంధ్రప్రముఖులచే మనోహరముగ వర్ణింపబడినది. చక్రవర్తులు చక్రవర్తినులు సేనానాయకులు సైన్యనివహములు రణరంగములు విమానములు యుద్ధనౌకలు దేశములు మున్నగు వస్తువులను ప్రత్యక్షీకరించెడి పటములును చిత్రపటములును విశేషముగ కలవు.

ఆంధ్రపత్రికా ముద్రాలయమున ముద్రితము: ఆంధ్రపత్రికాధిపతిచే ప్రకటితము
6 & 7, తంబుసెట్టి వీధి, జార్జిటవును, మదరాసు
1915-వ సంవత్సరము జూలై నెల 14-వ తేది

# విషయానుక్రమణిక

# ప్రస్తావన

శ్లో. ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే । నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః

చాంద్రమానాబ్దాదిని సంవత్సరాదిసంచిక ప్రచురించుట యాచార మైనది. సంవత్సర మారంభమై నాలుగు మాసములు గడచినవి. ఆయిన సంవత్సరాది సంచికను ప్రచురించుటయం దాలస్య మైనది. కారణ మనర్థపరంపరలకు మూల మైన మహాసంగ్రామము. ఆనందనామసంవత్సరాంతము భయంకరము. గతసంవత్సరఫలములందు యుద్ధము ప్రముఖము. మహాసంగ్రామము విప్లవమయము, లోకవ్యాప్తము, అదృష్టపూర్వకము, ధర్మసంస్థాపనానుకూలము. ఆనందవత్సరారంభమునం దీ ఘోరసంగ్రామ మజ్ఞాతము. ఏఁడాదిని లోకమునకు రానున్న విపత్పరంపరలు దురవగాహములు. మూఁడు మాసములు ముగిసినవి. నాల్గవ మాసమునందు యుద్ధము దాపరించినది; బడబానలమువలె లోకము నావరించినది. సంక్షోభ మంకురించినది. విప్లవ మేర్పడినది. విపత్పరంపరలు మూఁడినవి. దండధరుఁడు విలాసార్థమై విహరించుట కుపక్రమించెను. కాలువ కొక యేఁడు నిండినది. ఆనందవత్సర మంతము నొందినది. రాక్షస సంవత్సర మారంభ మైనది. సంగ్రామదావానలము వ్యాపించినది; సకలరాజ్యములను చుట్టుకొనినది; లోకసంహారమున కుపక్రమించినది. ఆ యుపక్రమణము రాక్షసనామ సంవత్సరము నందు గోచరము.

### వర్తమాన సంవత్సర ఫలము

రాక్షసనామ సంవత్సరమునకు రాజు కుజుఁడు: దానికి ఫలము రాజులకు యుద్ధములు, లోకదహనము; మంత్రి కుజుఁడు; ఫలము యుద్ధములు, మందవృష్టి, లోకదహనము; సేనాధిపతి కుజుఁడు: ఫలము ఘోరసంగ్రామము, ప్రజాదుఃఖము; గ్రామపాలకుఁడు కుజుఁడు: ఫలము గ్రామములం దగ్నిభయము, క్షుద్బాధ, శస్త్రవృష్టిసంజాత మైన పీడ; దండనాయకుఁడు కుజుఁడు: ఫలమగ్నిభయము, రోగపీడ; మేఘాధిపతి కుజుఁడు: ఫలము మహావాయువు, స్వల్పవృష్టి (మతాంతరమున చంద్రుఁడు: ఫలము మంచివానలు, పాడిపంటలు) సస్యాధిపతి శుక్రుఁడు: ఫలము జలధాన్యసమృద్ధి, తెల్లభూముల పంటలు; నీరసాధిపతి శుక్రుఁడు: ఫలము కర్పూరాగురుగంధములు వృద్ధి, బంగారు ముత్యములు బట్టలు వృద్ధి; పురోహితుఁడు శుక్రుఁడు: ఫలము క్షేమారోగ్యములు; పరీక్షకుఁడు శుక్రుఁడు; ఫలము పాడిపంటలు; ధాన్యాధిపతి బుధుఁడు: ఫలము మధ్యమవృష్టి, మందసస్యములు, రాజులకు పీడ; అర్ఘాధిపుఁడు చంద్రుఁడు: ఫలము సువృష్టి, అభివృద్ధి; దైవజ్ఞుఁడు చంద్రుఁడు: ఫలము మంచివానలు, మంచి పంటలు; రసాధిపతి శుక్రుఁడు: ఫలము శూన్యార్ఘము, నూనె పంటలకు హాని; గణకుఁడు శని: ఫలము గణకులకు మాంద్యము, నూనెవస్తువుల పంటలు; పశునాయకుఁడు గోపాలకృష్ణుఁడు: ఫలము పశువృద్ధి, సుభిక్షము.

రాక్షసనామసంవత్సరమునందు కుజుని బలము ప్రబలుటవలన సంగ్రామాది విప్లవంబులు కలుగు నని దైవజ్ఞుల నిర్ణయము. వర్తమాన సంగ్రామస్థితి యా నిర్ణయంబుల కనుకూలంబుగ నున్నది.

### సంవత్సరాది సంచిక

ఆనందనామ సంవత్సరమునం దారంభమైన మహాసంగ్రామము రాక్షసనామ సంవత్సరమునందు బలతరమైనది. సంగ్రామమువలన సకలవిషయములందును స్థితిగతులు మారినవి. యూరపు రాజ్యములు యుద్ధమునందు మునిఁగినవి. పరిశ్రమలు చెడినవి. వ్యాపారము తగ్గినది. సంపదలు తఱిఁగినవి. యంత్రాలయములు యుద్ధసామగ్రులను సిద్ధము చేయుటకై వినియోగింపఁబడినవి. పొగయోడలు యుద్ధసన్నాహములకై యుపయోగింపఁబడినవి. పాశ్చాత్యపరిశ్రమలపై నాధారపడియున్న హిందూదేశపు వ్యాపారపరిశ్రమలకు పనిపాటులకు భంగము కలిగినది. నియతకార్యములందు వ్యత్యాస మేర్పడినది. సంవత్సరాదిసంచికను నియతరీతిని ప్రచురించుట యసాధ్య మైనది. విదేశములనుండి మార్గశీర్ష మాసమునందు చేరవలసిన కాగితములు యంత్రాద్యుపకరణములు చైత్రమాసమునందు

చేరినవి. చేరిన తరువాత నింత పెద్ద పుస్తకమును— అనేక దేశపటములను, యుద్ధపటములను, మహాజనుల పటములను, వ్యాసములను చేర్చి—ప్రచురించుట యందుఁ గల ప్రయాసము విచారశీలురకు విదితము.

ఆనంద సంవత్సరాదిసంచికను ప్రచురించుట యందు కలిగిన కాలాతీతమునకు యుద్ధముతోఁ బాటు దినపత్రిక కూడ కొంతవఱకు తోడ్పడినది. అచ్చు యంత్రములు దినపత్రిక పనితో నిండినవి. సంగ్రామమువలన సంచికయందు నూతనపద్ధతి నవలంబించుట కూడ నవసరమైనది. ఈ సంచికయందు గతసంచికలందువలె కేవలము మహాజనుల వ్యాసములే కాక లోకదృష్టి నాకర్షించు యుద్ధచరిత్రము యుద్ధమునకు సంబంధించిన విశేషాంశములు కూడ ప్రకటింపఁబడినవి. తెలుఁగు భాషయందు యూరపురాజ్యముల పటములను యుద్ధపటములను సిద్ధము చేయుటయందుఁ గల సాధకబాధకములను వ్యయప్రయాసములను పాఠక మహాశయులు నిర్ధారణ చేయనోపుదురు. సంచికయొక్క ప్రతులను 10,000 ముద్రించుటయందుఁ గల ప్రయాసమును కూడ కార్యజ్ఞులు గ్రహింపఁ గలరు. పై కారణములచే సంవత్సరాదిసంచికను ప్రకటించుటయం దేర్పడిన యాలస్యమును చందాదారులు మన్నింతురుగాక!

దినపత్రిక

ఆనందసంవత్సరారంభమున నాంధ్రపత్రిక దినపత్రికగ వెలువడినది. దినపత్రికను నిర్వహించుట యందుఁ గల సాధకబాధకము లాంధ్రమహాజనులకు విదితములు. దేశబాంధవుల సహాయపోషణములవలనను భగవదనుగ్రహమువలనను దైనికపత్రికానిర్వహణమున నొక యేఁడు గడచినది. ఆ కాలమున నాంధ్రపత్రిక యథాశక్తిని దేశసేవ చేయుటకై పాటుపడినది. ఆ పరిశ్రమయందలి గుణదోషములను నిర్ణయించుటకు పత్రికాపాఠకులె యర్హులు. నూతనప్రయత్నములు సామాన్యముగ లోపభూయిష్ఠములు. ఆంధ్రప్రపంచమునకు దినపత్రికాప్రచురణము నూతనము. పత్రికానిర్వాహకులకు, పాఠకవర్గమునకు, లేఖకులకు, పోషకులకు, చందాదారులకు తెలుఁగు దినపత్రిక నూతనము. నూతనప్రయత్నములం దుండు లోపములు సహజముగ నాంధ్రదినపత్రికయందును కలిగియుండును. కాని యాంధ్రప్రపంచమునం దుదయించిన గాఢమగు దేశాభిమానభాషాభిమానములును మహాసంగ్రామమును పత్రికాభ్యుదయమునకై తోడ్పడినవి. పత్రికాభ్యుదయమునకై తోడ్పడిన దేశబాంధవులకు పత్రికానిర్వాహకులు కృతజ్ఞులు. దేశబాంధవుల సహాయప్రోత్సాహములవలన పత్రికోపయోగమును వ్యాపింపఁజేయుట కవకాశము గలదు.

దేశభాషలందు దినపత్రికను ప్రచురించుటకు వ్యయప్రయాసములు మెండు. తంత్రీవార్తలకై సంవత్సరమునకు 12,000 రూపాయలను చెల్లింపవలెను. కాగితములకు ముద్రణమునకు పనివాండ్రకు నిర్వాహకులకు సంపాదకులకు విశేషమైన ద్రవ్య మవసరము. ద్రవ్య మున్నను, నిర్వహణభారము దురారాధ్యము. దేశభాషాపత్రికానిర్వాహకులపట్ల పాలకపాలితులకు గౌరవము తక్కువ, అధికార మధికము. నిర్వహణభారము క్రమక్రమముగ తగ్గి పత్రిక నిర్విఘ్నముగ ప్రచురిత మగుచు సత్యాంతమైన ప్రతిభతో దేశసేవ చేయు సామర్థ్యమును పొందునటులు సహాకారు లగుటకు దేశబాంధవులు ప్రార్థితులు.

పరస్పరసంబంధము

పత్రికావ్యాపనమునకును సంవత్సరాదిసంచికకును సన్నిహితసంబంధము గలదు. పత్రికాప్రచారము హెచ్చినకొలఁది లేఖకులు చందాదారులు వర్ధిలి సంచికను బాగుగ ప్రచురించి జనోపయోగకరముగ చేయుటకు వీ లుండును. పత్రికాప్రచారము తగ్గినపుడు సంచికను ప్రచురించుటకు కూడ నవకాశములు తగ్గును. పాఠకుల సంఖ్య హెచ్చినపుడు వ్యాసలేఖకులు గ్రాహకులు ప్రబలి సంచికకు స్వయంపోషణ మేర్పడి మంచి వ్యాసములు గలిగిన చక్కని సంచిక ప్రచురిత మగును. పత్రికకువలె సంచికకును దేశబాంధవుల సహాయ మత్యవసరము గాన, నుచితరీతిని రెంటిని పోషించి పెంచుటకు భాషాభిమానులు ప్రార్థితులు.

వ్యాసములు

ఆనంద సంచికయందు 15 వ్యాసములు ముద్రింపఁబడినవి. అందు ప్రాచి-ప్రతీచి, నిర్బంధసైనికసేవ, వ్యవసాయము, రజస్వలావివాహములు, దేశచరిత్ర-నవలలు, ఆంధ్రోద్యమతత్త్వము, మన గొప్ప దురవస్థ-దానిని

తొలఁగించు నుపాయము, వ్యవసాయము-యుద్ధము, పరపతిసంఘములు, యుద్ధము-హైందవులు, కర్ణాటక గానము, హోమొపతి మొదలగు విషయములకు సంబంధించిన వ్యాసములు గలవు. యుద్ధము, రాజభక్తి, గోపాలకృష్ణగోఖలె, భయము, సత్యము మొదలగు విషయములను వర్ణించు పద్యములు గలవు. ఈ యేఁడు యుద్ధవిషయములు నూతనంబు లగుటంజేసి యుద్ధమునకు సంబంధించిన వ్యాసము లెక్కువగ చేర్పఁబడినవి. వ్యాసములందలి గుణాగుణములను పాఠకమహాశయులు నిరూపింప నర్హులు.

"ఐరోపామహాసంగ్రామచరిత్ర" అను వ్యాసమునందలి నాలుగు ప్రకరణములను వ్రాసిన ఎమ్. వేంకటరంగయ్యగారికి పత్రికానిర్వాహకులు కృతజ్ఞులు. వీరు చరిత్రయందు ఎమ్. ఏ. పరీక్ష నిచ్చి యుత్తీర్ణులై విజయనగరము మహారాజుగారి కళాశాలలో చరిత్రోపాధ్యాయపదవియం దున్నారు. ఆ వ్యాసమునందు యుద్ధకారణములు, యుద్ధమును చేయు రాజ్యముల బలాబలములు, ఐరోపారాజ్యముల రాజనీతి మొదలగు విషయములు విపులముగ వివరింపఁబడినవి. ఆ నాలు గధ్యాయముల తరువాత, పండ్రెండు మాసములందును జరిగిన యుద్ధవ్యూహములు యుద్ధములు సంక్షేపముగ వర్ణింపఁబడినవి. యుద్ధమునం దుపయోగింపఁబడుచున్న కోటలు, కందకములు, ఫిరంగులు, గుండ్లు, విమానములు, జలాంతర్గామినులు, నీటిగనులు మొదలుగాఁ గల విషయములు చిత్రపటముల సమేతము ప్రచురింపఁబడినవి. యుద్ధము చేయుచున్న ఫ్రాన్సు, జర్మని, బెల్జియము, రుష్యా, ఇంగ్లాండు మొదలగు రాజ్యముల సంక్షేపచరిత్రములు పటములతో కూడ ముద్రింపఁబడినవి. ఆకాశయానములను గురించి ప్రత్యేకవ్యాసము ప్రచురిత మైనది.

### చిత్రపటములు

గత సంచికల యందు హైందవప్రముఖుల యొక్కయు ఆంధ్రప్రముఖుల యొక్కయు చిత్రపటములు విశేషించి ముద్రింపఁబడినవి. ఇంక ముద్రింపదగిన చిత్రపటములు విశేషముగ నున్న వని తోఁచదు. ఒకవేళ నున్నను నవి సౌలభ్యములు గావు. గతసంవత్సరమునందును వర్తమానసంవత్సరమునందును సకలజనుల నాకర్షించిన ముఖ్యవిషయము మహాసంగ్రామము. ఆ సంగ్రామమునకు సంబంధించిన నూతనాంశము లనేకములు గలవు. అందు దేశముల స్థితిని తెలుపు దేశపటములు ముఖ్యములు. పడమటి యుద్ధరంగమును, హిందూదేశమును, యూరపుఖండమును, బ్రిటీషు జర్మను ఫ్రెంచి సామ్రాజ్యములను తెలుపు రంగుల దేశపటములు ముద్రింపఁబడినవి. ఫ్రాన్సు, జర్మని, రుష్యా, తుర్కి, ఇటలి, ఆస్ట్రియా, ఆఫ్రిక మొదలగు దేశముల పటములు, లీజి, నామూరు, ఆంట్వర్పు మొదలగు స్థలముల పటములు, తూర్పున పడమటఁ గల యుద్ధరంగముల పటములు మొదలైన వివిధపటములు చేర్పఁబడినవి. యూరపు చక్రవర్తుల, సేనాధ్యక్షుల, యోధుల, సైనికుల, యుద్ధరంగముల ప్రత్యేకమైన రంగుపటములు 160 గలవు. ఇవి గాక, యుద్ధమునకు సంబంధించి నల్లసిరాతో ముద్రించిన పటములు 200 గలవు.

దేశభక్తులలో నగ్రగణ్యుఁడును, ప్రజ్ఞానసంపన్నుఁడును, త్యాగశీలుఁడును, కీర్తిశేషుఁడును నైన గోపాలకృష్ణ గోకలె రంగుల పటము చేర్పఁబడినది.

పైన వివరించిన పటములతోఁ బాటు ఆంధ్రమహాజనుల చిత్రపటములు కొన్ని ప్రచురింపఁబడినవి. శేషించిన పటములు వలసంచికయందు ప్రచురింపఁబడును.

### ముఖపటము

ముఖపటము క్రొత్తరీతిని ముద్రింపఁబడినది. చిత్రకారుఁడు వంగదేశీయుఁడు గాన భావరూపవిలాసములు వంగీయసాంప్రదాయముల కనురూపముగ వర్ణింపఁబడినవి. గోపాలకృష్ణగోకలె స్థూలదేహమును విడిచినను, సూక్ష్మదేహముతో భరతవర్షాభ్యుదయమునకై తపం బొనరించుచున్నాఁడు. భారతమాత తన ప్రియసంతతికి గోపాలకృష్ణగోకలె పవిత్రజీవితమును నిదర్శనముగ చూపుచు శ్రేయఃప్రాప్తికై పుష్పాంజలి సమర్పించుచు, బ్రిటీషు సామ్రాజ్య విజయమును భారతజాతీయాభ్యుదయాదివరప్రసాదములను దయచేయు మని సర్వేశ్వరు నారాధించుచున్నది.

లోకము త్రిగుణాత్మకము. సత్త్వరజస్తమోగుణములు సృష్టిస్థితిలయములకు కారణములు. తామసావృతమైన రాజసభావము వర్తమాన మహాసంగ్రామమునకు మూలము. విజయసాధనంబులైన సైనికులు,

యుద్ధనౌకలు, విమానములు, శతఘ్నులు, నిప్పుగుండ్లు, ముండ్లతీఁగెలు, పార్శ్వములందు చిత్రితములు. అయ్యవి రాజసభావచిహ్నములు. ఆంగ్ల హైందవ సైనికుల సంయోగబలమువలనను రాజస సాధనసంపదలవలనను, బ్రిటీషు విజయపతాకము సుస్థిరస్థాపితము. రాజసభావము భౌతికసుఖసంపదలకు సాధనభూతంబైనను, సాత్త్వికభావమువలె ప్రశాంతంబైన లోకకల్యాణంబునకు పరమసాధనంబు గాదు.

మహాసంగ్రామంబులకు నిలయంబైనను, భరతఖండంబునం దవతరించిన సత్త్వసంపన్నులు నిరపాయంబైన శాశ్వతసుఖంబునకు మార్గదర్శకులు. వ్యాస వశిష్ఠాదిమహర్షులు, శుకాదియోగీంద్రులు, బుద్ధదేవుఁడు, శంకరరామానుజాద్యాచార్యవర్యులు సాత్త్వికగుణసంపన్నులు. గోపాలకృష్ణగోకలె, మోహనదాసకరుణాసాంద్రగాంధులు సాత్త్వికవిజయవిశ్వాసులు. భారతజనని రాజసచిహ్నములచే పరివృత యయ్యును, తన ముద్దుబిడ్డలకు దేశాభ్యుదయమూలములును, సాత్త్వికభావసంజాతములును, చిరవర్ధితములును నైన సారస్వతకళాద్యార్యసంపదలను సుమనఃపూర్వకముగ నిచ్చి వారిని భావిభాగ్యోదయమునకై హెచ్చరించుచున్నది. భారత జననీ పరిస్థితులు పావనంబులు, రమ్యంబులు, గంభీరంబులు, ప్రశాంతంబులు. పవిత్ర దేవాలయంబులు, ఉన్నతనగంబులు, సుందరవనంబులు, నదీప్రవాహంబులు ప్రశాంతస్థితిద్యోతకంబులు. జాతీయాభ్యుదయమున కవసరమైన గుణములు, పరిశ్రమలు, కళలు, విజ్ఞానము పుష్పాంజలిరూపమునను రాజసచిహ్నములు పార్శ్వములందును వర్ణింపఁబడినవి. ఈయుదారభావముల నాంధ్రులు గ్రహించి యాంధ్రప్రపంచాభ్యుదయమునకును భరతవర్షాభ్యుదయమునకును పాటుపడుచు గోపాలకృష్ణగోకలెవలె తమ జీవితములను దేశారాధనకై సమర్పించుచు భారతమాత మన్ననలకును సర్వేశ్వరుని దయకును పాత్రు లగుదురుగాక!

వందనములు

గతసంవత్సరంబులందువలె నీయేఁడును సంచికకుపయోగకరములైన వ్యాసములను వ్రాసి సాహాయ్యము చేసిన దేశబాంధవుల కనేకవందనములు. ప్రచురణార్థమై చిత్రపటముల నంపిన మహాజనులకును, చందాదారులకును, పోషకులకును, నితరవిధమున సహాయము చేసిన దేశబాంధవులకును వందనశతములు. కార్యాలయమునకు చేరిన వ్యాసములలోను పటములలోను కొన్ని యనివార్యములైన యాటంకములవలన ముద్రితములు కానందులకు పత్రికానిర్వాహకులు చింతిలుచు ప్రేషకుల మన్ననను వేఁడుచున్నారు. శేషించిన వ్యాసములును పటములును రాఁగల సంచికయందు ప్రచురించుట కేర్పాటు చేయఁబడును. పంపినవారు ముందీ విషయమును జ్ఞాపకము చేయుట యవసరము.

ఇన్ని పటములను ప్రశస్తమైన వ్యాసములను కలిగి మంచి కాగితములపై బాగుగ ముద్రితమైన యీ సంచిక ఆంధ్రపత్రిక చందాదారుల కొక రూప్యము వెలకే యియ్యఁబడుచున్నది. సంచికను ప్రచురించుటయందుఁ గల వ్యయప్రయాసములను, లాభనష్టములను చందాదారులు గమనించెదరుగాక!

లోకసంక్షోభకరం బగు భీకరసంగ్రామముతో నారంభమైన రాక్షససంవత్సరము లోకచరిత్రమందు సుఖప్రదంబై కల్యాణకరంబై ప్రసిద్ధి పడయుటకును, సకలజనులును సుఖులై యుండుటకును దయామయుఁడైన సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!

# గతసంవత్సర వృత్తాంతములు

### ప్రజాసభ్యత—జాతీయస్వాతంత్ర్యము

ఆనందనామ సంవత్సరము భీకరసంగ్రామ సంకలితంబైనను, లోకచరిత్రమునందు కాలాంతరమున శాశ్వతంబైన ప్రశస్తిని పడయఁగలదు. ఐరోపామహాసంగ్రామము ప్రస్తుతము దారుణంబైనను, కాలక్రమమున సౌమ్యము కాఁగలదు. పందొమ్మిదవ శతాబ్దపు చరిత్రను పరిశీలించినవారలకిట్టి నిండు విశ్వాసము తప్పక జనించును. పదునెనిమిదవ శతాబ్ద మంతమందు యూరపురాజ్యములలో ప్రజాసభ్యత లేదు. వ్యక్తిస్వాతంత్ర్యము ఫ్రెంచి పరివర్తనముతో పుట్టినది. అంతకు పూర్వము ప్రజాసామాన్యము మతజాడ్యమునకును, కులాభిమానమునకును, ధనాంధత్వమునకును బలియగుచుండెను. ఫ్రెంచి పరివర్తనము, అమెరికా సంయుక్త రాష్ట్రస్థాపనము ప్రజాసభ్యతను సుస్థిరముగ స్థాపించినవి. రాజ్య విప్లవకారుఁడైన నెపోలియను 1815-వ సం. నందు పరాజితుఁడైన పిదప, ప్రజాసభ్యతకు జాతీయస్వాతంత్ర్యము జతపడినది. పందొమ్మిదవ శతాబ్దమునందు ప్రజాసభ్యత్వభావము జాతీయస్వాతంత్ర్యభావము వర్ధిల్లినవి. 1832-వసం. నందు గ్రీసు, 1832-వ సం. నందు బెల్జియము, 1860-వ సం. నందు ఇటలీ, 1879-వసం. నందు బల్గేరియా, రుమేనియా, సర్వియా, మాంటినిగ్రోలు స్వతంత్రరాజ్యములుగ సంగీకరింపఁబడినవి. పందొమ్మిదవ శతాబ్దమునందు యూరపురాజ్యములలో ప్రజాసభ్యతకై పరివర్తనము లేర్పడుచుండెను. ఇరువదవ శతాబ్దము ప్రారంభమున దేశాభ్యుదయమునకును ప్రజాప్రబోధమునకును ప్రజాసభ్యతయు జాతీయస్వాతంత్ర్యమును ముఖ్యసాధనము లని స్థిరపడినది.

### స్వార్థపరత్వము, పరార్థపరత్వము

మానవ ప్రకృతియందు రెండు భావములు వ్యక్తములు—స్వార్థపరత్వము, పరార్థపరత్వము. స్వార్థపరత్వమువలన సంతృప్తికలుగక నిరంతరము ఖేదము కలుగుచుండును. స్వార్థపరత్వము నాత్మరక్షణ మని భ్రమింపఁజనదు. ఆత్మరక్షణము ధర్మానుకూలము, స్వార్థపరత్వము ధర్మప్రతికూలము. పరార్థపరత్వము ధర్మానుకూలము. వ్యక్తులనువలె జాతులను గూడ నీ యుభయభావములు కర్మపరతంత్రులను చేయుచుండును. పరదేశములను సయితము స్వలాభమునకుఁ గాని పరుల లాభమునకుఁ గాని యేలుటకు వీలు గలదు. బ్రిటీషు సామ్రాజ్యమునందు సకలదేశములును క్రమక్రమముగ స్వాతంత్ర్యమును పడయుచున్నవి. 19-వ శతాబ్దమునం బారంభమైన ప్రజాసభ్యత్వభావమును జాతీయస్వాతంత్ర్యభావమును ఇరువదవ శతాబ్దమునందు స్థిరపడవలయును. రాజ్యవిప్లవకారుఁడైన నెపోలియను 1815-వ సం. నందు సంయోగబలముచే పూర్ణముగ నోడింపఁబడెను. లోకమునకీ ముప్పు తప్పినూ రెండ్లు గతించినవి. జాతీయవిప్లవకారుఁడైన విలియము కెంజరునకును నీ దురవస్థ 1915-వసం.నందు సంభవించుటనైవనిర్ణయము కావచ్చును. పందొమ్మిదవ శతాబ్దమునందు స్థాపితములైన ప్రజాసభ్యతయు జాతీయస్వాతంత్ర్యమును ఇరువదవ శతాబ్దమునందు స్థిరపడి విజృంభించుటకై దైవ మైరోపామహాసంగ్రామమును సాధనంబుగఁ గైకొనియుండును.

### హైందవసైన్యములు

ఇమ్మహాసంగ్రామమునందు బ్రిటీషు సామ్రాజ్యము చేరుటవలన సామ్రాజ్యాంతర్భాగము లన్నియు చేరి సామ్రాజ్యవిజయమునకై ధనమును ప్రాణములను నర్పించుచున్నవి. భరతఖండము కూడ నుచితరీతిని సంగ్రామమునందు పాల్గొన నారంభించినది. వివిధరణరంగములకు హిందూదేశమునుండి 2,00,000 మంది సైనికులు పంపఁబడిరి. హైందవసైనికులు పారసీకము, ఈజిప్టు, ఆఫ్రికా, బెల్జియము, తుర్కి, ఫ్రాన్సు దేశములందు బ్రిటీషుసామ్రాజ్య సంరక్షణమునకై పోరాడుచు ప్రాణములను సమర్పించిన విధము పత్రికాపాఠకులకు విదితము. దర్వానుసింగు నేగి, ఖుదాదాదు, గంగాసింగు మొదలగు వీరులు తమ సాహసపరాక్రమములవలన విక్టోరియా పతకములను గడించిన యుదంతము పత్రికాపాఠకులకు తెలిసియున్నది. యుద్ధమునకు పోయిన బ్రిటీషు సైన్యములకు బదులు బ్రిటీషు ద్వీపములనుండి టెరిటోరియలు పటాలము లిండియాకు పంపఁబడినవి.

యుద్ధరంగమునకు పంపఁబడిన పటాలముల వ్యయము నిండియాదేశము భరించునట్లు తీర్మానింపఁబడినది.

### హైందవుల రాజభక్తి

మహారాజులు, నవాబులు, శ్రీమంతులు, యుద్ధనిధికి ద్రవ్యము నిచ్చిరి. మైసూరు మహారాజు 50 లక్షలు, నైజాము 60లక్షలు యుద్ధనిధి కిచ్చిరి. అన్ని రాష్ట్రములందును యుద్ధసహాయనిధు లారంభింపఁబడినవి. లక్షల కొలంది ధనము వసూలైనది. చెన్న రాష్ట్రమునందు వసూలైన ధనమును వ్యయము చేసి వైద్యసహాయనౌక నిర్మింపఁబడినది. సంస్థానాధీశులు తమ రాజ్యములలోని పటాలములను యుద్ధరంగమునకు పంపిరి. ప్రజలు రాజభక్తితత్పరులై సభలు చేసి ప్రభుభక్తిని విశదీకరించిరి. హైందవుల గాఢమైన ప్రభుభక్తికి జార్జిచక్రవర్తి, రాజప్రతినిధి, బ్రిటీషు ప్రజలు—అందఱు నాశ్చర్యభరితులై సంతసించిరి. దేశమునం దచ్చటచ్చట రాజద్రోహకార్యములు పొడ సూపుచున్నను, హైందవుల నిశ్చలమైన రాజభక్తి యందు పాలకజాతికి గట్టి నమ్మకము కలిగినది. రాజనీతిజ్ఞులు యుద్ధానంతరము హిందూదేశపరిపాలనమునందు నూతనశక మేర్పడవలయు నని శ్లాఘించిరి. హైందవుల రాజభక్తిని శంకించిన సంశయాత్ముల ప్రలాపములు కట్టుపడినవి. యుద్ధమువలన బ్రిటీషుద్వీపవాసులకు హిందూదేశపు ప్రముఖత వెల్లడి యైనది.

### నౌకాబలము

ఆంగ్లనౌకాబలరక్షణమువలన హిందూదేశపు వర్తక వ్యాపారములు నిర్భయముగ సాగుచున్నవి. సెప్టెంబరు అక్టోబరు నెలలలో మాత్ర మెమ్డెను భయమువలన హిందూమహాసముద్రమునందు వర్తకవ్యాపారముల కవరోధ మేర్పడినది. ఎమ్డెను కియుచౌనుండి తప్పించుకొనిన జర్మను యుద్ధనౌక. ఆ నౌక సెప్టెంబరు 22-వ తేది రాత్రి 9-15 గంటలకు చెన్నపురిమీఁద నిప్పుగుండ్లను వేసి కొంత నష్టము కలిగించెను. రెండు మాసములలో 22 స్టీమరులను ముంచినది. నవంబరు మాసారంభమునందు కోకోసులంకల చేరువ నెమ్డెను తగులఁబెట్టఁబడిన తరువాత వర్తకవ్యాపారములు నిర్భయముగ సాగుచున్నవి.

ఒక్క యెమ్డెను దురంతకార్యములవలన హిందూ మహాసముద్రమునందు కలిగిన సంక్షోభము వర్ణనాతీతము. హిందూదేశవ్యాపారమున కాంగ్లనౌకారక్షణమే శరణ్యముగ నున్నంతవఱకును నిట్టి నిస్సహాయస్థితి యేర్పడుట సహజము. భరతఖండమునందు తరతరములుగ నౌకావృత్తియం దారితేరిన నావికుల కులములు గలవు. నౌకాదళమును నిర్మించుటకు తగిన సాధనసంపదలు గలవు. ఆ సాధనములు నౌకాదళనిర్మాణమునకై వినియోగింపఁబడినచో, ఆపత్సమయమందు హైందవసైనికుల రీతిని, నౌకాసైనికులు కూడ బ్రిటీషు సామ్రాజ్య సంరక్షణమునకును భరతవర్ష సంరక్షణమునకును ప్రాపు కాఁగలరు.

### వర్తకము, పరిశ్రమలు

వర్తకవ్యాపారములు నిర్భయముగ సాగుచున్నను, యుద్ధమువలన వ్యాపారమునకు భంగము కలిగినది. దిగుమతి సరకులయొక్కయు నెగుమతి సరకులయొక్కయు మొత్తము తగ్గినది. హిందూదేశమునుండి జర్మని యాష్ట్రియా దేశములకు 1913-14-వ సంవత్సరమునందు 42 కోట్ల రూప్యముల విలువ గల యెగుమతులును, జర్మని యాష్ట్రియాలనుండి 9 కోట్ల రూప్యముల దిగుమతులును జరిగినవి. యుద్ధమువలన నా వ్యాపార మంతయు నిలిచిపోయినది. స్వదేశపరిశ్రమ లుండియున్నచో, హిందూదేశమునకు సంగ్రామము మహోపకారిగనై యుండును. సహజపదార్థములు నిర్మితపదార్థములై పరిశ్రమలు వృద్ధి చెంది దేశాదాయము పెక్కురెట్లు హెచ్చియుండును. పాలకుల యౌదాసీన్యమువలనను ప్రజల మాంద్యమువలనను నీ పని జరగియుండలేదు. సంగ్రామమువలన దేశాదాయము సంకుచితము కాఁగలదు. జపాను దేశమునకు యుద్ధమువలన నమితమైన లాభము కలుగుచున్నది. ప్రాచ్యదేశముల వ్యాపార మంతయు జపానీయుల వశమైనది. జపాను దేశమునందు ధనలక్ష్మి తాండవ మాడుచున్న దని వార్తలవలన తెలియుచున్నది. జపానీయులు తమ ప్రాంత మందుసామానులను తుపాకులను ఫిరంగులను 50 కోట్ల రూప్యములకు విక్రయించినట్లును, కోట్ల రూప్యముల సామానుల ననుదినము పంపుచున్నట్లును తెలియుచున్నది. హిందూదేశాభ్యుదయమునకు కూడ పరిశ్రామికాభ్యుదయము

సాధన మని ప్రజాపాలకులు గ్రహించి కార్యోపక్రమ మునకు పూనినఁ గాని సంపద లభివృద్ధి చెంది ప్రజా సౌఖ్యము హెచ్చదు.

సంగ్రామ ఫలము

యుద్ధము పరిసమాప్తి నొందిన తరువాత హిందూదేశపరిపాలనమునందు నూతనయుగ మేర్పడి, స్వపరిపాలనాదర్శమునకు పునాది యేర్పఱుపఁబడి, ప్రజాసభ్యతకును జాతీయస్వాతంత్ర్యమునకును సోపానం బేర్పడు నని గంపెఁడాశ ప్రజలకుఁ గలదు. చిన్న జాతుల స్వాతంత్ర్యమును సంరక్షించుటయే యుద్ధమునకు మూలకారణ మని మంత్రిపుంగవుఁడు అస్క్విత్తు గారు చెప్పియుండిరి. ఆ రాజ్యాంగసిద్ధాంతము నాంగ్ల రాజ్యతంత్రజ్ఞులు హిందూదేశపరిపాలనమున కన్వయింపఁజేసి దేశీయుల కృతజ్ఞతను వడయుదురుగాత!

విద్యావ్యాపకము

బ్రిటీషు హిందూదేశమునందు 1912-13-వ సం. నందు పురుషులకు కళాశాలలు 128, ఉన్నతపాఠశాలలు 1278, ప్రారంభపాఠశాలలు 1,13,955 గలవు. అందు 32,931; 4,28,132; 44,28,531 మంది విద్యార్థులు విద్య నభ్యసించుచున్నారు. స్త్రీలకు కళాశాలలు 10, ఉన్నతపాఠశాలలు 114, ప్రారంభ పాఠశాలలు 13,694 గలవు. అందు 318; 18,515; 8,32,962 మంది విద్యార్థినులు గలరు. మొత్తమున 71,49,669 మంది స్త్రీపురుషులు విద్య నభ్యసించుచున్నారు. విద్యాభ్యాసమునకై వ్యయమగు సొమ్ము వివరము:—

| | | |
|---|---|---|
| రాష్ట్రీయాయము | రూ. | 3,39,25,000 |
| స్థానికాదాయము | ,, | 1,23,08,000 |
| మ్యూనిసిపలు ద్రవ్యము | ,, | 33,28,000 |
| విద్యార్థుల జీతములు | ,, | 2,40,52,000 |
| ఇతరాదాయము | ,, | 1,65,96,000 |
| | మొత్తము | 9,02,09,000 |

దేశాదాయము

యుద్ధము సంప్రాప్తమగుటవలన దేశాదాయము కంటె వ్యయము హెచ్చినది. దేశాదాయము రూ. 127,54,95,000లు; వ్యయము రూ. 130,44,30,000లు; కొఱఁత రూ. 2,89,35,000 లు. ఆదాయమునుండి విద్యకై 6 కోట్లును వైద్య సహాయమునకై 270 లక్షలును వ్యయము చేయఁబడినవి. సైన్యమునకై రూ. 22,35,49,000 లును, ఇది గాక యింగ్లాండునందు పెన్షను సామానులు మొదలగువానికి రమారమి 7 కోట్ల రూప్యములును వ్యయ మగును. సంవత్సరమునకు మొత్తమున 30 కోట్ల రూప్యములు సైన్యదళములకును 54 లక్షలు నౌకాదళమునకును వ్యయ మగుచున్నవి.

సామ్రాజ్యశాసననిర్మాణసభ

యుద్ధసమయమందు వివాదాంశములు శాసననిర్మాణసభలో చర్చింపఁబడకుండుట సమంజస మని రాజప్రతినిధి యభిప్రాయపడినందున, విశేషమైన శాసనము లామోదింపఁబడలేదు. వానిలో అధికార విభజనశాసనము, ప్రొవిన్షలు స్మాల్కాజు కోర్టు చట్టము, మోటారు బండ్ల చట్టము, స్థానికాధికారుల యప్పు చట్టము, కాపీరైటు చట్టము, విమానశాసనము పేర్కొనఁదగియున్నవి. సురేంద్రనాథ బెనర్జీగారు స్థానిక స్వపరిపాలనమును గుఱించి యుపపాదించిన తీర్మానము లన్నియు నిరాకరింపఁబడినవి.

దేశభాషలయందు విద్య కఱపుటను గుఱించి గౌరవనీయు లగు రామారాయణంగారు ఉపపాదించిన తీర్మానము నిరాకరింపఁబడుట మిగుల సంతాపకరము. రామారాయణంగారు "మధ్యమపాఠశాలలందు విద్య దేశభాషలలోఁ గఱపుటయును, నిర్బంధముగ రెండవ భాషగ నాంగ్లభాషను గఱపుటయును విద్యావ్యాపనమునకును దేశాభ్యుదయమునకును సాధనములు గాన, నా మార్గమును పాలకు లవలంబించుట శ్రేయస్కర" మని యొక తీర్మానము నుపపాదించిరి. సురేంద్రనాథ బెనర్జీ మొదలగు దేశభక్తులకు సహిత మీ తీర్మానమునందలి తత్త్వార్థము బోధ్యము కాలేదు. ఎన్ని తరములు గడచినను నెంత ద్రవ్యము వ్యయము చేసినను నాంగ్ల భాష దేశభాషయై జనసామాన్యమునకు విజ్ఞానము గఱపుటకు సాధనము కాఁజాలదు. ఉన్నతపరీక్షలందు తీర్ణులైనవారు సయితము దినచర్య యంతయు దేశభాషయందే గడపుచు నాంగ్లభాషను బాగుగ నుపయోగింపఁజాలకున్నారు. విద్యావంతుల స్థితి యిటు లుండ, కేవల మాంగ్లానభిజ్ఞులైన పామరుల గతి యెటు లుండును? ఆంగ్లభాషాముఖమున విజ్ఞానవ్యాపనము సాధ్య మని యంగీకరించినను, దేశభాషావిజ్ఞానపు గతి

యేమి కావలయును? వర్తమానకాలమునందు మధ్యమ పాఠశాలలలో దేశభాషలందు విద్య గఱపఁగోరుట వింతగా తోఁచినను, కాలాంతరమున దేశభాషలందు విశ్వవిద్యాలయములు స్థాపితము లగుట కూడ సంభవము. విజ్ఞాన వ్యాపనమునకు దేశభాషలు ముఖ్యసాధనము లని పాలక పాలితులు సమ్మనంతవఱకును దేశాభ్యుదయము కలలోని వార్త.

ఈ యేఁడు చేయఁబడిన శాసనములలో "ప్రజాక్షేమసంరక్షణశాసనము" యుద్ధస్థితివలన నవసర మైనను, కష్టములకు కారణము గానవచ్చును. యుద్ధము త్వరలో ముగిసి యీ శాసనము పాలకులచే నుపసంహరింపఁబడుట శ్రేయస్కరము.

గత సంవత్సరోదంతములందు హిందూ విశ్వవిద్యాలయ శాసనమును గుఱించి పాలకులకును విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకులకును సంయోజము కుదురుట ప్రశంసాపాత్రము.

### గాంధిగారు

దేశభక్తాగ్రగణ్యుఁ డైన గోపాలకృష్ణ గోకలె యాకస్మికమరణము సేతు శీతనగ మధ్య వ్యాప్త మైన భరతవర్షము నెల్ల దుఃఖసాగరమునందు ముంచినది. హిందూదేశ సేవకసంఘము నందు గోకలె స్థానమును శ్రీనివాసశాస్త్రిగా రలంకరించుట సంతోషప్రదము. సత్త్వగుణసంపన్నుఁ డైన మోహనదాస కరుణాసాంద్ర గాంధీగారి స్వదేశాగమన సమయంబున భారతీయసోదరులు గాంధిదంపతులకు హృద్గతం బైన స్వాగతంబు నొసంగిరి. ఆ మహాపురుషుఁడు హిందూదేశ సేవక సంఘమునందు చేరుటవలన దేశమునకు గొప్ప ప్రయోజన మేర్పడనున్న దని విశ్వసింపఁబడుచున్నది.

## జాతీయోద్యమములు

### జాతీయమహాసభ

ఇరువది తొమ్మిదవ జాతీయ మహాసభ సుప్రసిద్ధన్యాయవాదు లైన భూపేంద్రనాథబాసుగారి యధ్యక్షతక్రింద జయప్రదముగ జరిగినది. ఆహ్వానసంఘాధ్యక్షులు సర్ సుబ్రహ్మణ్యయ్యరుగారు. ఉభయుల ప్రసంగములును గంభీరభావభరితంబు లై సభ్యుల నుత్సాహపరవశులను చేసినవి. అగ్రాసనాధిపతి యుపన్యాసములోని యీ క్రింది వాక్యములవలన స్వరాజ్యాదర్శమే జాతీయసభాదర్శ మని వ్యక్త మగుచున్నది.

"హిందూదేశసంతానము బ్రిటీషుసామ్రాజ్యమునందలి యితర రాజ్యవాసులకుఁ గల బ్రిటీషు సామ్రాజ్యాంతర్గతం బైన స్వపరిపాలనాస్థితిని కలిగియుండుటయే జాతీయమహాసభాదర్శము.

"భవిష్యత్స్వాంతదేశమును ప్రకటించుచు సముద్రములోనికి ప్రవహించుచున్న యీ మహానదుల గానములో నా కర్ణపుటంబులు నిండుచున్నవి. సోదరప్రతినిధులారా! మనము పూర్వమువలె మన దేవములను పరిశుద్ధముగ నుంచుకొందము. అప్పుడే యీ సందేశము ఫలప్రద మగును. మానవులు కల్పించుకొనిన స్వల్పభేదములను మఱచిపోవుదము. మన మణఁకువ కలిగి మెలఁగుదము. దురభిమానమును పరిత్యజింతము. అవిచారపూర్వకముగ తెచ్చిపెట్టికొనిన యభిప్రాయభేదముల నణఁగఁద్రొక్కుదము. భవిష్యత్ఫలసంపాదనార్థ మై మనము విశ్వలహృదయములో దేవుని దేశము నారాధింపుదము. మన యభీష్టము మనకు సిద్ధించుట తథ్యము. ప్రపంచ మంతయు కలఁక చెందినను, మన సంకల్పము నెఱవేఱకమానదు."

భూపేంద్రనాథబాసుగారి వాక్యములను మననము చేయుచు భారతీయు లందఱు నేకభావబద్ధు లై దేశారాధనపరాయణు లై దేశమాత నారాధించుచు భగవత్ప్రసాదమును పడయుదురు గాత!

### అధికారుల సానుభూతి

గతజాతీయ సభాసమావేశమునం దొక విశేషము గలదు. ఉదాత్తభావసమన్వితు లై శ్రీ పెంట్లండు ప్రభువుగారు, దేశభక్తాగ్రేసరుఁడు సురేంద్రనాథ బెనర్జి గారు ప్రసంగించుచుండఁగా, సభారంగము నధిష్ఠించి సభకు నూతనవికాసమును కలిగించిరి. ప్రథమ కార్యనిర్వాహకసభ్యుఁడు సర్ హేరల్డు స్టువర్టుగారును దేశీయ మహాసభకు దయచేసి సానుభూతిని తెలిపిరి.

### సంఘసంస్కరణసభ

ఇరువదియొనిమిదవ సంఘసంస్కరణసభకు ఎస్. శ్రీనివాసయ్యంగా రాహ్వానసభాధ్యక్షులు, మైసూరు యువరాజుగారు సభాధ్యక్షులు. శ్రీనివాసయ్యంగారు గతవత్సరంబున సాంఘికుల కలవరంబులకు కారణం బైన రజస్వలా వివాహ శాసనమును విపులముగ చర్చించి దాని యవశ్యమును స్థిరపఱచిరి. మైసూరు యువరాజుగారు సంస్కరణప్రియు లనుటకు వారి విదేశగమనమే నిదర్శనము. వారి భావగర్భితోపన్యాసమునందలి యీ క్రింది వాక్యమువలన వారికిఁ గల సంస్కరణాభిమానము వ్యక్తము.

"అభివృద్ధిదశను గాని క్షీణదశను గాని పొందక నిలుకడ స్థితియం దుండుట ప్రకృతిధర్మము గాదు. మనము సందర్భముల ననుసరించి చేతే మంచిమార్గముల నవలంబింపవలయును గాని నవలంబింపకున్న, క్రమక్రమముగ క్షీణదశ నొంది తుదకు నాశన మగుదుము."

యువరాజగారి హితోపదేశము సంఘాభిమానులకు సంస్మరణీయము.

పరిశ్రామికసభ

ఐరోపామహాసంగ్రామమువలన మన దేశము నందు పరిశ్రమలు లేని గొప్ప కొఱంత యాబాలగోపాలము విదితమైనది. విదేశములనుండి రావలసిన యన్ని వస్తువులు ప్రియమైనవి. ఎంత వెల పెట్టినను, కొన్ని వస్తువులు దొరకుట లేదు. ప్రతిదినమును కావలసిన కాకితములు, నిప్పుపుల్లలు, మందులు తగని ప్రియమైనవి. రంగుల వెల విపరీతముగ పెరిగినది. చక్కెర ధర హెచ్చినది. గాజు సామానుల ధర రెట్టింపైనది. జపానుదేశపు పంట పండినది. పరిశ్రమలు స్థాపితములైనచో, మనదేశమునందు సులభముగ చేయఁదగిన వస్తు సముదాయము విశేషముగ కలదు. పరిశ్రమలు స్థాపితము లగుటకు సాంకేతికవిద్యయు ద్రవ్యసంచయమును సాధనము లని త్యాగరాయసెట్టిగారును మనమోహన రాంజీ గారును చేసిన హితోపదేశమును పాలకులు గమనింప వలసియుందురు. మన దేశమునందు పరిశ్రామికయంత్రాగారము లుండియుండినచో, బ్రిటీషు సైన్యమునకు యుద్ధరంగములందు మందుగుండు సామానులకు కొఱంత యుండునా? ఆర్థికస్వాతంత్ర్యము లేని దేశమునకు బలము కలుగుట సంభవము గాదు. ఆర్థికబలమునకు పరిశ్రమలు సాధనము లని జపాను దేశచరిత్రవలన స్పష్టముగ తెలియుచున్నది. పాలకులు పరిశ్రమల స్థాపనమునకు తోడ్పడియు ప్రజలు స్వదేశవస్తువులను పోషించియు హిందూదేశమునందు పరిశ్రామికౌన్నత్యమును స్థాపింపవలయు నని సభాధ్యక్షులు చేసిన హితోపదేశము నాచరణమునకు తెచ్చుట పాలకపాలితుల నియతధర్మము.

ఇతరసభలు

ఆస్తికమహాసభ బ్రహ్మజ్ఞానసభ మొదలగు వైవాహికవిషయకసభలును గూడినవి. సకలసభల కార్యక్రమమును సంభాషణములను విమర్శించినవారలకు హైందవజాతీయనిర్మాణమునకై రాజ్యాంగములందును మతసాంఘికవ్యవస్థలయందును పరిశ్రామిక విషయములందును నూతనభావము లుదయించినవనియు భావానుగుణ్యముగ ప్రజలును పాలకులును కార్యపరతంత్రులయినఁ గాని ప్రయోజనము కలుగ దనియు విశదమగుచున్నది.

## చెన్నరాష్ట్రము

### ప్రజలు

చెన్నరాష్ట్ర విస్తీర్ణము 1,41,075 చదరపు మైళ్లు, జనసంఖ్య 4,14,02,000. ప్రజలు ద్రావిడ జాతీయులు. ముఖ్యభాషలు అఱవము, ఆంధ్రము, మలయాళము, కన్నడము. ప్రతి 1000 మంది జనులందును 407 మంది యఱవమును, 377 మంది యాంధ్రమును, 74 మంది మలయాళమును, 37 మంది కన్నడమును 23 మంది హిందుస్థానిని వాడుదురు. వృత్తులలో ముఖ్యమైనది వ్యవసాయము, 100 కి 68 మందికి వ్యవసాయము జీవనాధారము. పంటలలో వరిపంట ముఖ్యము. నేతపరిశ్రమ పరిశ్రమలలో ముఖ్యము.

### వ్యాపారము

సముద్రవ్యాపారము 1913-14-వ సంవత్సరము నందు రూ. 58,15,93,000 ల మొత్తమునకు జరిగినది. దిగుమతుల మొత్తము రూ. 16,97,76,951 లు; ఎగుమతుల మొత్తము రూ. 26,90,23,740 లు. ఎగుమతులలో నూనెగింజలు రూ 5,32,89,000 లవి, తోళ్లు రూ. 3,47,72,000 లవి, దూది రూ 3,08,96,000 లవి.

### విద్యావ్యాపనము

చెన్నరాష్ట్రమునందుఁ గల 414 లక్షల ప్రజలలోను 31,30,000 మంది మాత్రమె వ్రాయను చదువను నేర్చినవారు. 1000 కి 138 మంది పురుషులును 13 రు స్త్రీలును మాత్రమె యక్షరజ్ఞులు. 1000 కి 6 రు వంతున పురుషులును 400 కి 1 రు వంతున స్త్రీలును ఆంగ్లభాషాభిజ్ఞులు. 1913-14-వ సం. నందు పురుషులకు 29 శాస్త్రకళాశాలలు, 5 ప్రాచ్యకళాశాలలు, 3 వృత్తికళాశాలలు, 364 మధ్యమపాఠశాలలు, 26,018 ప్రథమపాఠశాలలును, స్త్రీలకు 2 శాస్త్రకళాశాలలు, 69 మధ్యమపాఠశాలలు, 1,443 ప్రథమపాఠశాలలును గలవు. పాలకపోషితవిద్యాలయములు గాక 720 ప్రజాపోషితవిద్యాలయములు గలవు. అందు ప్రథమపాఠశాల

లలో 12,00,249 మందియు, మధ్యమ పాఠశాలలలో 1,28,157 మందియు వృత్తికపాఠశాలలందు 986 మందియు, ప్రాచ్యకళాశాలలలో 7094 మందియు, శాస్త్రీకళాశాలలలో 7094 మందియు, మొత్తము 14,69,945 మంది విద్యార్థులు గలరు. ప్రతియేటను చెన్నపురి విశ్వవిద్యాలయమునుండి 600 మంది యుపపదాధియుక్తులు వెలువడుచున్నారు.

### ఆదాయవ్యయములు

రాష్ట్రాదాయము 1912-13-వ సంవత్సరమునందు రూ 740 లక్షల రూప్యములు. అందు రమారమి 350 లక్షల రూప్యములు భూమి సిస్తువలనను 174 లక్షలు మద్యమువలనను వచ్చుచున్నవి. వ్యయమునందు పాలనమునకు 147, విద్యకు 82, పోలీసునకు 93, కోర్టులకు 70, వైద్యసహాయమునకు 30 లక్షల రూప్యములు వ్యయమగుచున్నవి.

### పాలనము

పాలనము సభాప్రయుక్తరాష్ట్రపాలకునిచే నిర్వహింపఁబడుచున్నది. శ్రీ పెంట్లాండు ప్రభువు రాష్ట్రాధీశుఁడు. సర్. పి. ఎస్. శివస్వామయ్యరు, సర్ హెచ్. ఏ. స్టువర్టు, ఏ. జి. కార్డ్యూ గార్లు కార్యనిర్వాహకసభ్యులు. శాసనసభయందు ప్రజానియుక్తసభ్యులు 21 మందియు, పాలకనియుక్తసభ్యులు 21 మందియు, కార్యదర్శులు 6గురును గలరు.

### రాష్ట్రీయశాసనసభ

గతసంవత్సరమునందు పాలకులచే, తిరుపతి దేవస్థానవిద్యాశాసనము, ఎస్టేటు శాసనము, వైద్యుల నామలేఖనశాసనము, అధికారవిభజనశాసనము అమోదింపఁబడినవి. సిటీపారుదల శాసనము, గా. రామచంద్రరావుగా రుపపాదించిన సిటీ పంచాయతీ శాసనము, అవిభక్తహిందూకుటుంబశాసనము, గా. శ్రీనివాసశాస్త్రిగా రుపపాదించిన రజస్వలావివాహశాసనము విచారణార్థమై నిలుపుదల చేయఁబడియున్నవి. రజస్వలావివాహశాసనవిషయమై తీవ్రచర్చలు జరుగుటయు భిన్నాభిప్రాయము లేర్పడుటయు పత్రికాపాఠకులకు విదితము. సిటీ పంచాయతీ శాసనము ముందు విచారణకు రానున్నది. శాసనములోని యేర్పాటులు ముఖ్యముగ కృష్ణా గోదావరీ గుంటూరు జిల్లాలలోని రయితుల కనుకూలించును గాన, ప్రజలును ప్రజానాయకులును నిబంధనలను నిర్ణయించి నిశ్చితాభిప్రాయములను పాలకులకును రామచంద్రరావు పంతులుగారికిని తెలియఁజేయుట యత్యంతావశ్యము.

### రాష్ట్రీయసభ

చెన్నరాష్ట్రీయసభలు నెల్లూరుపురంబున మేనెల మొదటి వారములో కూడినవి. రాజకీయసభ కాహ్వానసంఘాధ్యక్షుఁడు గా. ఆకుంచిల్ల కృష్ణారావుగారు, అధ్యక్షులు గా. బయ్యా నరసింహేశ్వరశర్మగారు. ఇరువురి వ్యాసములును భావగర్భితములై స్వరాజ్యదర్శమును నానాముఖముల ఘోషించుచున్నవి. స్వపరిపాలనావిధానము గ్రామములం దారంభమై రాష్ట్రములకును దేశమునకును నంతరంగములుగ నిర్మితము గావలయును. శర్మగారి యుదారాదర్శములను తెలుపుటకు వారి వ్యాసములోని చివరిభాగ మిచట వ్రాయఁబడుచున్నది:—

"నేనే బ్రహ్మము-అను మహనీయవాక్యమందలి సత్యము హిందువు లందఱును స్వానుభవమునకు తెచ్చుకొనవలసియున్నది. పాలనకార్యని యందయమున విధియు మందునకలె నీ విజ్ఞానభానూదయమున పరస్పరభేదములు స్వోత్కర్షలు ఉత్తమాధమభిన్నభావములు మున్నగునవన్నియును గూడ మాయమైపోవును. అట్టి జ్ఞాని యప్రతిహతుఁ డగును. మహమ్మదీయులు కేవలము ప్రజాప్రభుత్వవాదులు. క్రైస్తవుఁ డనిన ప్రజాప్రభుత్వవాది యని వేఱుగ నుడువనక్కఱలేదు. ఈ రీతిగా ప్రజాప్రభుత్వ మహత్వము బోధించుటలో సర్వమతములు నేకభావమును కలిగియున్నవి. స్థితిగతు లనుకూలముగ నున్నవి. స్థానిక స్వపరిపాలనమునుండి సామ్రాజ్యాధీన మగు స్వపరిపాలనమును పడయుట దూరస్థ మగు స్వప్నభ్రాంతి కాఁజాలదు; తన విలాసమున మనల నాకర్షించుచు దరి చేరకపోలెంతి దూరమునకు పరుగిడఁబోవునది గాదు. మిగుల ప్రాచీన మైనట్టియు, గతించిన పెక్కు శతాబ్దములనుండి వంశపరంపరాగతముగ లభించిన పరిజ్ఞానముచే నిండియున్నట్టియు, అచిరకాలముననే యఖండభూమండలము నంతటిని పరికుక్షస్థితి మార్గమునను శాంతిభావమునను నడపుటకును ప్రతిమానవుఁడు వినయం దున్న దైవత్వమును గ్రహించునట్టియు త్తమస్థితికి రాఁగలుగునట్లు చేయుటకును నుద్దేశింపఁబడినట్టియు, భరతఖండమునకు న్యాయమగు సహాయము చేయుటకు శివ ఐశ్వర్యమును పుట్టుకనుండియు స్వాతంత్ర్యముచే వర్ధిల్లిన యాంగ్లేయులకు కలుగునట్లు పరమేశ్వరుఁడు వారి యాత్మలయందు ప్రవేశించి వారి కుత్సాహము కలిగించును గాక!"

భగవదనుగ్రహమువలన బ్రిటీషు పరిపాలకులకును హైందవప్రజలకును నీ యుదారసంకల్పంబులు హృదయస్థంబు లగుఁగాత!

### సంఘసంస్కరణసభ

సంఘసంస్కరణసభ కాహ్వానసంఘాధ్యక్షుఁడు ఎమ్. చెంగయ్యగారు, సభాధ్యక్షుఁడు మహాదేవశాస్త్రి గారు. చెంగయ్యగారు రజస్వలావివాహములను చర్చించుచు శాసనసహాయము ధర్మసమ్మత మనియు నవసర మనియు సిద్ధాంతీకరించిరి. మహాదేవ శాస్త్రిగారు దేశాభ్యుదయమునకు బాల్యవివాహములును కులభేదములును పోవలయు ననియు, సంఘము వర్ణాశ్రమధర్మపద్ధతి ననుసరించి నిర్మితము గావలయు ననియు, ఇతరవర్ణముల వారి నుద్ధరించి బ్రాహ్మణులను చేసి దేశమునం దంతట నొక్క బ్రాహ్మణవర్ణము మాత్రమే యుండునట్లు చేయుట సమంజస మనియు వాదించిరి.

### ఇతరసభలు

పండిత సుందరయ్యరు గారి యాధిపత్యముక్రింద సనాతనధర్మరక్షిణీసభయుం గూడినది. పరిశ్రామిక సభకు నెమలి పట్టాభిరామారావుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. దేశాభ్యుదయమునకును పరిశ్రామికాభ్యుదయమునకును గల సన్నిహిత సంబంధము వారి వ్యాసమునందు బాగుగ విమర్శింపఁబడినది.

### ప్రజావబోధము

చెన్నరాష్ట్రమునందలి యన్ని మండలముల లోను కదలిక యేర్పడినది. దేశాభ్యుదయమునందు ప్రజలకును నాయకులకును నభిమాన ముదయించినది. ఆ యభిమానము సకలవ్యవస్థలయందును గోచరము.

### ఆంధ్రదేశము

ఆంధ్రదేశము కొంత చెన్నరాష్ట్రమునకు వెలుపల నున్నను, చెన్నరాష్ట్రములోని తెలుఁగుభాగము నందలి గతసంవత్సర వృత్తాంతములు మాత్రమే యిచట పేర్కొనఁబడుచున్నవి. చెన్నరాష్ట్రవిస్తీర్ణము 141,075 చదరపు మైళ్లు, ఆంధ్రదేశపు విస్తీర్ణము సుమారు 70,000 చదరపు మైళ్లు. జనసంఖ్య 16,000,000 అది విస్తీర్ణమునందు రాష్ట్రములోని సగము ప్రదేశము నాక్రమించుకొని యున్నది; ప్రజాబాహుళ్యమునందును సంపదలందును సగము భాగమునకు తక్కువగ నున్నది. ఆంధ్రభాషా స్థితియు ఆంధ్ర ప్రజాస్థితియు ఆంధ్రదేశ వృద్ధిక్షయములను కనుఁగొనుటకు సాధనములు. ఆంధ్రదేశమునందు సాంఘిక నైతిక రాజకీయార్థిక జీవనము దినదిన ప్రవర్ధమాన మగుచున్నది. సంఘ స్థితియందు మార్పులు కలుగుచున్నవి. మతభావనలు మాఱుచున్నవి. ఆర్థికస్థితి బాగుపడుచున్నది. భాషాభిమానము ప్రబలుచున్నది. రాజకీయ జీవనమునందు నూతనాదర్శములు ప్రజల హృదయముల నాకర్షించుచున్నవి. గతసంవత్సరమునం దాంధ్రదేశమున సమావేశమైన శాఖాసభలయొక్కయు ఆంధ్రమహాసభయొక్కయు కార్యక్రమమును విమర్శించినపు డాంధ్రదేశమునం దుదయించిన నూతనోజ్జీవము వ్యక్తము కాఁగలదు. ఆనందసంవత్సర చైత్రమాసాదిని అయిదవ సంచిక ప్రకటింపఁబడినది. రాక్షస సంవత్సరమునం దాషాఢ మాస మారంభమైనది. పండ్రెండు నెలల వృత్తాంతము నిచట సంక్షేపముగ నైనను చెప్పుట కలవి గాదు.

### పుస్తకభాండాగారసభ

ఏప్రిలు 1-వ తేదిని మొదటి పుస్తకభాండాగారసభ బెజవాడయందుఁ గూడినది. సన్మానసంఘాధ్యక్షులు సూరి నరసింహశాస్త్రిగారు, అమెరికా సంయుక్త రాష్ట్రములందువలె నాంధ్రదేశమునందును పుస్తకభాండాగారవ్యాపనమును చేయుట దేశాభ్యుదయమునకు సాధన మనియును, ప్రస్తుతము 120 తెలుఁగుదేశమునందుఁ గల వనియును తెలిపియుండిరి. సభాధ్యక్షులు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. అధ్యక్షులు సహజమైన యనర్గళ వాగ్ధోరణిచే శ్రోతల వీనులకు విందు గొలుపుచు పుస్తకభాండాగారంబుల ప్రయోజనంబును విపులముగ వివరించిరి.

### రెండవ యాంధ్రమహాసభ

ఏప్రిలు నెల 11-వ తేది నాంధ్రుల నూతనోజ్జీవనమునకు కేంద్రస్థానముగ నెంచఁదగిన యాంధ్రమహాసభ విజయవాడయందుఁ గూడినది. నానాభాగములనుండియు 2000మంది ప్రతినిధులు వచ్చియుండిరి. రావు బహదూరు పురాణము వేంకటప్పయ్య పంతులుగా రాహ్వానసంఘాధ్యక్షులు. న్యాపతి సుబ్బారావు పంతులుగారు సభాధ్యక్షులు. వేంకటప్పయ్య పంతులుగారి కాంధ్రోద్యమ ప్రయోజనమునందు సంపూర్ణ

విశ్వాసము గలదని వారి వ్యాసమునందలి యీ క్రింది వాక్యములు విశదీకరించుచున్నవి.

"ఈ యుద్యమము న్యాయము లగు నభిలాషలవలన నుద్భవించినది గాని, నాంధ్రులయొక్క మతమే కాక యాంధ్రేతరులయొక్కను మన ప్రభుత్వమువారియొక్కయు నాక్షేపణములకు పాత్ర మగుచున్నది. ప్రచురింపబడిన గ్రంథములలో నీ యుద్యమముయొక్క యావశ్యకత చక్కని హేతువులతో నిశ్చయింపబడినందున కొంత మాత్రము వివాదాస్పదము కాదని నిశ్చయింపదగును?

"ఏకభాష యనునది మనుష్యుని మనుష్యునితోడను మనస్సును మనస్సుతోడను నేకీభావమును పొందింప శక్తిగలిగి పరస్పరానుభూతిజనక మయియుండుట సహజము. ఏకభాషను మాటలాడువారు సాధారణముగా సమానచారిత్రము సమానాచారములు ధర్మములు మతము అభిలాషలు మొదలగునవి గలిగి సమాన వాఙ్మయ సాధనముననే పురోవృద్ధిని పొందవలసియుందురు.

"ప్రతి మనుష్యుడును స్వభాష సహాయము చేతనే గ్రహింపను యోచించును; నూతనవిషయములను భావించును, కల్పించును; అన్యభాషయందట్లు చేయజాలడు. కావున స్వభాషయందు విద్యాపరిశ్రమము గలుగనిచో మనుష్యులకు సాధారణముగ ప్రతిభ యుండ యుండదు. అందువలన స్వదేశవాఙ్మయవృద్ధి కానేరదు. దేశమునకు ముఖ్యముగా కావలసిన జ్ఞానసంపత్తి జనసామాన్యులందఱకు నింగ్లీషు భాషామూలముగ లభించుట కష్టతరము. ఆభాష సులభసాధ్యము గాదు. అరువదివత్సరములకంటె నెక్కువకాలమునుండి ప్రభుత్వము వారా విద్యను వ్యాపింపజేయుచుండినను, నిప్పటి కది స్వల్పముగ నేర్చుకొనబడియున్నది. సామాన్యజనమున కది యబ్బనే లేదు. ఇక ముందు క్రమేణ సర్వోన్నతస్థానములయందుగూడ సర్వత్ర స్వభాషామూలముగ విద్య నేర్పుటకు తగు నేర్పాటులు చేయబడునని నమ్మదగియున్నది. ఇట్టి కారణములచేత నాయా భాషలు మాటలాడబడు ప్రదేశములను విద్యాపరిపాలన వ్యవహారమునకు దగిన ప్రత్యేక ఖండములుగా నేర్పఱచుట మిక్కిలి సహజమైన పద్ధతి గాని బహుభాషలు మాటలాడబడు నేక ప్రదేశము నట్టి ఖండముగా చేయుట లాభకారి కాదు. ఇతర వ్యవహారములకును నట్టి ప్రదేశములే యోగ్యమయిన ఖండములుగా నెంచుట శ్రేయస్కరము. ఈ కారణముననే యీ యుద్యమము తెలుగు జిల్లాల ప్రయత్నము లేక 'యాంధ్రోద్యమ' మను రూపమున వికాసమును పొందినదని తలచుచున్నాము."

వేంకటప్పయ్య పంతులుగారు స్థూలాంధ్రప్రపంచాభ్యుదయమునకు తమ సూక్ష్మదేహముతో సయితము తోడ్పడెదరుగాక!

సభాధ్యక్షుని పండితస్థానస్థ

సభాధ్యక్షులైన న్యాపతి సుబ్బారావు పంతులు

గారు చిరకాలము తమ జీవితమును దేశారాధనకై వినియోగించిన ప్రసిద్ధపురుషులు. యౌవనదశయందలి యుత్సాహము వార్ధకదశయందు సామాన్యముగ కన్పట్టదు. స్థిరవ్యవస్థలను మార్చుటయం దుదారభావసంపన్నులు సయితము వెనుకంజ వేయుచుందురు. ఐర్లాండు స్వరాజ్యాదర్శమును వంగవిభజనసంహారమును తీవ్రవివాదములకు గుఱియైనవి. సుబ్బారావు పంతులుగా రాంధ్రోద్యమముపట్ల సంపూర్ణ సానుభూతిని కలిగియుండియు నాంధ్రరాష్ట్రాదర్శముపట్ల సంశయము కలిగియుండుట యొక వింత గాదు. దీనికి కారణములు పెక్కు లుండును. పంతులుగారి యుపన్యాసమునందలి కడపటి వాక్యములను చదువువారలకు వారి కాంధ్రోద్యమముపట్ల సంపూర్ణవిశ్వాసము గలదని నమ్మకము గలుగుచున్నది.

"ఈ మార్పు ఇండియాదేశములోని పరగణాల మార్పులలో చేరవలసినదిగా నున్నది. భాషలప్రకారము పరగణాల నేర్పఱచినందువలన లాభము కలుగునని యు, ఆంధ్రరాష్ట్ర మేర్పడిన ప్రతి తెలుగు జిల్లాలోని యాంధ్రులభివృద్ధి పొందుదురనియు ప్రజాభిప్రాయము నేకముఖమునకు తెచ్చుటకై యాంధ్రరాష్ట్రము కోరువారెల్లరును ఒక సమాజముగా నేర్పడి పనిచేసినయెడల బాగుండునని నా యభిప్రాయము. వారి వాభిప్రాయములను వెల్లడిచేసి యుల్లరచేతను ఒప్పింపవలసినప్పుడు ఇట్టి సమాజము నేర్పఱచుట ముఖ్యము. అట్లు చేసినయెడల ప్రభుత్వమువారు గూడ పరగణాలయొక్కయు, సాధ్యమైనంతవఱకు స్వదేశ సంస్థానములయొక్కయు హద్దులను భాష ననుసరించి సాధ్యమగునంతవఱకు మార్చుట యావశ్యకమని యెంచిగాని, తెనుగు జిల్లాల యభివృద్ధిని పట్టి ప్రస్తుతపు రాజధానిక్రింద నుండుట రాజ్యపరిపాలనకు ననుకూలమని యెంచి గాని తెనుగుభాష మాటలాడువారిలో అందఱికిని గాని పలువురకు గాని ప్రత్యేకరాష్ట్ర మీయవచ్చును.

"ఆంధ్రోద్యమము ఆంధ్రులలో ఐకమత్యమును పురికొల్పి తమ్ములముగ భారతజాతీయ నవ్యస్థానమును కాంక్షించుచున్నది. ఈ కార్యము కష్టసాధ్యమైనది. అయినను పవిత్రమైనదియు, యశస్కరమైనదియు నగు కార్యమై యున్నది. ఈ యేకభారతీయనిర్మాణమున ఆంధ్రులు ముందంజ వేసి యితరసంఘములవారికి మార్గదర్శులుగా నుండుటకంటె తేజస్కరమైన యుత్కృష్టకార్యము మఱియేది కలదు? మీ రిప్పటికి పోయినను సత్యసంధులనియు, మీరు దేశసేవకై స్వార్థత్యాగము చేయుటయందు మార్గదర్శకులనియు మీకి పేరు వచ్చుటకంటె వేఱు గౌరవమేది కలదు? పూర్వకాలమందు ఆంధ్రవంశమువారు భరతఖండములో అధికభాగమును పరిపాలించుచు ఔన్నత్యమును పొందినారు. ఆ ప్రకారముగా మీరు ఐకమత్యమును

గాంచి తమ బుద్ధికుశలత వికసించినప్పుడు ముందు కూడ ఇతర జాతులవారికంటె అధికోన్నత్యమును పొందుట కేమి సంశయము? ఐహికాముష్మికవిద్యలు అభివృద్ధి చెందినప్పుడు వీరి పేరు పరదేశములయందు వ్యాపించి వీరు భారతమాతకు గౌరవమును తేకపోదురా? ఈ యుద్యమమును భగవంతుఁడు జయప్రదముగా చేయును గాక!

హిందూదేశమునందు జాతీయజీవనాభ్యుదయ సౌకర్యమునకును స్వరాజ్యాదర్శప్రాప్తికిని భాషాప్రయుక్తరాష్ట్రములు సాధనము లనియు నాంధ్రదేశాభ్యుదయమున కాంధ్రరాష్ట్రనిర్మాణము సాధన మనియు నొక తీర్మానము, వాదప్రతివాదములు ప్రబలముగ జరిగిన పిదప, సభ్యులచే నామోదింపఁబడినది. కార్యసాధనమునకై యాంధ్రదేశ సేవకసంఘము స్థాపింపఁబడినది. అయి దెకరముల భూమియు 6,000 రూప్యములును సహాయార్థ మొసంగఁబడినవి.

కార్యదర్శి నివేదిక

ఆంధ్రోద్యమప్రాప్తికై సకలవిధముల పాటుపడుచు, కార్యదర్శిగ నున్న కొండ వేంకటప్పయ్యగారి నివేదికలోని చివర భాగము ఆంధ్రుల భావపీఠమునందు సుస్థిరముగ నిలువ నర్హము గాన నిచట పునర్ముద్రితము.

"కాని, ఆంధ్రమహోద్యమ కార్యక్రమము అనంతము. కార్యసాఫల్య సాధనములు మితసంఖ్యాకములు. ద్రవ్యోపపత్తి స్వల్పము. కార్యసాధకులును అంతగా గానుపింపరు. కావున కార్యఫలములు చాల భాగము మృగ్యములే. ఆంధ్రులు తమ పూర్వచారిత్రమును ఇంకను చక్కగా నెఱుఁగరు. స్వశక్తిసామర్థ్యములయందు విశ్వాసము ఇంక నంతగా నుద్భవింపలేదు. జాతీయౌన్నత్య సాధనము లంతగా పట్టుపడుట లేదు. జీవితాదర్శములందు చిరతరాభ్యస్తమార్గములు తప్ప క్రొత్తత్రోవలు త్రొక్క నేరరు. ప్రముఖులు సయితము మాన్యాదర్శ శ్రవణమాత్రమున బెదరి తారుమారగుచున్నారు. ఋజుమార్గమునుండి బుద్ధిని మరల్చుట కియ్యకొనరు. కావున ఆంధ్రమాతృసేవకులు ఆంధ్రోద్యమముయొక్క నిజస్వరూపమును ఊరూరులను పల్లెపల్లెలను జనుల హృదయాంతరంగముల ప్రతిఫలించునట్లు ఉద్యమింపవలయును. బుద్ధిమంతులు తమ బుద్ధియును, విద్యావంతులు తమ విద్యయును, ధనవంతులు తమ ధనమును దేశమాతకు అర్పణంబు గావించి ఆంధ్రజాతీయోద్ధారణకు సన్నద్ధులు కావలయును. ఆంధ్రనాయకులు ఆంధ్రవాణి సునాదంబునకు చెవియొగ్గి ఆంధ్రోద్యమసత్యమును అభిలక్షించి గాఢమగు దేశభక్తితో కార్యకలాపములకు దిగి, ఆంధ్రజనాళి కుత్సాహంబుగ తమ[illegible]ల బుద్ధిబలమును, విద్యాబలమును, ద్రవ్యబలమును ఆంధ్రమాతృపాదపద్మంబులకు సమర్పణంబు గావించి, తమ నాయకత్వ[illegible]ను నిలుపుకొని, సార్థకము చేసికొనెదరని నమ్మి నింతట [illegible]ంచెద."

ఆంధ్రమహిళాసభ

అయిదవ యాంధ్రమహిళాసభ కూడ బెజవాడలో ఏప్రిలు నెలయం దాంధ్రమహాజనసభవలెనె కూడినది. సన్మానసంఘాధ్యక్షురాలు సూరి భ్రమరాంబగారు, సభాధ్యక్షురాలు కొటికలపూడి సీతమ్మగారు. స్త్రీవిద్యాభివృద్ధికై పాటుపడిన వీరేశలింగము పంతులుగారిని గుఱించి సీతమ్మగారు నుడివిన వాక్యము లిచట పొందుపఱుపఁబడినవి.

"కష్టములకు వెఱవక యీశ్వరునిపై భార ముంచి తమ ప్రయత్నముయొక్క ఫలాఫలముల నీశ్వరుని హస్తమందే యుంచి నైతికతో సత్కార్యముల నాచరించినవారి కీశ్వరుండు తోడుపడి కార్యసాఫల్య మొనర్చునని మన మీ యుదాహరణమువల్ల తేర్చుకొని మనము మంచిపని నమ్మిన సత్కార్యములను విడువక కొనసాగించుకొనవలయును. మన కట్టి యుత్సాహశక్తి కలిగించుటకే మహిళాసభలు తోడ్పడి వర్ధిల్లును గాక!"

ఆంధ్రసనాతనధర్మసంరక్షణసభ

ఈ సభ కిది మొదటి సమావేశము. బెజవాడయందు కూడినది. తుర్లపాటి శేషాచలము పంతులుగా రగ్రాసనాధిపతులు. వారి యుపన్యాసములోని యీ క్రింది వాక్యములవలన సభోద్దేశములు గ్రాహ్యములు.

"ఆంధ్రుల దృష్టి యంతయు ప్రస్తుతకాలమున రాజకీయవిషయములయందే ప్రసరించుచున్నది. సనాతనధర్మసంరక్షణమం దొకించుకయు ప్రసరింపకుండుట కడు శోచనీయము. రాజకీయ విషయములలో పాటుపడుట కితర దేశస్థులు మార్గదర్శకు లయిరి. సర్వకాలములకును సనాతనధర్మవిషయమున దేశముల కాదర్శము నిచ్చునది భరతవర్షమే గాని, మఱియొక దేశము కానేరదు. ఇదియే మన పూర్వులు దాచియుంచిన ధనము. కావున సనాతనధర్మమున కేమాత్రము భంగము కలుగకుండ, దేశాభివృద్ధి కలుగుట యట్లుతో యోచించుట మన యాంధ్రులకు ముఖ్య కర్తవ్యము."

ఆంధ్రసాహిత్యపరిషత్తు

ఇయ్యది కాకినాడపురంబున ఏప్రియలు 14-వ తేదిని కూడినది. సన్మాన సంఘాధ్యక్షులు పోలవరము జమీందారుగారు. సభాధ్యక్షులు కిడాంబి రామానుజాచార్యులుగారు. వారి యుపన్యాసమునందలి వాక్యము లిచట నుదహరింపఁబడుచున్నవి.

"కొంతకాలము క్రిందట నుచ్ఛదశ ననుభవించిన యాంధ్రసారస్వత మిటీవల క్షీణించి మరల నభివృద్ధికి వచ్చుచున్నది. ఇట్టి సమయమున విశేషోపయోగములు కాని నిర్బంధములచే దాని నరికట్టక వాఙ్మయాభివృద్ధిని చేయుట కాంధ్రవిద్వన్మహాజనులను ప్రార్థించుచున్నాను."

ఏప్రియలు నెల 11, 12 తేదులయందు ఆదివెలమ మహాసభయును బెజవాడలోఁ గూడినది. సంఘాభివృద్ధికి అవసరములైన తీర్మానము లామోదింపఁబడినవి.

### విశాఖపట్టణమండలసభలు

రాజకీయసభ మెయి 14-వ తేదిని అనకాపల్లియందుఁ గూడినది. భూపతిరాజు వేంకటపతిరాజుగా రగ్రాసనాధిపతులు. వారి కాంధ్రరాష్ట్రప్రయోజనముపట్ల సంపూర్ణ విశ్వాసము గలదు. ఆంధ్రోద్యమ విషయమై రాజుగారు చేసిన ప్రసంగ మంతయు ముద్రింపఁ దగినది. అయినను కొన్ని వాక్యములు మాత్రమే యిచట ముద్రింపఁబడు చున్నవి.

"దాదాపుగ నాంధ్రులలో నాయకు లనఁదగినవా రందఱును, ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్ర మేర్పడవలయు ననుట యుక్త మనియు, ఇది పొందఁదగిన యొక యాదర్శముగ నుండఁదగు ననియు, ఏకాభిప్రాయులై యున్నారు. మొన్నటి యాంధ్రసభలో వీరియం దిట్టి వంటి మార్పు కనఁబడుట నాకు సంతోషకరముగ నున్నది. ఆదర్శమని యొకసారి యంగీకరించిన తర్వాత, దానికై యాందోళన మొనర్చుట నెప్పటికో నిలిపివేయుట కేవలము పొరపాటు. తాము చేయుచున్న యీ ప్రధానకార్యమును, దానివలనఁ గలుగఁబోవు ప్రయోజనములను, వివేకముతో గ్రహించునట్లు జనసామాన్యమునకు బోధించుట యీ విషయమునందు శ్రద్ధగల ప్రతివానికిని విధియై యుండుట నిజము."

ఏ. పి. పాత్రోగారి యాధిపత్యముక్రింద పరిశ్రామికసభయు, అప్పడుపంతులుగారి యాధిపత్యముక్రింద సంస్కరణసభయుఁ గూడినవి. అవసరములైన తీర్మానము లత్యుత్సాహముతో నామోదితములైనవి.

### ఏడవ యార్యవైశ్యమహాసభ

ఈ సభ యేలూరునందుఁ గూడినది. చల్లా గురుస్వామిశ్రేష్ఠిగా రధ్యక్షులు. మోతే గంగరాజుగారు సన్మానసంఘాధ్యక్షులు. వారి యుపన్యాసమునందు, వైశ్యుల పురోభివృద్ధికి సాధనంబులైన విద్యను వ్యాపారమును పరిశ్రమలను నభివృద్ధినేయు సాధనంబులు చర్చింపఁబడినవి. అందలి కొన్ని వాక్యము లిచట నుదాహరింపఁబడుచున్నవి.

"ఆర్యవైశ్యుల నగు మన కీ రాజధానియం దాంధ్రం బే మాతృభాషగా నున్నయది. అధికసంఖ్యాకు లాంధ్రదేశంబునందే యుండుటచేతను, మన సభలుకూడ నాంధ్రదేశంబునందే జరుపఁబడుటచేతను నాంధ్రప్రవర్తనము తదభివృద్ధి, తన్నానాముఖ్యనిజయము మొదలగు వానిం గూర్చి ప్రకటింపక తీఱదు. అది హిందూదేశీయ మహాజనుల భాషయందుఁ దప్ప తక్కినవానిలో, ననుసరించుచున్నది. అదియు నానాభాషలజాతి యునుతంతై యున్నయది. దానియందును వైశ్యభావము సూచింపఁబడుచున్నను, తదభివృద్ధికిని నితరేతరభావగ్రాహ్యంబునకును సామాన్యభాష యావశ్యకం బనియు దానిచే పరోపకారము కొఱకు పాటుపడవలె ననియు నెఱుఁగఁబడుచున్నది. ఆంధ్రరాష్ట్రము మృష్ట వార్తాపత్రికలచేతను తత్తరులచేతను వివాదింపఁబడినను, నిరాక్షేపణీయంబే."

### గుంటూరుమండల రాజకీయసభ

జూను నెల 4-వ తేదిని ఒంగోలునందు 23-వ గుంటూరుమండలసభ కూడినది. సన్మానసంఘాధ్యక్షులు బి. లక్ష్మీనారాయణరావుగారు. సభాధ్యక్షులు వింజమూరి భావనాచార్యులుగారు. ఉభయులును నాంధ్రరాష్ట్రావిర్భావమును ప్రస్తుతించిరి.

"ఆంధ్రరాష్ట్ర నిర్మాణ మవసర మని మన గుంటూరు మండలము వారును గడచిన మండలసభయొక్క 10-వ తీర్మానమున నీ యుద్యమమును ఆమోదించియున్నారు. కృష్ణ, వైశ్య మహాజనసభలీ యుద్యమమున కనుకూలములుగా నున్నవి. ఈ నడుమ మదరాసు పట్టి డివిజనలు కాన్ఫరెన్సునందును ప్రత్యేకరాష్ట్రవిషయము నంగీకరింపక పోయినను, ఆంధ్రోద్యమము నామోదింపుమని తీర్మానింపఁబడెను. ఇట్లీ యుద్యమము కొలఁది కాలములోనే యాంధ్రదేశ మెల్ల వ్యాపించి జనాంగీకారము పొందియున్నది."

"మన యభివృద్ధి నిమిత్తమును సౌఖ్యము నిమిత్తమును ప్రభుత్వమువారు చేయవలసిన విధు లనేకము లున్నను స్వయంకృషిచే మనము పూనవలసిన యభివృద్ధిమార్గములు నానావు సంఖ్యను మీఱి యుండుటను మనము మఱువరాదు. ప్రపంచమునం దేదేశము గాని ప్రజలయొక్క, అందును విద్యాధికులయొక్క, స్వయంకృషియు స్వార్థత్యాగమును లేకయే కేవలము ప్రభువుల యౌదార్యమువలననే యున్నతస్థితికి వచ్చియుండినట్లు కానము. ప్రజలయొక్క యభివృద్ధికిఁ దగిన మార్గములను పూనుట ప్రభుత్వమువారి పనియే యయినను, వారు చేయు పనులు విద్యాధికుల కృషియు స్వార్థరహితబుద్ధియు లేక ఫలింపఁజాలవు."

### సంఘసంస్కరణసభ

పదునేడవ గుంటూరుమండల సంఘసంస్కరణసభ కూడ ఒంగోలునందు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి యధ్యక్షతక్రిందఁ గూడినది. సుప్ర సిద్ధులైన లక్ష్మీనరసింహముగారి భావము లాంధ్ర ప్రపంచమునం దంతటను వ్యాపించియున్నను, వా వ్యాసమునందలి కొన్ని వాక్యము లిచట పాఠక భావౌన్నత్యమునకై చేర్పఁబడినవి.

"జపాను అమెరికా మున్నగు దేశములతో తులదూఁగవలె నున్నవారితోఁ బాటు సంఘసంస్కరణము చేయుఁడు, కార్యాచరణశూరు లగుఁడు. కొంతమంది తమకు ధైర్యము లేనిచో, ముందంజ వేయువారికి సాయము సేయఁబూనుకొనుఁడు. అప్పుడే సంస్కరణము జయ మొందును. ఆర్యబుద్ధి సంతతివార మని చెప్పుకొను మనసంఘము మును ఇంత యధోగతికి తెచ్చుట సమంజసము కాదు. మన యాంధ్రోద్యమముయొక్క పురోవృద్ధి ముఖ్యముగా సంఘసంస్కరణముపై నాధారపడియున్న దని దృఢముగా నమ్ముఁడు. కాలానుగుణముగా మన ప్రస్తుతావసరములను బట్టి సంఘము నెప్పుడు సంస్కరించుకొందుమో మన యాంధ్రోద్యమము సయిత మప్పుడే యభ్యున్నతదశకు వచ్చును

దత్తమండల సాంఘికసమావేశము

ఇయ్యది జూను నెల 6,7 తేదులలో గుత్తియందుఁ గూడినది. గా. కేశవపిళ్లగా రతిథులకు హృదయంగమంబైన స్వాగతం బొసఁగిరి. రావు బహద్దరు సుబ్రహ్మణ్యము పంతులుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. వారి వ్యాసము సంఘాభిమానమును దేశాభిమానమును సూచించు భావములతో నిండియున్నటు లీ క్రింది వాక్యములు తెలుపుచున్నవి.

"అందఱు నిప్పు డాంధ్రోద్యమమును గూర్చి మాటలాడుచున్నారు. ఈ విషయమును నిష్పక్షపాతముగ నాలోచించుట మంచిది. ఈ జిల్లాల ముఖ్యభాష యాంధ్రము. మనకు తెలిసినంతవఱ కాంధ్రరాజుల చేతనే యీ దేశము పరిపాలింపఁబడుచుండెను. ఇప్పటికన్నడ భాగమునందలి యాచారములు తెలుఁగువారి యాచారములఁ బోలియున్నవి. ఈ జిల్లాలలో నెచ్చటను కన్నడ భాషయందు సాహిత్య గ్రంథములు వెలువడుట లేదు. కన్నడజను లందఱును సాధారణముగా వ్యవహారకార్యముల వ్రాఁతలను తెలుఁగు అక్షరములతోనే వ్రాసికొందురు. నిర్దేశింపఁబడినచో నీ జిల్లాలు ఆంధ్రములే కాని యన్యములు కావు. అట్టి యీ జిల్లాలలోని మన మాంధ్రోద్యమమును గూర్చి యుపేక్ష వహింపరాదు. ఈ యుద్యమము కాదు. ప్రపంచమం దేయుద్యమమం దైనను మన ముత్సాహము లేనంత మాంద్యము కలవారము."

"ఆంధ్రోద్యమము మన దేశమునం దిన్ని చోట్లను వ్యాపించి యున్న దా యని యుపోద్ఘాతమే గాని వేఱు కాదు. తమ స్థితి నభివృద్ధి నొందించుకొనుటకై దేశీయులందు కల్గిన యశాంతియే యిట్లు పరిణమించినది. తమ పూర్వ చరిత్రము, సుందర సాహిత్యము, ఫలవంతమగు భూమి యింక నిట్టి స్వాభావి కైశ్వర్యముల యాధిక్యము నెఱింగియుండి తమ యుదారభావముల మఱచిపోని జమీందారులతో కూడియున్న యుత్తర సర్కారు నివాసులగు నాంధ్రజనులు మేల్కాంచి చూచి, తాము అన్యజాతుల కన్న జీవిత యాత్రయందు వెనుకఁబడియుండుటను గమనించి నిద్రనుండి లేచినవారివలె ననేక దిశల ననేకవిధముల తొందఱగా ప్రయత్నములు సల్పుచున్నారు.

"ఈ విషయమును ఆంధ్రనాయకులు మమకార రహితులై తమ న్యాయబుద్ధి నెల్ల నుపయోగించి యీ ప్రశ్నను విమర్శించుట తగును. ఉన్న దున్నట్లు చెప్పువారిపై కొన్ని విరోధ విమర్శనలు కలుగక తప్పవు. పెద్ద సమస్యల నాలోచించి చర్చించునప్పుడు అధిక సంఖ్యాకుల యుద్దేశము చే మనము నంగీకరింపక పోయినను బాధలేదు."

కర్నూలుమండలసభ

ఆగస్టు 22-వ తేదిని కర్నూలునందు మొదటి కర్నూలుమండలసభ గూడినది. ఇంతవఱకును 24 కృష్ణామండల సభలు గూడుటయును, కర్నూలునం దిది మొదటి సమావేశ మగుటయును కర్నూలు మండల మాంధ్రదేశమునందు రాజకీయ సాంఘిక జీవనమునందు ముందంజ వేయుట లే దని సూచించుచున్నవి. గతమునకు వగచుటవలన ప్రయోజనము కలుగదు. దత్తమండల వాస్తవ్యులు మున్ముందు తమ మండలాభ్యుదయమునకై యధికతరోత్సాహముతో పాటుపడి వెనుకటి మాంద్యమునకు ప్రతీకారమును కల్పించుట శ్రేయస్కరము.

మండలసభకు ఎస్. వి. నరసింహారావు పంతులుగారు సన్మానసంఘాధ్యక్షులు, దివాన్ బహద్దరు కరుణాకర మీనన్‌గారు సభాధ్యక్షులు. సన్మానసంఘాధ్యక్షుల యుపన్యాసమునందలి కొన్ని వాక్యము లిచట చేర్పఁబడుచున్నవి. వానిని చదివినవారల కాంధ్రోద్యమ తత్త్వము బోధ్యమగును. నరసింహారావుగారు స్థానిక స్వపరిపాలనమును గుఱించి చేసిన విమర్శనము బాగుగ నున్నది.

"ఆంధ్రదేశీయమైన యొక జిల్లాలో జరగు నీ (ప్రతినిధి)సభలో నాంధ్రోద్యమమును గుఱించి నేను ప్రస్తావించుట విధి. ఈ యుద్యమము పత్రికలలోను వేదికలమీఁదను భిన్నాభిప్రాయములచేఁ జర్చితమగుచున్నది. ఈ యుద్యమమును గొందఱు తిన్నగ గ్రహింపక అపార్థము చేసికొనిరి. కార్యసాఫల్యమును బొందు నాధారములయందంతట ముండకవచ్చును గాని, యీ యుద్యమ మిండియాదేశీయ మహాసభయొక్క పరమాశయములను బొందఁగోరుచున్నదే గాని యందులకు తగ్గినది కాదు. ఇండియా కొక గొప్ప దేశసౌభాగ్యమువలె, నీ యాంధ్రోద్యమము, జననమువలనఁ గాని స్థిరనివాసమువలనఁ గాని యాంధ్రదేశమును స్వదేశముగఁ గలవారి సంఘము నొక్కటిగఁ జేయుటకుఁ గోరుచున్నది. ఇది భాషనుబట్టి యేర్పడిన యుద్యమము. మన లౌకిక వ్యవహారములకు సంబంధించిన దేశీయమహాసభయొక్క యుద్దేశమునే యనుసరించినది. ఈ యుద్యమముయొక్క అపరాగాని చెప్పఁ

బడు నన్నింటిని గాని చేయఁబడు నన్నింటినిగాని యంగీకరించుట సాధ్యము కాకపోవచ్చును గాని, మన మాతృదేశాభివృద్ధిఁ గోరు సహృదయుఁ డెవ్వఁడు గాని యీయుద్యమోద్దేశము నాక్షేపింప నోపఁడు. ఈ యుద్యమసందర్భమున వివాదమునకుఁ జోటిచ్చు నంశముల ప్రస్తావన నుండనిచ్చి, యుంటుతో సంబంధించిన విద్యావిషయిక (ఈ విషయమున మాత్ర మభిప్రాయభేద ముండఁజాల దని తలఁచెదను.) ప్రస్తావనను గుఱించి మాత్రము కొన్నిమాటల నుడువఁ బూనెదను. విద్యతోఁ జేరినంతవట్టును యోచించినచో, నీ యుద్యమముయొక్క యుద్దేశ మాంధ్రదేశమున కొక విశ్వవిద్యాలయ మేర్పడవలయు ననుటయే.

"సామాన్యముగ నొక్క దేశభాషక యుక్కువ ప్రచార మెంతవఱకుఁ గలదో అంతవఱ కొక భాగముగ గ్రహించి యంత కొక విశ్వవిద్యాలయము నేర్పఱచినచో, దేశభాషలద్వారా విద్యావ్యాపనకుఁ బూనుకొనుటకుఁ గడు సులభముగ నగును. దేశభాషల యుపయోగము విద్యార్థుల విషయగ్రహణశక్తికిని, బుద్ధివికాసమునకును, పరిశోధనాశక్తికిని జాల తోడ్పడఁగలదు. ఆంధ్ర విశ్వవిద్యాలయస్థాపన మాంధ్రజిల్లాల నివాసులయందు గొప్ప మార్పును కలిగించును. ఈ తీరున, ఇండియాదేశమునందలి పలుభాగములలో నభివృద్ధి సంఘటిల్లెనేని, దేశ మంతయు సమష్టి నభివృద్ధిఁగాంచి ప్రపంచమందు గౌరవనీయము లగు గొప్ప దేశములలో నొక్కటి కాఁగలదు. బోధనాశాలలును, వసతులును గల విశ్వవిద్యాలయ మొం డాంధ్రదేశమునకుఁ ద్వరలో స్థాపింపఁబడునని నెమ్మదిని కోరుచున్నాను."

కర్నూలుమండల సంఘసంస్కరణసభకు సి. వి. కృష్ణస్వామయ్యరుగారు సన్మానసంఘాధ్యక్షులు, దివాన్ బహద్దరు వారణాసి సుబ్రహ్మణ్యముపంతులుగా రగ్రాసనాధిపతులు.

బళ్లారిమండలసభ

మొదటి బళ్లారి మండలసభ సుప్రసిద్ధ న్యాయవాదులైన ఎస్. శ్రీనివాసయ్యంగారి యాధిపత్యము క్రింద అగస్టు 22-వ తేదీని బళ్లారియందుఁ గూడినది. అయ్యంగారి యుపన్యాసము విద్యావ్యాపన కనుకూలములైన విమర్శనలతో నిండియున్నది. అన్ని ప్రయత్నములకును విద్యయే మూలము గాన, దేశహితైకపరాయణులు వారి హితోపదేశములను గమనింపవలసియుందురు.

మూఁడవ కడప మండలసభ

మూఁడవ కడప మండలసభకు సన్మానసంఘాధ్యక్షులు టి. ఎమ్. నరసింహాచార్యులుగారు. ఏ. ఎస్. కృష్ణారావు పంతులుగా రధ్యక్షులు. సన్మానసంఘాధ్యక్షులు మండలస్థితి న్యాయవిచారణ అటవీ పరిపాలనము నీటి పారుదల మొదలగు విషయములను గుఱించి విపులముగ చర్చించిరి. కృష్ణారావు పంతులుగారును విద్యావ్యాపనము ఆరోగ్యము పారిశుద్ధ్యము భూమిసిస్తు మొదలగు మండలాభ్యుదయమున కవసరమైన విషయములను తమ యుపన్యాసమునందు బాగుగ చర్చించిరి.

కృష్ణామండల రాజకీయసభ

ఇరువది మూఁడవ కృష్ణామండలసభ యేలూరునందు అక్టోబరు 24-వ తేదిని గూడినది. సన్మానసంఘాధ్యక్షులు సుప్రసిద్ధులైన మోచర్ల రామచంద్రరావు పంతులుగారు. వారి యుపన్యాసమునందలి నౌకాసైన్యావశ్యకతను గుఱించిన వాక్యము లిచట నుదహరింపఁబడుచున్నవి.

"ఇండియా సంరక్షణకు కావలసిన నౌకాసైన్య విషయమును ఇండియా ప్రభుత్వమువారును ప్రజలును కూడ ఆలోచింపవలసియున్నది. పదను స్వదేశరాష్ట్రములు తమ సంరక్షణకొఱకును ఇంగ్లండు దేశ సంరక్షణకొఱకును నౌకాసైన్యాభివృద్ధికిఁగాను కట్టఁబడు నూతనయుద్ధనౌకలకు వెచ్చించు ద్రవ్యములసంగతి మీ రెఱిఁగియుందురు. మన దేశమున కున్న విస్తీర్ణసముద్రతీరమును ఆలోచించి చూచినయెడల, మన దేశసంరక్షణార్థము నౌకాసైన్యస్థాపన మత్యావశ్యక మని మీకు తోఁచకపోదు. మిగిలిన కష్టము లటుండ, ఇందునుగుఱించి ద్రవ్యకష్టమే యధికముగా నున్నది. ప్రజలపై నిదివఱకున్న పన్నులను అమితముగా హెచ్చింపకుండ నీ విషయమును సాధింపఁగల మార్గము త్వరలో కనుఁగొనఁబడి ఏదో యొకరూపకముగ దేశసంరక్షణార్థము నౌకాసైన్య మేర్పఱుపఁబడు నని నా నమ్మకము. ఇండియా సంతతివారికి నౌకాసైన్య పదవులను పొందుట కవకాశ మిచ్చు నౌకాసైన్యస్థాపనవిషయమై ఇండియా దేశపు ప్రభుత హెచ్చరిక పుట్టకమానదు."

సభాధ్యక్షులు పోలవరము జమీందారు గా. కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావు పంతులుగారు. నీటితీరువ, రిమిషనులు, భూమి సిస్తు, మురుగు కాలువలు, సెటిల్మెంటు, గ్రామకంఠములు మొదలగు రయితుల కుపయుక్తములైన విషయములు వారి వాక్యమునందు విమర్శింపఁబడినవి.

కృష్ణామండల మాంధ్రోద్యమమునకు పుట్టినిల్లు. గా. పంతులుగా రిరువురును నాంధ్రులు. అట్లయ్యును

నుభయసభాధ్యక్షులును నాంధ్రోద్యమమును గుఱించి తమ యుపన్యాసములందు ముచ్చటించకుండుట విచిత్రము. అయినను నాంధ్రరాష్ట్రపు తీర్మానము సభ్యులచే నంగీకృత మైనది.

### సంఘసంస్కరణసభ

మండల సంఘసంస్కరణసభ పి. లక్ష్మి నరసు నాయఁడుగారి యాధిపత్యముక్రిందఁ గూడినది. లక్ష్మి నరసు నాయఁడుగారు దేశాభ్యుదయమునకు సర్వతోముఖమైన సంఘజీవనము సాధన మనియును దానిని పొందుటకై విద్యావ్యాపనమునకు మించిన సాధనాంతరము లేదనియును చెప్పియుండిరి.

### నియోగిమహాజనసభ

రాజమహేంద్రపురంబు గౌతమీతీరంబున అక్టోబరు 30, 31 తేదులందును నవంబరు 1-వ తేదిని 12-వ నియోగిమహాజనసభ గూడినది. రావు బహద్దరు చిత్రపు వేంకటాచలము పంతులుగారు సన్మానసంఘాధ్యక్షులు. ద్రోణంరాజు వేంకటాచలపతి శర్మగారు సభాధ్యక్షులు. సన్మాన సంఘాధ్యక్షుని యుపన్యాసమునందలి చివర వాక్య మిచట నుదహరింపఁబడుచున్నది.

"మన మిప్పుడు అంత అవశ్య మంగీకరించుచున్నట్టియు, అభిప్రాయ భేదముల కవకాశము లేనట్టియు, పురోభివృద్ధికి సాధనభూతమై నట్టియు రాజకీయ విద్యాభివృద్ధిని గుఱించియు మత విద్యాభివృద్ధిని గుఱించియు తమపోష్యలకరములగు సాంఘిక విషయములను గుఱించియు అత్యుత్సాహపూర్వకముగ విచారించి నిర్ణయించి స్వసంఘమును సేవించెదముగాక!"

### ఆంధ్రదేశ సభలు

ఏఁటేఁట నిట్టి సభ లెన్నియో తెలుఁగుమండలంబులందుఁ గూడుచున్నవి. సభలు రెండు తెఱఁగుల నున్నవి—మహాజనసభలు, మహిళాసభలు. ఆంధ్రదేశమున కంతెకును ఆంధ్రమహాజనసభ ఆంధ్రమహిళాసభ నిర్ణీతస్థలములందుఁ గూడుచున్నవి. మహాజనసభకంటె మహిళాసభయే పురాతనము. మహాజనమహిళాసభలందు జాతికులవివక్ష లేక దేశాభ్యుదయమును గోరువారందఱును కూడఁగలరు. మహాజనసభకును మహిళాసభకును శాఖాసభలవలె మండలసభలు గలవు. ఆంధ్రదేశమునందు దాదా పన్ని మండలంబులందును మండలసభలు గలవు. కొన్ని మండలములందు రాజకీయసభలు, సంఘసంస్కరణసభలు, పరిశ్రామిక సభలు గూడుచున్నవి. పైన వివరించిన మండలసభలు గాక ప్రత్యేకశాఖాసభలును గూడుచున్నవి. శాఖాసభల ప్రయోజన మంతశ్శాఖాభివృద్ధి. నియోగులు, వైద్యులు, ఆర్యవైశ్యులు, విశ్వబ్రాహ్మణులు, కమ్మవారు, వెలమవారు, ఈడిగవారు, మొదలగువారందఱును తమ తమ శాఖల నభివృద్ధి చేయుటకై యేఁటేఁట సభలు చేయుచు పాటుపడుచున్నారు. ఈ సభాసమావేశము లాంధ్రదేశమునందు ప్రవర్ధమానం బగుచున్న నూతనోత్సాహంబునకు ప్రబలనిదర్శనంబులు.

హిందూదేశమునం దే యితరభాగములందును నాంధ్రదేశమునందుఁ గూడినన్ని సభలు గూడుట లేదు. ఆంధ్రదేశమునం దుదయించిన నూతనోత్సాహము సర్వతోముఖ మైనది. స్త్రీలు పురుషులవలె సంఘాభ్యుదయమునకై పాటుపడుచున్నారు. మండలసభలు రాజకీయాందోళనమునందు మాత్రమే మునుఁగక సంఘసంస్కరణసాధనములను ద్రవ్యోపార్జనోపాయములను నన్వేషించుచున్నవి. అంతశ్శాఖలవా రీ సభలతో సంతృప్తి చెందక తమ కులమువారికై శాఖాసభలను చేయుచున్నారు. ఆంధ్రదేశమునకు జాతీయజీవనము నూతనము గాదు. కృష్ణామండలసభకు 24 ఏండ్లు నిండినవి. చెన్నరాష్ట్రీయసభకు 21 ఏండ్లు మాత్రమె గడచినవి. కృష్ణా గుంటూరు మండలసభలు చెన్నరాష్ట్రీయ సభకంటె పురాతనంబులు.

### ఆంధ్రరాష్ట్రము

సమస్తసభాదర్శంబులును నాంధ్రమహాజనసభయందు కేంద్రీకృతములు. మండలసభాదర్శములు శాఖాసభాదర్శములు మహాజనసభాదర్శములం దిమిడియున్నవి. ఆర్యవైశ్య కమ్మ మహాజనసభలందును, కృష్ణా గుంటూరు విశాఖపట్టణ మండలసభలందును నాంధ్రరాష్ట్రపు తీర్మాన మంగీకృత మైనది. కొన్ని సభలం దీ విషయము సంస్తుతింపఁబడినది. ఇంకను కొందఱకీ భావము గ్రాహ్యము గాలేదు. వారు కూడ బాగుగ యోచించినచో, ఆంధ్రరాష్ట్రాదర్శమునందలి ప్రయోజనమును గ్రహింపఁగలరు.

### భాషను జాతిని బట్టి రాష్ట్రములు

సచివోత్తముఁడు ఆస్క్విత్తుగారు, యూరపుఖండమునందు శాశ్వతమైన శాంతి స్థాపిత మగుటకై,

యుద్ధము ముగిసిన పిదప భాషను జాతిని బట్టి రాజ్యముల నేర్పఱచుట సమంజస మని చెప్పిరి. ఈ నీతియె కొంతవఱకు పందొమ్మిదవ శతాబ్దమున నవలంబింపఁబడిన విధ మీ వ్యాసమునకు మొదట తెలుపఁబడినది. చిన్న జాతుల స్వాతంత్ర్యమును సంరక్షించుటకై యుద్ధమునందు బ్రిటీషు సామ్రాజ్యము చేరిన విషయము సర్వత్ర తెలిసియున్నది. ఇరువదవ శతాబ్దమున నవలంబింపఁబడఁదగిన రాజ్యనీతి ప్రజాసభ్యత్వ జాతీయస్వాతంత్ర్యములం దిమిడినది. ప్రజాసభ్యతకు విజ్ఞానవ్యాపనము సాధనము. విజ్ఞానవ్యాపనమునకు దేశభాషలు శరణ్యములు. జాతీయభావమును బలపఱచుటకు మాతృభూమి, మాతృభాష, సాంప్రదాయేతిహాసములు దృఢపాశములు. ఆ పాశములు రాష్ట్రాదర్శమునందు సులభములు. భాషను జాతిని బట్టి రాష్ట్రమును నిర్మించుట యనెడి ఆస్క్విత్తుగారి రాజనీతి యభివృద్ధి చెందిన రాజ్యముల కవసరమై యుండఁగా, అభివృద్ధి లేక వెనుకఁబడియున్న యాంధ్రదేశమున కవసరము గాదా?

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయమును గుఱించి యోచింపఁదగిన యంశములు రెండు గలవు. మొదటి సందేహము—ఆంధ్రరాష్ట్రము హైందవజాతీయత కనుకూలమా, ప్రతికూలమా యనునది. బ్రిటీషు సామ్రాజ్యమునందలి భిన్నరాజ్యములును హిందూదేశమునందలి భిన్నరాష్ట్రములును వలె నాంధ్రరాష్ట్రము కూడ హైందవజాతీయత కనుకూలపడును గాని ప్రతికూలపడదు. రెండవ సందేహము—ఆంధ్రరాష్ట్రనిర్మాణము వలన నాంధ్రదేశసామాన్యమున కుపకృతి కలుగునా, లేదా యనునది. రాష్ట్రనిర్మాణమువలన నాంధ్రభాష వికాసము నొందును; ఆంధ్రు లభివృద్ధిని చెందుదురు; ఆంధ్రదేశము బాగుపడును. హిందూదేశమునందు రాష్ట్రీయ స్వపరిపాలనా పద్ధతి సాధ్య మగుటకును యూరపునందు జాతీయ స్వాతంత్ర్య సంరక్షణము సుస్థిరముగ స్థాపిత మగుటకును భాషను జాతిని బట్టి యేర్పడిన రాజ్యములే శరణ్యములు. అందుకు భిన్నములైన రాజ్యములు ప్రజావబోధమున కననుకూలములు.

ఆంధ్రరాష్ట్రము ప్రత్యేక ప్రాంతములకుఁ గాని మండలములకుఁగాని శాఖలకుఁగాని లాభదాయకము గావచ్చును గాని నష్టదాయకము కాఁజాలదు. దేశసామాన్య ప్రయోజనము నిర్ణయింపఁబడునపుడు ప్రత్యేక వ్యక్తులయొక్కయు ప్రదేశములయొక్కయు లాభనష్టములు పాటింపఁదగినవి గావు. విపరీతాభిప్రాయములు గల దేశసోదరు లీ యాదర్శసారమును గ్రహించెదరుగాక!

ఆంధ్రులును నాంధ్రేతరులును స్వలాభ దురభిమానములను మఱచి పవిత్రంబును సుఖావహంబును కామ్యార్థప్రదంబును నైన మాతృపూజయెడ తత్పరులై ఆంధ్రలోకాభ్యుదయమునకును భారతజాతీయ నిర్మాణమునకును బ్రిటీషుసామ్రాజ్య సంరక్షణమునకును లోక కల్యాణమునకును తమ జీవితంబులను వినియోగించి గమ్యస్థానమును చేరునట్లు భగవంతుఁ డనుగ్రహించుఁగాక!

మ. ధరలో జాగ్రన్నృపాలశేఖరసముద్ధాటీజవాతంబుచే
పరిసేనల్ కను దూది పింజలుగ దత్త్వ రవ్వరవ్వంతలై
సురమార్గంబున కేఁగుఁగాత తిరుగన్ జూడంగ రాకుండఁగన్
వర కోదూరు జనార్దనేను కరుణాపాంగప్రభాదృష్టిచేన్.

# బ్రిటిషసామ్రాజ్యవిజయస్తోత్రః

ఒంగోలు వేంకటరంగసోమయాజినా విరచితం

శ్లో. శ్రీలసద్వేణుగోపాల జయం దేహి మమ ప్రభో!
యుధ్యతే యత్ర యత్రాస్తే కింగ్జార్జి చక్రవర్తినే. ౧

అన్యాయతస్తు బెల్జిన్యాం యే ప్రవిశ్యాదహన్ స్థలాన్.
వేణుగోపాల తాన్ జేతుం విక్రమం దేహి మత్ప్రభో. ౨

ఫ్రాన్సుదేశే జర్మనీభి రభియుధ్యంతి మామకాః
ఆంగ్లేయసైనికై ర్యస్తాః గోపాలవిజయం దిశ. ౩

ఐరోపాయుద్ధరంగేషు యుధ్యంతే యేస్వసైనికాః
తేషాంతు వేణుగోపాల విజయం దేహి సత్వరం. ౪

యమ్డన్ క్రూజరుతోస్మాకం అభయం యోహి దత్తవాన్
వేణుగోపాల విజయం దేహ్యస్మచ్చక్రవర్తినః. ౫

కింగ్జార్జిచక్రవర్తి ర్యో భారతంచాభిరక్షతి
అనిశం తస్యవిజయం దేహి గోపాల ధీమతే. ౬

గజేంద్రరక్షణం యేన కృతం పూర్వయుగే తదా
భోస్స్వామిన్ వేణుగోపాల త్వమైవాభయ మస్తునః. ౭

జయతుజయతుజార్జి శ్రీబ్రిటిష్చక్రవర్తి
భరతధరణిభాగ్యం చాస్తుతస్యైవ నూనం
బ్రిటిషు రషియ ఫ్రెంచీ మండలే మైత్రి శోభా
దిశజ విజయభాగ్యం శీఘ్రమేవా తనోతు. ౮

ఆంగ్లేయదేశ జనపోషక పారిజాతం
ఆస్ట్రేలియాభరత ఖండముఖండరాజ్యం
స్త్రీరత్నలోకజన సాదరభావరూపం
గోపాలదేవ జయినం కురు చక్రవర్తిం ౯

# యూరపుఖండఘోరభండనభాస్వద్రత్నావళము

మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్న శర్మగారు

మానవు లందఱు మహిఁ జెడు లగుటన్ - మహానే యుద్ధ మొనర్తురుగా!
యీ నవహావంబున నన జలచరు - లింక వియచ్చరులై రహహా!
ఘూనికి నందం దే పోరుం బోరిఁ - బొనరింతురు వేగులు, లింగల్
గానఁబడెను నవి పేఁ గానిస మిటఁ - గాంచ మహాయుద్ధ మిదె కదా! 1

జయాపజయములు దైవికములై - సమకొనుఁ దుద, నిప్పటియాహల్
ప్రయోజనము లేనిది యనుచుం జె - ప్పనొ; నైన, నే నుడివెద సం
దియ మేటికిఁ? గైజరున కందఱుం - దెలియఁగ శత్రులు, మిత్రులుగా
నయమున నార్జించ శక్తి - జ్జయము సిద్ధ మని యనఁగుం గా! 2

సాయపడిరి యాస్ట్రియావారి కని - జర్మను; లింగ్లిషువా రన్నన్
దోయమువా రగు ఫ్రాన్సువారికిని - దుర్బలు లగు బెల్జియములకున్;
న్యాయం బిది యగుట నందఱు స - హాయు లైరి యా కతమునన్;
శ్రేయం బిది కద నైనను దోడగు - సిద్ధము జయ మాంగ్లేయుల కౌ. 3

హైందవు లాంగ్లేయులతోఁ గూడి మ - హాహవముం జేయుటఁ జూడన్,
బొందగుఁ గృష్ణార్జునులు గూడుకొని - పోరికిఁ దొడఁగినయట్లహహా!
సందేహంబుం గలదే జయ మిట - సమకొనుటకు, ధర్మం బెపుడుం
బొందుపడున్ యెందే మేల్గెలు పగుఁ; - బోలుంగద శాంతియు మేలై. 4

అప్రార్థితు లయ్యును సమయజ్ఞత - నాంగిలేయులకు సహాయులునై
దీప్రప్రవిదారణముఁ జలుపుటం - దెలిసి వారలు కృతజ్ఞతతో
క్రమముగ న తమతో సమానులుగఁ - గాంతించి సమస్వాతంత్ర్యం
బే ప్రసిద్ధముగ నొసఁగవలయుటన్ - హిత మిది హైందవులకు నెందున్. 5

తన దొమనిది బలతారతమ్యమును - దలఁపక, వృషభము వ్యాఘ్రముతో
ననిసేసి వినాశముఁ గాంచె; నటులె - యక్కటా! యెనుఁగహహ!
ఘన మగు ఖడ్గాకంబు న్నార్పొనె, - కనునా గెలుపు? గను గాసిపడున్;
గనుఁగొన కభిమృగంబుల సింహము - ఖ్యాతిగ గెల్చి జయముఁ గాంచున్. 6

ఫ్రెంచివారి లింగ్లీషువారలును - ప్రేముడిఁ గూడుటఁ జూడఁగ స
త్ప్రాంచితచందనకర్పూరంబులు - వలనొప్పంగఁ బొందినయట్లౌ;
గాంచన్ జర్మను లాస్ట్రియనులు వే - ప్పం గూడుట రసమును బులుసున్
మించి కలసిన ట్లగుపడు నెవరికి; - మేలగు రష్యావార ధ్రువుల్. 7

సర్వవిధంబుల స్వతంత్రశక్తిని - జనుట బ్రిటీషుప్రభుతయె సూర్యుం;
డుర్విం బ్రజాప్రభుతచేతం జంద్రుని - యోజం దోంచును ఫ్రాన్సు; మహా
గర్వంబునం గ్రౌర్యంబున జర్మను - ఖ్యాతిగ నంగారకుండనవో;
గుర్వాభము రష్యాసామ్రాజ్యము; - గోఆలు సర్వియా బుధుభంగిన్. 8

అలమునకు మూలం బగు నాస్ట్రియ - యూ శని; జర్మనుపక్షమునం
దాలోచింపక చేరెం గాన శు - క్రాచార్యుం డగుం దుర్కీ; వే
యేలా? యాంగ్లేయప్రభుత్వ మను - నిద్ధబలుండు జనార్దనుండే
కేల దర్శ గొన; జపాను రాహువు; - కేతువు బెల్జియ మనంగం జనున్. 9

నెపోలియనువలెం బ్రపంచజయమున - నెగడంగడంగ న త్లెగ్గ యగున్;
విపులబలు లయిన యాంగిలేయులె - ఫ్రెంచివారితోం గలసిరి స
త్కృపాంతరంగులు గావున, వారలు - గెరక చేరెం గడు లక్ష్మీ;
నిపుణ విపులకున్ హిత మిది; కైజరు - తెలియవలె నశోకుని కాంతిన్. 10

భూమింగంసునికి గెలు వచ్చెనె శ్రీ - పురుషోత్తమునికె గెల్పొదవెన్;
భీమశక్తి శల్యునికిన్ జయ మయ్యెనె - భీమాగ్రజుండు యుధిష్ఠిరుండే
శ్రీమంతుండు విజయము హరికృపం గనెం; - తెందునె కైజరు గర్వితుం డా
స్వామి హరికృపన్? ధర్మిష్ఠుండగు - జార్జిచక్రవర్తి విజయుం డౌ. 11

అయనయసంపన్నుండు స్నీతి - న్యాయధర్మపరిపాలకుండున్
దయావిముం డామోఘనవీరుండు - తంత్రోపాయవిశారదుండున్
గ్రియాప్రధానుండు కైజరు లోంగొని - కీర్తనీయశాంతిం జేతన్
జయాఘ్యమ్ము దట జయముం బ్రొందెడు - జార్జిచక్రవర్తి విజయుం డౌ. 12

తేటగీతి

శ్రీ మహామహోపాధ్యాయనామబిరుద - రత్నకోక్కొండ వేంకటరత్నశర్మ
సముదితం బినరత్నావళి యిది భీమ - భండనవినాశకము శాంతిభద్రదంబు. 13

సమరశాంతి రస్తు సర్వేజనా స్సుఖినో భవంతు.

---

# ప్రాచి, ప్రతీచి

కవికొండల సాంబశివరావు గారు

పూర్వము కూడ పూర్వఖండవాసులకును పశ్చిమ ఖండవాసులకును విశేషసంబంధ ముండెడిది. క్రీస్తు జన్మింపకపూర్వమే భారతవర్షమునకును ఇటాలియాదేశమునకును వాణిజ్యము జరుగుచుండె నని మన కిప్పుడు తెలియవచ్చుచున్నది. ఇటీవల కూడ చీనా దేశపు వస్తువులు పశ్చిమప్రాంతములకు పోవుటయు, ఐరోపాఖండవాసులు భారతవర్షపు శాలువులను పట్టువస్త్రవిశేషములను గొనుటయు క్రీ.శ. పదునైదు పదునారు శతాబ్దంబులలోఁ గూడ మామూలై యుండెడిది. గ్రీసుదేశస్థులు రెండువేలసంవత్సరములకు పూర్వమే మనదేశము వచ్చి చూచి వెళ్లిరి. క్రీ.శ. రెండవశతాబ్దమందు శిష్టులగు బ్రాహ్మణులు ఈజిప్టుదేశమునందలి అలెగ్జాండ్రియాపట్టణమున బ్రహ్మతత్త్వమునుగూర్చి బోధించుచుండిరి. ఆసియాఖండవాసులగు బాక్ట్రియనులు ఐరోపాఖండమందలి ఆస్ట్రియాప్రాంతముల సంచరించుచుండిరి. క్రీ.శ. ఆఱవశతాబ్దమునందు నెస్టోరియను క్రైస్తవమిషనరీలు మన యాసియాఖండమం దంతటను వ్యాపించియుండిరి. ఇవ్విధముగ ననేకశతాబ్దములనుండి పూర్వపశ్చిమఖండవాసులకు అన్యోన్యసంబంధబాంధవ్యము లుండెడివి. కాని యిట్టివి యత్యల్పముగ నుండుట చేతను, పూర్వపశ్చిమప్రాంతములందుఁ దిరుగు బాటసారులసంఖ్య స్వల్పమగుటచేతను, వర్తకవ్యాపారములును మతబోధకైన యత్నములును విరివిగ నుండకుండుటచేతను, ఈ సంబంధబాంధవ్యములు విశేషము స్థిమితము గాక, బాగుగ నాటుకొని ప్రకాశింపలేక, పైపైకి మాత్రము తళతళలాడుచు, పూర్వపశ్చిమ వృత్తాంతములు ఏయిద్దఱుముగ్గురకో తెలిసినవై యుండెను.

కాని కాలక్రమమున పూర్వఖండవాసులు బలహీనులై యుక్తాయుక్తవివేకశూన్యు లగుటచే, పశ్చిమదేశస్థులు ఆసియాపై దండువెడలి చాల దేశముల నాక్రమించుకొనిరి. ఇండియా వర్మా దేశములు ఇంగ్లాండు అధికారమునకు లోఁబడియున్నవి; సైబీరియా రుష్యాకు లోనైనది. చీనా నామమాత్రము స్వాతంత్ర్యము గల్గి యున్నను, నిజమునకు ఐరోపాఖండమునకును జపానునకును లోఁబడగా నున్నది. ఆస్ట్రేలియా కూడ తెల్లవారలదే. పశ్చిమవాసులు వేలకొలఁది ఆసియాకు వచ్చి వర్తకము చేసికొనుచున్నారు; మతబోధ చేయుచున్నారు; ఉపాధ్యాయులుగ నున్నారు; రాజ్యాంగపాలనలందు ఉత్తమపీఠముల నాక్రమించుకొని యున్నారు. పూర్వఖండవాసులును పశ్చిమప్రాంతములకు బోవుచున్నారు; అచట విద్యగఱచుచున్నారు; వారి సాంఘికాచారములు కొన్ని తోడ్కొనివచ్చుచున్నారు; ఆధునికవాణిజ్యపద్ధతుల నేర్చుచున్నారు. ఈప్రకారముగా నేఁడును పూర్వపశ్చిమఖండవాసులు అన్యోన్యవిజ్ఞానమును గ్రహించుచున్నారు. వీరివీరి యాచారవ్యవహారములలో కొన్ని గొన్ని యక్కడి కిక్కడికిని, ఇక్కడి వక్కడికిని మాఱుచున్నవి. పశ్చిమదేశస్థుల యాధునిక వైజ్ఞానిక శాస్త్రములు మనదేశములలో వ్యాపించుచున్నవి; మనదేశపుఁ బురాతనతత్త్వశాస్త్రాదులు పశ్చిమమున పండితుల హృదయపీఠముల నధిష్ఠించుచున్నవి. కావున తెలిసియో తెలియకయో మానవులెల్లరకు తమతమ తత్త్వములు మాఱిపోవుచున్నవి. ఆధునిక ధూమశకటాది శీఘ్రవాహకములును తంత్రీవార్తలును తంత్రీశూన్యవార్తలును ఈ పూర్వపశ్చిమ సంబంధమును మరింత బలపఱచుచున్నవి.

ఇక్కారణములచేతనే యీసంబంధము ముందుముందు మరింత దృఢమగును. కాని యిది సుఖకారణము గాక దుఃఖదాయకమైన శోచనీయము గదా!

ఇది విశేషముగ మొదట రోగికి చికిత్సవలెను బాలకునకు శిక్షణవలెను సుఖదాయకము గాకుండును. ఆంగ్లేయులు విశేషముగ వస్తుకలాభమునకై మనదేశమున నివసించియున్నారు గాని వారికిని మనకును నింకను సంపూర్ణముగ సోదరభావ మేర్పడలేదు. పాశ్చాత్యులు భారతీయుల నప్పుడప్పు డక్కడక్కడ సోదర సమాన ప్రతిపత్తితోఁ జూడకుండుట తలఁపించుచున్నది. చీనాలో నిరోపాఖండ వాసులు కొందఱు శక్తికొలఁది స్వలాభప్రాప్తికై పాటుపడుచున్నారు. కావున ఈ పూర్వపశ్చిమ సంబంధము మొదట కష్టదాయక మనుమాట నిక్కము. అట్లని యీసంబంధమును వదలఁగొట్టుకొనఁజూచిన నది యసాధ్యము. అది గాక అట్లు చేయుట మానవజాతికి శ్రేయోదాయకము గాదు. గృహకల్లోలము లుండిన నట్టివానిని తొలఁగింపవలయునే గాని కుటుంబనాశనమును చేసికొనఁగూడదుకదా! అట్లే మనకును పాశ్చాత్యులకును అన్యోన్యానురాగము లేకుండిన దానిని కలిగించుకొన వలయునే గాని, రెండుమూడువేల సంవత్సరములక్రింద "ఎవరికి వారే యమునాతీరే" యని యుండిన ట్లుండుటకు యత్నించుట మూఢత్వము. ఎప్పటికైనను మానవజాతి యొక్కటి కావలయును. అంతఃకలహములు నశింపవలయును. జాతిస్పర్థలు చావవలయును. ప్రేమయే ప్రధానము కావలయును. పృథ్వి మీఁది క్లిష్టస్థితిని తెచ్చుటకు మనము పూర్వపాశ్చాత్య ఖండవాసుల ఆచారవ్యవహారములను పరిశీలింపవలయును; కాని యిప్పుడు ఉభయుల కున్న భేదములను కప్పి మాసిపుచ్చుట శ్రేయస్కరము గాదు. ఎవరు పూర్వపశ్చిమఖండవాసులకు స్నేహము కల్గింపఁజూతురో వారీరెండుఖండముల నాగరకమును బాగుగ పరిశీలించి, రెంటియందును నుండు మంచిచెడుగులను చూపి, ఉభయవిధనాగరకతలను సమన్వయించి సమ్మేళనము చేయవలయును.

పాశ్చాత్యుల మత సిద్ధాంత ప్రకారము పరమేశ్వరుఁడు సృష్టిస్థితిలయ కారణుఁడు. సకలము నాయన పాలించుచుండును. ఆయన సర్వమయుఁడు గాని, సర్వవ్యాపకుఁడు గాని, సర్వాధారుఁడు గాని కాఁడు; కేవలము ప్రభువు. ఆయన కొక స్వర్గలోకము కలదు. అం దాయన యొక యుచితాసనముపై కూర్చుండి ప్రపంచమును తన యిచ్ఛానుసారముగ నేలుచుండును. ఇది తప్ప మానవులకును ఆయనకును వేఱు సంబంధము లేదు. అందుచే తన్మతావలంబకులు అట్టి సిద్ధాంతమును విశ్వసించి, కార్యములోనికి దిగినప్పుడు మాత్రము అతీంద్రియుఁడగునట్టి భగవంతునితో సంబంధము నుంచుకొనఁజాలక తమ కనుకూలముగ తమకార్యములను చక్కఁబెట్టుకొనిరి. నిజమునకు అట్టి భగవంతునకును తదనుచరులకును ఎట్టి సంబంధము నుండుటకు వీలు లేదు. మతసిద్ధాంతములు వేఱును రాజ్యాంగపద్ధతులు వేఱును నయ్యెను. పరమేశ్వరుఁడు నిరంకుశస్వామి యైనను, వారల కది యంటక వారు సంఘమును సర్వజనసమ్మత పద్ధతుల ప్రకారము దిద్దుకొనిరి. పునర్జన్మ విషయమై గాని, మానవజన్మ పరమావధిని గూర్చి గాని విశేషముగ తర్కములోనికి దిగక, వా రైహిక జీవనమునే స్వర్గీయముగ మార్చుటకు యత్నించుచుండిరి; సంఘజీవనమును ఎల్లరకు సుఖకరముగ బాగుచేసిరి. గ్రుడ్డి కుంటి మొదలగు వికలాంగులకు జీవనాధారము నేర్పఱిచిరి. మతాచార్యుల యమిత ప్రవర్తన నాపిరి. రాజ్యాంగమందు నిరంకుశత్వమును దీసివేసిరి. స్త్రీలకు పురుషులతోడి సమానాధికారమును విద్యను నిచ్చిరి. స్త్రీపురుషులు గలసి మెలసి యానందింపఁగల యామోదముల ననేకము నేర్పాటుచేసిరి. బాలికాబాలకులను చక్కఁగ పెంచి వారియందు నిహితమైయుండు గుణములను వృద్ధిపొందింపఁగల్గిరి. వారలకు స్వేచ్ఛ నెక్కువ కలిగించి చులుకుఁదనమును పుట్టించిరి. యువజనులకు తగురీతిని వివిధములగు పరిశ్రామిక కళాశాలలను స్థాపించిరి. బాలురను చిన్నతనమునందే కర్మయోగమున ప్రవేశపెట్టి నానాయంత్రములను త్రిప్పను నడుపను వారలకు తగు సామర్థ్యము కలిగించిరి. యువజనుల మేధాశక్తియు బాహుబలమును తీక్ష్ణత చెందునట్లు పలు తెఱంగులగు నాటపాటలను సృష్టించిరి. గ్రుడ్డితనము

చెవుడు మూగతనము మొదలగు వైకల్యములు గల విద్యార్థులకు ఆయాయవస్థలందే నిపుణముగ విద్యను నేర్పిరి. సంఘజీవనమునందు ఐకమత్యాది గుణములు పెంపొందునట్లు చేసిరి. తమతమ దేశములలో నుండు వివిధజాతులవారికి పరస్పరప్రేమను పురికొల్పిరి. కూలి నాలిచేసికొని జీవించువారి వినోదార్థము అనేక సదుపాయములను చేయుచున్నారు. వారిని బాధించు యజమానులను తిరస్కరించి, యాబాధలను తగ్గించి, కూలి నెక్కువ చేయించుచున్నారు. రోజునకు కూలివాండ్రు తొమ్మిది పది ఘంటలకంటె నెక్కువ పరిశ్రమచేయు నవసరము లేనట్లు అధికారులతో చెప్పి చట్టముల నేర్పఱచుచున్నారు. బీదకుటుంబములలోని బాలురు చదువుకొన విద్యాలయమునకు పోయినపుడు, వారి యార్జన లోపముచే కుటుంబములకు ఇబ్బంది లేకుండునట్లు కొలఁదిధనము నాయాగృహస్థులకు ముట్టునట్లు యత్నించుచున్నారు. కూలివాండ్రు పెద్దపెద్ద కర్మాగారములలో పనిచేయుచు వికలాంగు లయినపుడు, వారికి జీవనసదుపాయములను ఆయా కర్మాగారముల యజమానుల చేతనే చేయించుచున్నారు. చిన్నతనమునందు చదువుకొనకుండుటచే పెద్దతనమునందు అజ్ఞానావస్థలో నున్న వారికి ప్రత్యేకముగ పాఠశాలలను పెట్టి ఆ వయస్సున కవసరమగు విద్యను గఱపుచున్నారు. భాగ్యవంతులతో బీదలకు కూడ రాజ్యపరిపాలకులను, మంత్రులను, గవర్నరులను నెన్నుకొను నధికారము నిచ్చుచున్నారు. సంఘమందు కొందఱు నిఱుపేదలును కొంద ఱమిత భాగ్యవంతులు నుండిన హాని వాటిల్లు నని ధనమును భూమిని అందఱకు సమానముగ పంచఁజూచుచున్నారు. ఇంకను వర్ణింపరానట్టియు, వర్ణింపసాహసించినను తెగనట్టియు అనేకానుకూల్యములను పాశ్చాత్యదేశములలో చేయుచున్నారు. ఇవి చాలనిచో, భూమిని స్వర్గముగ మార్ప నింకేమి కావలయును? ఇదంతయు పశ్చిమ ప్రాంతముల జరుగుచున్నందుకు అమెరికా సంయుక్త రాష్ట్రములే నిదర్శనము. అచ్చట జరగని మాటెద్ది? అచ్చట మానవుల సౌఖ్యముకొఱకై తలపెట్టని కార్యమెద్ది? ఓహో! అచ్చోట మానవసంఘ పరిణామమునకై చింతింపని చింత యెద్ది?

కాని యీ సాహసకృత్యము లన్నియు ఈశ్వర సహవాసబలముచేఁ గాక, తత్సహవాస మెడనై తమకుఁ దాము తలపోయుటవలనఁ గలిగినవి యని నేను సూచించియుంటిని. పాశ్చాత్యు లిట్టి యౌన్నత్యమును వారి కుశాగ్రబుద్ధికంటె, వారి యుదార హృదయముకంటె, వారి తీక్ష్ణమైన యిచ్ఛాశక్తిచేతనే పొందుచున్నారు. వారలకు బహుకాలము జీవించి హాయి ననుభవింప మిగుల కోరిక గలదు. వారికి అమితమైన సాహసము గలదు. వారు కర్మయోగులు. వారి కుండు ఇచ్ఛాశక్తి ఆయుష్కాలమును వృద్ధిచేసి ఇహసౌఖ్యముల నెక్కువచేయునట్టిది. కాని యీయిచ్ఛాయోగము సాంఘికసౌఖ్యములకు తోడ్పడినదో అదియ పాశ్చాత్యుల సంఘమునకును మన దేశమునకును ఆపదలను గూర్చుచున్నది.

పాశ్చాత్యులు కర్మయోగు లని చెప్పితిని. ఈ కర్మయోగమునకు కారణము కొంతవఱకు ఆదేశపు శీతోష్ణస్థితి. ఇంక కొంత అక్కడి పలుయుగములందలి స్థితిగతులు. మూడవకారణము ఆదేశములు సముద్రపుటొడ్డు వర్తకవ్యాపారమునకు అనుకూలముగ నుండుట. ఇవన్నియు చేరి పాశ్చాత్యదేశస్థులను కర్మవీరులను చేసినవి. ఈ కర్మకుశలత వారి యిచ్ఛాశక్తికి పదునుపెట్టినది. ఈ యిచ్ఛాశక్తిచే వారు తిరిగి మరింత కర్మవీరులైరి. వీరి కుండు సకల సుగుణసద్గుణములును ఈ యిచ్ఛాశక్తి కధీనములు; దీనివలననే మొలకలెత్తినవి; దాని నతిక్రమింపవు. వీరలకు మేధాశక్తి యున్నది. కాని యది యీ యిచ్ఛాశక్తి కధీనము; ఈ శక్తిచేతనే జననమందినది, కాన దానియానకు దాటి నడువదు. వీరికి దయాదిగుణము లున్నవి. కాని యవి కూడ ఈ యిచ్ఛాశక్తివలననే ప్రభూతములు; దాని కధీనమై యున్నవి గాని, అవ్వాని కధీనమై యిచ్ఛాశక్తి లేదు. ఈ రెండుకారణములచే వీరి దూరదృష్టి మిక్కిలి మందమైనది. పరమావధివిషయమై వీరు బాగుగ నాలోచిం

పడు. అందుచే వీరి రాజ్యాంగపద్ధతులు స్వార్థపర మైన స్వాత్మస్థాపనమునకనుకూలములు. వీరికి నమ్రత తక్కువ; విధేయతయు తక్కువ. వినయము నవ్వులాటు; అహంకార మధికము. కావున వీరి సంఘము మన సంఘమందు లేని యనేక లోపములను గలిగియున్నది. వీరి కున్న శూరత్వమునకు తగినట్లు మానవాత్మమీఁద ప్రేమయు దయయు నుండవలయును. వ్యాపారలాభము రాజ్యవ్యాపనము సుఖసాధనము పాశ్చాత్యరాజ్యముల యాదర్శములు. ఆ యాదర్శప్రాప్తికే వర్తమాన మహా సంగ్రామము జరగుట లోకవిదితము.

ఇఁక ప్రాచ్యఖండము లన్ననో దీనికి వ్యతిరిక్తము. వీరి యిచ్ఛాశక్తి యొకప్పుడు మేధాశక్తికిని ఇంకొకప్పుడు దయార్ద్రహృదయమునకును అధీనము. దానికి స్వాధీనత లేదు. మనలో ప్రజ్ఞాగుణము విచిత్రముగ పెంపొందినది. ఏయభిప్రాయమునైనను ముక్కలు ముక్కలుగ విడఁదీసి భారతీయుఁడు పలువిధములుగ నర్థము చెప్పఁగలఁడు. వీని మేధాశక్తి యత్యద్భుతము. వీఁడు త్రిలోకములలోని గూఢ భావముల నన్నిటి నెఱుఁగును. వీని కందని యాత్మ తత్త్వము లేదు. వీఁడు రుచి చూడని ధ్యానమార్గము లేదు. వీఁడు పరికింపని పరమార్థవిషయము లేదు. వీఁడు బోధింపని ధర్మము లేదు. తర్కము, తత్త్వము, అధ్యయనము వీనికి జన్మముతో పుట్టినవి. ఇందు వీఁ డసహాయశూరుఁడు. ఆహాహా! భారతీయునకు తెలియని జ్ఞానమార్గము గలదే!! వీని మేధాశక్తి నెవ్వఁడు పొగడఁగలఁడు!!!

భారతీయుని హృదయము నిట్టిదే. వీఁడు "పెద్దలఁ బూజగన్న భృత్యునికైవడి" నడచునాఁడు; "తన కన్నుల కన్యకాంతల లక్ష్యంబైన మాతృభావముసేసి మరలు వాఁడు". వీనికి పశ్వాదులమీఁద కూడ సమితదయ, వీని హృదయ మెప్పుడును దయారసముచే పొంగుచుండును. ఒక్కకఠినోక్తి వీనికి ములుకువలె గ్రుచ్చుకొనును. వీఁడు కోపమును భయంకరముగ చూచును; నమ్రభావము లేమిని రాక్షసత్వముతో సమానముగ నెంచును. జీవహింస కిచ్చగింపఁడు; తన ప్రాణము నైనఁ గోల్పోవును గాని మరియొకని చంపుట కొప్పుకొనఁడు. ఇతనికి బంగారము మట్టితో సమానము. వీఁడు పొరుగువానిని కాపాడుటకు ఆత్మహత్యకైన నొప్పుకొనును. వీనికి తల్లిదండ్రులు గురువులు, దైవ సమానులు. అంభోయని దూడను వెదకుకొనుచు తిరుగుచుండు పసువును చూచిన, వీతనిగుండె ఝల్లుమనును. ఇతఁడు బాధను చూడఁజాలఁడు. వీని దయారస మిట్టిది.

కాని యేశక్తులు ప్రాచ్యదేశములలో ప్రధానమై సంఘమునకు శిరోభూషణములై వెలయుచు, సంఘ జీవన శాశ్వత స్థితికి తోడ్పడుచున్నవో, అవియే వాని దౌర్బల్యమునకు కారణము లగుచున్నవి. ఈప్రాగ్దేశము లందు ఇచ్ఛాశక్తికి స్వాధీనత లేదని సూచించితిని. అదొకప్పుడు కుశాగ్రబుద్ధికిని, ఇంకొకప్పుడు దయార్ద్రహృదయమునకును అధీనమైయుండు నని కూడ సూచించితిని. ఏ కార్యమును గాని మనము ఇచ్ఛాశక్తి ప్రేరేపణమువలన చేయము. మన కుశాగ్రబుద్ధి ముందు వెనుక లాలోచనచేసి యెవ్విధముగ దారిదీయునో మన యిచ్ఛాశక్తి యాదారి ద్రొక్కును; లేదా మనదయార్ద్రహృదయము ఏవిషయమును చూచి అందు స్థగితమగునో మన కర్మము కూడ నటులే యుండును. మనమేకార్యమును గాని సాహసించి చేయము. మన కాలోచన యెక్కువ. ఒకకార్యము కర్తృత్వాభావముచే చెడిపోవుచున్నను, దానిని మనము సకాలమందు చేయక అనవసరముగ నాలోచించి లేనిపోని కష్టములను కల్పించుకొందుము; లేదేని దాని కర్తృత్వాభావమునకు తలపోయుచు మితి మీఱిన దుఃఖములో మునుఁగుదుము. మనయిచ్ఛాశక్తికి బలములేదు. దానికి పౌరుష లేదు. ఇందుచేతనే మనము జ్ఞానయోగుల మైతిమి. మనకు జంకు హెచ్చు. కష్టసమయములో కాలూని నిల్వఁబడలేము. మన వినయము కూడ హద్దుదాఁటినది. దాని నపాత్రులయెడ చూపిన మనకే హాని వాటిల్లును. మూర్ఖునకు సుద్దు లెందుకు? అంధునకు సౌందర్య మేల? బధిరునకు సంగీత మేమి? కొందఱకు వినయమునకును పిఱికితనమునకును ప్రభే

దము తెలియదు. అది గాక, మన మెల్లపు డతివినయమునే చూపుచుండిన మన స్వభావమున కదియే యలవడును గాని, ఇక శౌర్యమును సాహసమును మనలక్షణములలో నుండవు. మనదేశపు ప్రస్తుతస్థితియే దీనికుదాహరణము. మనసంఘమం దున్న అతిబాల్యవివాహములు, వివిధములగు సంఘజీవనశోషణము లగు నాచారములు, బాలవితంతువులు, జన సామాన్యము యొక్క యజ్ఞానస్థితి మొదలైనవి దీనినే పోషించుచున్నవి. మనసంఘబలము నానాటికి క్షీణించుచున్నది. దేశమందు ధనము లేదు; శరీరబలము తక్కువ; బుద్ధిపటుత్వము హీనము. ఇట్లింకొక కొలఁది శతాబ్దములు నడచిన, ప్రాచ్యదేశములలోని యనేకజాతులు నశించును; భారతవర్షము నట్లగును.

మన మిప్పుడు ప్రాచ్య పాశ్చాత్య దేశములలో నుండు లోపాలోపములను క్లుప్తముగా చూచితిమి. వీరి కున్న లోపములు వారికి లేవు. వారి కున్న మెఱుఁగు వీరికి లేదు. ప్రాచ్య పాశ్చాత్య దేశీయు లొక్కచోట కలసికొనినపుడు, ఇదియే సంఘర్షణమును భావోద్రేకమునకును కారణమగుచున్నది. పాశ్చాత్యులందు మనోబలమును, యోగపటుత్వమును వర్ధిలినవి. ప్రాచ్యులందు అవి అణగంటినవి. పాశ్చాత్యులందు దయార్ద్రహృదయము బలవత్తరము గాలేదు. ప్రాచ్యులందు అది హద్దు దాటినది. ప్రాచ్య పాశ్చాత్య ఖండములకు చెలిమి పొసంగవలె నన్న, ఈ సంఘర్షణ మంతరింపవలెను. ఇది యున్నంతవఱకు ఒకరొకరిని సన్మానింపరు, విశ్వసింపరు, ప్రేమింపరు; వారివారి జ్ఞానవిజ్ఞాన శాస్త్రములు ఒండొరుల కర్థము గావు; అన్యోన్య ప్రేమా గౌరవము లుండవు. ఎవ్వారైన ఈ యొండొరులకు సమభావము, సమానభావము కుదుర్పఁదలఁచినచో, ఈభేదమును తొలఁగింపవలయు. వారిలో సుకోమలభావములను వీరిలో కర్మయోగవాంఛను ఎక్కువ చేయవలయును. "ఏవం త్వయి నాన్యథే తోస్తి." ఇది గాక, మరియొక మార్గము లేదు.

అయిన, దీని నొనఁగూర్చు టెట్లు? దీనికి సదుపాయము లెవ్వి? ఇందులకు సాధన మేమి? ఇరుతెఱంగులగు జాతీయాదర్శములందును ఇట్టి సంపూర్ణమైన మార్పును కలుగఁజేయవలయు నన, దాని కగు నుపాయములు అందుకు తగునట్లు యుండవలయును గాని, తెప్పకొయ్యతో సముద్రమును దాట యత్నించినట్లుండఁగూడదు. ఈ భేదాభేదము లెప్పుడు అసలు జాతీయజీవనములోనే యున్నవో, మనము చేయు యత్నము కూడ ఆయసలునే మార్పవలయును. వేఱుపురుగు పట్టినపుడు సున్నమును చెట్టు మొదటనే ప్రయోగింతుము. అత్మకు వ్యాధివచ్చి నడత చెడినపుడు పైపై మందులు పనికిరావు. పాశ్చాత్య లీదృశస్వభావులగుటకు వారి మతమే ముఖ్య కారణము. వారి మతమందు వినమ్రాది సుకోమల భావములను పుట్టించు సాధన సంపత్తి హెచ్చవలయును. యేసు క్రీస్తు స్వజీవనమును ఈశ్వరార్పితము చేసినవాఁడే. కాని యీయనయం దంతకంటె ఆత్మపటుత్వము యోగబలము ఎక్కువ. ఈయన యూధీయజాతివాఁడు. ఆజాతియందు అన్యమతసహనము తక్కువ. ఎంతవఱకును ఇహలోకసుఖమే గాని పరమానందవిషయమైన యాలోచన లేదు. యూధీయులు 'ఆత్మ నాశనరహిత' మని నమ్మరు. శరీరముతోనే యాత్మ కూడ చెల్లని వారి నమ్మకము. వారికి తదనుసారముగనే భక్తిభావమువలన పుట్టుకోమలత్వము పట్టువడ లేదు. యేసుక్రీస్తు యూధీయమతమును దాటిపోవుటకు యత్నించినను, తా నావలలోనే పడెను. ఈయనకు శాంతస్వభావము స్వతస్సిద్ధము గాదు; శౌర్యమును సాహసమును తీక్ష్ణము. కాననే క్రైస్తవ మతమం దవన్నియు మీఱిపోయినవి. కాఁబట్టి క్రైస్తవమతమందుసాధనసంపత్తిమాఱవలెను. సృష్టిజాలముమీఁదికి దృష్టి యెక్కువపోవలెను. జంతుజాలముమీఁద దయ పుట్టవలెను. సుఖము మానవసంఘమునకే యున్న చాలు నని యనరాదు, విశ్వజనీనదృష్టి రావలెను. కర్మయోగము తగ్గవలెను. ధ్యానయోగము, భక్తియోగము ఎక్కువ కావలయును. మానవజాతిలో ప్రభేదములు కల్పింపరాదు. అందఱు

భగవత్పుత్రు లని నమ్మవలెను. మోక్షము కేవలము క్రైస్తవులకే కాదు, మానవ జాతికిఁ గావలయును.

అట్లే హిందూధర్మమునందును సాధనసంపత్తి మాఱవలెను. ఎంతవఱకును మనలో "నా కేమి చేతఁగా" దనియే కాని, "నాకు చేతౌను; నేను చేయఁగలను; నేను చేసితీరెదను" అను సాహసము తక్కువ. ఎంతవఱకును జీవించునది హాయిగ మృతిచెందుటకే గాని, మఱింతకాలము మఱియు జన్మములు హాయిగ బ్రతుకుటకుఁ గాదు. మనకు కర్మయోగము లేదు. మన కుండు నిత్యనైమిత్తికకర్మములు శరీరశోషణము చేయునే గాని శరీరపోషణము చేయవు. మన కుండు సాధనసంపత్తి యాత్మగౌరవమును నాశనముచేసి జీవన్మృతులనే చేయును. మన కున్న భక్తి యుత్సాహమును పుట్టించుటకు మాఱు ఆత్మను నమిలి పిప్పిపిప్పిచేయుచున్నది. ఇహలోకసౌఖ్యమును పొందుట పాప మని యెంచరాదు. ఇహలోక సౌఖ్యము లేనిదే పరలోక విషయమును చింతించుటకైన వీలుండదు. ఇహమును వదలుకొనినవారికి పరమును దక్కదు. మన జ్ఞానము గూడ మన యిచ్ఛాశక్తిని హీనముచేయుచున్నది. అది హద్దుమీఱుటచే ఇహ పరములకు రెంటికిని అక్కఱకు వచ్చుట లేదు. మనకు ధ్యానయోగము, భక్తియోగము, జ్ఞానయోగము తగ్గి, కర్మయోగము, శౌర్యయోగము, ఇచ్ఛాయోగము, మనోబలము, ఆత్మగౌరవము ఎక్కువకావలయును.

ఈ ప్రకారముగా నుభయదేశస్థుల యాదర్శములలోను మార్పు గలిగిన నిఁక భయ ముండదు. ఆ ప్రకారము సాధన సంపత్తులు మాఱిన మానవ తత్త్వములు మాఱిపోవును. ఆ కారణముచేతనే ప్రాచీ ప్రతీచీ సంయోగము లోక కల్యాణమునకై నిర్ణీతమైన భగవత్సంకల్ప మని విశ్వసింపవలయును. అటుపిమ్మట హిందువుల వినయము పాశ్చాత్యులకు పిఱికితనముగఁ గనుపట్టదు; పాశ్చాత్యుల సాహసము ప్రాచ్యులకు దౌర్జన్యముగఁ గాన్పింపదు. ఒండొరుల గౌరవింతురు, ప్రేమింతురు. ఒండొరులఁ జూచి నేర్చుకొందురు. సౌహార్దభావ ముదయించును. సహనము హెచ్చును. ప్రేమ యుప్పొంగును. ఆత్మ వికసిల్లును. ప్రాక్పాశ్చాత్య ఖండములు ఏకమత్యము గల్గియుండును. మానవసంఘము సౌఖ్యమునఁ దేజరిల్లును. మానవసంఘమున ఏకత హెచ్చును. దారిద్ర్యములు పోవును. అవిద్య నశించును. స్త్రీలకు విద్య యబ్బును. రాజులు ప్రజాపరిపాలనమునకు లొంగుదురు. ప్రపంచ మంతట సంయుక్తరాష్ట్రము లేర్పడును. అంతర్జాతీయపరిపాలనము ఘన మగును. దుష్టులు మాయ మగుదురు. శిష్టులు ఎక్కువగ నుందురు. అప్పుడే భగవంతుఁడు కూడ మానవుల యత్నములకు సంతసించి యాశీర్వదించును! ఓహో!! ఆ కాల మెప్పుడు వచ్చును!!!

---

E

LORD KITCHENER SHAKING HANDS WITH A GALLANT INDIAN SOLDIER



కిచనరుప్రభువు హైందవయోధునితో హస్తస్పర్శనము చేయుట

GANGA SINGH NEGI, V. C.



విక్టోరియాక్రాసును గడించిన భారతయోధుడు గంగాసింగు నేగి



శ్రీజార్జి సార్వభౌముఁడు యుద్ధరంగమునందు హైందవసైనికుల వికలమునరయుట

# హైందవ సామ్రాజ్య శూరశిఖామణులు

భోగరాజు నారాయణమూర్తిగారు

మందారప్రతిమానకీర్తులు బ్రిటిష్ సామ్రాజ్యమూర్తుల్ మహా
నందం బొందఁగ నీ కుమారు లనిలోనన్ భీమసంకాశు లై
ముం దెందుం గననట్టి యుద్ధపటిమమ్ముం జూపుచున్నా రదే
హిందూరాజ్యరమా! యదృష్ట మన నీదేనమ్మ ముమ్మాటికిన్. 1

ఉ. మెత్తనివారిఁ గాంచి కడు మెత్తఁగ మొత్తుట నైజ మాటచే
మొత్తిరి నీ కుమారులను ముష్కలగ్రీక్కులు నింక నెందఱో ;
మెత్తనివారె కాని చలమే గొని కేఁగిన, వారు లోక మొ
క్కత్తియునన్ భయంబుడుదురే ప్రభుకోటిసహాయ ముండఁగాన్. 2

ఉ. పత్రిక లెల్ల నీ సుతుల బాహుబలాఢ్యుల విక్రమమ్మదే
స్తోత్ర మొనర్చుచుండె నటు చూడఁగదమ్మ మొగమ్ము నెత్తి; నీ
పుత్రులు జర్మనీనివహభూరుహపంక్తికి నగ్నిహోత్రు లై
క్షాత్రముఁ జూపఁజొచ్చి; రిదె చాలుఁగదా పదివేలయేండ్లకున్! 3

శా. మార్కొ లేరు సురాసురాదు లయినన్ మమ్మాజిలో నంచుఁ జం
డార్కాకారత, నైజధైర్యగరిమం బాంగ్లేయసాహాయ్యసం
పర్కప్రాప్తి మరింత గా, రిపుచమూవర్గమ్ము నుగ్గాడరే
ఘూర్కాలున్ రసపుత్రవీరులును సిక్కుల్ గూడ నుద్దండు లై? 4

సీ. యుద్ధనావను బాద మూంచనేలేరు, సంగర మెట్లొనర్తు రం చఱచినారు;
మనవారలు తుపాకులను బట్టనేలేరు, సమరమా యని కూయసాగినారు ;
రణభూమియం దొక్క క్షణమైన నిలువంగఁగలరె వీ రని నవ్వఁగడఁగినారు ;
ప్రభులబల్మిని బోనపలసెఁగా, కంతటి వీరులా వీ రని గేరినారు ;
హిందువులె తొల్లిఁ గొండఱు మందమతులు - హిందువులఁ దూలనాడినా రిందు నందు ;
అట్టి దేశాభిమానశూన్యవచనములఁ - బాటిసేయదు మాతల్లి! భరతమాత! 5

సీ. భరతఖండాన మున్నటి ద్రోణభీష్ముల శౌర్యప్రతాపముల్ చావలేదు ;
భీమార్జునుల మహాభీలప్రతాపానలజ్వాల లింకఁ జల్లవడలేదు ;
రహి నభిమన్యుపరవ్యూహభేదనాకౌశలమును జెలఁగ గలయలేదు ;
ఆచార్యపుత్రకృపాచార్యశౌర్యమహార్యధైర్యంబు లడఁగలేదు ;
అస్థిరకళేబరమ్ములె యడఁగుఁ గాని - వినుము జీవాత్మ కెపుడు నాశనము లేదు ;
తన్మహాత్ములఁ గాంచిన ధన్య వీవు ; - కొఱఁత నీ కెందుఁ గలదమ్మ? భరతమాత! 6

చ. విదితపరాక్రముల్ సమరవేషములన్ ధరియించి నీ సుతుల్
తదుచితభీకరాయుధశతంబులతోఁ బొగరొంద నెక్కి ప్రా

న్నుదరిని జేర, వారలను జూచి పరాసు లనంతసంభ్రమం
బొదవఁగ నార్చినార లోహో హో యనుచున్ జయనిశ్చితాత్ము లై. 7

సీ. జారువాబుంగారుజల్తారుపగిడీల దట్టంపుగుచ్ఛులు తళుకు లీన,
పట్టుఫాయిజమాలపై నొప్పు మఖమలంగరఖాలరంగుల్ జిగాల్ మనంగ,
పటుతరభీకరవదనమండలములు చూపర కతిభీతిఁ దోఁపఁజేయ,
నిమ్మపండుల నిల్పు నీటైన మీసాలు తమ రాచఠీవి నందఱకుఁ జూప,
ధవళసుందరదంతసంతానతరళ - ధాళధళ్యంబు తమకుఁ ఛత్రముగఁ దోఁప,
ఆ పరాసులు భారతీయాళి నెంత - యాదరించిరొ తెలుఁగవే యార్యధాని! 8

ఉ. నిన్నును నీ కుమారుల గణింతురు పెద్దగ నన్యదేశవి
ద్వన్నుతు లెల్ల, నైనను కృతఘ్నులు కొందఱు నిర్విచారు లై
ని న్నిరసించుచుండు టది నిక్కము; నైనను నింతమాత్రలో
వన్నెఁ దొఱంగదే? పొరుగువారల కూరలె రుచ్యముల్ గదా! 9

సీ. ప్రకృతిశాస్త్రజ్ఞానపటిమమ్ము తొలుదొల్తఁ దల్లిరో! నీ మూలధనము కాదె?
మొదట "న్యాయమ్ము" నీ ముద్దుబిడ్డలు శేముషీప్రతిభన్ రచించినది కాదె?
ఈ విమానావళి హిందురాజ్యము! నీకు వింతయే? కొట్టినపిండి గాదె?
తగ నభోమార్గయంత్రపు సృష్టి హైందవప్రజ్ఞాధురంధరత్వమ్ము గాదె?
సకలవిద్యలు నీయందె సంభవించె - ధర్మదేవత కీవె యాధారమమ్మ!
బల్లిదుల నెందఱినొ కన్న తల్లి వీవు - పూజ్యురాల వో హైందవరాజ్యలక్ష్మి! 10

సీ. విజ్ఞానశాస్త్రకోవిదురాల వనుటకు "జగదీశచంద్రుండు" సాక్షి గాఁడె?
ఘనతరకవితానిపుణురాల వనుటకు జననీ! "రవీంద్రుండు" సాక్షి గాఁడె?
బలవంతురాల వంబరొ! నీ వనఁగ "ప్రొఫెసరు రామమూర్తి" యు సాక్షి గాఁడె?
తతరాజకీయమంత్రజ్ఞ వంటకు యశశ్శాలి "ఘోక్లే" యొక్క సాక్షి గాఁడె?
అజిలోన నజేయ వీ వనుట కిపుడు - వినుత "విక్టోరియా క్రాసు" బిరుదు గన్న
శౌర్యశాలి "గంగాసింగు" సాక్షి గాఁడె? - సరసగుణగణోపేత! యోధరతమాత! 11

ఉ. చండశతఘ్నికానికరసంజనితానలకీలికాళి బ్ర
హ్మాండము నిండ, శత్రునివహమ్మునరున్ లయకాలమూర్తు లై
ఖండనచాకచక్యవిభవ మ్మరుదార ఘనత్కుమారకుల్
మెండుగ మిత్రమండలికి మెప్పు ఘటింతురు దేశమాతరో! 12

చ. కొడుకుల క్షేమమున్ మదిని గోరెద వేని, "బ్రిటిష్ జగాన సూ
ర్యుఁ డెపుడు గ్రుంకలేఁ డను బుధోక్తి యథార్థము గాఁగ నీశ్వరా!
కడువడి నాంగిలేయుల కఖండజయమ్ము ననుగ్రహించి నా
యిడుములఁ బాపు" మంచు స్మరియింపు మనారత మార్యదేశమా! 13

# నిర్బంధసైనిక సేవ

భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు

ఇప్పుడు జరుగుచున్న యుద్ధమును గూర్చి ముచ్చటించుచు, "నిర్బంధసైనిక సేవాపద్ధతులను బ్రిటీషుదొరతనమువారు అవలంబింపవలసియుండును" అని ఇటీవల సెల్బోర్న్ ప్రభువు నుడివియున్నారు. ఈయుద్ధము ఒకటి రెండు సంవత్సరము లైనను పట్టు నను నిశ్చయమును, యుద్ధమునం దవలంబింపఁబడు నూతన విధులును ఇట్టి యూహకు కారణములు. ఇట్టిసందర్భమున నిర్బంధ సైనిక సేవయొక్క చరిత్రయు, వివరమును, లాభనష్టములును, భావిస్థితియు ఆలోచించుట ప్రస్తుతముగ నుండును.

సైనికులను దీసికొనుట మూఁడు పద్ధతుల ననుసరించి యున్నది:— 1. తమ యభీష్టమును బట్టి జనులు సైనికులుగ చేరుట. (ఉ. బ్రిటను.) 2. నిర్బంధముగ కొంతకాలము ప్రతిమనుష్యుఁడును సేనలో సేవచేయుట. (ఉ. జర్మని, ఫ్రాంసు.) 3. స్విట్జర్లాండులో ఆచరణలో నున్న "మిలీషియా" అను మూఁడవ పద్ధతినిగూర్చి మనము ముచ్చటింపనక్కఱలేదు. నిర్బంధ సైనికసేవ ప్రథమమున 1793-వ సం.న ఫ్రెంచిదేశపు మహావిప్లవములో ప్రారంభింపఁబడెను. అప్పుడే సైనికులు యుద్ధమధ్యమున రంగమును వదలి పారిపోవుదురను భీతిచే వారిని గుడారములం దుంచి జాగ్రతపెట్టెడి యావశ్యకము తగ్గి, దేశాభిమానపూరితు లగు పౌరుల సేనలు యుద్ధరంగములకు క్రొత్తకళను తేఁగల్గెను. ఆ కాలములో ఈనిర్బంధము క్రొత్తమాత్రే అయినను, దేశమునందు ప్రబలియున్న యరాజకము నడుమ ప్రజల ప్రాణములు, పట్టణములలోని న్యాయస్థానముల యెదుటకన్న, బహిఃప్రదేశమునందలి యుద్ధరంగములలో ఎదిరికిఁ వారి ఫిరంగుల యెదుట ఎక్కువ భద్రముగ నుండెను. కావున ప్రజలు విశేషముగ సేనలో చేరిరి. 1798 లో నిర్బంధ సైనికసేవ శాసనరూపకముగ స్థాపింపఁబడెను. అప్పటి నిర్ణయకాలము 5 సంవత్సరము లయినను, సామాన్యముగ సైనికులు గడువు నతిశయించి సేవచేయవలసి వచ్చుటచే, అది సేవగనే కాక ఉద్యోగముగఁ గూడ పరిగణింపఁబడుచుండెను. అందుచే సైనికులు తమకు ప్రత్యామ్నాయముగ నితరులను సేనలోనికి పంపు నాచారము ప్రబలెను. ఇట్టి ప్రతినిధులతోఁ గూడిన సేన పూర్వము డబ్బున కాసించిన సేనకన్న హీనమై రాను రాను నీచదశలోనికి వచ్చెను. నెపోలియనుచే పీడింపఁబడుచున్న జర్మనీదేశమునఁ గూడ జేనాయందలి యపజయమయిన పిమ్మట "క్రంపరు" పద్ధతి ననుసరించిన విధానముచే నొక విధమగు నిర్బంధ సైనికసేవ అభివృద్ధిలోనికి వచ్చెను. ఇట్టినిర్బంధము కొంతవఱకు సైనికసేవను దుస్థితికిఁ దెచ్చినను, అమెరికాలో 1861-1865 సంవత్సరములలో బానిసతనమును నిర్మూలము చేయుటకు ప్రజల నడుమ జరిగిన యుద్ధములో దాని గౌరవము పునరుద్ధారణ చేయఁబడెను. 1870-వ సంవత్సరములో ఫ్రెంచివారిపై జర్మనీకిఁ గలిగిన సులభజయము ఈ పద్ధతియందు జర్మనులు చేయఁగలిగిన సంస్కారము వలననే లభించిన దని చెప్పుదురు. అప్పటినుండియు, బ్రిటను తప్ప ఐరోపాఖండమునందలి దేశము లన్నియు ఈపద్ధతి నవలంబించినవి. రెండు సంవత్సరములనుండి బ్రిటీషు సామ్రాజ్యములో చేరిన ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజీలాండు అను వలసలు గూడ ఫ్రాంసు జర్మనిదేశములలో నున్న నిర్బంధసైనికపద్ధతులను విశేషముగ సంస్కరించి యాచరణలోనికిఁ దెచ్చి, ప్రపంచకమున కంతకును మార్గదర్శులుగ నున్నవి. ఈ పద్ధతి యొక్క వివరము ముందు తెలుపఁబడును.

నిర్బంధసేవ మొదట అయిదు సంవత్సరముల కాలమువఱకు నిర్ణయింపఁబడెను కాని, దేశములోని సైనికసేవకు తగిన యువకుల నెల్ల నేఁటేట సేనలోనికి తీసికొనుట దుస్సాధ్యమయ్యెను. కావున రాను రాను

సేనాపరిమితి(ఇప్పుడు జర్మనీలోవలె) 2 సం.లకు తగ్గింపఁబడెను. అప్పటికిని ఒకసమయమునందు శిక్షనొందవలసిన సైనికులసంఖ్య అపరిమితముగ నుండుచుండెను. మఱియు శిక్షాకాలము తక్కువగ నుండెను. ఇట్లు అందఱను చేర్చి శిక్షనొసంగుటకు సదుపాయము తక్కువగుటచే, జనసంఖ్య వృద్ధియయినకొలఁది సైనికులసంఖ్య వృద్ధియగుటలేదు. 1905-సం.న జర్మనీలో, వైద్యపరీక్షలో దుర్బలులని గాని ఇతరకారణములవలనఁ గాని నిర్బంధము నుండి మినహాయింపగు జనము గాక, సైనికులుగ నుండఁదగిన జనుల సంఖ్యలో సగముమంది సైనికసేవనుండి తప్పింపఁబడిరి. ఈ పద్ధతిలో వ్యయము బహు స్వల్పముగ నుండును. నిరంతరము సైనికులుగ తమజీవితమును సలుపవలసిన మొదటి పద్ధతిలో దీనికన్న మూఁడు రెట్లు ఎక్కువ వ్యయమగు నని నిశ్చయింపఁబడినది. మొదటిపద్ధతిలో లేని లోపములు కొన్ని నిర్బంధపు పద్ధతిలోఁ గలవని కొందఱి యభిప్రాయము. తమ యభీష్టమునననుసరించి యావజ్జీవము భటులుగనుండఁదలఁచిన సైనికులు మనస్స్ఫూర్తిగ శిక్షనొంది ఉత్సాహముగ పోరాడుదురు. నిర్బంధముగ తీసికొనఁబడినవారిలో కొందఱు తమసేవను బలవంతపుసేవగ నెంచుకొనెదరు. కాని దేశములోని యువకు లెల్లరు శిక్ష నొందియుండుటచే, పిఱికిపందలును దేశాభిమానహీనులగువారును కడపటకు యుద్ధములో చేరకపోయినను, మిగిలినవారే అసంఖ్యాకులుగ నుండుదురు గావున రాజ్యాంగమున కెట్టి యాపత్తును గలుగఁజాలదు. అభీష్టము ననుసరించి సేనలో చేరు పద్ధతి ఇంగ్లాండులో నాచరణలో నుండి ఐరోపాఖండములో నుండకుండుటకు తగిన కారణములు గలవు. బ్రిటను గొప్పద్వీప మయి యున్నది. దానిపై దండయాత్రచేయుట కష్టము. ఒకవేళ చేసినను, మొదట నౌకాదళముతో పోరాడవలెను. ఈలోపుగ సివిల్ జనమును యుద్ధమునకు తయారుచేయుటకు తగిన యవకాశ ముండును. ఈపద్ధతి ననుసరించువారు కొద్దిసేనను మాత్రమే యుంచుకొనఁగలరు. అందువలననే బ్రిటిషు సామ్రాజ్యములో 6 లక్షల సేన మాత్రమే గలదు. కాని ప్రస్తుతపు యుద్ధమువంటి మహాయుద్ధము తటస్థించిన యెడల 20లక్షలసైన్యమునుగూడ సిద్ధముచేసికొనుటకు అవకాశమున్నది. అట్లే ఇప్పుడు సిద్ధము చేయఁబడుచున్నది. భూభాగము సరిహద్దుగాఁగల దేశముల కిది సాధ్యముగాదు. శత్రువు వచ్చి దేశముమీఁద పడుటకు విశేష కాలము పట్టదు. జర్మని ఫ్రాంచిదేశముపై పడుటకు ఎంతకాలము పట్టినది? ఆపత్సమయమునందు నిదు క్రొత్తగ మీటింగులు చేసి జనులను ఉత్సాహపఱచి వారిని సేనలో చేర్చికొని వారికి శిక్షను గఱపి వారిచే పోరాడించుటకు అవకాశము చాలదు. కావుననే ఐరోపాయం దెల్ల నిర్బంధసైనికపద్ధతి ఆచరణలో నున్నది.

నిర్బంధసైనికసేవనుగూర్చి వివిధాభిప్రాయములు గలవు. దీనివలన నిర్మింపఁబడు బహుళమైన సేనల వలన యుద్ధములకన్న శాంతమే ఎక్కువగ ప్రబలు నని దానిని సమర్థించు కొందఱు వాదింతురు. నిర్బంధ సైనిక సేవయును, ఆయుధములయొక్క మహాబలమును, వానిని వినియోగించుటయం దుండెడి విశేషకష్టమును, పోరాటముల జయాపజయములను గూర్చి గల యనిశ్చయమును, మహాసంగ్రామములవలన పరిశ్రమలకు తప్పక కలుగు సంక్షోభమును, అపజయమువలన సంప్రాప్తమగుపరిపూర్ణనాశనమును, దేశముయొక్క యైశ్వర్యమునకు భంగము గలిగించు నను నిశ్చయము గలదు కనుక, యుద్ధములు తగ్గిపోవు నని కొందఱు తలంతురు. వృత్తిరీతిని పోరాడు యుద్ధభటులతోఁబాటు మానాభిమానములతో పౌరభటులు పోరాడఁజాల రను కొందఱి యభిప్రాయము నిర్వివాదము గాదు.

నిర్బంధసైనికసేవవలన కొన్ని యితర ప్రయోజనము లుండును. అనేకకారణములవలన జాతీయాభిమానము తగ్గి, విశ్రాంతియందును భాగ్యభోగములందును, మానవకోటియొక్క సర్వసౌభ్రాతృత్వమునందును కోరికలను బలపఱచు నీకాలమునందు, ఇట్టి నిర్మాణమువలన దేశాభిమానము హెచ్చి, పౌరధర్మము,స్వార్థత్యాగము, ధైర్యము, దేశోద్ధరణమునకుఁగాను ప్రజాసామాన్యమునకు వలయు నుత్సాహము వృద్ధియగును. ఆ దినపు

వ్యక్తతయు నశించు నని కొందఱి యభిప్రాయము. బుద్ధి కౌశలమును, చుఱుకుఁదనమును గలిగిన యువజన శ్రేష్ఠుల బుద్ధిప్రసారమున కిది గొప్ప యంతరాయ మందురు. ఇట్టిపురుషులలో నెందఱో మహాశక్తులు వ్యర్థ మగుచున్నవో, యెందఱో మనస్సులు సంతాపము నొందుచున్నవో యూహించుట సులభము.

కాని ప్రజాస్వామికమును గోరు దేశములలో ఈ నష్టములను నివారించుట కైన గమనింపక, నిరంతరము ప్రజలు సైనిక జీవిత మాహాత్మ్యమునందు నిమగ్నులై యుందురు. ఎట్లు ప్రతియువకునకును వోటియ్యవలెనో, అట్లే ఈ దేశములలో ప్రతియువకుఁడును సైనికుఁడుగ నుండవలెను. నిర్బంధ సైనిక సేవ జాతి మత భేదములను నిర్మూలముచేసి, ప్రజల నందఱను కులము ధనము మున్నగువానివలనఁ గలుగు తారతమ్యములనుండి తొలఁగించి, వారికి సర్వసమానత్వమును గలుగఁజేయును. కాని, నిర్బంధ సైనిక సేవకును ప్రాతినిధ్యపు పరిపాలనను గోరు ప్రజాస్వామికమునకును గొన్ని యసందర్భములు గలవు. ప్రజాస్వామికమునందు అధికారము, అనువర్తనము అను భావములు తిరస్కరింపఁబడి, తెలివిగల వక్త నాయకత్వము వహించును. ప్రతి సమస్యయు జనబాహుళ్యముయొక్క యభిప్రాయము (వోట్లు) ననుసరించి నిర్ణయింపఁబడును. మఱియు ప్రజాస్వాతంత్ర్య మను భావము పోను పోను అరాజకమునకు సమీపించుచుండును. నిర్బంధసైనిక సేవ యన్ననో, నిరంకుశాధికారము, చర్చగాని విచారణగాని లేని విధేయత. ఇందలి ఆదర్శములు అభ్యాసములు భావములు, ప్రజాస్వామికమునకు వర్తించువానికి అతిదూరములై యుండును. రానురాను సర్వత్ర ప్రజాస్వామికము వృద్ధియగుచున్న దేశములలో నిర్బంధ సైనిక సేవ ఎంతవఱకు వర్ధిల్లఁగల దని మహనీయు లనేకులు సంశయించుచున్నారు. ఎంతకాలము గరుత్మంతులు చిలుకలవలన పరిపాలింపఁబడుదురు ?—— అని వీరు ప్రశ్నింతురు.

ఈ తర్కవాదము లెట్లున్నను, సభ్యత నొందిన ప్రపంచ మంతటను నిర్బంధసైనిక సేవ అవలంబింపఁబడుచున్నది. ఇంగ్లాండు అమెరికాలలో దీని యనావశ్యకతకు కారణము లిదివఱకే నుడువఁబడినవి. లాభనష్టము లెట్లున్నను, ఇంగ్లాండులోని పద్ధతులవలన సైనికవ్యయము విశేషముగ హెచ్చుచున్నది. ఈవ్యయము హెచ్చిన కొలఁది దేశముయొక్క ఋణము వృద్ధియగును. ఇది యొక ఇంగ్లాండు దేశముననేగాదు, కాలక్రమమున సకలదేశములలోను రాజ్యాంగమువారి యప్పులు వృద్ధియగుచున్నవి. ఈ యప్పులు ఆయాదేశపు ప్రజలనుండియే గాక ఇతర దేశపుప్రజలనుండి కూడ పుచ్చుకొనఁబడుచున్నవి. వీనికి ముఖ్యకారణము వత్సరవత్సరము సైనిక సంబంధమగు వ్యయముయొక్క వృద్ధియే. ఇంగ్లాండు దేశముయొక్క యప్పు 1835-1888 సం.లకును నూటికి173 పెరిగి273 అయినది. ఇటీవల నిరంతరము యుద్ధనౌకలయందును ఆయుధములందును జరగుచున్న మార్పులే ఈ వృద్ధిని ఇంకను హెచ్చించుచున్నవి. ఇంగ్లాండుయొక్క స్థితిగతులను గమనించువారు ఆదేశముయొక్క భద్రతకు ఇట్టి వ్యయము అత్యవసరమని గ్రహింపకమానరు. తనప్రజలకైనను వలయు నాహార పదార్థముల నెల్ల పండింపఁజాలనట్టియు, తన జీవితమునకు పూర్ణముగ విరివియైన వాణిజ్యముపై నాధారపడవలసినట్టియు, తన రాజ్యపరిమితినిబట్టి, తఱుచుగ నితరరాజ్యములతో కలహింపఁదగినట్టియు, ఇతరుల దండయాత్రకు ఆశను గలిగించునట్టియు ఈద్వీపము మఱియొకరీతిని తనస్వాతంత్ర్యమును నిలుపుకొనఁజాలదను సంశము ఆంగ్లేయ ప్రజలును పాలకులును గ్రహింపఁగలిగియుండుట మిక్కిలి శ్రేయోదాయకము.

ఈ వ్యయమునందు వృద్ధి అన్ని దేశములయందుఁ గన్పట్టుచు, అన్ని రాజ్యములను గలవరపఱచుచున్నది. ఇది ఎట్లు అంత్యము గానున్నదో ఎవరును గ్రహింపఁజాలకున్నారు. కాని వ్యయమును గొంతవఱకు తగ్గించుటకు నిర్బంధ సైనిక సేవ యను నూతన ప్రతిక్రియ వర్తించుచున్నది.

ఇంగ్లాండుయొక్క స్థితినిబట్టి నిర్బంధ సైనిక సేవ ఇంగ్లాండులో నాచరణలోనికి రాకున్నను, ఆదేశమునకు చేరియున్న ఆస్ట్రేలియా న్యూజీలాండు దక్షిణాఫ్రికా

వ్యక్తిత్వము నశించు నని కొందఱి యభిప్రాయము. బుద్ధి కౌశలమును, చతురుఁడనమును గలిగిన యువజన శ్రేష్ఠుల బుద్ధిప్రసారమున కిది గొప్ప యంతరాయ మందురు. ఇట్టిపురుషులలో నెందఱి మహాశక్తులు వ్యర్థ మగుచున్నవో, యెందఱి మనస్సులు సంతాపము నొందుచున్నవో యూహించుట సులభము.

కాని ప్రజాస్వామికమును గోరు దేశములలో ఈ నష్టములను నివారించుటకైన గమనింపక, నిరంతరము ప్రజలు సైనిక జీవిత మాహాత్మ్యమునందు నిమగ్నులై యుందురు. ఎట్లు ప్రతియువకునకును వోటియ్యవలెనో, అట్లే ఈ దేశములలో ప్రతియువకుఁడును సైనికుఁడుగ నుండవలెను. నిర్బంధ సైనిక సేవ జాతి మత భేదములను నిర్మూలనముచేసి, ప్రజల నందఱను కులము ధనము మున్నగువానివలనఁ గలుగు తారతమ్యములనుండి తొలఁగించి, వారికి సర్వసమానత్వమును గలుగఁజేయును. కాని, నిర్బంధ సైనిక సేవకును ప్రాతినిధ్యపు పరిపాలనను గోరు ప్రజాస్వామికమునకును గొన్ని యసందర్భములు గలవు. ప్రజాస్వామికమునందు అధికారము, అనువర్తనము అను భావములు తిరస్కరింపఁబడి, తెలివిగల వక్త నాయకత్వము వహించును. ప్రతి సమస్యయు జనబాహుళ్యముయొక్క యభిప్రాయము (వోట్లు) ననుసరించి నిర్ణయింపఁబడును. మఱియు ప్రజాస్వాతంత్ర్య మను భావము పోను పోను అరాజకమునకు సమీపించుచుండును. నిర్బంధ సైనిక సేవ యన్ననో, నిరంకుశాధికారము, చర్చగాని విచారణగాని లేని విధేయత. ఇందలి ఆదర్శములు అభ్యాసములు భావములు, ప్రజాస్వామికమునకు వర్తించువానికి అతిదూరములై యుండును. రానురాను సర్వత్ర ప్రజాస్వామికము వృద్ధియగుచున్న దేశములలో నిర్బంధ సైనిక సేవ ఎంతవఱకు వర్ధిల్లఁగల దని మహనీయు లనేకులు సంశయించుచున్నారు. ఎంతకాలము గరుత్మంతులు చిలుకలవలన పరిపాలింపఁబడుదురు ?—— అని వీరు ప్రశ్నింతురు.

ఈ తర్కవాదము లెట్లున్నను, సభ్యత నొందిన ప్రపంచ మంతటను నిర్బంధ సైనిక సేవ అవలంబింపఁబడుచున్నది. ఇంగ్లాండు అమెరికాలలో దీని యనావశ్యకతకు కారణము లిదివఱకే నుడువఁబడినవి. లాభనష్టము లెట్లున్నను, ఇంగ్లాండులోని పద్ధతులవలన సైనిక వ్యయము విశేషముగ హెచ్చుచున్నది. ఈవ్యయము హెచ్చిన కొలఁది దేశముయొక్క ఋణము వృద్ధియగును. ఇది యొక ఇంగ్లాండు దేశమున నేగాదు, కాలక్రమమున సకల దేశములలోను రాజ్యాంగమువారి యప్పులు వృద్ధియగుచున్నవి. ఈ యప్పులు ఆయాదేశపు ప్రజలనుండియే గాక ఇతర దేశపు ప్రజలనుండి కూడ పుచ్చుకొనఁబడుచున్నవి. వీనికి ముఖ్యకారణము సత్సరసత్సరము సైనిక సంబంధ మగు వ్యయముయొక్క వృద్ధియే. ఇంగ్లాండు దేశముయొక్క యప్పు 1835-1888 సం.లకును నూటికి173 పెరిగి273 అయినది. ఇటీవల నిరంతరము యుద్ధశాలలయందును ఆయుధములందును జరగుచున్న మార్పులే ఈ వృద్ధిని ఇంకను హెచ్చించుచున్నవి. ఇంగ్లాండుయొక్క స్థితిగతులను గమనించువారు ఆదేశముయొక్క భద్రతకు ఇట్టి వ్యయము అత్యవసరమని గ్రహింపకమానరు. తనప్రజలకైనను వలయు నాహార పదార్థముల నెల్ల పండింపఁజాలనట్టియు, తన జీవితమునకు పూర్ణముగ విరివియైన వాణిజ్యముపై నాధారపడవలసినట్టియు, తన రాజ్యపరిమితినిబట్టి, తఱుచుగ నితర రాజ్యములతో కలహింపఁదగినట్టియు, ఇతరుల దండయాత్రకు ఆశను గలిగించునట్టియు ఈద్వీపము మఱియొకరీతిని తనస్వాతంత్ర్యమును నిలుపుకొనఁజాలదను సంశము ఆంగ్లేయ ప్రజలును పాలకులును గ్రహింపఁగలిగియుండుట మిక్కిలి శ్రేయోదాయకము.

ఈ వ్యయమునందు వృద్ధి అన్ని దేశములయందుఁ గన్పట్టుచు, అన్ని రాజ్యములను గలవరపఱచుచున్నది. ఇది ఎట్లు అంత్యము గానున్నదో ఎవరును గ్రహింపఁజాలకున్నారు. కాని వ్యయమును గొంతవఱకు తగ్గించుటకు నిర్బంధ సైనిక సేవ యను నూతన ప్రతిక్రియ వర్తించుచున్నది.

ఇంగ్లాండుయొక్క స్థితినిబట్టి నిర్బంధ సైనిక సేవ ఇంగ్లాండులో నాచరణలోనికి రాకున్నను, ఆదేశమునకు చేరియున్న ఆస్ట్రేలియా న్యూజీలాండు దక్షిణాఫ్రికా

లను వలసలలో అది కొంతమార్పుతో రెండు సంవత్సరములనుండి అవలంబింపఁబడుచున్నది. దీనికి 'సిటిజన్ ఆర్మీ' అనఁగా 'పౌరులసేన' యని యావలసలలో నామకరణముచేయఁబడినది. ఆస్ట్రేలియా న్యూజిలాండు దేశములు ఇంగ్లాండునకు ఎక్కువ దూరముగ నుండి, ఆసియా దేశస్థుల దండయాత్ర భీతి నొందిన వగుటచేతను, దక్షిణాఫ్రికాలో వలసకువచ్చిన పాశ్చాత్యుని ప్రతియొక్కనికిని అయిదుగురు చొప్పున దేశీయుల సంఖ్య హెచ్చుగ నుండుటచేతను, ఈ మూడు వలసలలోను పౌరులసేన యను నిర్బంధ సైనిక పద్ధతి యవలంబింపఁబడినది. ప్రతి పౌరుఁడును 12 సం.ల వయసు మొదలు 25 సం.ల వయసువఱకును, అనఁగా 13 సం.ల కాలము సేవ చేయవలెను. ప్రతిసంవత్సరమును మొత్తముమీఁద 16 రోజులు సేవ చేయవలసియుండును.

| వయసు | |
|---|---|
| 12-14 సంవత్సరమునకు | 90 గంటలు శిక్ష. |
| 14-18 ,, | 4 రోజులు డ్రిల్లు. |
| 14-18 సంవత్సరమునకు | 12 అర్ధదినములు డ్రిల్లు. |
| | 14 రాత్రులు ,, |
| 18-25 వఱకు పౌరుల సేనలో చేర్చుకొనఁబడి సం.కు | 16 రోజులు శిక్ష. |
| ,, | 8 ,, పర్యటనము. |
| మొత్తము కాల్బలమునకు | 6½ మాసములు శిక్ష. |
| టెక్నికల్ సేనలో | 8½ ,, ,, |

ఈ విధముగ ఫ్రాన్సు జర్మని దేశములలోని పద్ధతి సంస్కరింపఁబడినది. ఇది యైనను, వాలంటీర్ల సంఖ్య తగినంతగ నుండనియెడల, తగిన వయస్సుగల వారిలో కావలసినవారిని లాటరీవలన తీసికొనెదరు. సేవచేయుకాలములో రోజునకు రు. 2-4-0 చొ. వేతన మొసఁగఁబడుటచే, వ్యయము విశేషము కాఁజాలదు. మన దేశములోఁ గూడ [illegible] అవలంబింపఁబడునెడల అమితమగు సైనికబల మేర్పడుట కవకాశము కల్పింపఁబడును.

CARRYING A MACHINE GUN



ఒక యంత్రఫిరంగిని కందకములోనికి గొంపోవుట

LIFE IN TRENCHES



కందకములలో జీవితము

SAVING HER HONOUR



రెడ్ క్రాస్ నర్సును ఎత్తుకొనిపోవుచున్న జర్మనుని హైందవయోధుడు పొడుచుట

SAVING THE WOUNDED



గాయపడిన అప్సరుని ఫిరంగులున్న ప్రదేశమునుండి భారతీయుడు రక్షించుట

X

GERMANS APPROACH THE INDIAN TRENCHES



భారతీయసైనికులున్న కందకములవద్దకువచ్చిన జర్మనులు పాతులగుట

HOW GANGA SINGH NEGI EARNED THE VICTORIA CROSS



విక్టోరియాక్రాసును పొందిన గంగాసింగు నేగి పదునాలుగురు జర్మనుల నొక్కకందకములో జంపినవిధము

MR. G. LAKSHMANNA B.A. B.L.



గంటి లక్ష్మన్నగారు (రాజమండ్రి)

MR. M. KRISHNA RAO, B.A.



ఎం. కృష్ణారావుగారు (ఒంగోలు)

RAO BAHADUR MOOPUR APPA GARU



రావుబహదూర్ మూపూరు అప్పగారు (మదరాసు)

# వ్యవసాయము

వ్యవసాయశాఖ డిప్యూటీ డైరక్టరు

కూనప్పరెడ్డి రామశాస్త్రులు నాయుడుగారు, బి. ఎస్ సి.

వ్యవసాయ మనఁగా "త్రవ్వుట, పూడ్చుకొనుట" అని సంగ్రహముగాఁ జెప్పవచ్చును. భూమిని త్రవ్వనిది పంటలు పండవు. పంటలు పండనిచో పొట్ట పూడ్చుకొన శక్యము కాదు. మనుష్యులకు ఆహారము ముఖ్యము. వ్యవసాయఫలము ఆహారము కాఁబట్టి వ్యవసాయ మనెడు వృత్తి వృత్తులలో నెల్ల మొదటి వృత్తియని చెప్పవచ్చును. ఈ వృత్తి లేనిచో ప్రపంచము సాఁగనేరదు.

వ్యవసాయఫలము ఆహారమే కాదు, అది యాహారమునకుఁ దోడు అనేకఫలములను ఇచ్చుచున్నది; మనము ధరించు వస్త్రములకు కావలసిన సామానులను, వసించుట కవసరమయిన గృహములను గట్టుకొనుటకు మూలాధారము లగు కలప మొదలగు సామగ్రులను, శరీరారోగ్యముకొఱకు కావలసెడు పలువిధములయిన మూలికలను, వేళ్లను, రసములను, పరిమళములను, ఇంకను పెక్కు వస్తువులను ఇచ్చుచున్నది. లోహసంబంధమయిన వస్తువులు దప్ప, మనుష్యులకు కావలసిన యన్ని వస్తువులును వ్యవసాయము మూలముగానే వచ్చుచున్నవి.

చదువు లేనిది బ్రతుకవచ్చును. శాస్త్రములను చదువనిచో బ్రతుకవచ్చును. కాని వ్యవసాయము లేనిది క్షణమాత్రమైనను బ్రతుకలేము. దీనిని నిరాకరించువాఁడు మన్నుదిన్న పాముఁబోలె అజ్ఞానాంధకారమున మునుఁగువానితో సమానము. వృత్తులలోని కెల్ల ఆది వృత్తి వ్యవసాయ మని చెప్పితిని. మనుష్యుఁడు పశుత్వమునుండి క్రమక్రమముగా నాగరకతను బొందుచున్నాఁడో ఆరీతిగానే వ్యవసాయము కూడ వృద్ధిచెందవలసినదే. ఇట్టి యభివృద్ధి అన్యదేశములలో అగపడుచున్నను, జాతులలో నెల్ల నాదిజాతి యగు ఆర్యులజాతికిఁ బుట్టినిల్లగు భరతఖండమున అగపడు చున్నట్లు కానరాదు. ఇందుకు కారణములు చదువరులకు ముందుముందు తెలియును.

ఆదియందు మనుష్యునకు ఆహారము అడవులలో నుండు దుంపలు, పండ్లు, ఆకు, అలము, జంతువులు మొదలగునవియే. జనసంఘములు కష్టపడికొని యొక యడవినుండి మరియొక యడవికిఁ బోవుచు వేఁటాడుకొనుచు దొరకిన యాహారములను భుజించుచు కాలము గడపి రను సంగతి యూహింపక తప్పదు. కాని, రానురాను జనసంఖ్య హెచ్చుకొలఁదిని అడవులలో నుండెడి యాహారము చాలకుండుట మనుష్యుఁడు కడుచింత నంది తానే స్వయముగా కృషి చేసి తనకుఁ గావలసిన యాహారములను వృద్ధిచేసికొనుటకుఁ బ్రయత్నించవలసి వచ్చెను. నెట్టి ప్రయత్నము పుట్టుటయే వ్యవసాయము పుట్టుట యని చెప్పవచ్చును. సృష్టిలోఁ గల యాహారములు చాలక మనుష్యునకుఁ దనకుఁ గావలసిన వస్తువులను తానే సృష్టించుకొనవలయు నను బుద్ధి కుశలత యెప్పుడు గల్గెనో, అప్పుడే సృష్టిని తిరస్కరించుచు "మనుష్యసృష్టి" యనెడు వ్యవసాయపుబీజము భూమిలోఁ బడెను. అప్పటినుండి వ్యవసాయము రానురాను అభివృద్ధిని జెంది మనుష్యునియొక్క బుద్ధికుశలత ననుసరించి యనేకరూపములను దాల్చి ప్రపంచమునందు వికసించుచున్నది.

దైవసృష్టిని తిరస్కరించుచున్నటు లుద్భవించిన వ్యవసాయ మనెడు మనుష్యసృష్టి యెట్టిదియో దానికి కాలక్రమమున వచ్చిన మార్పులకు కారణము తెలిసికొని కొంచె మూహించెదము.

వ్యవసాయ మనఁగా మనుష్యునకుఁ గావలసిన వృక్షజాతులను జంతుజాతులను పుట్టించుకొనుట. ఇది యేగాక, వృక్షజాతులనుండియు జంతుజాతులనుండియు వచ్చు వస్తువులను అనేకరూపములుగా మార్చుచున్నట్టి

వ్యావసాయిక పరిశ్రమలు కూడ వ్యవసాయమునకు సంబంధించినవియే. గంజి తీయుట, చక్కెర చేయుట, సారాయి కాచుట, జిగుళ్ళను తీయుట, కర్పూరము తీయుట, పరిమళద్రవ్యములను చేయుట, ఆకులనుండియు మూలికలనుండియు మందులను తీయుట, చమురులను తీయుట మొదలయినవి వృక్షములకు సంబంధించిన వ్యవసాయపరిశ్రమలే యైయున్నవి. తోళ్లవ్యాపారము, వెంట్రుకల వ్యాపారము, మాంసము, క్రొవ్వు, గ్రుడ్లు మొదలయిన యనేకవ్యాపారములు కూడ జంతుసంబంధమైన వ్యవసాయపరిశ్రమలే యైయున్నవి.

వ్యవసాయవృత్తి వృద్ధిచెందుటకు అనేకశాస్త్రములు కారణములయి యున్నవి. అనుభవము రానురాను మనుష్యునకు వృద్ధిచెందినకొలఁదిని శాస్త్రపరిచితియు వృద్ధిచెందెను. భౌమికశాస్త్రము, వాతావరణశాస్త్రము, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, పురుగులశాస్త్రము, క్రిమికీటకాదులశాస్త్రము, రసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము, ఇంకను లోహసంబంధము లయిన శాస్త్రములు తప్ప, తక్కిన యున్నిశాస్త్రములును వ్యవసాయవృత్తికిఁ దోడ్పడు శాస్త్రములే. కాఁబట్టి వ్యవసాయమనెడి వృత్తి యొకవేళ మిశ్రమశాస్త్ర మనియుఁ జెప్పవచ్చును. పైఁజెప్పిన శాస్త్రములను చక్కఁగా చదివి వ్యవసాయమును దిద్దుకొనుట అత్యావశ్యక మగుచున్నది. ఇట్లు చేయువాఁడే రైతు గాని మఱియొకఁడు రైతుగా నెగ్గనేరఁడు. రైతునకు తాను వ్యవసాయమునందుఁ జేయు ప్రతిక్రియకును శాస్త్రము లాధారములుగా నున్నవి. కాఁబట్టి శాస్త్రాధారము ననుసరించి వ్యవసాయమును నడపించువాఁడు కలకాలమును వృద్ధిలోనే యుండును. ఇదియే కాక రైతు తనకు ఫలించు వస్తువులకు ఏకాలమున ఏదేశములలో ఏసంతలలో ఏరీతిగా తా నెక్కువక్రయమును బొందఁగలుగునో దానిని దెలిసికొనుటయు ముఖ్యమై యున్నది. కాఁబట్టి పైఁజెప్పిన శాస్త్రము లన్నియు బాగుగాఁ దెలిసినఁ గాని వ్యవసాయశాస్త్రము వృద్ధి చెందదు. మనదేశములో ఇట్టిశాస్త్రములందు పరిచయము బహుస్వల్పము గాన వ్యవసాయము రానురాను అడుగంటుచున్నది. అన్యదేశములందో మనుజులు శాస్త్రములందు మునుఁగుచుఁ దేలుచు జయమును బొందుచు అభివృద్ధిని జెందుచున్నారు. అమెరికావారును, ఫ్రాంసువారును, జర్మనీవారును, ఇంగ్లీషువారును, ఆస్ట్రేలియావారును వ్యవసాయమునందు కొలఁదిలేని ఘనతను వహించుచున్నారు. 12 అంగుళముల వెడల్పును 9 అంగుళముల లోఁతును గల చాళ్లను లాగు ఇనుపనాఁగళ్లను సృష్టించి గుఱ్ఱములబలముతో నాఁగళ్లపై నెక్కి భూమిని దున్నుచున్నారు. ఇది చాలక ఆవిరియంత్రముల మూలముగా 7 లేక 8 నాఁగళ్లను కలిపి ఒక్కసారిగా భూమిని పెళ్లగించుచున్నారు. దున్నినభూమిని సవరణచేయుటకు అనేకవిధములయిన యంత్రములను కనిపెట్టియున్నారు. ఏలోఁతున కావలయునో ఆలోఁతున విత్తనము వేయుటకును, ఒత్తుగా కావలసిన ఒత్తుగా వేయుటకును, పలుచఁగా కావలసిన పలుచఁగా వేయుటకును యంత్రములను కనిపెట్టియున్నారు. మఱియు ఒక్కగింజ వేయు యంత్రములను, కొంకుగింజలను వేయు యంత్రములను గూడ కనిపెట్టియున్నారు. కోఁతలు కోయు యంత్రములను, కోఁతలన్ని కోసి కట్టలను కట్టు యంత్రములను, నూర్పుడుయంత్రములను, మఱియు పలువిధము లయిన యంత్రములను కనిపెట్టియున్నారు.

దేశగతికిని శీతోష్ణస్థితికిని భూస్థితికిని తగిన పైరుల జాతులను వృద్ధిచేసి, వానివిత్తనములను దీసి, రానురాను వానిని వృద్ధిచేసి, వానినుండి అమితఫలమును బొందుచున్నారు. అకాలములో కాయుటకును సాధారణకాలముకంటె తక్కువకాలములో ఫలించుటకును తగిన సదుపాయములను కనిపెట్టియున్నారు. కొన్నికాలములలో మంచుమొక్క యుపద్రవము తగులకుండ ఫలవృక్షములను జాగరూకతతోఁ గాచుకొనుటకు థర్మామీటరునకును అలారము గడియారమునకును సంబంధము నేర్పఱచి, తోఁటలలో నుంచుకొని ఉట్లలో ప్రేలాడఁగట్టియున్న బొగ్గును ముట్టించి కాకను బుట్టించి మంచును చెదరఁగొట్టుచున్నారు.

క్రొత్తజాతులను తమదేశములోనికి స్వీకరించుకొనుటకు అనేకశాస్త్రజ్ఞులను పరదేశములకుఁ బంపి కోట్లకొలఁది రూపాయలను కర్చుపెట్టుచున్నారు. ఈ రీతిగా అమెరికావారు తమదేశములోని యత్తిఫలమును పెద్దదిగాను రసవంతముగాను జేయుటకు అత్తిపురుగును స్మర్నా దేశమునుండి తెచ్చి తోఁటలలో ఉంచుకొనుచున్నారు. పంటలతెగుళ్లను చీడలను తీసివేసి, వాని యుపద్రవమును తప్పించి మేలు కలిగించు పురుగులను పెంచుచున్నారు.

ఈ పైఁజెప్పినవి గాక వేఱువిధములయిన యేర్పాటులను జేయుచు విసుగుచెందక వ్యవసాయమును వృద్ధిచేయుచు దేశసౌఖ్యమును గనిపెట్టుచున్నారు.

మనదేశములోనో "ఎక్కడ నున్నావే గొంగళీ అంటే వేసినచోటనే యున్నానే కంబళీ" అన్నలోకోక్తి ననుసరించి ఉన్నస్థితినుండి మాఱ్పును చెందఁజాలక యున్నాము. కొన్ని సంవత్సరములక్రిందట నేను మదరాసులో చదువుకొనుచున్నప్పుడు కట్టుచున్న యొక యిల్లు కూలి పనివాండ్రలోఁ గొంతమంది క్రిందఁబడి రాళ్లతోఁ గప్పఁబడిరి. అప్పుడు ఊరంతయు గుమిగూడి 'రాళ్లను ఎత్తవలెను, పడినవారిని రక్షించవలెను' అనువారే తప్ప, ఒక్కఁడైనను ఒక్కరాయినైనను చేతితో నెత్తి ఆవలఁ బడవైచినవారు కారు. ఈరీతినే మనదేశములోఁ జదువుకొన్నవారందఱును ప్లాట్ఫారముల మీఁద లెకలెకలాడుట తప్ప క్రియలయందు శూన్యులు. వ్యవసాయము మనదేశములో అభివృద్ధిచెందక దేశము క్షామములకు లోఁగుటను చూచి, ఘనతవహించిన మన గవర్నమెంటువారు దేశోపకారముకొఱకు వ్యవసాయశాఖను సృష్టిచేసి వీలయినంతవఱకు ఉపకారము చేయుచున్నారు. కోయంబత్తూరులో వ్యవసాయకళాశాలను నేర్పఱచి పిల్లలకుఁ జదువు నేర్పుచున్నారు. కోయంబత్తూరు, తాలిపరంబా, పాలూరు, మంగనెల్లూరు, కోయిలపట్టి, హాగరి, నందియాల, సిరువళ్ల, చామర్లకోట, అనకాపల్లి మొదలగు గ్రామములలో పరిశోధనస్థానముల నేర్పఱచి రహితులకు ఆవసరమయిన సంగతులను నేర్పుచున్నారు. చెఱుకుజాతులలో శ్రేష్ఠమైన జాతులను దెచ్చి గోదావరి, కృష్ణా, దక్షిణార్కాటు జిల్లాలలో స్థాపించిరి. మాగాణులలో ఒంటికఱ్ఱ యూడ్పును నేర్పుచున్నారు. వర్షాభావము ఎక్కువగని వరిసాగుచేత క్షీణించుచున్న భూములలో జనుము, వెంపలి, జీలుగు మొదలగు అనుపైరులను పెంచి దున్నుకొను మని చెప్పుచున్నారు. కావలసిన విత్తనములను కొన్నధరలకే రహితుల కిచ్చుచున్నారు. ప్రత్తిపైరులలో మంచివిత్తనములను ఎత్తి రహితులు భూములలో వేసికొనుటకు పంచిపెట్టుచున్నారు. దక్షిణజిల్లాలలో ఎచ్. సి. సామ్సన్ దొరగారు కరంగన్నీప్రత్తిని, ఉత్తరజిల్లాలలో జి. ఆర్. విల్సన్ దొరగారు తెల్లప్రత్తిని వృద్ధిచేసి ప్రజల కిచ్చుచున్నారు. వ్యవసాయశాఖవారి సహాయమువల్ల కంబోడియాప్రత్తి చెన్నరాష్ట్ర మంతటను వ్యాపించి పెక్కుబీదలను వారిఋణములనుండి తప్పించినది. కాని, అజ్ఞానముచేతను ధనాపేక్షచేతను ఈప్రత్తిని అన్ని భూములలోను వేయుటవల్ల కొంత క్షీణించి ఫలము తగ్గుచున్నట్లు కనఁబడుచున్నది. ఇంకను కోయంబత్తూరులో పరిశోధనాలయము మను నొకశాఖను పెట్టి అనేక రూప్యములను సెలవుచేయుచు పురుగులశాస్త్రములలోను, క్రిమికీటకశాస్త్రములలోను, మృత్శాస్త్రములలోను, పైరులలోను పరిశోధనలు చేయుటకును క్రొత్త సంగతులను గనిపెట్టుటకును విద్వాంసులను నియమించియున్నారు. ఈరీతిని అనేకవిధముల ధనమును వ్యయపఱచి వ్యవసాయశాఖ నేర్పఱచిన గవర్నమెంటు వారికి మన మందఱము కృతజ్ఞులము. వారికిఁ దోడ్పడి సహాయముచేయుట మనయొక్క ముఖ్యకర్తవ్యమయి యున్నది.

రహితు బీదవాఁడు. ఇతఁడు పరిశోధనలను జేయ శక్తిగలవాఁడు కాఁడు; శాస్త్రములను జదువుకొన్న వాఁడు గాఁడు; చదువు లేనందున అతనివృత్తి యే విధముగా వృద్ధియగుచున్నదో దానిని పరిశోధించుటకును గ్రుడ్డివాఁడుగా నున్నాఁడు. కాబట్టి యిట్టి బీద రహితునకు మన మహారాజులు, దేశముఖులు, లాయర్లు,

ప్లీడర్లు, పట్టాదార్లు, మిట్టాదార్లు మొదలగువా రంది లును తోడ్పడి ధనము కావలసినప్పుడు తక్కువవడ్డీ కిచ్చుచు, వ్యవసాయశాఖవారు పరిశోధించి తెల్పిన సంగతులను రహితులకు గ్రామములలో నిదర్శనపూర్వక ముగ తెలియఁజేయుచు, రహితులకుఁ గావలసిన సహా యము చేయుచు వచ్చినచో, మనదేశ మభివృద్ధిలోనికి వచ్చును.

ప్రస్తుతము మనదేశములో వ్యవసాయము ఏ యేవిధములుగా వృద్ధిని బొందఁగలదో ఆయాయంశ ములను సంగ్రహముగా నుడివెదను.

రహితునకు విద్య యవశ్యము. విద్యవలన శాస్త్ర పరిచితి గలుగును. దీనిచేఁ గ్రొత్తసంగతులను తెలిసి కొనుటకు హెచ్చరిక పుట్టును. ఇదియే యభివృద్ధికి కారణము.

గొప్పగొప్ప మిరాసిదార్లును, మిట్టాదార్లును, జమీన్‌దార్లును పట్టణములను విడిచిపెట్టి తమతమ గ్రామములకుఁ బోయి మేడలను మిద్దెలను గట్టుకొని నివసించుచు తమరహితులఁ జేరఁదీసి వారికి కావలసిన సదుపాయములను జేయుచు వారు చేయు కృషిఫల మును అనుభవించుట యుక్తము. ప్రస్తుతము పట్టణ ములలో నుండి, గ్రామములలో మేనేజరులను బెట్టి కార్యము నిర్వహించుకొను ప్రయత్నములవల్ల, పొల ములు పాడగుచున్నవి ; ఫలమును తగ్గుచున్నది. డబ్బు గలవా రగుటచేత, ఈ మిరాసీదార్లును, మిట్టాదార్లును వ్యవసాయశాస్త్రమును జదివి తా ననుష్ఠించుట యత్యా వశ్యము.

వ్యవసాయసంబంధమగు పరిశోధనస్థలములు పెక్కులు కావలయును; జిల్లాజిల్లాకును ఒక్కటియైన నుండవలయును. గవర్నమెంటువారు వీలయినంతవఱకు స్థాపించిరి; ఇంకను మరికొన్నిటిని స్థాపించుటకు ప్రయ త్నించుచున్నారు.

వ్యవసాయపుసంఘములను ప్రజలు స్థాపింప వలయును. ప్రస్తుత మక్కడక్కడ మాండలికవ్యవ సాయసంఘములు నెలకొలుపఁబడినవి. కొన్నిజిల్లాలకొక్కట ములు సాధారణముగా అగ్రాసనాధిపతులుగా నున్నారు. అనేకములగు నితరకార్యముల తొందరలవల్ల వీరు వ్యవసాయమున రహితునకు తగిన సహాయము చేయుట కవకాశము దొరకుట లేదు. ఈ సంఘముల మెంబ ర్లన్ననో లాయర్లు, పింఛనుపుచ్చుకొన్న పెద్ద పెద్ద యుద్యోగస్థులు. వీరి జరీతలపాగాలు వీరి దుస్తులు వీరి యాకారములు వీరిమాటలు రహితును బెదరఁగొట్టునవి యే గాని రహితునకు హితోపదేశము నిచ్చునవి కావు. వీరికి దానిమ్మపండ్లకు ఎరువులు కావలయును; పుష్ప జాతులకు చికిత్సలు కావలయును. ఇట్టియుపయోగకరము కాని జిల్లా వ్యవసాయ సంఘములను నెలకొలుపుటకన్న గ్రామవ్యవసాయసంఘములను స్థాపించి సహకారపద్ధ తుల ననుసరించి బాగుగాఁ దెలిసిన రహితులను మెంబ ర్లగుటకు హెచ్చరించుట దేశక్షేమమునకు ముఖ్య మయినది. ఇట్టి సంఘములలో శ్రద్ధవహించిన విద్యగల వారు గూడ రహితులతో సమానముగఁ గూర్చుండి ఈ దిగువ నుదహరించు వ్యవసాయాంశములను కొన్నిటిని రహితునకుఁ జెప్పినచో వ్యవసాయ మభివృద్ధిచెందఁ గలదు :—

1. చవుడుభూములను బాగుచేసికొనుట, వ్యవ సాయశాఖవారు 1912-వ సంవత్సరమున ప్రకటించిన నెం 1 వ కరపత్రమును జదివినచోఁ, దెలియును.

2. పశువుల యెరువులను కాల్పకుండ జాగ్రత్త చేసి దానితో ఆకు అలము చొప్పు మన్ను మొదలగు నవి చేర్చి పూడ్చిపెట్టి కొంచెము నీరుపెట్టి మంచి యెరు వుగా మగ్గునట్లు చేసికొనినచో, దేశములోని యెరువు లను వృద్ధిచేయవచ్చును.

3. కొన్నికొన్ని మ్యునిసిపాలిటీలలో ఊరికుప్ప వ్యర్థముగా పోవుచున్నది. దీనిని జాగ్రత్తచేసి మంచి యెరువుగాఁ జేసికొనవచ్చును. బాపట్లలో రివరెండు జి. ఎస్. తామ్సన్ దొరవారు కుప్ప నంతయు జాగ్రత్త చేసి గోతులలో పాతిపెట్టి, తగిన మన్ను చెత్త మొద లగువానిని జేర్చి అప్పుడప్పు డెండకుండ నీరుపెట్టుచు మంచియెరు వగునట్లు మగ్గఁబెట్టి ఆ యెరువులవల్ల దివిటి

వల్లపుభూములను బాగుపఱచి వానిని మంచి మాగాణి స్థితిలోనికిఁ దెచ్చినారు.

4. గ్రామాదులలోఁ జచ్చు పసువుల యెముక లన్నియును మాదిగలమూలముగా తురకలచేతిలోఁ బడి పరదేశములకుఁ బోవుచున్నవి. వీనిని గ్రామస్థులే స్వాధీనపఱచుకొనుట అతిసులభము. కొన్నికొన్ని గ్రామములను సంఘములుగాఁ జేర్చి, చిన్నయంత్రములతో వానిని బొడిచేసికొని అపోకనే యెరువుగా నుపయోగింపవచ్చును.

5. రైతు బీదవాఁ డగుటవల్ల గొప్పగొప్ప వ్యవసాయపుఁ బనిముట్లను కొనుటకు శక్తి గలవాఁడు గాఁడు. సాధ్యమయినంతవఱకు తక్కువ క్రయమునకు వచ్చెడియినుపనాగళ్లను అమర్చవలయును. ఇట్టినూర్పుత్త యంత్రములను చొప్పనఱకు యంత్రములను మన దేశములోనే చేసికొనవచ్చును. పెద్దపెద్ద యుపకరణములు కావలయు నన్నచో, అయిదారు గ్రామములవారు చేరి తెప్పించుకొని గాని, ఏదో యొక సంఘముమూలముగా తెప్పించి రైతున కిచ్చి గాని యుపయోగింపవచ్చును.

6. మనదేశములోని విత్తనములు రానురాను క్షీణించుచున్నవి. మంచివిత్తనముల నత్తి రైతున కిచ్చు సంఘములు కొన్ని యేర్పడినఁ గాని వ్యవసాయ ఫలము వృద్ధిచెందదు. వ్యవసాయశాఖవారు దీనిలో నిలయినంతవఱకు పనిచేయుచున్నారు. శ్రద్ధవహించిన కొన్ని సంఘములు తోడ్పడినఁ గాని స్థిరగా వృద్ధిలోనికి రానేరదు.

ఇంకను అనేకవిషయములలో శ్రద్ధవహించిన వారు వ్యవసాయమును వృద్ధిచేయవచ్చును. వాని నన్నిటిని ఇచ్చటఁ జెప్పుట కవకాశ ముండదు.

తుదవఱకు దీనిని జదివినవారికి వ్యవసాయము వృత్తులలోని కెల్ల ఆదివృత్తి యనియు, ఇది లేనిది ప్రపంచము సాగదనియు, దీనిని సాధించినఁ గాని ప్రజలకు క్షేమము గలుగదనియు తెలియును. భూమిని దున్ని ప్రపంచమును పోషించుచున్న రైతును మన మందఱము కాపాడవలయును. ప్రస్తుతము చక్కఁగాఁ జదువు కొన్నవారు, వ్యవసాయమునందు తప్ప, ఇతరవృత్తులం దెల్ల ప్రవేశించుచున్నారు. ఇట్లు ప్రవేశించి రైతు యొక్క పైకమును ముఖ్యముగా తమసౌఖ్యముకొఱకు నుపయోగించు పెద్దమనుష్యులు, దేశక్షేమముకొఱకును వృద్ధికొఱకును పాటుపడునట్లు అనేక సంఘములలోఁ బాటుపడుచున్నప్పటికిని, రైతువృద్ధికొఱకు ఏమాత్రమును శ్రద్ధపుచ్చుకొన్నట్లు కనుపించదు. ఇది చూడ, అందఱికి నాధారమయిన రైతుయొక్క యభివృద్ధిని గమనింపకుండుట మిక్కిలి వ్యసనకరము.

---

# శ్రీ గోపాలకృష్ణగోకులనిర్యాణతారావళి

గో. రమాకాంతాచార్యులుగారు

కడుపునఁ గంటి వెందఱినొ కారణజన్ముల లోకమాన్యులౌ
కొడుకుల; నందు నెవ్వరును గోకులకృష్ణుని కీడునత్తురే?
కడుపునఁ జిచ్చుపెట్టి చనెఁ, గంటికిఁ గూరవెదు గాఁగ నేడ్పికన్
బడయఁగలావె క్రమ్మరను భారతమాతరొ! యింక నాతనిన్? 1

చ. వయసునఁ జిన్న యయ్యును భవత్సుతరత్నములందు సద్గుణో
దయుఁడయి సర్వభూతహితతత్పరుఁడై భవదంఘ్రిపద్మసే
వ యనఁ దలన్ ధరించి తన ప్రాణము లర్పణచేసె భక్తి న
ట్టి యమితమాతృవత్సలుఁ గనింతుమె యెన్నటికైన? నమ్మరో! 2

ఉ. ఎందఱొ నాకలోకమున కేగిరి నీతనయుల్ ధురంధరుల్,
హిందువు లేతదర్థము రయేడ్చిరి; గోకులకృష్ణుఁ డేగ, నే
మందుము? జక్రవర్తి మొద లంత్యజుదాఁక సమస్తమానవుల్
కుందుచునున్నవా రతనికోసము; తన్మహిమం బదెట్టిదో? 3

ఉ. పిల్లలకోడి వీ; పరులపిల్లల కోడి, భవత్సుతుల్ సిరుల్
కొల్లఁగ నున్న విశ్వధనకోశమునం జొరలేనివేళ, శ్రీ
పిల్లకుఁ డంచు వారి కొక తెన్నును జూపిన ధీరుఁ డేగె; నీ
పిల్లల కింక దిక్కెవరు? వేఱుగ నెవ్వరు దేవుఁ డొక్కఁడే. 4

ఉ. లేరె సురేంద్రవైభవులు లేరె సునీతిలకుల్ జగన్మనో
హారిసరస్వతీరసవిహారులు లేరె వివేకమండితుల్
లేరె నరేంద్రచంద్రులును లెక్కకు నొక్కఁడె గాని శ్రీమహా
భారతగోష్ఠిఁ గృష్ణునటుఁ బ్రాజ్ఞుఁడు గోకులకృష్ణుఁ డమ్మరో! 5

ఉ. నందియు మేల కృష్ణుఁ డను సర్వవిధంబుల నొంచి చూడ్క నా ని
యందము చందమున్ గనిన నాతఁడె జ్ఞప్తికి వచ్చుఁ గాని శ్రీ
నందనుఁ డుండు చాలఁడు గుణంబుల నేకపతీవ్రతంబునన్
నందసుతుండుగాఁడు రఘునందనుఁ డాతని కీడు తల్లిరో! 6

శా. గీతాశాస్త్రపదార్థపీఠికలలోఁ గ్రీడించినా రెందఱో
ఖ్యాతిన్ దన్నుననీక మొక్కలికిఁ జిక్కన్ లేదు శ్రీకృష్ణుకే
తాతాత్పర్యము కర్మయోగ మని స్వార్థత్యాగియై దేశసే
వాతంత్రజ్ఞుఁడు గోకులుం డలవడెం బ్రాజ్ఞప్రవక్ర్యిష్టుఁడై. 7

ఉ. కర్మము జ్ఞానగర్భ మగు జ్ఞానము భక్తిరసప్రగర్భ, మీ
మర్మ మెఱుంగ కున్న ఋజుమార్గమునం జన దాత్మ; కర్మమున్
నిర్మలబుద్ధిఁ జేసెడు మనీషులు లోకహితాభిలాషు; లీ
ధర్మము వృద్ధిఁ జెందక యధర్మ మడంగ దడంగ దమ్మరో! 8

శా. హిందూనాత్మయుగోదయార్కసుషమాద్యప్యన్మహాదేవగో
విందశ్రీరణదేవదేశికపదస్వీకారలబ్ధాఖిలా
స్పందజ్ఞానధనుండు గోకులుఁడు, తద్జ్ఞానంబు సామాన్యమే ?
మందప్రజ్ఞుల కందరాదు తదసామాన్యాంతరార్థధ్వనుల్. 9

మ. ఘనగంగాలహరీతరంగవిలుఠద్గంభీరవాగ్గుంభిజృం
భణ దేశీయసభాగ్రపీఠపతి యై భాషింప, సామ్రాజ్యశా
సననిర్మాణసభాంతరాళమున శాస్త్రీశ శ్రీఁ బోరాడఁ గాం
చినవా రెవ్వరు విస్మరింపరనుమీ శ్రీకృష్ణగోపాలునిన్. 10

ఉ. పాలకపాల్యబంధపరిపాలనమంత్రవిధుండు దీర్ఘదృ
క్కాలి వరాంగ్లరాజ్యహితకాంక్షి స్వదేశజనోపకారది
క్షాలలితాంతరంగుఁ డని చాటిరి మువ్వురు హైందవప్రభుల్
చాలదె నీ తనూజుఁ డయి జన్మము నెత్తినదాని? కమ్మరో! 11

మ. అతికారుణ్యము నిమ్నజాతిపయి, విద్యాహీను లైనన్ బహు
ప్రతతిం బోలుదు రంచు రాట్సభలఁ దత్పుత్రులం బాదించి యా
ప్రతతాసేతుహిమాద్రిమధ్యప్రజకున్ ప్రారంభవిద్యామహా
స్మృతి సల్పించెను జక్రవర్తివలనన్, సాధించెఁ దత్సన్మతిన్. 12

మ. తరమే యెవ్వరికే నెఱుంగ భగవత్సంకల్పముల్? గోకులున్
హరియించెన్ సుకృతీ గతాయు వను వాక్యంబే ఫలింపన్ ; జగ
ద్వరణాం జెట్టులో ధీరు లందఱు హరింపన్? మర్త్యనో యద్యదా
చరతి శ్రేష్ఠ యటన్న సూక్తిని? జగత్సామ్రాజ్యమే యుల్లదో ? 13

ఉ. వేలకు వేల్ గణింపఁగల విద్యలు నేర్చినవాఁడు, చాలియున్
జాలని వేతనంబునను సల్పెను జీవనయాత్ర చేడవి
ద్యాలయమందుఁ; జేడ యన నాస్తికభాగము గాని జానిన్
బోలున దేకశానిలయముల్ ప్రతిభానవశక్తిసంపదన్ ? 14

మ. తులసీదాసుడు రామదాసు నను భక్తుల్ పుట్టి రెచ్చోట, వి
ద్యలభక్తిన్ దరియించి రెచ్చట నఖండజ్ఞాన వైరాగ్యని
ష్ఠులు లై, యట్టి పవిత్రదేశమునఁ దా జన్మించె గోపాలకృ
ష్ణుఁడు; వైరాగ్యపయోధి యైన నరుఁడే శుద్ధప్రపన్నాత్ముఁ డై ? 15

శా. ముందున్ వెన్కయుఁ జూడకుండఁగను నెవ్వుఁ జేయుఁ దేశార్య మే
మందున్ దత్ప్రభుభక్తి భూతదయ; నిత్యక్షేమ మీరెంట న
బ్బన్ దేశంబున కంచు సర్వవిషయంబుల్ నిర్వహింపంగ శ్రీ
హిందూసేవకసంఘమున్ నిలిపెఁ దానే నాయకుండై దానికిన్. 16

ఉ. ఎన్ని యుగాల్ గణించి ధరియించెదు కాలభుజంగ! యాదలన్
భిన్నఫణాసహస్రపృథుపీఠుల నుజ్జ్వలకీవరత్నముల్ ?
తన్నవకాంతిపూరములు దక్కిన భౌతికలోక మే మగున్ ?
గన్నులలో వినులలో కొఱంత గల్గకయుండిన నిట్లు చేయుదే ? 17

మ. జననీ! లోకమునన్ బ్రవృద్ధులు జరాజాడ్యంబులం జిక్కి యా
తనువుం బాసి ముకుందపాదములఁ జెందన్ సిద్ధులై యుండ, నా
టిని గాదంచు జగద్ధితాచరణపూర్తిం జేయనీకుండ జ
వ్వనముం దుంచిన యట్టి కృష్ణుఁ గొనిపోవన్ న్యాయమే మిత్తికిన్ ? 18

శా. ఆపత్కాలము తల్లి! మా కిది మహాయాసంబు ప్రాప్తించె మా
గోపాలున్ భగవంతుఁ డేతలఁపుతోఁ గొంపోయెనో గాని తా
మాపక్షంబును బూని దేవసభలో మాన్యాది సామ్రాజ్యమున్
గాపాడంగలవాఁ డతండు పరలోకంబందు సౌభ్రాతృతన్. 19

ఉ. ఏమి హరింపఁగల్గితి? వినీ! వచియింపు మకాలమృత్యువా!
యీ మహనీయు దేహమున నస్థులు చర్మము రక్తమాంసముల్
పాముకొనంగ వచ్చెనె ఫలంబు? తదాత్మపవిత్రసౌరభ
స్తోమము సోఁకెనే నతనిశోభికిఁ బోదువె నాల్క లార్చుచున్ ? 20

మ. అదియుం దక్కెనె నీకు; నస్థికలు గంగాంతర్జలంబందు శే
ష్యనదుల్ కల్వఁ బ్రయాగ వెళ్లెఁగదా! చర్మంబు రక్తంబు మాం
సవసాదుల్ పునహాపురంబునను భస్మం బయ్యెఁ; దత్ఖ్యాతియే
నవహిందూజననీవిభూతికి ననంతత్వప్రదం బయ్యెడిన్ ! 21

ఉ. భీరులు నాస్తికాగ్రణులు భీతిని బొందెద రోసిమృత్యువా!
నారకలోక మేగెడు జనంబులు నీ యధికారధాటికిన్ ;
ధీరులు కర్మయోగులు సధీనులు గా, రలసీమమూఁపుపై
స్వారి యొనర్చి పోవుదురు శాశ్వతలోకము ముక్తసంగులై. 22

శా. గంగాదేవిరో! నీ జలంబులను గ్రుంకన్ బుణ్య మన్నాటకు
బొంగన్ నామది; యెందఱెందఱు మహాత్ముల్ నీదుగర్భంబులో
సంగం బస్థులు దాఁచి వెళ్ళిరి, తదీయానూనసంగంబునన్
మాంగళ్యం బగు నీశరీరమును దస్మద్దేహచైతన్యముల్. 23

మ. అలుకా పల్క వదెన్ని పిల్పులకుఁ? జోనా పిల్పుచున్నారు నీ
ర్మలసామ్రాజ్యసభాసదుల్ ప్రథితమీమాంసాసభాసభ్యులున్ ?
నిలుచున్ నీ వట కేగకున్నఁ బను లోసీతిజ్ఞ! ప్రార్థించినన్
బలుకన్ రాదకొ మానముద్ర ధరియింపన్ బాడిమే యుత్తతిన్ ? 24

చ. అశరణులై భవత్సుతలు హా యని యేడ్చుచునున్న వారు; నీ
విశదవచస్సుధావిహృతి నీనుల కెక్కెడి దింక నెంచు నీ
యశము దలంచి శిష్యజను లక్కట! కుందుచునున్నవారు; తా
మశనము మానినారు ప్రజ లందఱుఁ; బల్కఁగరాదె? గోకులా! 25

ఉ. సోదరులార! యెందు మన శోకము దా విను సేము గాని యీ
రోదసి వానిపల్కులకు రూపము చేరఁగనీదు వీనులన్;
వాదుల మాని యిం కతని పాదముఁ బట్టి చరింత మాపయిన్
ఖేదముఁ బుట్టనీయఁడు సుమీ మన దిక్కగు శ్రీనివాసుఁడే. 26

ఉ. శ్రీకరసద్గుణార్ణవుఁ డశేషజగద్భరణైకదక్షుఁ డ
ప్రాకృతదివ్యమంగళవిరాట్పురుషుండు విశుద్ధమూర్తి య
స్తోకవిలాసబుద్ధిమహితుండు కృపారసితాంతరంగుఁడై
గోకులకృష్ణు నాత్మజుదు నూర్చుఁ బ్రశాంతరసానుభూతినిన్. 27

---

# రజస్వలా వివాహములు

వల్లూరి సూర్యనారాయణరావుగారు

వీనిని శాస్త్రములు నిషేధించినను, నిషేధింపకపోయినను, ఇవి జరగించుటవలన గొప్ప పాతిత్యము వచ్చునని గాని, దేశమునకు అరిష్టము వచ్చునని గాని నా యభిప్రాయము కాదు. పూర్వము మనశాస్త్రములు నిజముగా వీనిని నిషేధించినను, సంఘముతో సంబంధించిన వగుటచేత, సంఘాభివృద్ధి కనుకూలముగ నున్న యెడల, వీనిలో మార్పులు చేసికొనవలసినదే. కాబట్టి ముందుగా మన మాలోచించుకొనవలసిన విషయము: ఈ సంస్కరణమును హిందూ సభ్యతలో చొప్పించుట అవసరమా? ఇది మన కర్తవ్యమైనయెడల, చొప్పించుటకు మార్గ మెద్ది? ఈవిషయములలో వాదనలు రెండు తరగతులుగ భాగింపవచ్చును— (1) హేతువాదము (2) కులక్రమాగత మైన భావనవాదము.

హేతువాదము

(ఎ) చిన్నపిల్లలకు పెండ్లిండ్లు చేసినయెడల వారిలో గండములు మెండు గనుక వారికి వైధవ్యము రావచ్చును. కాబట్టి పురుషులకు ఇరువదియైదు సంవత్సరములకు పైన, పూర్వకాలములోవలెనే, పెండ్లి చేసిన యెడల, బాలవితంతువులు తగ్గుదురు. వధూవరులకు వయస్సులో మిగుల వ్యత్యాస ముండగూడదు గనుక, ఆడుపిల్లలకుం గూడ 18 సంవత్సరములు దాటిన తరువాతనే వివాహము చేయుట న్యాయము.

(బి) ఆడుపిల్లలకు 18 సంవత్సరముల తరువాతనే గర్భోత్పత్తి కలుగుట మంచిదనియు, ఈలోపుగ వారికి పురుషునితో సంసర్గము కలిగినయెడల వారి శరీరపాటవమునకు మిక్కిలి నష్టమనియు, బలశాలులగు పిల్లలు కలుగరనియు మన శారీరకశాస్త్రములు కూడ ఘోషించుచున్నవి. కనుక ఆడుపిల్లలు మేజర్లయిన తరువాతనే వివాహమాడవలెను.

(సి) సంఘాభివృద్ధికి స్త్రీవిద్య మూలము గనుక మగపిల్లలవలె, స్త్రీలకుకూడ కనీసము 18 సంవత్సరముల వయస్సు వచ్చువఱకైనను విద్య నేర్పినయెడల, వారు నిజముగా సంఘాభివృద్ధికి ఉపయోగింతురు. ఈలోపుగ వివాహముచేసినయెడల, వారి విద్యకు భంగము కలుగును. ఇప్పటి మిడిమిడి జ్ఞానమువలన స్త్రీల కింతమాత్రము లాభము లేదు.

(డి) ఆడుపిల్లలను బాగుగ చదివించి జ్ఞానవతులుగ చేసి వయసు వచ్చిన తరువాత పెండ్లిచేసినయెడల కన్యావరశుల్కములు మొదలగు దురాచారము లడుగంటును.

(ఇ) వివాహ సంబంధము మిక్కిలి పవిత్రమైనది, వధూవరులు యావజ్జీవము త్రెంపగూడనిది గనుకనే, వారియుభయుల యిష్టమునుబట్టి వివాహము చేయవలయును. ఇట్టి వివాహమునకు ఉభయులు మేజరులై యుండవలెను. స్వయంవరమే నిజమైన వివాహము. ఉభయులకు ఒండొరులయందు అత్యంతప్రేమ జనించుటకు వారు వివాహమునకు ముందు సమావేశమగుచుండు దినములే వారికి సుదినములు, ఎప్పటికిని మఱపురానివి.

(ఎఫ్) పురుషుడును, స్త్రీయును సమాన స్వాతంత్ర్యము అన్నివిషయములలోను కలిగియుండవలసినది. ఉభయులలోనుండు ఆత్మ ఒక్కటే. ఉభయులు సమానముగ జ్ఞానవంతులగుట యీశ్వరోద్దేశము. పురుషుడుగాని స్త్రీగాని తనయిష్టము వచ్చినపుడు వివాహము చేసికొనవచ్చును; లేదా పూర్తిగ మానివేసి బ్రహ్మచర్యమున నుండవచ్చును. వివాహము జరిగినతరువాత ఉభయులకు ఏకారణమువలననైనను, ఒకరియం దొకరికి అనిష్టము జనించినయెడల వారు తమవివాహబంధమును త్రెంపివేయవచ్చును. అట్లు వారి కధికారము లేనియెడల వారు యావజ్జీవము దుఃఖసముద్రము పాలగు

మనలో నైన వచ్చిన బాధలు కాకపోవచ్చుననియు, మన కనుశ్రుతముగ వచ్చుచున్న జాతీయభావనలనుబట్టి మన స్త్రీలు నడచుకొనెదరనియు కొందఱు చెప్పెదరు. ఇది కేవలము వారియూహ. మఱికొందఱు ఈ యూహతో నేకీభవింపక వివాహవిషయములలో కొంత సన్నవదలఁగానే క్రమక్రమముగ నన్నియు సదర్థకములు వాటిల్లునని అభిప్రాయపడుచున్నారు. హేతువాదము చేయువారు మనసంఘములో ఇప్పుడున్న కొన్ని యిబ్బందులను తొలఁగించి, మఱి కొన్ని బాధలను కలిగించుచున్నారు. ప్రతిసంఘములో కొన్ని యాచారములవలన కొన్ని కష్టము లుండుట తప్పదు. కనుక ఆ యాచారములను మార్చునపుడు, నూతనాచారములవలన నెక్కువ బాధలు కలుగవని చూపించుటకు హేతువాదులమీఁదనే ఋజువుభారము పడవలసియున్నది.

పన్నెండు సంవత్సరముల పిల్లను ఇరువది సంవత్సరముల వయసుగల పిల్లవానికి వివాహము చేయుచునే యున్నారు. నిషేకము మఱి నాలుగు సంవత్సరముల వఱకు ఆపినయెడల, ఎట్టి యిబ్బందులు తటస్థింపవు. ఈనాలుగుసంవత్సరములలో ఉభయులు పండుగలకు వచ్చుచు పోవుచుండుటచేత, ఒకరియెడల నొకరికి ప్రేమ వృద్ధియగుచు, గర్భాధానసమయమునకు వారు చిరపరిచితులుగా నుందురుగాని, ఘోషాలోనున్న మన క్షత్రియులు మొదలగువారిలోవలె ముక్కు మొగము మెఱుఁగనివారుగ నుండరు. మనము వివాహముచేసికొన్న వారిని మనచిన్నతనమునుండి ప్రేమించుటకు నేర్చుకొనెదము. పాశ్చాత్యులలో తమను ప్రేమించినవారినే వివాహము చేసికొనెదరు. ఈరెండు ఆచారములను బాగుగ గ్రహించిన నివేదిత యను పాశ్చాత్యస్త్రీ వ్రాసిన (Web of Indian Life) "భారతీయ జీవితతంతుసమితి" యను పుస్తకమును ప్రతివారును చదువవలయును. దానిలో మనయాచారమే యుత్కృష్టమని సహేతుకముగ వ్రాసియున్నది. కాబట్టి మనలో వియ్యంకులు బుద్ధిమంతులైనయెడల రజస్వలయైనను కాకపోయినను 12 సంవత్సరములు వచ్చిన తరువాత పెండ్లియైన తను బిడ్డకు మూఁడునాలుగు సంవత్సరములవఱకు నిషేకము నాపినయెడల బాల్యవివాహములవలన కలిగెడి యిబ్బందులు చాలభాగము తగ్గిపోవును. 12-వ సంవత్సరము మొదలు 16-వ సంవత్సరమువఱకు భార్యాభర్తలను వేఱుగ నుంచుట యేకారణమువలననైనను అనుచితమని తోఁచినపుడు గర్భాధానము జరిగింపవచ్చును. ఇది ఆయాకుటుంబములవారి స్త్రీలవంగసమును బట్టియు ఇంటిలో భయభక్తులను బట్టియు ఇంటికి వచ్చు సహవాసగాఢ్యమును బట్టియు నుండును.

ఈపైరెండువాదములను ఆలోచించుటకు మనలో ప్రతిశాఖవారును సభలుచేసి తీర్మానములు చేసికొనవలసియుండును. తుదకు, బ్రాహ్మణులందఱు అంతశ్శాఖాభేదమును పాటింపక సభ కూడి చర్చించుట యత్యవశ్యము. అట్లు చేయక వ్యక్తిస్వాతంత్ర్యముమీఁదనే యీసంఘసంస్కరణము నాధారపఱచినయెడల, తుదకు వ్యక్తులైన పిల్లను కులశీలములులేక వీధిలోపోవు నేరుఁబడ్డవానికో కట్టిపెట్టవలసివచ్చును. తగిన మర్యాదగల సంబంధములు దొరకవు. "కుల మేమి? మర్యాద యేమి?" యనువారికి ఈవాదముతో సంబంధమే లేదు. అట్టివారు తమ యాఁడుపిల్లలను పెంచి పెద్దవారినిచేసి బాగుగచదువుకొన్న బ్రాహ్మణేతరులకు ఇచ్చుటకుంగూడ సిద్ధపడవచ్చును. "కుల మెఱిగి కోడలిని తెచ్చుకొనవలయు" ననుసామెతప్రకారము నడచుకొనుట మంచిది కాని, సొమ్ము ఎల్లతోలు దర్జా మొదలగునవి యెంత మాత్రము పాటింపఁగూడదు. మాంసభక్షకులతో సంబంధము చేసికొనుట హేయము. బ్రాహ్మణులలోనుండి వెలిగాకుండ చేసికొనుట ముఖ్యము. ఒకవేళ వితంతువివాహములవలె వేఱుశాఖ నొక దానిని ఏర్పఱచుకొనవచ్చును. కాని, తండ్రిమధ్యావారి తనయుఁ డారాధ్యుఁడు—అనుసామెత ప్రకారము జరిగించినయెడల, ఎంతవఱకు అట్టి వివాహములు సౌఖ్యప్రదములుగా నుండునో మనము ఆలోచించుకొనవలెను.

హేతువాదముమీఁదను వ్యక్తిస్వాతంత్ర్యముమీఁదను ఆధారపడి వివాహములు జరిగించినయెడల,

ఎట్టి పాతివ్రత్యము రాదని నా యభిప్రాయమేగాని, కులక్రమాగతమైన భావనల నింకను చంపుకొనలేని నావంటివారు సాంఘిక నీతిసూత్రములను గమనించి, వివాహ విషయములలో సంస్కరణము ప్రారంభించెదరు. సంఘాచారములు చలిమిడి ముద్దలవలె మన యిష్టప్రకారము మార్చఁబడవు గనుక బ్రాహ్మణులమని గర్వపడఁదలఁచు కొన్నవారు అందఱు కూడి, ఎంతవఱకు కాలవశమున మార్పులు కావలసియున్నవో ఆలోచించుకొనుట ముఖ్యము. చట్టములు చేసికొన్నంత మాత్రముచేత ప్రయోజనము లేదు. మనలో కూడ క్రమక్రమముగ కులక్రమాగత భావనలు మాఱినకొలఁది మార్పులు చేసికొనవచ్చును. చిట్టచివరకు అద్వైతసిద్ధాంతము ననుసరించి, వర్ణాశ్రమభేదమును తొలఁగించి, విశ్వమానవకోటిలో భేదరాహిత్యమును గ్రహించి, ఆహారపదార్థములలోను వివాహములలోను ఇచ్ఛకు వచ్చినట్లు నడచుకొనుట కూడ తటస్థమునేమో!

రాజకీయ పరిశ్రామిక విషయములలో సంఘీభావ ముండవలసి యున్నప్పుడు, సాంఘిక విషయములలో సహకార మావశ్యకము కాదా! అడవిజాతుల నుండి సంఘము లేర్పడినవి. అవి క్రమముగా పెరిగినవి. నాగరికత ప్రబలినకొలఁది మతసూత్రములు, నీతిసూత్రములు, న్యాయసూత్రములు వృద్ధియగుచు వచ్చినవి. ఏసంఘమున కా సంఘము తనచుట్టు నున్న సంగతి సందర్భముల ననుసరించి పరిపూర్ణత వహించినది. కాని ప్రతిసంఘములోను చలనమున్నది. అవి మనకు తెలియకుండ మార్పుఁజెందుచునే యున్నవి. దూరము నుండి మనము నడచుచున్న ఒకపటాలమును చూచుచున్న యెడల, అది కొంతసేపటికిఁగాని చలించుచున్నట్లు కనఁబడదు; కాని దానిలోని ప్రతిపదాతుఁడు నడచుచునే యున్నాఁడు. మన సంఘాచారములు మతముతో సంబంధించినవగుటచేత, శీఘ్రముగ మన మనుకొన్న మార్పులు కానేరవు. అట్లని మనము తొందరపడి ప్రయోజనము లేదు. ఏమిచేయక యూరకుండుట కూడ ప్రయోజనకారి గాదు. సేన పోవుచుండఁగా, కొందఱు సిపాయీలు ముందుగానే పోయి శత్రువులు వచ్చుచున్నారేమో యని యెట్లు తెలిసికొనుచుందురో, అవిధముగనే మన సంఘములో కూడ ధైర్యశాలులు నూతనమార్గములను త్రొక్కుచుందురు. వా రవలంబించిన మార్గము సరియైనదని సంఘము గ్రహించినయెడల, అది వారిని తనలో చేర్చుకొనును, లేదా త్రోసివేయును. అట్టి సంఘసంస్కర్తలవలన మనము కొన్ని ఉపాయములను తెప్పించుకొనెదము.

మన మెంత వేదాంతులమైనను కులక్రమాగతమైన భావనల నతిసులభముగ త్యజింపలేము. చనిపోయిన భార్యచెల్లెలిని వివాహము చేసికొనుట తప్పుకాదని శాసన మేర్పఱచుటకు ఎన్ని సంవత్సరములు ఇంగ్లాండులో తగవులాడిరి? మన కీవిషయము ఎంత యాశ్చర్యమును కలిగించుచున్నది! పాశ్చాత్యులలోను మహమ్మదీయులలోను పినతండ్రి పెత్తండ్రి బిడ్డలను వివాహము చేసికొనెదరు. ఇది మన కెంతరోఁత కలిగించును! ఇట్టి వివాహములు మనలో వ్యాపింపఁజేయుటకు మనవారు శాసన నిర్మాణసభలో ఒక బిల్లును ప్రవేశపెట్టినయెడల మనలో నెంత గోల పుట్టును! హేతువాదమునుబట్టి దీనిలో తప్పేమున్నది? ఇష్టము వచ్చినవారు అట్టివివాహములు చేసికొనెదరు. అందఱును చేసికొమ్మని చెప్పినామా యని వాదింపఁ గూడదు? రజస్వలా వివాహములు శాస్త్రసమ్మతములు కావని నమ్మువారికి ఈ ప్రస్తుతపు బిల్లును గుఱించి అంత యనిష్టము కనఁబడుచుట ఒకవింత కాదు. కాఁబట్టి యీబిల్లునుకోరువారు కూడ హేతువాదములతో పూర్ణముగ నేకీభవింపక, సంఘసంస్కరణములో కొంతవఱకే వెళ్లెదమందురు కాని, పాశ్చాత్యాచారములుకూడ నని వాదింపరు. మతములోఁగాని, హిందూధర్మశాస్త్రములోఁగాని మార్పులు చేయఁదల్లరు; వర్ణాశ్రమ భేదములుండవలెనందురు; మనవారివనుసలు మాఱఁగూడదందురు; మతమును త్యజింపలేరు; సంధ్యావందనము కూడ చేయకపోయినను, యజ్ఞోపవీతము త్యజింపలేరు; ఇంత యేల, కులక్రమాగతమైన భావనలను చంపుకొన

# అస్తమయము

రాయప్రోలు సుబ్బారావుగారు

వాడిన తలపూలతోడ నాశ్రమతరుల్ లేతకొమ్మలు కదలింప నేల?
ఉదయగీతులు పాడు సదనశకుంతముల్ గద్గదశ్రుతుల మూల్గంగ నేల?
పొడచూచున్న సవితృముఖబింబమును గప్పి కాఱుమబ్బులు వ్రేలుకాడ నేల?
కులుకులొలికెడు జాగుడులాడు కయ్యారల్ కదలక యెచటనో యొరుగ నేల?
శాంతిచే సవ్యరాగనితాంతమయిన
సుప్రభాత మిప్పటి కశాంతిచేఁ దొరంగి
మాయలముసుగు గీలించిన ట్లయిన దేల?
కలుగదుగద! దేశారిష్టకమ్ము? కృష్ణ! 1

ఉ. భారతవీరపుత్రులు ప్రవాసమునందును, బ్రిటీషు రాజ్యసే
వారతి, దిక్కుదేశక్షేత్రములు భ్రాంతుల నెత్తురుకండ లిచ్చుచు
న్నారు; హసింపనున్న తరుణంబున నేటికి మోసము నాసె నీ
ధారుణి? కయ్యో! తెల్లసరదార్ల ప్రమాదముఁ ద్రోసి మెచ్చఁగన్. 2

ఉ. పచ్చని పంట్లతోటలను భాగ్యపదం బగు పైరుపచ్చలన్
విచ్చిన భోగగర్వ మగు వెల్లియ మక్కటా! పాపనైరిచే
వెచ్చని నెత్తురుం దడిసి బీడయిపోయె; నటుల్ మహాపదల్
హెచ్చుపుగా మతచ్చలవిడీ! రణరక్తవివాహవేదిచేన్. 3

మ. * అనుచున్ భావనసైని భావన మహాహల్ కేది యొదన్, వినా
తనశాఖాహసితాశ్రమద్రుమసమృద్ధిచ్ఛాయలం బోయితే;
వినిచెన్ సోకులమర్త్యదేహగమాతనిర్భిన్నాత్మహాహాకుల
స్వనముల్ గాంధికుమారసర్గములపజ్ఞంబట్టి యంతన్ విధీ! 4

(స్మృతి)

సీ. జనియించినావు! పావనమహారాష్ట్రఖండమునందు శ్రీచందనమువిధాన,
చవిచూచినావు! శైశవమాది దేశసేవానందరుచిఁ జనుఁబాలలీల,
సహియించినావు! దూషణభూషణాలు నిశాదినములు చాలనైతివనీతి,
ప్రకటించినావు! పాలకపాలితాదర్శములు మూలయుధ యగ్రములను బోలె,
ధన్యమొనరించితివి జీవితమ్ము! కృష్ణ!
కీర్తికన్యక యింక మేలగింపఁగలదు
భూభువనవీణ నీగుణమ్ములను బాడ,
పురుషగుణసాంద్ర! గోకలేపూర్ణచంద్ర! 5

* శాంతినికేతనమునందు వ్రాయబడినది. విషాదవార్త ప్రప్రథమమున గాంధి కందినది. ఈ యాశ్రమమందు వారుండుభాగము ప్రాగుత్తరదిశాకోణము.

సీ. విప్పి చెప్పితివి వెల్బీకమీషనుముందు భారతవర్ష దుర్వ్యయభరంబు;
సాహసించితివి కర్జనుసంతవానితో రాజ్యతంత్రములం బోరాట సలుప;
స్థాపించితివి భ్రాతృజనజాగ్రదాదర్శ మయిన భారతసేవ శాలయమ్ము
కల్పించితివి మహాత్మగర్భసంతానమ్ము లుచితవిద్యాభాగ్య మొందునాస;
మనసు వాక్కును గాయమ్ము ననవరతము
చిరదురంతపరిశ్రమం జిదికి చిదికి
సిరసిరయుపో! తుది భారవ్రాసి
నావె? నవ్వుచు 'అస్థిప్రాణాలు' కృష్ణ! 6

సీ. దొర లందగించిన బిరుదుమోజునం ద్రుళ్లి నాయకధర్మంబుం బాయలేదు;
ప్రభువుల విశ్వాసపదవి నెక్కి, దుర్నీతిం బ్రజలహితము భంగపఱుపలేదు;
స్వార్థలోభమునం గపటనాటకము లాడి తల్లికడుపు చెఱం దలంపలేదు;
సమయసేతిం ద్వేషించి సంక్షోభ విజేపడ, కలహాకినాటముల్ కడపలేదు;
నీతిచాతుర్యమును, స్తవనీయ మయిన
దేశసేవనదీక్షయుం దీర్చినావు
యోగిప్రాలెను ఫలనిస్స్పృహుండవగుచు
మేలుకీర్తి సహించి గోపాలకృష్ణ!

చ. తొలంగిన యున్నతాసన, మధోగతిం బడ్డ శిరోవిభూషణా
వళియు నుదాత్తదృష్టిపరిపాకముచేం గని, భస్మసుస్తవ
హిమ్మలతీకమాద్రి మార్పసిన యీ మహదార్యకుమారపాళి మే
ల్కొలిపితి దేశపూజకొఱకున్! జననాయక! గోకులాగ్రణీ! 8

చ. మలినము లేని వృత్తిముం బ్రమాణముగాంగను మాకుం జూపి, యు
స్ఖలితపు దేశభక్తిలతికన్ మనసారంగ నాటినావు ని
ర్మల మగు నిందుచెన్నెనముమున్ నలినింబలెం; గాని పూలనే
నెలం దలందూంగు భాగ్యసరణిం దిలకింపక పోయి తక్కటా! 9

చ. కలంగి కృశించియున్న లతికామణి తాం గడసారిపూల న
ర్మిలి ననలత్మ్మకిచ్చెను శమించువిధమ్ములన, వాడి వాడి శో
షిలిన శరీరబుద్ధిబలజీవములం గడ కొక్కటొక్కటే
నిలిపితివయ్య! దేశజననీపదసన్నిధిం బ్రాణపూజగన్. 10

మ. స్థిరమై లాలన లొందు నాభరతమాతృప్రేమపూర్ణాంకస్థం
దరభాగమ్మునం దావకాత్మ! ననసీతస్నిగ్ధముగ్ధాకృతిన్
చిఱునవ్వల్ వెలుంగం బుల్లవించు జననీసామ్రాజ్యసేవావ్రతాం
కురముల్ జాతువుగాత! గోకులమణీ! గోపాలకృష్ణాగ్రణీ! 11

# దేశచరిత్ర—నవలలు

తణికెళ్ల వీరభద్రుడుగారు, బి. ఏ. (ఆనర్సు)

స్వదేశచరిత్రను నేర్చియుండుట ప్రతిమనుజునకు నత్యావశ్యకము. అట్టి దేశచరిత్రాపరిజ్ఞానము దేశాభ్యుదయమునకు మిక్కిలి సహాకారి. పూర్వమం దెట్టి వీరప్రధానులు మన మాతృదేశము నలంకరించిరో, ఏయే రాజ్యము లభివృద్ధి చెందెనో, వాని నెంతటి మహాచక్రవర్తులు పాలించిరో తెలిసియుండుట సంతోషదాయకము. అంతే కాక, అట్టి పుణ్యదేశమున కేల యిట్టి క్షీణదశ యబ్బెనో గ్రహించుట మిక్కిలి యుపయోగకారి. మన ప్రాచీనుల ఘనతను గూర్చి వినినప్పుడును, హైందవవీరుల పరాక్రమమును ఆర్యవనితల మానరక్షణమును దేశభక్తుల స్వార్థత్యాగమును గుఱించి చదివినప్పుడును, ఒడలు పులకరించి మనయం దొక నూతనశక్తి జనించును. ఇట్టి మహాపురుషుల సంతతివార మని మది యుప్పొంగ, మన జాతీయాభివృద్ధి కవకాశము కల దని యాశ పుట్టి, ఆత్మశక్తియం దొక వింతనమ్మకము కలుగును. ఆ యాత్మవిశ్వాసమునకును దేశాభ్యుదయమునకును పరస్పరసంబంధము కలదు. అట్టి స్వజాతీయవిశ్వాస ముద్భవించినపుడే మనకు మన ప్రాచీనుల పావనచరితములందు మఱింత కౌతూహలము కల్గుటయు, మనము సదా వారి నామోచ్చారణము సేయుచు హృదయములందు నూతన బీజములు నాటుటయు తటస్థించును. ఆధునికాంధ్రదేశస్థితిని గూర్చి యించుకసేపు సమాలోచనసేయువారికి 16-వ శతాబ్దమందు ఇంగ్లాండుదేశ మెట్లుండెనో జ్ఞప్తికి రాకమానదు. ఆంగ్లదేశము పరరాష్ట్రములతో పోరు సల్పుచు, స్వదేశరక్షణమునందు ప్రాణత్యాగమున కుద్యుక్తులయిన యాంగ్లేయులు తమ దార్ఢ్యమునుగూర్చి సంతసించునపుడు, వారికి తమ పూర్వికుల చరిత్రములు వినవలె నని యాశ వొడమిటయు, కవీశ్వరులును నాటకకర్తలును సమయము చూచి గ్రంథములను వ్రాసి దేశచరిత్రను నేర్పి, దేశభక్తిని హెచ్చించుటయు మనకు తెలిసిన యంశమే. అవ్విధముననే మన యాంధ్రదేశమందుఁ గూడ స్వదేశచరిత్రను తెలిసికొనవలె నని మితిలేని యాతురత జనించినది. ఇట్టి పిపాసమునకు చికిత్స యేది యన, తగిన గ్రంథములు చరిత్రలు వ్రాయఁబడుటయు, మన ప్రాచీనుల పరాక్రమాది పుణ్యగుణములు వేనోళ్ళ ఘోషింపఁబడుటయు తప్ప, వేఱు లేదు.

దేశచరిత్రను ప్రజకు వాఙ్మయరూపమున తెలియఁజేయుట త్రివిధము. ఏదో యొక మహాపురుని సాహసకృత్యము గాని, యొకానొక యుద్ధము గాని వర్ణించి పద్యకావ్యము వ్రాయవచ్చును. అట్టి కావ్యము లింగ్లీషులో వాల్టరు స్కాటు అను దేశభక్తుఁ డొకఁడు వ్రాసెను గాని మన భాషయం దున్నట్టు గాన్పింపవు. శివాజీవంటి మహారాజుయొక్క గాని, పద్మినివంటి మహాపతివ్రతయొక్క గాని పవిత్రచరిత్రము కథగాఁ గల కావ్యము హృదయమును రంజింప, మన మనస్సు పరిశుద్ధత నొంది యొకింతసేపు ప్రాపంచికవిషయముల మఱచుటయు, మనయం దొకవిధమయిన భక్తి జనించుటయు, మన ప్రతినాళమందును పవిత్రరక్తము ప్రవహించుటయు సహజము. చరిత్రను చిన్న కథలుగాఁ దీసి కావ్యములు రచించుటకు నాటకములును నవలలును నుచితములు. నాటకమునకును నవలకును నొక భేదము గమనింపవలెను. నవలయందు గ్రంథకర్త తానే కథను జెప్పును; పాత్రములను వర్ణించి తన యభిప్రాయమును వెల్లడిచేయుచుండును. నాటకమం దన్ననో గ్రంథకర్త మనకు గోచరము కాఁడు; అతని యభిప్రాయము గ్రహింపవలసినదే కాని తనంతట తాను తెలియఁజేయఁడు. పాత్రలు చేయు కార్యములను బట్టియు వా రాడు పల్కులను బట్టియు మనము పాత్రసంపోషణక్రమము నెఱుఁగఁగలము. నాటకకర్త ప్రతివిషయమును ప్రత్యక్షముగా రంగస్థలమున చూపును. నవలాకారుఁ డయినచో నొకానొకపురుషునిఁ గాని, పట్టణమును గాని వర్ణించినపుడు ప్రతివిషయమును విశదముగా చెప్పవలెను. ఇట్టి భేదములు కొన్ని యున్నను మనము నవలలను నాటకములను ప్రస్తుతసందర్భమున సమదృష్టితోఁ జూడవచ్చును. నవలయందయినను ఒకపురుషునిఁ గాని యొకస్థితిని గాని వర్ణించునపుడు గ్రంథకర్త దానిని జాగరూకతతో చిత్రించి, నాటకరంగస్థలమున దిదృక్షుఁ డేలాగు పాత్రమును గాని మఱి పట్టణమును గాని చూడఁగలుగునో యావిధముననే పాఠకుఁడు తన మానసికనేత్రముతో స్పష్టముగా చూడఁగల్గులాగున వర్ణింపవలెను. అట్టి వర్ణనమును నాటకోచిత మని చెప్పవచ్చును. ఈ నడుమ ప్రకటింపఁబడిన "విజయనగరసామ్రాజ్యము" లోని వర్ణనలు చిత్రముగాను స్వాభావికముగాను నున్నవి. జగన్మోహిని విజయసింహుల పరస్పరప్రేమమును జ్ఞప్తియం దుంచుకొని యీ క్రింది వాక్యములను తిలకింపుఁడు:—

> "అంత నామె కన్నులయందలి బాష్పములు మౌక్తికజాలములవలెఁ గ్రిందఁ బడఁజొచ్చెను. దాని మన విజయసింహుఁడు కనిపెట్టెను. అతని హృదయము [illegible]. అతని కేమియుఁ [illegible] లేదు, [illegible] చేయుటకు ప్రయత్నించ లేదు. కాని [illegible] జగన్మోహిని కనులను [illegible]. [illegible] ప్రకాశించుచున్న [illegible] ప్రకాశింపఁజొచ్చెను, అతని హృదయము [illegible]. అతనికి [illegible] స్మృతి లేదు. [illegible] యుండెను. [illegible] ప్రయత్నించెను, కాని [illegible]." [పుట [illegible]]

ఇట్టి వర్ణనమే నాటకోచితము. ఆ సుందరుఁడు జగన్మోహిని కనులను రుమాలుతోఁ దుడుచుటయు వారు మాటాడలేక చేష్టలు దక్కి బొమ్మలవలె నిలువఁబడుటయు రంగస్థలమందలి ప్రదర్శనమువలె స్పష్టముగా కండ్లయెదుట కాన్పించుచున్నది. ఈ శైలి పౌలస్త్య

మేమి! ఈ వర్ణన మెంత స్వాభావికము! దీర్ఘసమాసములును పదగుంభనమ్మును శైలి యగు నని యూహించు జను లెంతటి వెఱ్ఱివారు!

చరిత్రగ్రంథములు కావ్యము లనిపించుకొనుట కొకగుణము ముఖ్యముగాఁ గావలసియున్నది. దానినే మనము కవన మని పిలువవచ్చును. కవన మున్నచోఁ గావ్య మగును. ఈ కవితాచమత్కృతియే ప్రతిగ్రంథమునకును ప్రాణము. చరిత్రలయందుఁ గల, చెప్పిన యంశములు పట్టి పొడిమాటలతోఁ జెప్పక, ఉపమానాద్యలంకారములు గల శైలితో హృదయరంజకముగా వర్ణించినచో నట్టి గ్రంథము రసపూరిత మగును. మఱియు దేశచరిత్రయందు విఖ్యాతి చెందిన యొకానొకపురుషుఁడు వర్ణింపఁబడినను, మనుష్యమానసము చిత్రింపఁబడి మానవునకు రక్షణోపాయము చూపఁబడినను, అట్టి గ్రంథము కావ్యమే యగును. అందుచేత నవలలు కావ్యములు కావచ్చును గాని చరిత్ర లన్నియు కావ్యములు కావు. విమలాదేవి యను నవల ఔరంగజేబు జీవిత చరిత్రను కొంతవఱకు తెలియఁజేసిన మాట వాస్తవము. ఆ నవలయం దితరసుగుణములు కలవు గనుక నే యది కావ్యమయినది కాని ఔరంగజేబు చరిత్రను గూర్చి వ్రాయఁబడిన పుస్తకము లన్నియు కావ్యములా?

చరిత్రనవలలను మూడు తరగతులుగా భాగింపవచ్చును. (1) చరిత్రయే కథాభాగముగాఁ గలవి కొన్ని. వానియందు చరిత్రాంశములకు దప్ప మాఱువిషయములకు చో టుండదు. (2) మఱికొన్ని నవలలు పేరునకు మాత్రము చరిత్రాత్మకములు గాని నిజముగా శృంగారము ప్రేమ మొదలగు నంశములే వాని కథాభాగముగా నేర్పడును. చరిత్రాంశము పట్టి విషయమే కాని నవలాకారుని దృష్టి యంతయు జన్యసుల యనురాగమును వారిసౌఖ్యమును గూర్చియే యుండును. హూణభాషయందు వాల్టరు స్కాటుయొక్క నవల లిట్టివియే. "హేమలత" యందలి కథ రాజపుత్రస్థానచరిత్ర యయినను, హేమలతాజయసింహుల ప్రేమానుబంధమే ముఖ్యముగాఁ దోఁచును. (3) మఱికొన్ని నవలలందు, చరిత్రాంశము ముఖ్యమయినను, ఇతరకథలు నితరవిషయములును లేకపోవు; చరిత్రయే ముఖ్యభాగముగా నేర్పడును. "విమలాదేవి" "రాణీసంయుక్త" "సగుణ" "విజయనగర సామ్రాజ్యము"— ఇవి యట్టి వని చెప్పవచ్చును. విమలాదేవియందు విమలావిజయసింహుల ప్రేమయు, ఇందిరాదేవి చమత్కృతులును మిక్కిలి యానందమును గల్పించును గాని మొగలాయి చక్రవర్తితో రజపుత్రవీరులు పోరు సల్పిన విధమును, ఆ క్షత్రియమహారాణాలు తమ స్వాతంత్ర్యమును గాపాడుకొనిన విధమును నవలయందలి ముఖ్యాంశ మని చెప్పుటకు సందేహ మేమి? మఱియు విజయనగరసామ్రాజ్యమందు ఆంధ్రసామ్రాజ్యమును ఆంధ్రపరాక్రమమును ఆంధ్రదేశభక్తియు వర్ణించుటయే గ్రంథకారుని ముఖ్యాభిప్రాయ మని తోఁచును. కథను రెండుభాగములుగా విభజింపవచ్చును. రామరాజును తురుష్కులు మోసపుచ్చుట కెన్ని కపటోపాయములఁ బన్నిరో, వారిబారినుండి చక్రవర్తిని దప్పించుట కాతని మిత్రు లెట్లు స్వార్థత్యాగము చేసిరో, తుద కట్టిసామ్రాజ్య మస్తమించెనో కథకు ముఖ్యభాగము. జగన్మోహినీవిజయసింహులకును, స్వర్ణకుమారీ రాధాకుమారులకును గల ప్రేమానుబంధము రెండవభాగమయి యున్నది. ఈ రెండుకథలకును పరస్పరసంబంధము కలదు. అది యంతయు నేల? ఆంధ్రుల యౌన్నత్యమును శౌర్యమును బాహుపరాక్రమమును శ్లాఘించుటయే గ్రంథకర్త ముఖ్యోద్దేశ మయినచో, సదా దేశాభిమానము గలిగి తమ భర్తలను ఆంధ్రమాతసేవకయి స్వార్థత్యాగము సేయు మని పురికొల్పుచు పురుషవేషముతో యుద్ధభూమికి తామును బోయి తమ నాథులవెంటఁ దోడునీడవలెఁ దిరుగుచు, వారితోఁ గూడు శత్రుక్షయము సేయుచు, తుదకు వారితో నేకకాలమందే సమరరంగమునఁ బ్రాణములు విడిచిన యా వీరవనితల చరిత్ర నవలాకారుని ప్రధానోద్దేశమునకు భిన్నము కాదే! ఆంధ్రయువజనులే కాక యువతులు కూడ మానరక్షణమందును దేశరక్షణమందును ప్రాణములు గోల్పోయి రను విషయము కవి ప్రథమోద్దేశమునకు సహకారి యయి యాంధ్రశౌర్యమును వేనోళ్లఁ జాటుచున్నది.

చరిత్రాత్మక మగు నవల వ్రాయునపు డొక విషయము మఱువఁదగినది కాదు. గ్రంథకర్త దేశచరిత్రను నాట్యరూపమున దేశీయులకుఁ గనుపడుటయే యుద్దేశముగా నూహించినచో దేశచరిత్ర ననుసరించియే వ్రాయుట మంచిది. ముఖ్యాంశములు చరిత్రాధారముల ననుసరించి వర్ణించవలెను; కొన్ని చిల్లరమార్పులను స్వాతంత్ర్యముతో చేయవచ్చును. కథను రసవంతముగా చేయుటకు కొన్ని విషయములను మార్పవలసివచ్చును. కాని మన యభిప్రాయమును బట్టి చరిత్రను మార్పఁగూడదు. ప్లాసీయుద్ధమును గూర్చి నవల వ్రాయునెడల సురాజాదౌలాను దూషింపవలసియుండును. క్లైవు సాహసవంతుఁ డనియు సురాజాదౌలా దుర్మార్గుఁ డనియు నెల్లరకును తెలిసిన యంశమే. కాని క్లైవునందుఁ గల యభిమానముచే నతని లోపములను గుణము లనవచ్చునా? బ్రిటీషు ప్రభువులు వచ్చుటచే దేశము వృద్ధిచెందెను గాని మీర్జాఫరు తనరాజును మోసపుచ్చుటను గప్పిపుచ్చవచ్చునా? మనకు చరిత్రాజ్ఞానము ప్రధాన మయినది కనుక, సాధ్య మయినంతవఱకు చరిత్రభాగమును కథలో నింపుట మంచిది. సగుణ యను నవల యొకటి నూతనముగా ప్రకటింపఁబడినది. కథ మహారాష్ట్రదేశపుచరిత్ర. 19వ శతాబ్దమునందలి మహారాష్ట్రదేశస్థితియు, మహారాష్ట్రప్రముఖులు హోల్కారు, సింధియా, బాజీరావు మొదలగువారి చరిత్రములును పూర్తిగా నందు చర్చింపఁబడినవి. ఆ నవలయం దితరకథలు లేక పోలేదు. సగుణకును పాండురంగహరికిని గల యనురాగము ముఖ్య మయినది. అది కాక నలసీనరల హాస్యరసము కూడ ఆనవలయందుఁ గలదు. ఫుల్లా యను తురుష్కసాధుని చేష్టలును, వానిచరిత్రమును మనకు హాస్యమును గలుగఁజేయును గాని యతఁడు ప్రధానకథకు కూడ నావశ్యక మయిన పాత్రమే. షేక్స్పియరు కవిసార్వభౌమునిచే రచియింపఁబడిన చరిత్రనాటకముల పద్ధతి పరికించిన వారి కీసంగతి బోధపడఁగలదు. నాల్గవ హెన్రీ నాటకమున రెండు

# ఆంధ్రోద్యమతత్త్వము

చల్లా శేషగిరిరావు, బి. ఏ. గారు

**ఆంధ్రోద్యమము** నాంధ్రులే గాక యాంధ్రేతరులు గూడ ఆమోదించుట సంతోషదాయకము. అట్టివారిలో ముఖ్యులును విద్వాంసులు నగు శ్రీధర వేంకటేశ కేట్కారు, ఎమ్. ఏ., పి. హెచ్. డి. గారు ఆంధ్రోద్యమమునకు చేయుచున్న సాహాయ్య మమూల్యము. వీరు మహారాష్ట్ర బ్రాహ్మణులు. వీరు గొప్ప సంస్కృతవిద్వాంసులు; అమెరికాదేశములో విద్య నభ్యసించి సాంఘికశాస్త్రమునందు డాక్టరు బిరుదును సంపాదించి ఘనతచెందినవారు. ఆంధ్రోద్యమ మేసూత్రమువలన హైందవజాతీయతకు తోడ్పడునో యాసూత్రము నాంధ్రదేశమం దంతటను బోధించుచున్నారు. వారి సిద్ధాంతములోని వివరము లన్నిటితోను మన మేకీభవింపవలసిన పని లేదు. మూలసూత్రములు మాత్ర మిక్కడ వ్రాసెదను.

హిందూదేశములోని జనసామాన్య మంతయు దేశభాషల నుపయోగించుచున్నారు. వారు రెండవ భాష నభ్యసింపరు. హిందీ గాని యాంగ్లేయభాష గాని జనసామాన్యమునకు సామాన్యభాష కానేరదు. విద్యాధికులు మాత్రమే రెండు మూడు భాషల నభ్యసించెదరు. జనసామాన్యమునకు జ్ఞానాభివృద్ధి గావలయు ననిన, దేశ భాషలలోనే విద్యను బోధింపవలయును. పాశ్చాత్యవిజ్ఞాన మంతయు భాషాంతరీకరణము ద్వారా జనసామాన్యమున కందుబాటు చేయవలయును. అటులే సంస్కృతములో నున్న మన పూర్వుల జ్ఞాన మంతయు దేశీయులకు తెలియునట్లు చేయవలయును. విద్యను దేశభాషలలోనే కఱపినచో, అన్యభాష నభ్యసించుటకు వలయు దీర్ఘకాల మంతయు జ్ఞానసముపార్జననిమిత్త ముపయోగింపవచ్చును. జపాను దేశ మటులే వృద్ధిపొందినది. దేశభాషల నశింపజేసి యేకజాతీయతను పెంపొందింపజేయగలుగుదు మను దురూహ కేవలము భ్రమ. పెక్కువేల వత్సరముల నుండి దేశభాషలు పెంపొంది, యనేకమైన యుద్గ్రంథము లాభాషలలో వ్రాయబడి, యావాఙ్మయజ్ఞాన మంతయు దేశీయుల మనంబులలో జీర్ణమయిన కాలమునందు, భాషలను నిర్మూలింపజేసి యేకభాషను దేశమం దంతటను వ్యాపింపజేయగలుగుదు మనుటకంటె వెఱ్ఱితలంపు కలుగనేరదు. దేశభాషల యభివృద్ధి మూలముననే దేశీయులు జ్ఞానాభివృద్ధి గాంచుట సాధ్యము. ఎన్ని దినములు దేశభాషలను నిరసించి యాంగ్లేయభాష మీదనే మన దృష్టిని నిలిపెదమో యంతవఱకును దేశీయు లజ్ఞానాంధకారములో మునిగియుండుట నిశ్చయము. ఇదివఱకు మనము చేసిన లోప మిదియే. కాంగ్రెసులు, కాన్ఫరెన్సులు, విశ్వవిద్యాలయములు, ఏవియు దేశీయులను నిద్రనుండి మేలుకొలిపియుండలేదు. దేశభాష లభివృద్ధి పొందవలయు ననిన, విశ్వవిద్యాలయములలో దేశభాష ప్రముఖత వహింపవలయును. అపుడు ప్రముఖ మగు ప్రతి దేశభాషకును ప్రత్యేక విశ్వవిద్యాలయ ముండవలెను. హిందూదేశములోని ముఖ్యమగు దేశభాషలను మదింపువేయగా, పదునారని తేలినది. ముప్పది కోట్ల జనము గల దేశమందు పదునారు విశ్వవిద్యాలయము లుండుట యాశ్చర్యకరము గాదు. కాననే యాంధ్రభాషను పోషించుటకై యాంధ్ర విశ్వవిద్యాలయ మావశ్యకము.

ప్రజలకును దొరతనమువారికిని ఐకమత్య మభివృద్ధి గావలె ననిన, సర్కారుద్యోగులు దేశభాషలను నేర్చుకొనవలయును. పరిపాలన మంతయు దేశభాషలలోనే జరగవలయును. దొరతన మపుడే దేశీయుల యంగీకారముపై నాధారపడియుండును. ప్రజలు రాజ్యతంత్రమును గ్రహించెదరు. వారి రాజభక్తి నిర్హేతుకము గాక, సహేతుక మగును. జనులు తమకష్టనిష్ఠురములు దొరతనమువారికి తామే నివేదించుకొన సమర్థత గలిగియుండెదరు. ఎవరో యాంగ్లేయ విద్యాధికులు తమ స్వలాభము నిమిత్తము రాజకీయాందోళనము జరగించుచున్నా రనెడి యపవాదమున కెడ ముండదు. కోర్టులోని వ్యాజ్యెముల గ్రంథ మంతయు దేశభాషలలోనే జరగవలయును. సర్కారు ఉత్తరవు లన్నియు దేశభాషలలోనే ప్రచురింపబడవలయును. జనసామాన్య మంతయు పరిపాలనమందు శ్రద్ధ దీసికొనుటకు రాజ

కీయవ్యవహార మంతయు దేశభాషలలో జరుగుటకంటె మార్గము వేఱే లేదు.

పరిపాలన దేశభాషలో జరగవలయు ననిన పరిపాలనాభాగ మంతటిలో నేకభాష మాటలాడు ప్రజ లుండవలెను. అనఁగా దేశ మంతయు భాషలను బట్టి విభజింపవలెను. ఆ కారణమును బట్టియే యాంధ్రులకు ప్రత్యేకరాష్ట్ర ముండవలెను. ప్రత్యేకరాష్ట్రము పాలకులకును పాలితులకును గూడ నవసరమే. పాలకు లనేక దేశభాషల నభ్యసించుట దుష్కరము. పాలితులు దేశభాషలోనే తమ వ్యవహారములు జరపుకొనుటకు వీ లేర్పడును.

భాషలను బట్టి రాష్ట్రములను విభజించుటవలననే హార్డింజ ప్రభువు సూచించిన స్థానికస్వపరిపాలనాస్వాతంత్ర్యము సత్యము కాఁగలదు. అట్టి విభజన లేనిచో ప్రతిరాష్ట్రము నేకలక్షణము గల యొక యంగము కానేరదు. భాషాప్రయుక్తరాష్ట్రవిభాగమువలన హైందవజాతి సంయుక్తజాతి యగు నను సూచన కనఁబడుచున్నది. భిన్నజాతులు బలపడినచో, అవి యన్నియుఁ గలసి బలమైన సంయుక్తజాతి యగుటకు మార్గ మేర్పడును. హైందవజాతీయత యపుడే సాధ్యపడును. హైందవజాతి యెన్నడును నేకలక్షణము గల జాతి కానేరదు. ఆంధ్రాభివృద్ధికి ఆంధ్రరాష్ట్రము ప్రధానము. ప్రత్యేక విశ్వవిద్యాలయమును లభించుటకును పరిపాలన దేశభాషలో జరగుటకును ప్రత్యేకరాష్ట్ర మావశ్యకము. మతభేదములు, మహమ్మదీయ సమస్య—వీని నెట్లు దాఁటవచ్చు నను ప్రశ్నకు జవా బొసంగఁబడుచున్నది. భాషాభిమానము మతమువలన కలిగెడియీర్ష్యలను పోఁగొట్టవలెను. మత మభిప్రాయముక్రింద మాఱవలెను. జాతీయతకు భంగము రాకుండ మతవిశ్వాసములను కాపాడవలెను. హిందూమత మను ప్రత్యేక మతము లేదు. మొదటినుండి 'హిందూ' యను శబ్దము రాజకీయసంబంధ మైనది. అందువలన హిందువు లన్న మహమ్మదీయులకు కోప మక్కఱలేదు. దేశభాషాప్రాముఖ్యమువలన మహమ్మదీయులు గూడ దేశభాష నభ్యసింతురు. ఏ రాష్ట్రములోనివా రారాష్ట్రభాషను నేర్చుకొనెదరు. వారికి క్రమముగా రాష్ట్రాభిమాన మేర్పడును. పరదేశ మగు టర్కీయెడ వారి యభిమానము తగ్గును. స్వదేశాభిమానము వృద్ధియగును. ఇది గాక యీ దేశములోని జనులే విశేషముగ మహమ్మదీయ మతము స్వీకరించినారు. కాన వారికి దేశభాష నభ్యసించుటకు కష్ట మేమియు కలుగఁబోదు. భాషాభిమానము వారికి కలిగినచో, హైందవజాతిలో వారును మిళిత మగుదురు. ఆంధ్రమహమ్మదీయులకు ఆంధ్రభాషయం దభిమాన మెక్కువగ కలుగును. వంగమహమ్మదీయులు వంగభాషాభిమానము చూపుదురు. క్రైస్తవులు దేశభాషలనే యుపయోగింతురు. ఆంధ్రక్రైస్తవు లాంధ్రభాషనే యుపయోగించుచున్నారు. వారికి భాషాభిమానము హెచ్చినవెంటనే యాంధ్రజాతికి బలము గూర్చెదరు. వారికిఁ గూడ హిందూ శబ్దార్థము తెలిపి యాంధ్రాభిమానమును వారిలో కలిగింపవలెను. ఆంధ్రదేశములోనివా రందఱు నాంధ్రుల మని పిలుచుకొనుటకు గర్వపడవలెను. "నేను ఆంధ్రుఁడను, నాది ఆంధ్రదేశము" అని ప్రతియాంధ్రుఁడును స్మరించుకొనుచు తనదేశము నభివృద్ధి చేసికొనవలెను.

ఆంధ్రోద్యమమునకు పునాది యాంధ్రరాష్ట్రము. ఆంధ్రరాష్ట్ర మాంధ్రుల నైకమత్యమునకును శీఘ్రాభివృద్ధికిని తప్పక చేయూఁత నొసఁగును. ద్వితీయాంధ్రమహాజనసభలో ఆంధ్రరాష్ట్రము వాంఛనీయ మని తీర్మానింపఁబడినది. తృతీయాంధ్రమహాజనసభలో ఆంధ్రరాష్ట్ర మావశ్యక మనియు యుక్త మనియు తీర్మానింపఁబడినది. ఆంధ్రనాయకు లందఱు, గౌరవనీయులగు శాసనసభా సభ్యులకూఁ గూడ, ఈతీర్మాన మైకకంఠ్యముగ నామోదించిరి. ఇది యంతయు శుభసూచకము, ఉత్సాహజనకము. కాని యాంధ్రు లింకను గట్టి యత్నములు చేయవలయును. ఆంధ్రోద్యమముయొక్క ముఖ్యసూత్రములు గ్రహింపవలయును. శాస్త్రి రుకేశ్వరుగారు నెలవిచ్చిన ప్రకార మవి మూఁడు:—

(1) భాషలనుబట్టి దేశమును విభజించుట, ఆంధ్రరాష్ట్ర మేర్పఱచుట.

(2) దేశభాషలలో విద్య నేర్పుట. అందుకొఱకై భాషలను బట్టి విశ్వవిద్యాలయము లేర్పఱచుట. ఆ మార్గమును బట్టియే యాంధ్రవిశ్వవిద్యాలయ మేర్పఱచుట యవసరము.

(3) పరిపాలన మంతయు దేశభాషలలోనే జరపుట.

ఆంధ్రోద్యమ మీ మూలసూత్రములమీఁద నాధారపడియున్నది. ఈ తత్త్వమును దేశీయు లందఱు గ్రహించెదరుగాక!

# మన గొప్ప దురవస్థ — దానిని తొలఁగించు నుపాయము

ఏ. నంజుండప్ప, బి. ఏ., బి. ఎల్. గారు

ఈ కాలమున లోకమునం దనేక విషయములలో మార్పులు గలుగ నారంభించియున్నవి. శాస్త్రజ్ఞులచే క్రొత్తక్రొత్త పద్ధతులు కనిపెట్టఁబడుచున్నవి. ప్రజలకు ప్రయోజనకరములగు వివిధయంత్రములు, సాధనములు కల్పింపఁబడుచున్నవి. వ్యవసాయము, వస్తుపరిశోధన, శరీరారోగ్యము, విద్యాభివృద్ధి, జ్ఞానవృద్ధి మొదలగు విషయములందు క్రొత్తమార్గములు కనిపెట్టఁబడుచున్నవి.

ఇట్టి సమయమున మానవులు తమ జన్మముయొక్క యుద్దేశమును కనుఁగొని యది సార్థక మగునట్లు వర్తింపవలయును. ఈశ్వరాజ్ఞ ననుసరించి స్త్రీపురుషు లెవరైనను యొక దేశమందును, జాతి యందును, కుటుంబమందును జన్మించెదరు. అట్లు జన్మించినపుడు వారు తమయం దుండు లోపములను దుష్ప్రవృత్తులను కనుఁగొని వానిని నశింపఁజేసి పరిశుద్ధులై, జ్ఞానమును సంపాదించి తమజాతి యందును కుటుంబమందును దేశమందును గల దురాచారములను తెలిసికొని వానిని తొలఁగించుటకు యత్నింపవలయును. తమ కుటుంబములలో పుట్టు బిడ్డలకు శరీరారోగ్యమును గలుగఁజేయుచు, మంచినడతను విద్యను జ్ఞానమును నేర్పుచు, వారిని చక్కఁగా పెంచవలెను.

మనము శరీరారోగ్యమును పొంది పరిశుద్ధుల మైనచో, మన దేశ మంతయు బాగుపడును. మనవలె మనబాలురకును బాలికలకును మనము దేహారోగ్యము నిచ్చి వారిని మంచి మార్గమందు పెంచినచో, ముందు కూడ మన దేశము మంచి స్థితిలో నుండఁగలదు. మనము గతించినపిదప మన బాలురును బాలికలును మన స్థానమునకు వచ్చుచున్నారుకదా! వారిని మన మిప్పటినుండియు మంచి స్థితిలో నుంచిన, వారు పెద్దవారైనపిదప మంచిత్రోవనే నడచుచు దేశమునకు మేలు చేయఁగలుగుదురు. వారు బిడ్డలకును నట్టి మంచి శిక్షనే యిచ్చుచు వారు దేశహితము నొనరింపఁగలరు. ఇట్లు వంశపారంపర్యముగా మంచి నడతయే మనదేశమందు వర్ధిల్లి, మనము పుణ్యమునకు పాత్రుల మగుచుందుము.

మన మందఱము జీవులము. జీవునకు స్థూల సూక్ష్మ కారణము లను శరీరత్రయ మున్నది. భూలోకమున మనము పని చేయుట కుపయోగించు స్థూలదేహము మాత్ర మందఱికి గోచరించుచున్నది. తడిగుడ్డలో నీటివలె సూక్ష్మదేహము స్థూలశరీరమున వ్యాపించి యున్నది. కామక్రోధాదుల కిదియే స్థానము. దీనికంటెను సూక్ష్మమై యుత్తమగుణముల కాశ్రయమైన కారణశరీరము స్థూలసూక్ష్మశరీరముల రెంటిని వ్యాపించియున్నది. దివ్యదృష్టి గల యోగులకు మాత్రమే సూక్ష్మకారణదేహము లగపడును.

జీవుల మగు మనము భూలోకమున పుట్టి ధర్మాధర్మస్వరూపమును తెలిసికొని, ధర్మమందే వర్తించుచు దేహములయం దుండు దుర్వాసనలను పోఁగొట్టుకొని, పరిశుద్ధులమై సర్వభూతముల మేలునకుఁగాను పాటుపడుచు పూర్ణులము కావలయు నని యీశ్వరుని సంకల్పము.

మేడకు పునాది బలమైనదిగా నుండుట యెట్లు ముఖ్యమో అట్లే పురుషార్థసాధనమునకు స్థూలదేహారోగ్య మవశ్యము. స్థూలదేహ మారోగ్యముగా లేకున్న, నింద్రియములను మనస్సును స్వాధీనమునకు తెచ్చుకొనుట కష్టము. వానియందలి దుష్టవాసనలను పోఁగొట్టుట యంతకంటె కష్టము. స్థూలదేహారోగ్యము మోక్షమునకు ప్రథమసోపాన మని వ్యాసులవారు తెలిపియున్నారు. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అనఁగా ధర్మసాధనములలో మొట్టమొదటిది శరీరము కదా! శరీర మారోగ్యముగా లేకున్న జీర్ణశక్తి తగ్గి, జాడ్యము ప్రబలమై, మెదడు నరములు బలహీనములై, శరీర మనోదార్ఢ్యములు లేకపోవును. ఏపని చేయుటకును శక్తిలేక యిచ్ఛ లేక స్థైర్యము తప్పి చాపల్య మధిక మగును. ఉదరపోషణమునకుఁగాను చేయవలసిన దైనికములు నిత్యము మొదలగు కార్యములను చేయుటకు కూడ త్రాణ లేకపోవును. దీనివలన దారిద్ర్యము హెచ్చును; విద్యను జ్ఞానమును నభివృద్ధి చేసికొనుటకు వీలు లేక ధర్మస్వరూపమును గ్రహింపఁజాలకపోదుము.

స్థూలదేహము అన్నమయ ప్రాణమయ కోశము లను రెండు భాగములుగా నున్నది. అనారోగ్యస్థితిలో నీ రెంటికిని బలము తగ్గును. సూర్యుఁడు ప్రాణశక్తిని సదా భూమిపై ప్రసరించుచున్నాఁడనియు, ప్రతిమనుష్యుని ప్రాణమయకోశమును ప్రాణశక్తిని స్వీకరించి అన్నమయకోశమునకు వ్యాపింపఁజేయుచున్నదనియు, ప్రాణమయకోశమునకు శక్తి తక్కువయైనచో, ఆవశ్యకమైనంత ప్రాణశక్తిని అది యన్నమయకోశమున కియ్యఁజాల దనియు యోగులును శాస్త్రజ్ఞులును చెప్పుచున్నారు. ప్రాణశక్తి తక్కువయైనచో, దేహమునకు దార్ఢ్యము తప్పి బహువిధము లగు జాడ్యములు కలుగును.

కాఁగుచుండు పాత్రయొక్క వేడిమి దానిలోని నీటికి వ్యాపించులాగున స్థూలదేహముయొక్క యనారోగ్యము సూక్ష్మదేహమునకును వ్యాపించును గాన, దానియందు కామక్రోధాదు లధికమై మనశ్చాంచల్యము గలుగును.

పాత్రలో పోయఁబడిన నీళ్లు వేడిగా నుండిన, ఆ వేడిమి పాత్రకు వ్యాపించులాగున సూక్ష్మదేహముయొక్క యనారోగ్యము

స్థూలదేహమునకు వ్యాపించును. ఇప్పటి డాక్టర్లు పరీక్షించి యీ యుక్తి ప్రాయమునే చెప్పుచున్నారు:—కోపము మొదలగు దుష్టసంకల్పములు స్థూలదేహములోని కొంత సామర్థ్యమును నశింపఁజేసి రక్తమందు విషాణువులను పుట్టించి జాడ్యమును కలుఁగఁజేయును. శాంతిని సంతోషమును వృద్ధిచేసికొనుటచే ఆరోగ్యము వృద్ధిచేసెడి యణువులే రక్తమం దేర్పడును. ఈ సంగతులను పాశ్చాత్యవైద్యులు క్రమముగా పరిశోధించి నిరూపించినారు.

మంచి గాలి, సూర్యుని వెలుఁగు, సత్తువ, చుట్టు నుండు గడ్డి కలుపు తీసివేయుట, మంచి నీరు కట్టుట మొదలగునవి చెట్టు యొక్క యారోగ్యమునకు అత్యావశ్యకము గదా? అట్లే శరీరారోగ్యమునకు మంచి గాలి, మంచి నీళ్లు, మంచి యాహారము, ఆయా శరీరములకు తగిన సాము, ఇంటి చుట్టుప్రక్కల మంచి స్థలము, ఇంటిలోపల చక్కఁగ మంచి గాలియు సూర్యుని వెలుఁగును ప్రవేశించు నేర్పాటు ముఖ్యము. మరియు స్నానాదులచే దేహమును పరిశుద్ధముగ నుంచుకొని శుభ్రమయిన వస్త్రములను ధరించుటయు, సాత్వికాహారములను భుజించుటయు మిక్కిలి యావశ్యకము. భంగి సారాయి మొదలగు మత్తువస్తువులను తీసికొనఁగూడదు. అవి స్థూలశరీరమును చెఱచి సూక్ష్మశరీరమును కూడ చెఱుపును. చెడ్డ కార్యములు వదలుట, యుక్తచేష్టలు, మితనిద్ర, శాంతము, ఇంద్రియ నిగ్రహము, ధ్యానము, భూతదయ, [జీవుఁడు ఆనందస్వరూపుఁడు గాన కష్టములు దుఃఖములు వచ్చినను చలింపక కష్టములు తాను పూర్వమందు చేసిన అప్పు (ఋణానుబంధములు) తీరుటకై వచ్చినవని తెలిసికొని] కష్టములను దుఃఖములను ధైర్యముతో అనుభవించుట, సదా శాంతస్థితియం దుండుట, సంతోషముగా నుండుట, సద్ధర్మానుష్ఠానము—ఇవి యన్నియుఁ గూడ స్థూలశరీర సౌఖ్యమునకు అత్యావశ్యకములు.

ఒకచెట్టు మంచిఫల మియ్యవలెనన్నచో, మొదట ఆచెట్టు మొలచు భూమి సారవంతమై పత్తువగలదిగ నుండవలెను. చెట్టు కూడ రోగము లేనిదిగను బలము గలదిగను ఉండవలెను. చవుటిభూమి యందు విత్తనము వేసిన మొలవకపోవును; మొలచినను బలహీనముగ పుట్టి యెంత పోషించినను చక్కఁగ పెరుగక జాడ్యములు మెండై చచ్చిపోవును; ఒకవేళ బ్రతికినను మంచిఫలము లియ్యక పోవును. ఇట్టి చెట్టునందు పుట్టు విత్తనములు మరల విత్తిన మిక్కిలి బలహీనమగు చెట్లు పుట్టి మరింత హీనమగు ఫలముల నిచ్చి తుత్తుగ విత్తనము లేకయే నశించి చెట్టు రూపము లేక పోవును. అట్లే మన స్థూలశరీర మనెడి చెట్టు ఆరోగ్యము బలము గలదిగ జన్మించి చక్కఁగ పెరుగవలెనన్న, స్థూలశరీరముయొక్క యుత్పత్తికి తల్లి దండ్రులు ఆదికారణము గాన, తల్లి భూమిగను తండ్రి విత్తనముగను నుందురు. చెట్టు వృద్ధికి భూమి ముఖ్యకారణముగ నుండునట్లు శరీరారోగ్యమునకు తల్లియొక్క శరీరారోగ్యము ముఖ్యకారణము. స్థూలశరీరము తల్లిగర్భమున మొదట ఏర్పడి నవమాసములు అచ్చట పెరుగును గదా? ఆ నవమాసములలో అవయవములు అన్నియు క్రమముగ నేర్పడి వృద్ధినొంది భూమిని ప్రవేశించును. గర్భమునందు శరీరము ఏర్పడి వృద్ధియగుటకేగాను తల్లి తనయొక్క రక్తమును బలమును పరిశుద్ధతేజమును నవమాసములందు నిమిష నిమిషము పిండమున కిచ్చుచుండును. తల్లియొక్క రక్తము బలము తేజస్సులచే గర్భమునందుండు పిండము దినదినము పెరుగుచుండును.

ఒక చెట్టునకు నిమిష నిమిషము వ్యాపించు భూసారము వలె పిండవృద్ధికి ప్రతినిమిషము తల్లి రక్తము బలము తేజస్సు సదా వ్యాపించుచుండును. ఇది తక్కువ స్థాయిచో తల్లియందు పిండమునకు చాలినంత రక్తము లేక పిండముయొక్క యవయవములు చక్కఁగ పెరుగక పిండమునకు సామర్థ్యము లేక బిడ్డ బలహీనమై రోగపీడితముగ జన్మించును గాన, తల్లికి తగు రక్తవృద్ధి శరీరారోగ్యము నుండవలెను.

గర్భధారణకాలమందు సాత్వికాహారములచే భక్షించుచుండవలెను. సులభముగ జీర్ణము కాఁదగిన యాహారమును మితముగ భోజనము చేయవలయును. ఎప్పుడు కదలక పనిచేయక కూర్చుండుట మంచిది కాదు. మితముగ పనిచేయుట పరిశుద్ధమగు గాలి గల స్థలములందు నడచుట మిక్కిలి శ్రేయస్కరము. దుఃఖము కోపము భయము మొదలగునవి గర్భిణీస్త్రీల కుండఁగూడదు. తల్లి సదాచారము గలదై శాంతముగను సంతోషముగను నుండవలెను. మనస్సులో దుఃఖము కోపము చింత ప్రవేశించియుండుట మొదలగు మనోవికారములు బొత్తిగ లేక యుండవలయును. తల్లియొక్క ప్రతి దుష్టసంకల్పమును మనోవికారమును బాణమువలె శిశువునకు తగిలి గర్భమునందు శిశువు బాధపడును. మరియు తల్లి మనసునందు పుట్టు దుఃఖము కోపము చింత మొదలగునవి తల్లి రక్తమును చెఱచి విషము గలదానినిగ చేయును. ఇట్లు చెడురక్తము పిండమునకు వ్యాపించును. పిండము బలహీనమై యనారోగ్యము గలదగును. తల్లిని చిన్నప్పటినుండి శరీరబలము గలదిగను శాంతురాలుగను భక్తురాలుగను పెంచినచో గర్భధారణకాలమునఁ గూడ ఆ గుణములు గలిగియుండును గాన పిండమునకు మేలు కలుగును. గర్భధారణకాలమున తల్లికి దుఃఖము కోపము కలుఁగఁజేయరాదు. ఇది సూమె కుండరాదు. తల్లియింటియందు చుట్టు నుండువారు అతి దయ గలవారై శాంతులుగను భక్తులుగను వర్తింపవలెను. ఇట్లు చేసినచో తల్లి శాంతురాలుగను సంతోషిగను నుండును. తల్లియొక్క శాంతమును ఆరోగ్యమును మరియు నితరులయొక్క శాంతమును భక్తియును గర్భమునందుండు శిశువునకు వ్యాపించి యా శిశువు చక్కఁగ వృద్ధియగును; లేనిచో శిశువు బహువిధముల చెడును. సీమలో ఒక గర్భిణీస్త్రీ గొఱ్ఱెలను కోయు కటికవాని యంగడియొద్దకు దినదినము పోయి గొఱ్ఱెల నరుకుటను చూచి యుల్లాసపడుచుండెను. ఆమె కొడుకును గనెను. వాఁడు పెరిగిన వెనుక ఇతరులను చంపవలెనను బుద్ధిగలవాఁడై కత్తి తీసికొని పోయి యితరులను నిష్కారణముగ చంపఁబ్రయత్నించుచుండెను. డాక్టర్లు దీనిని పరీక్షించి కారణము యో

చింపగ గర్భధారణకాలమందు వానితల్లి కటికవాసు చేయు హోత్య యులను సంతోషించుచున్న కారణమున ఆ సంకల్పతరంగములు గర్భము నం దుండినపుడు వానికి వ్యాపించి వాఁడట్టి బుద్ధిగలవాఁడై జన్మించి నట్లు కనిపెట్టిరి. కాన గర్భధారణ కాలమున తల్లి శరీరారోగ్యము గాంచియు ధూతదయ శక్తి గలిగి, సద్గుణములు వృద్ధిచేయు కార్యము లను చేయుచుండవలయును; మరియు పిండమును వృద్ధిచేయుటకు వలయు రక్తమును పౌష్టికమును కలిగియుండవలయును.

చెట్లు పెరిగెడి కాలమందు అవి గ్రహించెడి యాహార మంతయు దాని పెరుగుటకే వినియోగింపఁబడును. అట్టి కాలమందు చెట్టునకు రోగము చీడ గలిగిన, ఆచెట్టు ఆహారమును గ్రహించు శక్తిలేక చక్కఁగ పెరుగక బలహీనమై గిటకబారి మంచి ఫల మియ్యదు. ఫలించినను నమ్ముఫలము లిచ్చును. ఇట్లు బాలుర బాలికలు పుట్టినపిదప కొన్ని సంవత్సరములవఱకు పెరుగుచుందురు. అనఁగా ఆహారాదులచే కొన్నేండ్లవఱకు తమయందు వృద్ధియగు రక్తము తమ శరీరమును పెంచుటకే వినియోగింపఁబడును. ఇది శరీరధర్మము. దేవుని యేర్పాటు. బాలికలు కనీసము 16, 18 సంవత్సరములవఱకు పెరుగు చుందు రని డాక్టర్లు కనిపెట్టియున్నారు. ఒకబాలిక ప్రథమరజస్వల (పెండ్లిసమర్త) యగుట ఆ బాలిక పెరుగుటకు ప్రారంభించిన దని తలంచుచున్నారు. చెట్లు పుట్టిన కొంతకాలమువఱకు భూమి నంటియుండి పిదప త్వరగా పెరుగునట్లు బాలిక ప్రథమ రజస్వల యయినది మొదలు రెండు సంవత్సరములవఱకు వేగముగ శరీరము పెరుగుచు వృద్ధియగుచుండు నని డాక్టర్లు కనిపెట్టియున్నారు. ఇట్లు పెరుగు కాలములో మనము బాలికలను చక్కఁగ పోషించినచో, వారి రక్తవృద్ధి పొంది బాగుగ శరీరసౌఖ్యవృద్ధి గలిగినవా రగుదురు. అట్లు చేయక ఈ రెండు సంవత్సరములలోపలనే నిషేకము చేసి పురుషునితో సంసారము చేయుటకు పంపిన భార్యాభర్తల సంబంధము వలన బాలికలయొక్క శరీరమందు ఉదుకు పుట్టి, నరములు మాంసపు కండలు పెరుగుట మాని వృద్ధి కాక చెడిపోయి శరీరము బలహీనమై చెడును. చక్కఁగ పెరుగుచుండు పంటచైనను తెగులు తగిలినయెడల పైరు సరిగ్గ కృశించి ఫలము నియ్యక చెడులాగున, బాలిక పెంపు సరిగ్గ బలహీనురాలై గిటకబారి శరీరము ఎముకలు మెదడు కూడ బలహీనము లగును. గర్భస్థానము కూడ కృశించును. జీర్ణశక్తి తగ్గును. జీర్ణశక్తి లేమిచే ఆహారము సరిగ్గ శరీరమునందు బలము రక్తము తగ్గిపోవును. ఇట్లు హీనమైన రక్తము ఆబాలిక శరీరమును పెంచుటకే చాలకయుండును. కాన అట్టి సమయమున గర్భధారణను కూడ నటకట్టించినయెడల, ఒకరికి కూడ చాలని యన్నము నిద్దరికి పంచిపెట్టినచో కొంతకిని చాలక యుభయులు కృశించులాగున, తల్లిశరీరమునం దుండు స్వల్పరక్తము తల్లికిని గర్భమునం దుండు పిండమునకును ఈ యిద్దరికిని చాలక పంచుకొనవలసివచ్చును. కాన ఈ యిద్దరు బలహీనులై కృశింతురు. బాలికకు ఇటులనే దాంపత్యముచేఁ గలిగిన బలహీనత అనారోగ్యము గర్భధారణముచే హెచ్చును. దీనిచే ఆబాలిక గర్భధారణకాలమందు అనేకజాడ్యములు బాధలు గలవై ఆహారమునం దసహ్యత కలిగి అన్నము చక్కఁగ సహింపక రక్తహీనత మరింత హెచ్చును. ఇందుచేతబలహీనత మరింత అధికమగును. ఇట్టి బలహీనత అనారోగ్యము మున్నగు బాధలచే తల్లికి దుఃఖము కోపము అధికమగును. దీనిచే పిండము విశేషించి బాధపొంది చెడిపోవును. రక్తము లేమిచే తల్లిశరీరము చెడి వివిధములగు జాడ్యములు పుట్టును. తల్లిశరీరము గిటకబారి గర్భసంబంధమగు నరములు మాంసఖండలు ఎముకలు బలహీనములగును. ప్రసవమయ్యుటకు చాలినంత రక్తము లేమిచేతను తల్లియొక్క దుఃఖము మెండలగు మనోబాధలచేతను, విషపురుగున్న గల బలబీడభూమియందు చెట్టుమొలచినను పెరుగకుండులాగున, పిండము గర్భమునందు పెరుగక నశించును. ఒకవేళ పిండము బ్రతికి జన్మించినను ఎలుక పిల్లవలె బలహీనమగు శిశువు పుట్టును. పైకారణములచే తల్లి గర్భస్థానము రక్తహీనమై బలహీనముగ నుండుటచే ప్రసవకాలమందు తల్లికి బిడ్డను గనుటకు పౌష్టికము లేకపోవును. ఒకవేళ కనుటకు మాత్రము పౌష్టిక ముండినను మైలను చక్కఁగ బయటఁ ద్రోయఁజాలకపోవును. అది శరీరమందు నిలిచి పలువిధము లగు బాలింత జాడ్యములు గలిగి అనేకులు చచ్చుచుందురు. ఇట్లు వృద్ధికాలసిన కుటుంబము లనేకములు నాశనమగుచున్నవి. తల్లి బ్రతికినను బిడ్డను గనిన పిమ్మట బలహీనురాలై, బిడ్డకు చాలినన్ని పాలు లేకపోవును. ఒకవేళ పాలుండినను పాలము లేక సిద్ధింపవలె నుండి బిడ్డకు ఆరోగ్యమును పౌష్టికమును నియ్యఁజాలకయుండును. ఇట్టి స్త్రీ ప్రతి కానుపునకు చచ్చుచూచుచుండును. కొన్ని కాన్పులకే ముసలిదియగును. అల్పవయస్సునకే యౌవనము పోయి ముసలిది యగును. ఇట్టి బాలికయగు స్త్రీకి పుట్టిన శిశువు పుట్టుకతోనే బలహీనుఁడుగ పుట్టి చక్కఁగ పెరుగఁజాలక ఆరోగ్యము లేక పోవును. ఇట్టి శిశువులు పెరిగినను బలహీను లగుదురు. ఇట్లు దేశమం దుండు స్త్రీ పురుష లనేకులు బలహీనులై జాడ్యగ్రస్తులైన, దేశముయొక్క సౌఖ్యము తగ్గును. క్రమముగ దేశము క్షీణదశకు వచ్చును.

ఈ విషయము లన్నియు మనశాస్త్రములు బోధించుచున్నవి. ఇవి మన కనుభవసిద్ధమైనవి. విశేషముగ శరీరధర్మములు శోధించి కనిపెట్టిన గొప్ప డాక్టర్లు చెప్పునదియు ఇదియే. బాలికకు ప్రథమరజస్వల యైనది మొదలు రెండుసంవత్సరములు దేహమందు విశేషముగ మార్పులు కలిగి ముఖ్యముగ పెరుగు కాలము. ఇట్టికాలమందు నిషేకకార్యము కావించిన బాలికలు బలహీనులై వారి శరీరము చెడునదియును, ఇందుచే అనేక కుటుంబములు నశించి దేశము హీనదశకు వచ్చు ననియును, ఈ యన్ని కారణములను బట్టి బాలికలకు ప్రథమరజస్వల యయిన రెండు సంవత్సరములలోపల నిషేకకార్యము బొత్తిగ చేయఁగూడ దనియును గొప్ప డాక్టర్లు బోధించుచు ఖండితముగ నిషేధించుచున్నారు.

బాలికలకు బాల్యమున గర్భాధానముచేయుటవలన గలుగు కీడులు, బాలుర ప్రాప్తయౌవనులు గాకమునుపు గర్భాధాన కార్యము చేసిన, బాలురకును గలుగును. పక్వము కాని పచ్చికాయ

నుండి విత్తనము కొత్తి విత్తినచో మంచిచెట్టు మొలచునా? మొలచినను ఆచెట్టు బలముగ పెరుగునా? అందు ఫలించు పండ్లు పూరకంతములుగ నుండునా? ఫలము బాగుగ నుండవలయు నవిన భూమి మంచిదిగను పూరకంతిముగను నుండవలెను. విత్తనము మంచిదిగను పక్వమైనదిగను నుండవలెను. అట్లే యతిబాల్యదశయందు స్త్రీలకుఁ గాని పురుషులకుఁ గాని నిషేకకార్యము చేయుట గొప్పకీడు. ఇంతే గాక బాలునకు పుట్టినది మొదలు బ్రహ్మచర్యాశ్రమము విద్య నేర్చుకొను కాలముగదా? చదువు పూర్తియై గురువునాజ్ఞ పొందిన పిమ్మటఁ గదా వివాహము చేసికొనవలసినది. అట్లు చేయక చదువుకొనుచుండు కాలములోనే బాలునకు నిషేక కార్యము చేసినను చేసికొనుట కవకాశములు కలుగఁజేసినను వాని మనస్సు విద్యయందు నిలువదు. బాలుఁడు చెడిపోవును.

శ్లో. ఊనషోడశవర్షాయా మప్రాప్తః పంచవింశతిం
యద్యాధత్తే పుమాన్గర్భం కుక్షిస్థస్సవిపద్యతే
జాతో వా నచిరంజీవే జ్జీవేద్వా దుర్బలేంద్రియః
తస్మాదత్యంతబాలాయాం గర్భాధానం నకారయేత్.

సుశ్రుత సంహిత.

అనఁగా పదునారు సంవత్సరములు నిండని స్త్రీయందు ఇరువదియైదు సంవత్సరములు నిండని పురుషుఁడు గర్భాధానము చేసినట్లయిన ఆ గర్భము కడుపులోనే ఆపదనొంది స్రవించును. ఒకవేళ గర్భము నిలిచి శిశువు జనించినను, బహుకాలము జీవింపదు. జీవించినను ఇంద్రియపటుత్వము లేక మిగుల బలహీనముగా నుండును. కనుక అతి బాల్యదశలో గర్భాధానము చేయఁదగదని తాత్పర్యము.

శ్లో. పూర్ణషోడశవర్షా స్త్రీ పూర్ణవింశేన సంగతా
శుద్ధే గర్భాశయే మార్గే రక్తే శుక్రేనిలే హృది
వీర్యవంతం సుతం సూతే తతో న్యూనాబ్దయోః పునః
రోగ్యల్పాయురధన్యో వా గర్భో భవతి నైవ వా.

చరకసంహిత.

అనఁగా, పదునారు సంవత్సరములు నిండిన స్త్రీ యిరువది సంవత్సరములు నిండిన పురుషునితోఁ గలసినయెడల గర్భాశయ మార్గము, రక్తము, శుక్రము, వాయువు—ఇవన్నియు శుద్ధంబై మంచి బలము గల కుమారుఁడు పుట్టును. అట్లుగాక తక్కువ వయసుగలవారైనయెడల రోగము అల్పాయువు గల శిశువుగాని పొందియైన శిశువు గాని పుట్టు నని యభిప్రాయము.

శ్లో. కుమార్యృతుమతీ త్రీణి వర్షాణ్యుపాసీత
త్రిభ్యోర్ధ్వం విన్దేత పతిం సదృశం తుల్యం.   వాసిష్ఠ ధర్మశాస్త్రము.

అనఁగా ఋతుమతియైన మూఁడు సంవత్సరములకు గర్భాధానము చేయవలయును.

ఇట్లు శరీరసౌఖ్యమునకు ఆధారాణము తల్లిదండ్రులే. బాలికా గర్భాధానముకలన అనేకబాలికలు బాలెంత బాధ్యములచే నశింప లేదా? శిశువు లనేకులు మృతినొందలేదా? ఇట్టి స్త్రీహత్య శిశుహత్య దోషము మనకు దటస్థించును గదా? ఇట్లు చిన్న వయస్సున చేయు నిషేకములవలనఁ గలుగు కీడులను కొన్నిటిని వివరింతము.

1. బాల్యదశయందు శిశువులు అనేకబాధ్యములు కలవారై, వారివల్ల తల్లిదండ్రులకును మిగుల కష్టములు కలుగును.

2. బాల్యదశయందు చక్కఁగ చదివి జ్ఞానవృద్ధి చేసికొనుటకు శరీరమనోదార్ఢ్యములు లేనిచో పెద్దవారైనప్పుడును దార్ఢ్యములేని వారై కుటుంబవృద్ధికిని దేశవృద్ధికిని పాటుపడుటకు సామర్థ్యము లేనివారగుదురు. అనేక కుటుంబములకును దేశమునకును నష్టము దారిద్ర్యము గలుగును.

3. మనోదార్ఢ్యము లేమిచే, గొప్ప విద్యలు శాస్త్రములు కొత్త శోధన క్రొత్తవిషయములు కనిపెట్టుట—కినికి శక్తి లేక, ప్రపంచమునకు మేలు చేయుటకు వీలు లేకపోవును.

4. చిత్తస్వాస్థ్యత లేమిచే మనస్సు దుర్వ్యసనములుగలదై దుష్టబుద్ధు లధికమై దుష్కార్యములు కావించి తాను చెడి అనేకులను చెఱుపును. మనస్థిమితము లేనిచో భక్తి జ్ఞాన వైరాగ్యములు సాధించుట కవకాశము లేకపోవును.

5. దీనిచే దేశము చెడి ఇట్టివారి సంఖ్య వృద్ధి కాను కాను దేశము దినదినము హీనస్థితిని చెంది, మన దేశప్రజ లందఱును హీన దశను చెందుదురు. మంచి కుటుంబములు లేకపోవును.

6. భక్తులయు పతివ్రతలయు బ్రహ్మనిష్ఠులయు సంఖ్య తగ్గును. మహాత్ములు జన్మమెత్తుటకు తగిన యోగ్యులును దృఢాంగులు నగు దంపతులు లేమిచే వారు మనదేశమందు జన్మమెత్తకపోదురు. ఈ కారణముచే పరిశుద్ధతేజస్సు తగ్గి మనదేశము దుష్టతేజస్సుచే నిండిన దగును.

7. ఇందుచే దేశమంతయు చెడి దుష్టబాధ్యములు బలమైన, రోగములు క్షామములు పలువిధము లగు గొప్ప కష్టములు దేశములో వృద్ధియగును.

8. ఈ పాపముచే పశ్వాదులును వైరులును కూడ చెడును.

ఇన్ని విధముల కష్టము కలుగఁజేసెడి పాపము, బాలురకును బాలికలకును గర్భాధానము చేసి బాల్యదశయందు గర్భధారణమునకు అవకాశమిచ్చిన మన పెద్దలకును కలుగును. దీనిచే ఇట్టి మన పాతక నరకబాధలనుభవించి ముందు జన్మములఁ బెక్కుకష్టములును బాధ్యములును దేహపీడలును గలవారై మితిలేని బాధలు పొందుదురు. నానావిధములగు హీనజన్మము లెత్తి కష్టపడుదురు. ఇట్లు బాధపడక సద్వృత్తియందు వర్తించుటకు దేవుఁడు మనకు జ్ఞానమును స్వాతంత్ర్యము నిచ్చియున్నాఁడు. సోదరీసోదరులారా! మన వంశములను కులములను దేశమును భక్తిజ్ఞానములను నాశనముచేసి ఇట్టి యమిత దోషము పొందుట మేలా? లేక మన దేశము నన్ని విధముల నాశనము చేయు బాలికాగర్భాధాన మనెడి బ్రహ్మరాక్షసిని చంపి మనలను మనదేశమందు రాఁబోవు ప్రజాకోటిని సౌఖ్యస్థితికి తెచ్చి పరిశుద్ధులను చేసి శాశ్వతమి యమితమగు పుణ్యమును పొందుట మేలా? ఇట్లు ప్రతి స్త్రీయును పురుషుఁడును బాలికాగర్భాధానము నాఁపుటకు తగు ప్రయత్నములు చేయవలయును. దీనికి తగిన బోధలు చేసి ఏర్పాట్లు చేసి యట్లు ప్రతివాఁడును వర్తించి యితరులను వర్తించునట్లు చేయవలయును. మన బిడ్డల శరీరారోగ్యమును శాశ్వత వృద్ధి చేయవలయును. ఇట్లు చేయుటకు వలయు జ్ఞానము, దార్ఢ్యము, దేశాభిమానము, శ్రద్ధ, భక్తి, భూతదయ జగదీశ్వరుఁడు మన కిమ్ముఁగాక!

# వ్యవసాయము — యుద్ధము

దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు

కృషిః క్లిష్టాన్నస్త్యా — అను వారోక్తి ననుసరించి వ్యవసాయము చేయుటకు అతివృష్టి యనావృష్టి దోషములచే కష్టముగా నున్నప్పుడు, గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్లు ప్రస్తుతము జరుగుచున్న మహాఘోర యుద్ధమువలన మన వ్యవసాయమునకు కలిగిన నష్టమింతంత యని వక్కాణించుటకు వీలు లేదు. ముందాలోచన లేక మన వ్యవసాయకు లవలంబించు పద్ధతులు కూడ "అయ్యకు పెండ్లయిన దన్న సంతోషమే కాని అమ్మకు సవతి వచ్చునన్న విచారము లే" దన్నట్లున్నవి. భోజనోపయోగకరమైన ధాన్యాదులు పండు భూములలో కేవలము వ్యాపారప్రధానమైన పైర్లను పండించుటవల్ల మన దేశమును ఇదివఱకే తెంపులేని కఱవులో ముంచియున్నారు. అందు మఱియొక విశేషము. ఇదివఱలో అట్టి వ్యాపారయోగ్యమైన పైరు దినుసులకు విశేషముగ వెల వచ్చుటవల్ల ఆ హెచ్చు డబ్బుతో ధాన్యాదులను కొనుక్కొనెడివారు; ఇప్పుడో, యుద్ధారంభమునకు ముందు గరిసె రు 70 లకు పైగా అమ్ముచుండిన వేరుసెనగలు రు 30 లకును, పుట్టి రు 75 లకు అమ్మిన గోగునార రు 25 లకును కూడ కొనువారు లేరు. ఈ వెలలను పట్టి పూర్తిగా ఫలించిన చేనిలో కూడ పంట కూలిఖర్చుల కైనను చాలదు. ఇక శిస్తు లెక్కడ? పన్ను లెక్కడ? హెచ్చు వడ్డీలకు పెట్టుబడి పెట్టిన సాహుకార్లకు ఇండ్లు వాకిళ్ళు భూములు తనఖా పెట్టవలసివచ్చినది. దీనికి తోడు కాలవ్యత్యాసము కూడ అలాగుననే తటస్థించినది. ధాన్యాదికముల క్రింద నున్న భూములు కూడ సరిగా పండుటకు వీల్లేకపోయినవి. సెప్టెంబరు నెలలో కురిసిన అతివర్షములవల్ల జలాధారములకు గండ్లుపడి ఉన్ననీరు పోయినది. అటుపిమ్మట పొటుక్కున చినుకు పడకపోవుటవల్ల చెఱువులు, వాని క్రింది సస్యములు పొట్టకువచ్చినప్పుడు, పూర్తిగా ఎండిపోయినవి. నీటికఱవు లేని డెల్టాభూములలోని వరిచేల పాట్లు వఱదలవల్ల ఏలాగయినవో చదువరులకే తెలియును. ఇక ముందు కాల మెట్లుండునో ఊహించుటకు శక్యము కాకుండ నున్నది.

పండినపట్టుకు అమ్ముద మన్నను, ధర లేదు; కొనువారు కనుపించరు. పంటల దినములలో అయిదు రూపాయిలకు పైగా అమ్మిన ధాన్యపు బస్తా ఇప్పుడు మూడు రూపాయిలకు దిగిపోయినది. పండిన సరకులకు ఎగుమతులు లేక ధరలు పడిపోవుటవల్లను, జీవనాధారమైన బట్టలు మొదలగువానికి దిగుమతులు లేక ఖరీదులు హెచ్చుగుటవల్లను, రైతుల పాట్లు చెప్ప నలవి కాకున్నవి. శత్రురాజ్యములలో తయారగు కొన్ని కొన్ని వస్తువులను పండించి లాభము పొందుటకా తరుణము మీఱిపోయినది. తిరిగి తరుణము వచ్చేసరికి కాల మెట్లుండునో ఎవరు చెప్పగలరు? ఇందు కుదాహరణముగా నొక విషయము వివరించెద. పూర్వము మన దేశములో విశేషముగా నీలిమందు తయారగుచుండెడిది. జర్మనీదేశమందు కృత్రిమపు నీలిమందు చవుకగా తయారు చేయబడుటవల్ల దానితో మన దేశములో తయారగు మందు తూగలేక, ఆ వ్యాపారము పూర్తిగా నశించినది. దీనికి నిదర్శనముగా ప్రతిజిల్లాలోను పాడైపోయిన నీలిమందు తొట్లు వేనవేలున్నవి. ఇప్పుడు జరుగుచున్న ఘోరసంగ్రామము కారణముగా జర్మనీనుండి మందు రాకపోవుటవల్ల దీనికి గిరాకీ హెచ్చినది. కావలసిన మందు నిలువ లేదు. స్వల్పముగా నిలువ చేసిన సాహుకార్లకు నూటికి రెండు వందలకు పైగా లాభము వచ్చుచున్నట్లు కనిపించుచున్నది. ప్రస్తుతము ఇంత లాభము వచ్చుచున్న దని యుత్సాహపడి హెచ్చుగా నీలిమందు వ్యాపారము చేయుద మన్న

THE LATE RAO BAHADUR
P.V. KRISHNAIAH NAIDU B.A.



కీర్తిశేషులయిన రావుబహాదూర్ పుప్పురేటి
వెంకట కృష్ణయ్యనాయుడుగారు
మునిసిపలుచైర్మన్ (గుంటూరు)

Mr. K. KRISHNA RAO B.A., L.T.



క. కృష్ణారావుగారు (అనంతపురం)

Mr. R. SRINIVASA RAO B.A.



రాయసము శ్రీనివాసరావుగారు

Mr. R. PRASANNA VENKATESWARA
RAO



ఆర్. ప్రసన్న వెంకటేశ్వర రావు గారు
(శ్రీరంగము)

# పరపతి సంఘములు

బలభద్రపాత్రుని హనుమంతరావుగారు

మదరాసు రాజధానియందు 1913-వ సంవత్సరము జూన్ మాసముతో నంతమైన కోవాపరేటివ్ సంవత్సరమువఱకు 1,078 పరపతిసంఘములు గలవు. అందాంధ్రదేశమునందు 300 సంఘములు మాత్రమే గలవు. ఆ 300 సంఘములు నీక్రింద వివరించిన మండలములందుఁ గలవు:— గంజాము జిల్లా 4; విశాఖపట్టణము జిల్లా 7; గోదావరి జిల్లా 12; కృష్ణ జిల్లా 34; గుంటూరు జిల్లా 21; కర్నూలు జిల్లా 22; బళ్లారి జిల్లా 3; అనంతపురము జిల్లా 148; చిత్తూరు జిల్లా 17; నెల్లూరు జిల్లా 11. పై నుదహరించిన మండలములలో అనంతపురమునందు 148 సంఘములును మిగిలిన 10 మండలములలో 152 సంఘములు మాత్రమును కలవు. ఆంధ్రదేశమునందలి 300 సంఘములు గాక, యీరాజధానియందలి మిగిలిన 14 జిల్లాలలో 778 సంఘములు కలవు. ఇట్టి సంఘముల పనులు నెఱవేర్చుటకు రాజధానియందుఁ గల 25 జిల్లాలును నాలుగు భాగములుగా విభజింపఁబడి ప్రత్యేకాధికారులపరిపాలన క్రింద నుంచఁబడినవి. అందు 1 రిజిస్ట్రారు సెక్షను: దాని యధికారము క్రింద దక్షిణకన్నడము, మలబారు, చెంగల్పట్టు, మదరాసు జిల్లాలు గలవు; 2 తిరుచునాపల్లి అసిస్టెంటు రిజిస్ట్రారు సెక్షను: దాని యధికారముక్రింద తిరుచునాపల్లి, తంజావూరు, దక్షిణార్కాడు, మధుర, రామనాధము, తిరునెల్వేలి జిల్లాలు గలవు. 3 వెల్లూరు అసిస్టెంటు రిజిస్ట్రారు సెక్షను: దాని యధికారము క్రింద, సేలము కోయంబుత్తూరు, నీలగిరి, ఉత్తరార్కాడు, చిత్తూరు, కడప, జిల్లాలును అనంతపురముజిల్లాలో కదిరితాలూకాయును గలవు; 4 బెజవాడ అసిస్టెంటు రిజిస్ట్రారు సెక్షను: దానియధికారము క్రింద గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, బళ్లారి, అనంతపురము, కర్నూలు జిల్లాలు కలవు. బెజవాడ సెక్షను క్రిందనే (కడప చిత్తూరు జిల్లాలు తప్ప తక్కిన) ఆంధ్రమండలము లన్నియు కలవు. 1913-వ సంవత్సరము జూన్ మాసాంతమువఱకు మొదటి మూడు సెక్షనులనుండి నూతన సంఘములకొఱకు వచ్చిన దరఖాస్తుల సంఖ్య 550; అందులో రిజిస్టరు చేయఁబడిన సంఘముల సంఖ్య 95. నాల్గవ సెక్షను అనఁగా బెజవాడ సెక్షనునుండి వచ్చిన క్రొత్త దరఖాస్తుల సంఖ్య 327; అందులో రిజిస్టరు చేయఁబడిన సంఘముల సంఖ్య 11. ఆంధ్రదేశమునం దిదివఱకు పనిచేయుచున్న సంఘముల సంఖ్యయు నూతనముగా రిజిస్టరుచేయఁబడిన సంఘముల సంఖ్యయు రాజధానియందుఁ గల తక్కిన మండలములయందలి సంఖ్యలకంటె మిగుల స్వల్పము. ఆంధ్రదేశమున నిట్టి సంఘములు వృద్ధి పొందకుండుటకు కారణములు మూడు:—(1) అధికారులు శ్రద్ధ చూపకుండుట (2) ఇతర దేశములం దీయుద్యమమును వృద్ధిపఱచుటకు గౌరవార్థము పనిచేయువారలు గలరు. అట్టివా రాంధ్రదేశమున నొక్కరును లేరు. (3) అరవపత్రికయగు స్వదేశమిత్రను సంఘములను వృద్ధిపఱచుటకు తోడ్పడినది; ఆంధ్రపత్రికలలో నొకటియైనను సంవత్సరమునకు పది వ్యాసములు ప్రకటించినది లేదు. 1914-వ సంవత్సరము జూలై మాసమునుండి బెజవాడ అసిస్టెంటు రిజిస్ట్రారుగారు అక్టోబరు మాసమువఱకు ఉత్తర సర్కారులలో 18 నూతన సంఘములను రిజిస్టరుచేసిరి. ఇంకను రిజిస్టరుచేయఁబడఁగలవు. ఇట్టి సంఘములు పల్లెటూరి చేలిపనులకును, వ్యవసాయమునకును ఎంతవఱ కుపయోగించునో యొకింత వ్రాసెదను. హిందూదేశమునందు పేదల యుపయోగము నిమిత్తమే యీ సంఘము లేర్పఱుపఁబడుచున్నవి. వరిపంట ముఖ్యముగాఁ గల జిల్లాలలో ఊడ్పులగు పర్యంతము అనఁగా జూలై ఆగస్టు మాసములవఱకు మిక్కిలి బీదలగు పంచములు మొదలైనవారికి కూలి దొరకుచుండును. ఊడ్పు లయినతరువాత పంటలు కోయువఱకు వీరికి కూలి దొరకుట దుర్లభము. ఇట్టి బీదలాడలు తమకు కూలి చిక్కని కాలములో నిత్యము కావలసిన యాహారపదార్థములను, ధాన్యము మొదలగువానిని సాహుకారులయొద్దకు వెళ్లి తెచ్చుకొను

చుందురు. వడ్డీ సంపాదించుటయే ప్రధానముగాఁ గల సాహుకారులు తా మప్పిచ్చు కాలమునం దాధాన్యము పుట్టి రు 60 ల కమ్ముచున్నను రు 65, 70 లు ధర వేసి నూటికి నెలకు రూపాయి చొప్పున వడ్డితో నిచ్చునట్లు నోటు వ్రాయించుకొందురు. తరువాత ఆ పేద వాండ్రు కూలిపనులు చేసి సంపాదించుకొనిన ద్రవ్యమంతయు అప్పునకు సరిపోక పోవుటవలన తమ పెద్దలు సంపాదించిన స్థిరాస్తిని సయితము సాహుకార్ల కొప్పగింపవలసివచ్చును. ఇట్టి బీదలను అప్పులపాలు కాకుండ చేయవలయునన్నచో, చేతిపనుల సంఘములు స్థాపించి వారికి జీవనాధారము కల్పింపవలెను. మన దేశమునందు మాలలు నూలు వస్త్రములను, మాదిగెలు పాదరక్షలు మొదలగు తోలుసామానులను మిక్కిలి యందముగా చేయుచుందురు. ఇట్టివారు చేయు వస్తువులకు తగిన వెలలను మన మియ్యకపోవుటచేతను చేయువారికి పెట్టుబడి పెట్టువారు లేకపోవుటచేతను పై వృత్తులు క్రమముగా క్షీణించుచున్నవి.

హిందూదేశమునందు నూటిలో ముప్పాతిక మందికి వ్యవసాయమే ప్రధానవృత్తిగా నున్నది. నవంబరు మాసము వచ్చినతోడనే జనుపవిత్తనములు కొనవలసియుండును. ఒక గ్రామమునందు 1,000 ఎకరముల భూమి యున్నచో, రు 1,000 ల విత్తనములు కొనవలసియుండును. ప్రత్యేకించి యొక్కొక్క మనుష్యుఁడుచు వెళ్లి తనకు కావలసిన విత్తనములు తెచ్చుకొనుటకంటె వ్యవసాయకు లందఱు నొక సంఘము నేర్పఱచుకొని తమకు కావలసిన విత్తనముల నొక్కసారే తీసికొనినయెడల, విత్తనములు చవుకగా దొరకుటయే గాక మేలైన రకము కూడ లభ్యము కావచ్చును. వేయేల, ప్రతికార్యము నిట్టి సంఘములవలన నెఱవేర్చుకొనవచ్చును. సర్కారు సిస్తు సమయములో రయితుల పాలిటి కివి కల్పవృక్షములు. సాహుకారులు తమయొద్దనున్న ధనము నిట్టి సంఘములలో దాఁచుకొనినచో, వారు న్యాయస్థానములకు తఱచుగా పోవుట తగ్గును. మన దేశమందు కూలీలును, తదితరులగు బీదలును తాము సంపాదించుకొనిన చిన్న మొత్తములను వృథావ్యయము చేసి కల్లు సారాయి త్రాగుచుందురు. అట్టివారందఱిని తాము సంపాదించుకొన్న చిన్న మొత్తముల నిట్టి సంఘములలో దాఁచుకొనునట్లు చేసి వారికలవాటుగా నున్న త్రాగుఁబోతుతనమును మాన్పింపవచ్చును.

నూతనముగా సంఘములు స్థాపింపఁబోయినప్పుడు కొన్ని చిక్కులు కలుగుచున్నవి. అవి యెవ్వియనిన:—(1) మితి లేని యుత్తరవాదిత్వము (2) ఆస్తిపట్టి (3) సాహుకార్ల సలహాలు. గ్రామసంఘము లన్నియు పరిమితి లేని పూచీసంఘములుగా నేర్పఱుపఁబడుచున్నవి. పరిమితి లేని పూచీ యనఁగా అట్టి సంఘము చేయు యావత్తు ఋణములకును సంఘములో చేరినవా రందఱును జవాబుదారి వహించుట. ఇట్టి పూచీమీఁద పనిచేయుచున్న సంఘము లేవియు నష్టము పొందియుండలేదు. ఇట్టి పూచీ యుండిననే గాని యైకమత్య మేర్పడఁజాలదు. మర్యాద గలవారినే సంఘములో చేర్చుకొనుచుండుటవలన నష్ట మేమియు రాదనియే దృఢముగా చెప్పవచ్చును. సంఘము ప్రారంభించుటకు పూర్వము సంఘములో చేరఁదలఁచుకొన్నవారియొక్క స్థిరచరాస్తుల వివరము వ్రాయవలసియుండును. ఇట్టి పట్టి తయారుచేయుచున్నప్పుడు దొరతనమువారు తమ యాస్తి నెల్ల తాకట్టు పెట్టుకొనుచున్నా రనియు సంఘము వడ్డి సాహుకారు వడ్డి యొకటియే యనియు సాహుకార్లు సలహా నిచ్చుచుందురు. ఆస్తిపట్టిక వ్రాయఁబడెడి యుద్దేశ మేమనిన, సంఘము మెంబర్ల యాస్తి నంతటిని లెక్కచూచుకొన్న తరువాత మొత్తము మాస్తిలో 8-వ వంతు సంఘమునకు ఋణ మియ్యవచ్చునని నిశ్చయించుకొనుటయే గాని ఆస్తిని తాకట్టు పెట్టుకొనుట గాదు. దొరతనమువారికి సంఘమువారి యాస్తితో పనిలేదు. దొరతనమువారి సహాయమువల్లనే మనదేశమందు సంఘములు వృద్ధినొందుచున్నవి. చెన్నరాజధానియం దిట్టి సంఘముల పరిపాలన నిమిత్తమై దొరతనమువారు తమయుద్యోగస్థులకు సంవత్సరమునకు లక్ష రూపాయీలు జీతములుగా నిచ్చి వారిచే పని చేయించుచున్నారు గాని యొక్కఋణమైనను సంఘములనుండి పుచ్చుకొనుట లేదు. సాహుకారు వడ్డియు సంఘము వడ్డియు ఎప్పటికి నొకటి కాఁజాలదు.

కనుక, ఆంధ్రులారా! మనదేశమందుఁ గల ప్రతి గ్రామమునకు నొక సంఘమును ప్రతి మండలమునకు గ్రామ సంఘములకు ఋణము లిచ్చుటకై యొక్కొక్క డిస్ట్రిక్టు బ్యాంకును స్థా దేశమును బాగుపఱచిపెదు రని నమ్ముచున్నాను.

# యుద్ధము—హైందవులు

బలభద్రుని కోటయ్యగారు

సత్త్వరజస్తమోగుణములలో నొక్కొక్క టొక్కొక కాలమున ప్రకాశించును. కేవలము సత్వగుణ ప్రధానముగాఁ గలది కృతయుగము. ఆ కాలమునందలి ప్రజలు మిగుల సాత్వికులు. వారు భుజించునది సాత్వికాహారము. అప్పటి వాతావరణస్థితి కూడ భేదమే. గనుక దప్పక నెలకు మూఁడు వర్షములు కురియుచుండుటవలన సస్యములు బాగుగా ఫలించి మనుజులకును మృగములకును సుఖదాయకముగా నుండెడిది. మృగములు కూడ కృతయుగమున సాత్వికవృత్తితో నుండుట కిదియే కారణము. ఆ కాలమునందలి మనుజులకు శోకము, కోపము, భయము, ద్వేషము, మోసము మున్నగువానితో పని లేదు. కావున, ఆ ప్రజలను పాలించుటకు ప్రభు వవశ్యము లేదు. ఆ కాలమునందలి ప్రజలు సేవించుటయు నెఱుఁగరు. ఆ పని వారి కవశ్యము లేదు. అనవశ్యకమును అలవాటును లేని కార్యములు నీచకార్యములుగా నెంచఁబడుట సుప్రసిద్ధము. దేశకాలస్థితులు క్రమముగా మార్పులు చెందుటవలన రజోగుణము ప్రకాశింపఁజొచ్చెను. రజోగుణ ప్రధానమువలన పరాక్రమము కొందఱియందును సాత్వికము కొందఱియందును ప్రకాశించుచుండెను. అది త్రేతాయుగము. ఆ కాలమున కోపము, భయము మున్నగునవి ప్రకాశించుచుండెను. అప్పటికిని ప్రభువులు లేరు. చాలవఱకు సత్యమే ప్రకాశించుటచే ప్రజలు సమాజములను స్థాపించి తమతమ లోపములను సైరించుటకును, శిక్షించుటకును, జ్ఞానోపదేశము చేయుటకును నాయకుల నేర్పఱచిరి. వారి కాచార్యు లనియు గురువు లనియు పేరు. ఆచార్యులు కూడ నక్రమపద్ధతుల నవలంబించినప్పుడు వారిని తీసివేసి మఱియొకరి నేర్పఱచుటకు సాంఘికుల కధికారము గలదు. ప్రస్తుత మీ పద్ధతిని అమెరికా మున్నగుచోట్ల పరిపాలన జరుగుచున్నది. రానురాను ప్రజలయందు సత్వగుణము చాలవఱకు తగ్గి రజోగుణ మధికమై యించుక తమోగుణము ప్రకాశింపఁజొచ్చెను. కోపము, ద్వేషము, భయము మున్నగునవి అప్పటికి ప్రధానగుణము లయ్యెను. అది ద్వాపరయుగము. రజోగుణ మధికమై ప్రతివాఁడును రెండవవానిని జయింపఁజూచుటవలనను, క్షాత్రము తమోగుణమిశ్రమమై యుండుటవలనను, నాయకులు రజోగుణప్రధాను లగుటవలనను ప్రజలను పాలించుటకు ప్రభువు లగత్య మయ్యెను. సాధువులను రక్షించుట, క్రూరులను శిక్షించుట వీరి పని. తరువాత క్రమముగా సత్వగుణము నామమాత్రావశిష్టమై, రజోగుణ మల్పమై, తమోగుణ మధికమైనది. ఇది కలియుగము. ఈకాలమున ద్వేషము, మోసము ప్రధానము. కలియుగమున సత్వగుణ ప్రధానులును, నీతిపరులును, సత్యవంతులును జీవయాత్ర ననాయాసముగఁ గడపఁజాలరు. వీరిని పోషించు ప్రభువులు లేరు. నాయకులు, గురువులు మున్నగువారు ధనాకర్షణయే ప్రధానముగా నెంచి సాంఘికనీతిని కాపాడుట తమ విధాయక మను మాటను మఱచియుండుటవలన, ప్రజాపక్షమున నుండవలసిన యధికారము లన్నియు ప్రభుపక్షమున చేరినవి. సమస్తమగు నేరములు ప్రభువులచేతనే పాలింపఁబడుచున్నవి.

కలియుగమున సమస్తకార్యములు ధనముచేతనే నడపఁబడుచుండుటవలన ప్రభువులకును ప్రజలకును ధనాకర్షణము ప్రధానమైనది. ప్రపంచ మీషణత్రయముచే చుట్టఁబడియున్నది. దారేషణ పక్షులయందును, పుత్రేషణ మృగములయందును, ధనేషణ మనుజులయందును గలదు. సమస్తధర్మములు ధనము ననుసరించి నడచుచుండును. యుద్ధములు కూడ ధనాకర్షణకొఱకుఁ దక్క వేఱొండు ధర్మరక్షణకొఱకుఁ గాదు.

ఇది యుగధర్మము. ఏ యుగమున నా యుగధర్మము నడుపవలెను గదా? ధర్మ మనేకవిధములుగా నుండును. అది దేశకాలస్థితుల ననుసరించి మాఱుచుండును. ఒకరి ధనగౌరవములను గాని ప్రాణమును గాని వేఱొకఁడు హరించుటవలన దండనీతి యుగ్రరూపము దాల్చి న్యాయస్థానమున నిలువఁజాలనప్పుడు రణరంగమున కేగును. బక్కప్రాణి హరింపఁబడుట దుర్భరమైనప్పుడు రణరంగముం దనేకులు మృతి నొందుట సంతసమగునా? అట్లయినచో, యుద్ధము చేయవచ్చునా? గయుని మూలమున కృష్ణార్జునులకు యుద్ధము సంభవించెను. ఐరోపామహాసంగ్రామము దాదాపీ విధముగనే ప్రారంభ మయ్యెను. ప్రజలకు రణోత్సాహ మేల కలుగవలయును? భూభారమును తగ్గించుటకై యుద్ధమును కల్పించితి నని కృష్ణభగవానుఁడు నుడివియున్నాఁడు. యుద్ధమువలనఁ జేయునది శత్రుసంహారమా? పాపసంహారమా? శత్రువులు పాపులగుదురా?— అనువానిని విచారింపఁదగును. పాపులే లోకమునకు శత్రువులు. ధనగౌరవములను హరించుట, సత్కార్యములను పవిత్రస్థానములను నాశనము చేయుట, స్త్రీలను చెఱపెట్టుట మున్నగునవి పాపకార్యములుగా నెన్నఁబడును. ఇట్టి కార్యములను చేయువారు తమోగుణప్రధాను లనియు, పాపు లనియు, లోకమునకు శత్రువు లనియు చెప్పఁబడుదురు. వీరిని సంహరించుట లోకహితార్థము గాని వేఱు గాదు. ఆపనికి రజోగుణము తన సహజధర్మములతో మూర్తీభవించి రణసీమను కైకొనును గావున సమర మొనరించుట సమంజసమే.

ప్రస్తుత యైరోపాఖండమున ప్రతిమనుజునకును సమరోత్సాహము కలదు. అది యితరఖండములలో లేదు. అవశ్యమును లేదు. జ్ఞానము గలవానికే భయముండును. భయము గలవాఁడే పరాక్రమవంతుఁడుగా నుండుటకు ప్రయత్నించును. పసిబిడ్డలకు భయముతోఁ బని లేదు. ప్రస్తుత మాంగ్లప్రభుత్వము హైందవులను పసిబిడ్డలవలె గౌరవించుచున్నది. ఆంగ్లేయుల పాదస్పర్శ కలిగినది మొదలు నేటివఱకును భారతమాత కష్టము లను మాట మఱచినది. దయగల బ్రిటిష్ ప్రభుత్వమువలన భారతీయులు చిరకాలమునుండి శాంతిభంగము లేక సుఖించుచు తమసాత్వికవృత్తిని సార్థకపఱచుకొనుచున్నారు. కాని వీరి కిప్పుడు క్షాత్ర మవశ్యమని తోఁచుచున్నది. తల్లివలె ప్రభుత్వము పోషించుచున్నను ఆత్మరక్షణకై ప్రతిమనుజుఁడును పరాక్రమవంతుఁడై యుండవలయును. ఎమ్డెన్ చేసియున్న తుంటరి కృత్యములు సుప్రసిద్ధములే గదా? మదరాసుపై ఫిరంగులు విడువఁబడినప్పుడు వేనవేలు ప్రజలు తమకు కలిగిన యాపదను నివారింపుఁ డని దొరతనమువారిని వేఁడుటకు మాఱుగా రోదనము చేయుచు పాఱిపోవఁజొచ్చిరి. అట్టివారిని ప్రభుత్వమువా రెట్లు రక్షింపఁగలరు? ఆపదలు సంభవించినప్పుడు గాని వానిని నివారించుకొనుట కుపాయమును గ్రహింపఁ బ్రయత్నింపరు. సాత్వికవృత్తి గల భారతీయులయొకుట రజోగుణమునకు ప్రముఖత నిచ్చి ప్రతిమనుజుఁడును వీరుఁడుగా నుండవలె ననుట యుక్తిత ధర్మవిరోధముగా నుండును గాని, దేశకాలస్థితుల ననుసరించి యొప్పుకొనక తప్పదు.

ధర్మ మెట్లున్నను సమరముయొక్క ముఖ్యోద్దేశము సంహరించుట గావున బుద్ధిచాతుర్యము కొలఁది ననేకప్రయోగములు చేయఁబడుచున్నవి. ప్రస్తుతము జర్మనులు ఆగ్నేయాస్త్రములు, విషప్రయోగములు, శస్త్రములు మున్నగువానిని ప్రయోగించుచున్నారు. భూమిమీఁదను జలముమీఁదను ఆకసముమీఁదను యుద్ధము చేయుచున్నారు. పావురములచే యుద్ధవార్తల నంపుట, ఫోటోగ్రాఫులను దీయుంచుట మున్నగు కార్యములను చేయుచున్నారు. ఇవి లోకోత్తర మగు కార్యములు. ఇట్టి కార్యములవలననే మనుజు లద్భుతశక్తివంతు లనియు, ఈశ్వరాంశసంభూతు లనియు చెప్పఁబడుదురు. కాని వీరి శక్తు లద్వితీయములు గావు. పూర్వకాలపు హిందూశిల్పముల నొక్కసారి స్మరింపుఁడు! మయుఁడు మేఘవాహనారూఢుఁడు. అనఁగా నంతరిక్షమునఁ బోవువాఁడు. గంధర్వులకు తెక్కలుండు ననుటవలన మన పూర్వులు మనుష్యున

K. BRAHMAYYA LINGAM AYYAVARLU (Masulipatam)



కాశీనాథుని బ్రహ్మయ్యలింగం అయ్యవార్లంగారు

B. PADMARAZU GARU



శ్రీ బసవా పద్మరాజుగారు (ముక్కామల, గోదావరి)

Mr. K. VENKANNA



శ్రీమాన్ కుప్పిలి వెంకన్నగారు. వీణాపండితులు (విశాఖపట్టణము)

Mr. V. SESHANNA



వీణ శేషన్నగారు. వీణాపండితులు (మైసూరు)

h

Mr. VALLURI JAGANNATHA RAO



వల్లూరి జగన్నాథరావు గారు.

Mr. A. SRIRAMA SASTRI



బ్రహ్మశ్రీ అఖండం శ్రీరామశాస్త్రిగారు
(రేలంగి, కృష్ణాజిల్లా)

PRESIDENT WOODROW WILSON



అమెరికా ప్రెసిడెంటు వుడ్రో విల్సన్ గారు

Mr. W. J. BRYAN



అమెరికా విదేశాంగమంత్రిగానున్న బ్రయన్ దొరగారు.

కొక్క విమానము చొప్పున తయారుచేసి యిచ్చిరని తెలియుచున్నది. మయునిచే పాండవుల కొసఁగఁబడిన సభను స్మరించినచో ప్రస్తుతము జర్మనులు చేయు మోసకృత్యము లద్వితీయములు గావని తేటపడును. విమానాధికరణము అగమశాస్త్రము మున్నగు శాస్త్రములయొక్క ప్రజ్ఞను చిరకాలమునుండి మఱచియున్న ప్రపంచమున జర్మనీ వైమానికుఁ డగు జపలిన్ మయుని యొక్క యపరావతార మని చెప్పవచ్చును. భీముని పుత్రుఁ డగు ఘటోత్కచుఁ డంతరిక్షమునుండి యుద్ధము చేసియున్నాఁడు. పూర్వకాలమున వేదముల నపహరించి సముద్రమధ్యమున దాఁగియున్న సోమకాసురుని వధించుటకై శ్రీకృష్ణుఁడు మత్స్యావతారము నెత్తి సముద్రములో యుద్ధము చేసియున్నాఁడు. ప్రస్తుతయుద్ధ మిట్టి సామర్థ్యములతోనే జరగుచున్నది. ఇట్టి మహాత్తరమగు ప్రజ్ఞలు కృతయుగమునం దుండెడివనియు, కలియుగమునందలి చివర పాదమున కృతయుగ ధర్మము నడచు ననియు కాలజ్ఞానము చెప్పుచున్నది.

కృషిచేయుట విధ్యుక్తధర్మము. జయాపజయము లీశ్వరాధీనములు. విరాట్పురుషుని కర్ణములయందు పుట్టిన రాక్షసునకును నాభికమలమునందు పుట్టిన బ్రహ్మకును అరువది వేల సంవత్సరములు యుద్ధము జరగెను. రామరావణయుద్ధమును చిరకాలము జరగెను. భారతయుద్ధము పదునెనిమి దక్షౌహిణుల బలము మడియఁగా పదునెనిమిది దినములలో ముగిసినది. పరాక్రమమునం దద్వితీయు లగు భారతీయులు నిర్వ్యాజ్యులై తుదకు భారతమాత నష్టకష్టములనుండి కడతేర్చిన బ్రిటిష్ దొరతనమువారి కీ యుద్ధసందర్భమున తోడ్పడనైనఁ జాలకుండుట శోచనీయము. భారతీయుల భక్తి ప్రపంచమునం దద్వితీయము. వీరికి రాజభక్తి మెండు. వీరి రక్తనాళములయందు భక్తితో పాటు పౌరుషమును జీర్ణించియున్నది. కాని పరాక్రమమునందు విముఖులై యున్నారు. ఆయుధశాసన మనెడి చట్రాతిక్రింద నణఁగి పడియున్నారు. రాజశాసన మెట్టిదైనను చర్చించుటకుఁ గాని తిరస్కరించుటకుఁ గాని పూనుకొనక దాని నీశ్వరాజ్ఞగా నెంచి శిరసా వహింతురు. వీరు కత్తిని గాని కట్టను గాని తుపాకిని గాని యుపయోగింపఁజాలకుండుటచే ప్రస్తుతపు యూరోపామహాసంగ్రామమున నాంగ్లప్రభుత్వమువారికి బాగుగా తోడ్పడఁ జాలనందులకు మిగుల విచారించుచున్నారు. ఇకనైన దొరతనమువారాయుధశాసనమును తొలఁగింపకున్న, భారతీయుల రాజభక్తివలన తాము పొందవలసిన ఫలమును ప్రభుత్వమువారు పొందఁజాలరని నిస్సంశయముగఁ జెప్పవచ్చును.

సీ. దుష్టులౌవారిని దునుమాడి శిష్టులఁ గారుణ్యమునఁ బ్రోచు కలితయశుఁడు
తనవారు పెరవార లనెడు భేదము లేక సమదృష్టితోఁ జూచు సన్నుతుండు
న్యాయైకదృష్టితో నన్నిదేశంబులఁ బాలించునట్టి భూపాలవరుఁడు
పరులతోఁ దుదఁ బగ నొల్ల కెవ్వేళల సాధుత్వమున నుండు సజ్జనుండు

అట్టి శ్రీజార్జి ప్రభున కిప్పట్టునందు
వచ్చె జర్మనురాజుతో వైర మిపుడు
గాన సర్వేశ్వరుండును గరుణతోడ
విజయ మిడుఁగాత శ్రీజార్జి విభున కెపుడు

PRES DENT POINCARE



ప్రెసిడెంటు పోయిన్ కేర్

[M. DELCASSE.



ఫ్రెంచి విదేశాంగమంత్రి ఎం. డెల్కాసె

M. VIVIANI



ఫ్రెంచి ముఖ్యమంత్రి ఎం. వీవియాని

GENERAL D'AMADE



జనరల్ డి అమాడి. మరొక్కో వారికి పంపబడిన
ఫ్రెంచి సేనాధ్యక్షుడు

THE END OF A TERRIFIC ENCOUNTER



ఫ్రెంచిపదాతులును, ప్రష్యన్ గార్డులును మాండిమాంటు ధాటో కొరకయి నాలుగుపర్యాయములు
పోరాడినపిమ్మట, కట్టకడపట ఫ్రెంచి సైనికులు దానిని వశము చేసికొనుట

# మానసగీతము

తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు

కాలమును గడల్ప మేధావి కాన మూన్పఁ  
బనులఁ గల్పింపఁ గవులకుఁ దనరుదాని  
నరయ మనసయ్యొ; మనసయ్యొ నరయ నదియె;  
అది యయ్యెను జగమున కంత కదియె. 4  
దానిఁ బట్టి బయల్ వెట్టఁ దలఁపు గలిగ;  
బాహిరంబున కాంతరప్రకృతి కదియె  
మూలకారణమై చెల్లు మూర్తి యయ్యె.  
అఖిలమతములవారు తదాస్తికతను 8  
నొప్పుదురు; దీనికిని గూడ నొకటి గల్గు  
మూలప్రకృతి యటంచును జాల నరసి  
పల్కు మతములు నున్నవి; పట్టి చూడ  
నావిభేదముల నటుంచి యంద రైక 12  
మత్యముగ నొప్పికొనినట్టి మతమునకును  
మూలమైనట్టి మనసును లీలలకును  
పాత్రముగఁ జేసి వెలిఁ జూప బ్రహ్మ వశమె?  
ఎవని గుట్టు బయల్ వెట్ట నెవని కగును; 16  
బలుకఁ బలికింప నూహ యుద్భవము సేయఁ  
దాని కర్తయుఁ గారయితయును నగుచు  
నెలయు మన నది, తన చిత్తవృత్తిపగిది.  
బయలుపడినను లోలోనఁ బ్రబలియున్న 20  
మెలఁగునది కాని యొరుచేత మెలగునదియె?  
చిద్విలాసంబుగను నాదు జిహ్వనుండి  
తన విలాసంబు నొకయింత గనుపఱుపఁగ  
నాంతరప్రకృతుల తత్వ మరయఁగోరు 24  
వార లగుదు గా దన నిచ్చపడితొ యేను  
యుట్టి సంకల్ప మొదవించె నిచ్చ నొకటె;  
కరము చంచల మగు దీని గతులఁ గనినఁ  
జంచలత తామరాకున సలిలమునకు 28  
ఘనతమం బని చాంచల్యగరిమ కెపుడు  
నుపమగాఁగ గణించిరి నిపుణమతులు;  
వారి పల్కులు న్యూనలు గావలయు దీని  
గతులఁ జాంచల్యమును సరిగాఁ గనంగ; 32  
నెంతలో బుద్ధి మాఱునో యెఱుఁగరాదు;  
తలఁపు లిప్పుడు తనుఁగూర్చి నిలిపె మదిని;  
పురికొలుపుచుండె నది వెలిఁబుచ్చు మనుచుఁ;  
గాలనైలంబు మొకయింత గాక యుండ 36  
వెడలఁబుచ్చఁగవలె మనోవేగమునను;  
కల మల మనోగతిని బోవఁగలదె యెంత  
వడిగ వ్రాసెడి లేఖకు వ్రాఁతకైన?  
కలము కొలపాత్ర, జలధులు తలఁపు లెన్న; 40  
నెంత వశమౌనొ దానికి నంతవట్టు  
పాఠకవిమర్శనకుఁ దెచ్చి పాలుపఱుతు;  
పాఠకమహాశయులు మీరు పట్టు విడక  
మీ మనోనుభవంబులమీఁద దృష్టి 44  
నిలిపి వినుఁడయ్య మాపల్కు నిజము దెలియుఁ;  
గన మనోదృష్టి సమభావమునఁ జెలంగ  
దేమి చిత్రమొ! తెలియరా దెవ్వరికిని;  
ఇంద్రియంబుల నరికట్టి యిహసుఖముల 48  
యాశ దిగఁద్రోసి యతులైన యయ్యలైన  
మనసును జయింప లేరైరి మానదయ్యొ  
విషయపర్యాకులత బ్రహ్మవేత్తలకును;  
విషయము లనంగ నెయ్యవి వీని జన్మ 52  
నేమి యెయ్యది? యనుచుఁ బ్రశ్నించువారె?  
మనసు నడుగుద మది పుట్టె మనికిఁ గన్న  
తాఁపు తా నౌనొ వేఱొక్కతాన మగునొ?  
ఉభయపక్షంబులందుఁ బ్రశ్నోత్తరముల 56  
కన్నిటికి నన్నె కర్తగా నరయువారె?  
మనస! యొక్కింతసేపు నా మాట వినుము

నీ రహస్యంబు లోకకొన్ని జారవిడుము;
నిన్నుఁగూర్చిన గీత మానించు నెడల 60
లోటు వచ్చిన నదియు నీ లోటు గాదె?
మొటను ఛాయాపటముఁ దీయు నెడ నొకింత
ప్రకృతిరూపంబు నెవరినఁ బనులవాని
నేర్పు కొఱనైన ఫలము గణింప నొకట 64
పటము నైరూప్యమును బొంది పాడుపడుట,
నిన్నెఱుంగనివారు నిందింత్రు నిన్ను;
నెఱుకఁ గలవార లంత్రు న న్నే మనినను;
వా రెఱుంగరే నేను నీ వశత నుంట? 68
కాన లోకుల్ల నాదిగాఁ గాన రెవరు;
కేవలస్వతంత్రత మటుంచి భావిఁ జూచి
యతురఖ్యాతి గనువారి యుండ గనుము;
అన్నియును గూడఁ జక్కనై యలరు నపుడు; 72
భారతీదేవి సాయంబుఁ బడయరాదె?
తోడఁ బనిసేయుచుండు నీ కరాడ నుండి,
యవయవంబులు మనస! నీ కళలవిషయ
సంచయంబును; నీవెగా జన్మభూమి 76
యింద్రియంబుల కన్నింటి కెటులు గనినఁ;
దత్సహాయమున జగ మంతయు జయింత్రు;
వెలుపలను గల్గు నఖిలంబుఁ దెలిసికొనుచుఁ
బట్టి లోపలి కీవ్చుచు బలిమినో చను 80
వునవో యొప్పగించెదు లోనె పనులు సేయు
వానికెని కొన్ని యవియె గా బాహిరములు;
అంతరంగములోఁ గొన్ని యమరియుండి
చక్కఁజేసెదు పను లెల్ల జగతియందు; 84
లోన వెలుపల నవి యేమి లోఁగొనినను
నెంతె యవ్యగ్రముగ నవి యొనఁగుచున్న
నీకుఁ జిత్తంబు రానిదే నిలువ దెదియు;
నేది గనుచున్న వినుచున్న నెచట నీకుఁ 88
దలఁపు పుట్టునో యది తక్క నొకటి
బుద్ధి కెక్కదు; నీ భావమును గ్రహించి
యంతరంగానుచరులు; బాహ్యానుచరులు
నూడిగము సేయవలయు నీ కొప్పిదముగ 92
అందఱును నీకు వశవర్తులై మెలంగు
చుందురే గాని లోనుగా వ్రకరి కీవు;
సర్వతంత్రస్వతంత్రు లీజగతి నైనఁ
గలరె నీవంటివార లొక్కరుడు గాని? 96
స్వేచ్ఛ నినుఁ జెప్పి మఱి యన్యుఁ జెప్పవలయు;
యతులు సామ్రాజ్యపట్టభద్రాయతులును
గడు స్వతంత్రు లటంచుఁ బేర్వడినవారు;
వారిపై నాధిపత్యంబు వఱలు నీకు; 100
నింతకంటెను స్వాతంత్ర్య మెటను గల్గు?
పార్థివులు ప్రకృతిచేఁ దుష్టిపడనివారు
వారిపైన నీ వధికారపథము గనుట,
వింత గా దనఁగ నొక విధము గాఁగ; 104
నీదు పరివారమును గెల్చి నిను జయింప
నేకదీక్షగఁ బనిసేయ నెసఁగువారు
అదియె నియతిగఁ గలవారు యతు లనంగ;
శమదమాదులఁ బరివారసరణిఁ గాంచి 108
శాంతిసాధనములను దుర్దాంతు లగుచుఁ
బట్టి బంధించి నీ పరివారములను
ముట్టడింతురు వా రటకట్టి నిన్ను
నిను వధించి లోకజ్ఞ సన్యాని వచింప 112
వలెను శత్రుఁడు నైఁజేయి గలిగియున్న
నొదిగియుండును సమయంబు పొదలుదనుక;
పట్టియుంచిన కొన్ని చేపట్టు సడల
రివ్వనను దొల్లిటికి నూరు రెట్లు వడిని 116
మింటి కెగసెను క్రియ వారిమీఁద మరల
నీదు నధికారవిభవంబు నెఱపుచుందు.
అణువు నీ రూప మాకాశమంత యాశ
యాశలకు నెల్లఁ గూటస్థురాల వీవ 120
యఖిలయోజనలకు మూల మగుదు వీవ
పాపపుణ్యంబులకు నున్కిపట్టు వీవ
మూడు లోకంబులును గాలములును గూడ
నెఱుఁగఁగలదాన వీవ; నిన్నెఱుఁగ నగునె? 124
గతము దెలిపెడి తఱి నిన్ను స్మృతి యటంద్రు;
మఱి యటందురు భావిసంగతుల నున్న

నీ రహస్యంబు లోకకొన్ని జారవిడుము;
నిన్నుఁ గూర్చిన గీత మానించు నెడల 60
లోటు వచ్చిన నదియు నీ లోటు గాదె?
మొటను ఛాయాపటముఁ దీయు నెడ నొకింత
ప్రకృతిరూపంబు సెవరినఁ బనులవాని
నేర్పు కౌశలమైన ఫలము గణింప నొకటి 64
పటము నైరూప్యమును బొంది పాడుపడుట,
నిన్నెఱుంగనివారు నిందింత్రు నిన్ను;
నెఱుకఁ గలవార లంద్రు న న్నే మనినను;
వా రెఱుంగరే నేను నీ వశత నుంట? 68
కాన లోటెల్ల నాదిగాఁ గాన రెవరు;
కేవలస్వాతంత్ర్య మటుంచి భావిఁ జూచి
యతుర ఖ్యాతి గనువారి యండ గనుము;
అన్నియును గూడఁ జక్కనై యలరు నపుడు; 72
భారతీదేవి సాయంబుఁ బడయరాదె?
తోడఁ బనిసేయుచుండు నీ కూడ నుండి,
యవయవంబులు మనస! నీ కఖిలవిషయ
సంచయంబును; నీవెగా జన్మభూమి 76
యింద్రియంబుల కన్నింటి కెటులు గనినఁ;
దత్సహాయమున జగ మంతయు జయింతు;
వెలుపలను గల్గు నఖిలంబుఁ దెలిసికొనుచుఁ
బట్టి లోపలి కీడ్చుచు బలిమినో చను 80
వుననొ యొప్పగించెదము లోనె పనులు సేయు
వానికిని గొన్ని యవియె గా బాహిరములు;
అంతరంగములోఁ గొన్ని యమరియుండి
చక్కఁజేసెదు పను లెల్ల జగతియందు; 84
లోన నెఱపల నవి యేమి లోఁగొనినను
నెంతె యవ్యగ్రముగ నవి యొసఁగుచున్న
నీకుఁ జిత్తంబు రానిదే నిలువ దెదియు;
నేది గనుచున్న వినుచున్న నెచట నీకుఁ 88
దలఁపు పుట్టునో యది తక్క నొకటి
బుద్ధి కెక్కదు; నీ భావమును గ్రహించి
యంతరంగానుచరులు; బాహ్యానుచరులు
నాడిగము సేయవలయు నీ కొప్పిదముగ 92

అందఱును నీకు వశవర్తులై మెలంగు
చుందురే గాని లోనుగా వ్రకరి కీవు;
సర్వతంత్రస్వతంత్రు లేజగతి నైనఁ
గలరె నీవంటివార లొక్కరుడు గాని? 96
స్వేచ్ఛ నినుఁ జెప్పి మఱి యన్యుఁ జెప్పవలయు;
యతులు సామ్రాజ్యపట్టభద్రాయతులును
గడు స్వతంత్రు లటంచుఁ బేర్వడినవారు;
వారిపై నాధిపత్యంబు వఱలు నీకు; 100
నింతకంటెను స్వాతంత్ర్య మెటను గల్గు?
పార్థివులు ప్రకృతిచేఁ బుట్టిపడినవారు
వారిపైన నీ వధికారపక్షము గనుట,
వింత గా దనఁగు నొక విధము గాఁగ; 104
నీకు పరివారమును గల్గి నిను జయింప
నేకదీక్షఁగఁ బనిసేయ నెసఁగువారు
అదియె నియమితిగఁ గలవారు యతు లనంగ;
శమదమాదులఁ బరివారసరణిఁ గాంచి 108
శాంతిసాధనములను దుర్దాంతు లగుచుఁ
బట్టి బంధించి నీ పరివారములను
ముట్టడింతురు వా రటకట్టి నిన్ను
నిను వధించి లోకజ్ఞ సన్యాసి వచింప 112
వలెను శత్రుఁడు నైఁజేయి గలిగియున్న
నొదిగియుండుసు సమయంబు పొదలుదనుక;
పట్టియుంచిన కొమ్మ చేపట్టు సడల
రివ్వునను దొల్లిటికి మారు రెట్ల వడిని 116
మింటి కెగసెడు క్రియ వారిమీఁద మరల
నీవు నధికారవిభవంబు నెఱపుచుండు.
అణువు నీ రూప మాకాశమంత యాశ
యాశలకు నెల్లఁ గూటస్థరాల వీవ 120
యఖిలయోజనలకు మూల మగుదు వీవ
పాపపుణ్యంబులకు నున్కిపట్టు వీవ
మూడు లోకంబులును గాలములును గూడ
నెఱుఁగఁగలదాన వీవ; నిన్నెఱుఁగనగునె? 124
గతము దెలిపెడి తఱి నిన్ను స్మృతి యటంద్రు;
మఱి యటందురు భావిసంగతుల నున్న

బుద్ధి వోదు తాత్కాలికముగ మెలంగ ;
వంద లామడలను దూరమందు నున్నఁ 128
గనని విననట్టి వస్తువులఁ గాంతు వీవ;
కాలజలనిధి నడుగంటి గ్రాలుచున్న
యర్థములఁ దెచ్చి యెదుటఁ బ్రత్యక్షముగను
వెలలఁ జేయుదు ; వెదుటఁ గన్పడుచునున్న 132
వారిఁ గనకుండఁ జేతువు; దూరభార
మనెడి మాటలు లేవు; దా పనుచు లేదు ;
మిత్రుఁ డని లేదు; లేదు బల్ శత్రుఁ డనుచు
సర్వసమురాల వీను నమ్మి చనఁగ రాదు 136
నీదు సాంగత్యమును నమ్మి నెగడువారి
మనసువచ్చిన రీతిని మనెడువారి
వర్తనము బోధపడునె యెవ్వరికి నైన ?
ఒకని వృత్తంబు నొకరీతి నుండనీవు 140
మిత్రులను శత్రులుగఁ జేసి మెలపుముందు
మిత్రులుగఁ జేతు తృటిలోన శాత్రవులను;
మంచిఁ జెడ్డగఁ జెడుగుల మంచివిగను
గనుఁగొనఁగఁ జేతు భ్రమ యనుకొనక యుండఁ 144
దిరుగులేనట్టి మం దిచ్చి త్రిప్పుచుందు;
మందు తల కెక్కినా, లవమాత్ర మైనఁ
దిరుఁగు మఱుఁగగు మఱుఁగగుఁ దిరుగు జగతి
సాధుసాంగత్యమునఁ బ్రోవఁ జనెడువారి 148
దారి దప్పించి మెలపంగఁ దప్పుత్రోవ
నడుగువారల నడుగంట నణఁగఁద్రొక్కి
బయటఁబడకుండఁ జేయఁ బాల్పడుచునుందు
వ్యసనములలోనఁ దగుల్కొనువారిఁ గనుఁడి. 152
దినదినంబును వృద్ధిగాఁ దనరుఁ గాని
తిరుగు గనరాదు ; నుడిబడి తిరుగుచుంద్రు ;
స్నేహ మని నిముసము నమ్మి చెలఁగ లేరు
వైరభావంబువలన లాభమును లేదు 156
ప్రకృతి యగు నీకు దుష్పథవర్తనంబు
సత్ప్రవర్తనకును నీకుఁ జాల దవ్వు,
అడుగు పడ దేలొకో నీకు నమలగతుల
నొక్కపట్టునఁ ; జప్పునఁ జక్కఁబోదు 160

వెగుబుజంబున కాపథ మగపడఁగనె
నీరు పల్లమునకు నేగు తీరు గాఁగ
అందువనె నిన్ను మాయకు నాత్మజ వని
యాస్తికమతావలంబులై యలరువారు 164
పరమమతిఁ జూచి సిద్ధాంతపఱచినారు ;
జడ మటందురు తార్కికజ్ఞానమతులు
నిన్నుఁ గొందఱు ; లే దందు నీకు స్వప్ర
కాశతయె కొంద ; ఱెందలి కల్ల నిజము 168
లరయ శక్తు లెవ్వరు? స్వయంవ్యక్తి వగుదొ
ఛాయ వయ్యెదవో చెప్పఁజాల మమ్మ!
ప్రకృతిచాంచల్యము భవత్స్వభావ మరయ
దాని యనుభవమునుబట్టి నీ నడవడు 172
లరసి చూచిన ఛాయవే యనుచుఁ దోఁచు ;
లేకయుండిన స్థైర్యంబు లేద దెట్లు?
అందుచే స్వయంవ్యక్తి గా వంద్రు నిన్ను
మూల మున్నది నినుఁ ద్రిప్పఁజాలునద్ది; 176
అదియె యాస్తికు లెల్లరు నాత్మ యంద్రు
నీకుఁ గూడను మూలమై నెగడు దాని
హస్తవటిఁ జేసి యాడింతు వనవరతము;
వింత యగుఁగాదె యిది మాయవిధముగాదె? 180
ఆత్మ యద్ద మగును మెఱుఁ గగుదు వీవు.
నీదు సంగతిచే నాత్మ నిశ్చయంపు
స్థితిని నేమఱుచుండె, నీ గతియె గతిగ
నలరుచున్నది, కల్ల యథార్థ మనుచు 184
భ్రమను బడి దిరుగుచున్నది విమతి యగుచు;
చటులసాంగత్యదోష మెంతటికిఁ గాదు ?
అద్దమున మెఱుం గెటు లుండు నటులు గాదె
మొగము గన్పడు? నొకవంక మొగము పెద్ద 188
దొకటఁ జిన్న దొకటఁ గోల దొకట గుండ్ర
దొకట బుంగగ నుండెడు నొకటఁ జక్క
శల్యముగఁ గానఁబడుఁ గాని సహజరూప
మెప్పుడో గాని కన్పడ దేర్పడంగ; 192
ఒకని మనమును బోలి వేఱొకని చిత్త
మలర దేలొకొ బుద్ధి భేదములకుఁ గల్గు

మనము లన్నిటికిని లోన మమత గలదు;
స్నేహభావంబున నొకనిఁ జేరఁబోవ 196
నాదరంబుగఁ గను వాని నాతఁ డపుడు ;
వైరభావంబునను బొమ్మ వానికడకుఁ
జెప్పకయె వాని నాతఁడు చెప్పికొనును ;
త్రాఁగుఁబోఁతులఁ గను మొక్క త్రావునందె 200
గానఁబడుదురు; జూదరుల్ కల్లరులును
స్వచ్ఛమతులును నొక్కొక్క స్థలమునందె
చూడనయ్యెద రెప్పుడుఁ గూడఁ గూడి
వారికిని వీరికిని జెల్మి వఱల దెపుడు ; 204
మంచికిని జెడ్డకును జెల్మి మనఁగనగునె?
భాష చెల్మియు దేశంబు బాంధవంబు
లేనివారలు గూడ లోలోనఁ జాల
నాప్తభావంబు గల్గి యన్యోన్యమైన 208
మైత్రి మెలఁగుచుందురు తత్సమాగమమును
నానుషంగికమే యగు నరసి చూడ;
మనసు లాకర్షణము లేక తనరునేని
నేకవిధంబైన వన్నియు నొకటఁ జేరఁ 212
గారణం బెట్లు చూచినఁ గానరాదు
నిన్ను పురుషునిగాఁగ గణించినారు
తాత్వికులు దానిని యథార్థతను వచింపఁ
జన దనుచుఁ దోఁచు; హేతు వే మనుదు వేమొ 216
తనదు చిత్తానువృత్తి నందఱను ద్రిప్పఁ
నద్భుతపు శక్తి యొక్క స్త్రీయంత్రమునని
గాని యా శక్తి గన మఱొక్కఁడును లేడు ;
అందుననె మూఁడు మూర్తుల కాదికిని 220
మయిన శక్తి యొకం డుండు నాదినని.
అట్టి శక్తులు నీయందు నమరియుంట
స్త్రీత్వ మారోపణముచేసి చెప్పినాము
స్త్రీత్వపుంస్త్వంబు లేర్పడఁజేయ నెవరి 224
కగును? దోఁచిన క్రియఁ జెప్పనగును గాని;
ప్రకృతిని నపుంసకత గల్గి ప్రథమమందు
పుంస్త్వమును బొందె విజ్ఞానపూర్ణులకడ
స్త్రీత్వ మందెను విచట నీ చేష్టితముల 228
స్త్రీత్వపుంస్త్వనపుంస్త్వముల్ చేరి యొకట
నుండు నిచట జగత్కర్తయొద్దఁ దక్క?
నందుననె నిన్ను జగమున కాది గాఁగఁ
జెప్పియున్నారు; జగతియుఁ దెలుఁగు నటులె. 232
స్త్రీ లొకొక్కపుడు తమంత హేల గాఁగ
నెందుకును గానివానిపై నెచట లేని
కూర్మి గలిగి మెలంగుట కూడఁ గలదు;
అట్లె యొప్పునైన నీకు దయార్ద్రభావ 236
మొదవుటయు నుండు నెవ్వరో యొకో పైన
నపుడు సద్వృత్తివానికి నమరుచుండు
వారి వశవర్తినివిగాఁగ వఱలుచుండి
ముక్తికాంతకు వానిపై మోహ మలరఁ 240
జేసి నిర్వాణపదమునకుఁ జేతు నతని;
నట్టి దయఁ జూపుమమ్మ మాయందు నెపుడొ;
నీకుఁ గృప వచ్చునప్పు డందాక మాత్ర
మిటునటును ద్రిప్పి దుర్గతి కీడ్వకమ్మ! 244
అకుఠరభాగ్యలి జగతి నీ కమరునమ్మ!

శా. మా జాడ్యను పరాక్రమాగ్నిశిఖ యుద్యజ్జాతకారుణ్యవీ
చీజాలానిల మూగుచుండఁగ రిపుశ్లాఘాస్త్రలం బంతటన్
బేజారై శలభాకృతిం బడసి భస్మీభూతు లౌనట్లుగా
వేఁ జేయన్ భువి శ్రీజనార్దను నిరన్ విష్ణున్ భజింతున్ మదిన్.

# ఐరోపా మహాసంగ్రామము

## ప్రస్తావన

శ్లో. తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ - జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ - నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. ౧౧-౩౩.

మహాసంగ్రామము బడబానలమువలె నాగరకప్రపంచము నావరించినది. యుద్ధము సకలారిష్టములకు మూలము. ద్రవ్యనష్టము, సుఖనాశనము, జనసంక్షోభము, ప్రజాక్షయము, సర్వసంహారము యుద్ధఫలములు. యుద్ధప్రకటనము రాజులకు భయమును, మంత్రులకు కంపమును, యోధుల కుత్సాహమును, శాంతికాములకు నిరాశను, ఆగ్నేయాస్త్ర నిర్మాతల కానందమును, లోభుల కాశావేశమును గలిగించెను. జనులు గుంపులు గుంపులు గూడి గుసగుసలాడఁ గడంగిరి. పండితులు పామరులు కలహకారణంబులను చర్చింప నుపక్రమించిరి, కలహకారకులను నిందించుచుండిరి. కొందఱు ఆష్ట్రియాయువరాజును యువరాజ్ఞిని చంపిన సర్వియా యువకుని నిందించిరి. కొందఱు చిరకాలముగ సర్వియనులను దౌర్జన్యముపాలు సేయుచున్న ఆష్ట్రియనులు మూలకారకు లని నిందించిరి. మఱి కొందఱు సజాతీయులైన సర్వియనులకు చేయూఁత నొసంగిన రుష్యా కారణ మనిరి. మఱికొందఱు ఆష్ట్రియా కభయహస్తము నిచ్చి స్వలాభమునకై కయ్యమునకు పురికొలిపిన జర్మనిని దూషించిరి. మఱికొందఱు పగను సాధించుటకై వేచియున్న ఫ్రాన్సు కారణ మనిరి. ఇతరులు చిన్నిరాజ్యములను లోకసామ్రాజ్యమును గాపాడుటకై ఇంగ్లాండవలంబించిన ధర్మమార్గమనిరి. కారకు లెవ రైనను రాజనీతి కసమానకరం బైన యుద్ధము పొసఁగినది.

రుద్రుఁ డవతరించెను. విలయమున కేర్పడిన యాయుధములను ధరించెను. లయఘోరమును వహించెను. లయరూపంబు లైన ఝంఝానిలంబులకును, బడబానలంబులకును, జలప్రవాహంబులకును, భూకంపంబులకును, మహావ్యాధులకును కారణభూతుం డైన రుద్రుండు సంగ్రామరూపం బైన లయమునకును కారకుండు. ఇతరకారణములు నిమిత్తమాత్రములు.

అనంతదయామయుం డైన సర్వేశ్వరునకు భయానకం బైన రౌద్రావతార మేల? ధర్మమూర్తికి నిరపరాధి దండన మేల? విశ్వంభరునకు విప్లవవినోద మేల? దీనరక్షకునకు దీనసంహార మేల? సృష్టికర్తకు లయలీల లేల?—అను విషమసమస్యలు లోకవైచిత్ర్యమును పరిశీలించుటవలనఁ గలుగుచున్నవి. ఇట్టి సమస్యలకు సమాధానము సమస్తసృష్టిపరిణామమువలన గ్రాహ్యము కాఁగలదు గాని ప్రత్యేకకారణము నుపపాదించుటవలన గ్రాహ్యము కాఁజాలదు. జీవాత్మ పరిణామమునకు లయపరంపరలు సోపానంబులు. లయము అవస్థాభేదము గాని నాశనము గాదు.

శ్లో. న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౨-౨౦.

సృష్టి లయము ననుగమించియుండును. ప్రాచీనభావప్రపంచమును రూపుమాపి నూతనభావప్రపంచమును నిర్మించుటకు వర్తమాన మహాసంగ్రామమును సాధనంబుగఁ గైకొనుట భగవత్సంకల్పము గావచ్చును. కార్యకారణసంఘటనము దుర్లభ మైనను జీవాత్మపరిణామమునకు లయమును సృష్టివలె మూల మని నమ్మవలసియున్నది.

ఈ సంచికయందు కలహకారకము లైన ఫ్రాన్సు,

బెల్జియము, జర్మని, రుష్యా మొదలగు రాజ్యముల చరిత్రములు సంక్షేపముగ వ్రాయబడినవి. ఆ చరిత్రలను పరిశీలించినపుడు భిన్నరాజ్యముల శ్రేయఃప్రాప్తికి, రాజ్యాభివృద్ధికి, వ్యాపారాభివృద్ధికి ఘోరము లైన యుద్ధములు తఱచుగ జరగినట్లు తెలియుచున్నది. యుద్ధానంతరము భావప్రపంచమునందు మార్పులును నేర్పడుచుండెను.

యుద్ధములకు మొదటియుగమునందు దేశస్వాతంత్ర్యము, మధ్యమయుగమునందు మతస్వాతంత్ర్యము, తుదియుగమునందు ప్రజాస్వాతంత్ర్యము కారణములు. రాజ్యస్వాతంత్ర్యయుగమునందా కారణము పరిస్ఫుటము; తక్కిన భావము లంతర్గతములు. ఇట్టి నిర్ధారణము మూడు యుగములకును వర్తించుచున్నది.

గ్రీకులు మొదట యూరపుఖండమునందు నాగరకాంకురములను నాటిరి. గ్రీకులకు విశ్వాత్మ సుందరాకారము. అయ్యది ప్రకృతియందు దృష్టము. గ్రీకులు నాగరకులు. తదితరు లనాగరకులు. రక్తబాంధవ్యమె దేశ బాంధవ్యము, జాతి బాంధవ్యము. రోమనులకు విశ్వాత్మ ధర్మమూర్తి. అయ్యది సామ్రాజ్య వ్యవహారములందు పరిస్ఫుటము. రోమక సామ్రాజ్య వాసులు నాగరకులు. తదితరు లనాగరకులు. సామ్రాజ్యవాసము జాతిబాంధవ్యము, దేశబాంధవ్యము. కాన్స్టెన్ టైను చక్రవర్తి క్రైస్తవమతమును స్వీకరించిన పిదప మతబాంధవ్యము సామ్రాజ్యవాసబాంధవ్యమును బలపఱచెను. క్రైస్తవులు నాగరకులు, సజాతీయులు. తదితరు లనాగరకులు, విజాతీయులు. ఏకదేశవాసము, ఏకభాషాప్రచారము, ఏకమతావలంబనము మొదలగు చిహ్నములు లేకజాతీయతకు నిదర్శనములుగ నుండెను. పదునాఱవ శతాబ్దమునందు మతభేద మేర్పడి మతకలహములు ప్రబలినవి. దేశములు సంక్షోభవశ మైనవి. పదునేడవ శతాబ్ద మంతమునందు మతస్వాతంత్ర్య మేర్పడినది. యూరపు రాజ్యములు విస్తీర్ణతహ్రాసములను దాల్చినవి. పదునెనిమిదవ శతాబ్ద మంతమునందు ప్రజాస్వాతంత్ర్యమునకై పరివర్తన మేర్పడినది. పందొమ్మిదవ శతాబ్దమునందు యూరపురాజ్యములలోని ప్రజ లధికారదాస్యము నుండియు ఆచారదాస్యమునుండియు మతదాస్యము నుండియు విముక్తులై, మానవసమత్వమును సౌభ్రాతృత్వమును స్వాతంత్ర్యమును స్థాపించిరి. కాని, సిద్ధాంతమునం దీభావము లంగీకృతము లైనను వాడుకయందు వ్యక్తిస్వాతంత్ర్యమునకును జాతీయ స్వాతంత్ర్యమునకును బల సంపదలు మాత్రమె కారణములుగ నున్నవి. పాశ్చాత్య రాజ్యములు మతాభిమానమును నాగరకాభిమానమును బూని మహా సామ్రాజ్యములను నిర్మించి శాంతిని స్థాపించి లోకప్రఖ్యాతిని గడించినవి. యూరపియనులు నివాసయోగ్యము లైన ప్రదేశములను విజయమువలననో నివాసమువలననో ప్రతిగ్రహణకారణముననో యాక్రమించుకొనిరి. ఇపుడు ఇంగ్లాండు 1,31,53,712, రుష్యా 84,00,000, ఫ్రాన్సు 53, 66,400, జర్మని 13,37,020, అమెరికాసంయుక్తరాష్ట్రములు 37,48,100 చదరపు మైళ్ల భూభాగము నాక్రమించుకొనియున్నవి.

మఱియు పందొమ్మిదవ శతాబ్దమున యూరపు ఖండమునందు జనసంఖ్య హెచ్చినది; యంత్రసాధనములవలన పరిశ్రమలు విపరీతముగ వృద్ధిపొందినవి. యూరపునందు పరిశ్రమయుగ మేర్పడినది. ధనాశ ప్రబలినది. వ్యాపారవైరము హెచ్చినది. విషయలోలత్వము వ్యాపించినది. టాల్‌స్టాయి ప్రభువు వ్రాసినట్లు యూరపురాజ్యములందు ధనదేవత యిష్టదేవతయై వెలసినది. ధనదేవతను గొలుచువారలకు సంతృప్తి దుర్లభము. యూరపురాజ్యములందు రాజ్యవైరములకు వ్యాపారవైరము జతపడ, ప్రబలవైరము వర్ధిల్లుట కారంభమయ్యెను. భావప్రపంచమును భౌతికప్రపంచము వశపఱచుకొనెను. భావప్రపంచము క్షీణించినపుడు జీవాత్మపరిణామము వెనుకబడును. యూరపియను జాతులు భౌతికాడంబరములందు చిక్కుకొని భావార్థములను నిరసించినవి. యూరపుజాతులందు వ్యక్తిసౌభ్రాతృత్వ మంగీకృత మైనది కాని జాతీయసౌభ్రాతృ

త్వ మంగీకృతము గాలేదు. చిన్న దేశములను వీలైనంత వఱకు పెద్దరాజ్యములందు బలిమిని చేర్చుకొనుటయె యూరపురాజ్యముల రాజనీతి. నిస్సహాయుఁడైన వ్యక్తిని గాపాడుట మానవధర్మము; నిస్సహాయస్థితియందున్న జాతిని రక్షించుట ధర్మవిరుద్ధము. జాతిస్వాతంత్ర్యమును స్థిరపఱచి రక్షించుటకీ మహాసంగ్రామ మవసరమైనది. పందొమ్మిదవ శతాబ్దమునందు వ్యక్తిస్వాతంత్ర్య భావము వ్యాపించి, ధర్మపరిపాలనమునకు ప్రాతినిధ్యనిర్మాణములును, ప్రజాతంత్రమును సాధనము లని యంగీకృత మైనది. ఆ భావములు మానవసోదరత్వమునకు సోపానంబు లైనను జాతీయమత్సరంబును మాన్ప లేకుండెను. వ్యక్తులకు మైత్రి జాతులకు వైరము పందొమ్మిదవ శతాబ్దమునందలి భావములు. జాతీయసోదరత్వమును గ్రహింపని మానవసోదరత్వము నిరుపయోగము, అసంభవము. మానవులు సోదరు లనియు దేవుని బిడ్డ లనియు బోధించుచు, నుత్తమజాతు లని నీచజాతు లని దురభిమానము బూనుట సమంజసమా, వివేకమా, ధర్మమా? పునాది లేని నిర్మాణము సాధ్యమా? జాతీయసోదరత్వము స్థాపిత మగుటకు వర్తమాన భావములు మాఱవలయును. ప్రాత భావములు పోయి క్రొత్త భావములు గలుగుటకు లయము సాధనము. జాతీయసోదరత్వభావము పుట్టి పెరిఁగి స్థిరపడుట కెన్ని మార్పులు, యుద్ధములు, ప్రళయములు గావలయునో దేవున కెఱుక. వర్తమానసంగ్రామమున భిన్నరాజ్యములకును భిన్నజాతులకును రణరంగమునందు సమావేశము గలిగినది. మహోపద్రవావస్థయందు దురభిమానప్రకర్షణమున కవకాశము లేదు, ప్రశాంతస్థితి యందును లేదు, సామాన్యస్థితియందు మాత్రము గలదు. వంశధరునకు ఆంగ్ల హైందవ జర్మను జపాను రాజ్యభేదములు లేవు; తెల్ల నల్ల పచ్చ జాతిభేదములు లేవు; భాగ్య దరిద్ర స్థితిభేదములు లేవు; హిందూ మహమ్మదీయ క్రైస్తవ మతభేదములు లేవు; ధర్మాధర్మభేదము మాత్రము గలదు. లోకకళ్యాణమునకును జీవాత్మపరిణామమునకును భేదభావము సమసి సోదర భావము స్థిరపడుటకు సృష్టిస్థితిలయములు సమాన సాధనములు.

జాతీయాభిమానము జర్మనులకు విశేషము. గతించిన యేఁబదేండ్లలోను జర్మనుజాత్యభిమానము స్థిరముగ స్థాపిత మైనది. జర్మను లతిసులభముగ డెన్మార్కునుండి స్లెస్విగును ఆస్ట్రియానుండి గలీషియాను ఫ్రాన్సునుండి అల్సేసు లారేనులను జయించిరి. విజయమువలన దిగ్విజయాభిలాష గలిగినది. క్షాత్రధర్మము విజృంభించినది. ప్రపంచవ్యాప్తసామ్రాజ్యనిర్మాణమునకై సకల సంపదలు వినియోగింపఁబడినవి. నిర్బంధసైన్యశిక్షణము విధింపఁబడినది. బలవత్తరమైన యుద్ధనౌకాబలము నిర్మింపఁబడినది. యుద్ధోపకరణములను నిర్మించుటకై శాస్త్రజ్ఞాన ముపయోగింపఁబడినది. సంపదల వృద్ధికై పరిశ్రమలు బలపఱుపఁబడినవి. బిస్మార్కు మొదలగు మంత్రివర్యుల పరిజ్ఞానము జర్మను ప్రతిభను విస్తరింపఁజేయుటకై వినియోగపడినది. ట్రీట్‌స్కీ మొదలగు శాస్త్రవేత్తలు జర్మను ప్రతిభ నుగ్గడించిరి. వారి మతమునందు లోక ముత్తమపురుష పరిణామమునకై సృజింపఁబడినది. ఉత్తమపురుషులు వర్ధిలుట తదితరులు నశించుట సృష్టినిర్ణయము. జర్మను లుత్తమపురుషులు, జర్మనుజాతి యుత్తమజాతి. ఆంగ్లేయులు మాయకులు, ఫరాసులు నిర్వీర్యులు, రుష్యనులు ప్రాకృతులు. లోకము జర్మనుతత్త్వమును వ్యాపింపఁజేయుటకై పుట్టినది. జర్మను తత్త్వమును వ్యాపింపఁజేయుట జర్మనుల విధి. బర్న్‌హార్డి యుద్ధము ధర్మములలో నుత్తమధర్మ మని బోధించెను. ఆయన మతమునందు జగత్తున ధర్మము బలమూలము; బలవంతులు బలహీనులను నిర్జించుట సమంజసము; జర్మనులు లోకసామ్రాజ్యమును పొందవలయును, లేదా చచ్చిపోవలయును; జర్మను లవక్రపరాక్రములు, ఆంగ్ల ఫ్రెంచి రుష్యను బలములను నిర్జించుటకు సమర్థులు; అభీష్టార్థమును జర్మనులు కష్టపరంపరలకు పాలై సాధింపవలయును. మోల్ట్కే మొదలగు వ్యూహనిర్మాతలు జర్మనుల విజయమునందు విశ్వాసము గలిగియుండిరి. సైని

కులు విజయగీతంబులను పాడుచుండిరి. విద్యాలయము లందు విజయోత్సాహము బోధింపఁబడుచుండెను.

జర్మను సామ్రాజ్య పరిపాలనమిట్టి యూహాలను పోషించుటకుఁ దగిన స్థితియం దున్నది. జర్మను సామ్రాజ్యము సంయుక్త సామ్రాజ్యము. సంయుక్తరాజ్యము లందు ప్రష్యా ప్రధాన రాజ్యము. ప్రష్యారాజులు జర్మను సామ్రాజ్యమును నిర్మించి ముఖ్యాధికారమును తమ యధీనమునం దుంచుకొనిన విధ మీ సంచికయందలి జర్మనుదేశ చరిత్రమునందు తెలుపఁబడినది. హోహాన్ జొల్లోర్న్ వంశస్థు లాశాపరాయణులు. ప్రెడరికు మహా మహుఁ డాశాపరాయణుం డైనను నింగితజ్ఞుఁడు; సమయానుకూలముగ సామ్రాజ్యమును పెంచి బలపఱచెను. ఇప్పటి చక్రవర్తి కట్టి సహనము లేదు; ప్రజ్ఞ లేదు; అత్యాశాదురభిమానములు గలవు.

జర్మనుల యత్యాశ కైజరు విలియమునందు మూర్తీభవించినది. జర్మను రాజ్యాంగ నిర్మాణమునందు చక్రవర్తి శాసకుఁడు, మంత్రి, కోశాధ్యక్షుఁడు, సేనాధిపతి, నౌకాదళాధ్యక్షుఁడు. పాలనము నియమితపాలన మైనను చక్రవర్తి సర్వాధికారి, సర్వస్వతంత్రుఁడు. విలియముచక్రవర్తి సర్వజ్ఞత్వాభిమాని. విలియము కవులకు కవి, గాయకులకు గాయకుఁడు, సేనాధ్యక్షులకు సేనాధ్యక్షుఁడు, మతబోధకులకు బోధకుఁడు, పండితులకు పండితుఁడు. ఇంత యేల?— సర్వజ్ఞశిఖామణి. ప్రజలు, అధికారులు, చక్రవర్తి— అందఱు తమ బలవిజయములందు సంపూర్ణ విశ్వాసము గలిగియుండ, సమయ మాసన్న మైనపుడు యుద్ధము తప్పునా? జర్మనుల మతమునందు "జర్మని దేవదేశము, జర్మనులు దేవతలు, చక్రవర్తి దేవేంద్రుఁడు. సురాసుర సమరమునందు సురలకు విజయము ధ్రువము." సమరోత్సాహము జర్మనులందు మూర్తీభవించినది. ఇతరభావము లన్నియు రాజసభావముచే నావరింపఁబడినవి. దేశాదాయములో మూడవ వంతు యుద్ధసన్నాహములకై వినియోగపడుచుండెను. ప్రజలు వ్యయభారమున క్రుంగుచుండిరి.

జర్మనీయుద్ధప్రయత్నములను చూచి ఫ్రాన్సు రుష్యా ఇంగ్లాండు మొదలగు రాజ్యము లన్నియును తద్దేశనిష్ఠతో యుద్ధప్రయత్నములు చేయుచుండెను. సకలరాజ్యములును తమ యాదాయమును, ప్రజాసౌఖ్యమునకుఁ గాక, యుద్ధసన్నాహములకై వినియోగించుచుండెను. సమరోత్సాహము మితిమీఱి సకలదేశములందును వ్యాపించినపుడు స్వల్పకారణము సమరాగ్నిని ప్రజ్వరిల్లఁజేయుట సహజము. మహాసంగ్రామమునకు సర్వియా నిమిత్తమాత్రము. సంగ్రామాంకురములు చిరవర్ధితములు గాని యాకస్మికములు గావు. యూరపురాజ్యముల ప్రబలవైరము జర్మనుల దురభిమానము జర్మను చక్రవర్తి నిరంకుశాధికారము సంగ్రామమునకు మూలాంకురము లని యూరపుదేశచరిత్ర వలన విదిత మగుచున్నది. భావప్రపంచమును మార్చి జాతీయసమస్యను విప్పి మానవసోదరత్వమును జాతీయసమత్వమును స్థిరముగ స్థాపించుటకై వర్తమాన సంగ్రామమును నిమిత్తమాత్రముగ నుపయోగించుట భగవత్సంకల్పమై యుండును. ధర్మసంస్థాపనార్థము సంహార మవసర మని శ్రీకృష్ణుఁడు చేసిన తత్త్వోపదేశము విశ్వసనీయము.

తే. తొల్లి నలహరిశ్చంద్రాదు లెల్ల నలఁగ
మెచ్చి సత్యస్వరూపుఁడు వచ్చి కాచె
దుష్టయుం బగు మాయను దొలఁచి యశము
గనిర లోకంబులు నుతింపఁ గరము నకట!



THE KING OF BELGIUM

బెల్జియము రాజు

THE QUEEN OF BELGIUM



బెల్జియము రాణి

THE HERO OF THE ARMOURED MOTOR CAR LIEU. HENKART IN HIS CAR



లెఫ్టినెంటు హెన్ కార్టు ఫిరంగులతో సమకూర్చబడిన తనమోటారుబండి ప్రతియుద్ధయాత్రకు జర్మను అశ్వసైనికులగు ఉల్లానులను వెంటబడు
చు శత్రువులపై 70 మందిని చంపెను. అయిదుగురిని ఖయిదీలుగ జేసెను. 7 మందికి గాయములు కలిగించెను.
జర్మను లీ మోటరుకారు వచ్చుచున్నప్పుడు భయకంపితులగుచుండిరి.

BELGIAN REFUGEES IN LONDON



లండనులోని ఆల్డ్విచ్ లో ప్రవాసులగు బెల్జియనులు. జర్మనుల క్రూరకృత్యములవలననిట్టివారు 60 లక్షలమంది అన్నములేక అల్లాడుచున్నారు.
వీరిని అమెరికావారును, ఇంగ్లీషువారును కాలభాగము రక్షించుచున్నారు.

ములు వేలు. కాని సంకల్పసిద్ధికై సామాన్యసాధనము లనుపయోగ్యము లైనపుడు ఘోరసాధనముల నుపయోగింప సమకట్టెను. ప్రజలు క్రూరహింసలకు పాలు సేయబడిరి. ఆ కాలమునందు యూరపులో వాడుకయం దుండిన భయంకరాన్వేషణము నెదర్లాండ్సు దేశమునందు వాడుకలోనికి తేబడెను. ఆ పద్ధతిని వాడుకయందు పెట్టి ప్రజల పౌరుషస్వాతంత్ర్యములను పాడుసేయుటకు క్రూరాత్ముఁడైన యాల్వా ప్రభువు నియమింపఁబడెను. అపుడు దేశము వధ్యస్థానమైనట్లుగా నుండెను. కష్టపరంపరల కాలవాలం బాయెను. దౌర్జన్యములవలన ప్రజలు రోషావేశులై రాజాధికారమును ధిక్కరించిరి. ఆల్వా ప్రభువును తిరస్కరింపఁజాలిన దేశభక్తులు బయలువెడలి వచ్చి రిపబ్లికును స్థాపించిరి. ఎగ్మాంటు హారను ప్రభువులు నెదర్లాండ్సు దేశమును, విలియమ్ ఆరెంజి ప్రభువు స్పెయిను దురాగతము నుండి స్వదేశమును రక్షించి శాశ్వత కీర్తిని గడించిరి.




పదునారవ శతాబ్దమునందు స్పెయిను దేశము విశాలమైన సామ్రాజ్యము స్థాపించెను. కాని మతాభిమానమును ధనలోభమును అధికారలోభమును సామ్రాజ్యవినాశనమునకు కారణము లయ్యెను. ఇండియనులను వోలాండులను ధనాశాపరత్వముచేతను మతాభేదముచేతను స్పెయినువారు హింసించిరి. ఆ క్రూరహింసలకు ప్రతిఫలమో యనునటు 1588వ సంవత్సరమునందు స్పెయిను దేశపు నౌకాబలమాంగ్లేయ నౌకాబలముచే నోడింపఁబడెను. స్పెయిను సామ్రాజ్యము క్షీణింప నారంభించెను.

దేశము దీనదశయం దున్నపుడు స్వార్థత్యాగులైన దేశాభిమాను లవతరించి ప్రజలయం దైకమత్యమును స్థాపించి దేశోద్ధరణమును జేసిరని సుప్రసిద్ధేతిహాసము లన్ని దేశముల చరిత్రలందును గానఁబడును. శ్రీరామకృష్ణాదులు శివాజీ కృష్ణదేవరాయాదులు పూజ్యులగుట కిదియెగదా కారణము. హాలండు దేశచరిత్రమునందు విలియమ్ ఆరెంజి చరిత్రము సంస్మరణీయ మైనది. విలియము ప్రజాసత్తాక పాలనమును స్థాపించెను. కాని, యంతఃకలహములవలన నది సుస్థిరముగా లేదు.

ఫిలిప్పు కూఁతు రైన ఇసబెల్లాకును ఆస్ట్రియా రాకొమారుఁడైన అల్బర్టునకును 1598వ సం. నందు వివాహము జరిగెను. ఫిలిప్పు బెల్జియమును [illegible] బహుమానముగ నిచ్చెను. ఆ రాజదంపతుల కాలమునందు బెల్జియము శాంతిప్రదమై యుండెను. వారికి సంతతి లేనందున బెల్జియము తిరిగి స్పెయినునకు సంక్రమించెను. తరువాత నూ రేండ్ల వఱకును ఫ్రాన్సు స్పెయిను హాలండు దేశములకు సాగిన యుద్ధములందు బెల్జియము రంగస్థలముగ నుండెను. పరస్వత్వదేశమైన బెల్జియమున కిప్పటి దురవస్థ యీ కాలమునందును గలిగెను.

జ్ఞాతిబాంధవ్యము గల హాలెండునకును బెల్జియమునకును శత్రుత్వ మేర్పడెను. డచ్చివారు బెల్జియము రేవులను బంధించిరి. వ్యాపారమును నాశనము చేసిరి. పదునెనిమిదవ శతాబ్దమునందు బెల్జియము మరల ఆస్ట్రియనుల పాలాయెను. దేశము 1744-1792 సంవత్సరములలో శాంతిభూయిష్ఠమై వర్ధిల్లెను. మేరియా థెరీసా కాలమునందు దేశములో విద్యాలయములు స్థాపింపఁబడి, దేశ మభివృద్ధి చెందెను. కాని, జోసెఫు నిరంకుశాధికారాభిమానమువలన ప్రజలు తిరుగుబాటుచేసి 1790వ సంవత్సరమునందు సంయుక్త బెల్జియము రాజ్యమును స్థాపించిరి. కాని 1792వ సంవత్సరమునందు నెపోలియను దిగ్విజయములవలన బెల్జియము ఫ్రాన్సుదేశమునందు చేర్పఁబడెను. నెపోలియను 1815వ సంవత్సరమునందు పరాజితుఁడైనపుడు హాలెండు బెల్జియములను విలియము ఫ్రెడరికు పాలించెను. కాని యుభయదేశములకును మిత్రత్వము కలుగలేదు. మతభేద

THE FAMOUS KRUPP GUN FACTORY



సుప్రసిద్ధమయిన క్రుప్ ఫిరంగుల కర్మాగారములోని అంతర్భాగము

వల్లారినది. ఆశేజము తిరిగి ప్రజ్వరిల్లుట కనేక శతాబ్దములు పట్టినది. వర్తమాన మహాసంగ్రామ ఫలితమును నిట్టిదిగ నుండవచ్చు ననిభయము కలుగుచున్నది.

ఆశతాబ్దముననే సాక్సనులు ఫ్రాంకులు పశ్చిమసముద్రతీరములందు పొడసూపిరి. ఫ్రాంకులకు, సాక్సనులకు, గాథులకు, జర్మనుదేశము జన్మభూమి. నాల్గవ శతాబ్దమునందు గాథుల బలము హెచ్చి వారి రాజు హెర్మనరిక్ నల్లసముద్రమునుండి బాల్టిక్సముద్రము వఱకు గల దేశము నేలెను. వాని మరణానంతరము హూణులు రష్యానుండి తూర్పు జర్మనీని నాక్రమించుకొనిరి. స్లావులు పడమటిదిశను వ్యాపించిరి. హూణ్ణ నాయకుఁడు అటిల్ల అయిదవ శతాబ్దమునందు జర్మనుల నోడించెను.

ఆరు ఏడు శతాబ్దములందు పడమట సాక్సనులు, తూర్పున స్లావులు, దక్షిణమున లొంబార్డులు పోలోనులు, ఉత్తరమున డేనులు ప్రష్యనులు లిథుయనులు మొదలగు జాతులు జర్మనీయందు నివసించుచుండిరి. ఏడవ శతాబ్దమునందు బానిఫేషియస్ అను ఆంగ్లసన్యాసి తురింగియనులను బవేరియనులను క్రైస్తవమతమునందు చేర్చెను. కాలక్రమమున మతాభిమానము జర్మనీయందు పెరిగినది. ఎనిమిదవ శతాబ్దమునందు ఛార్లమేను సాక్సనుల నోడించి ట్యూటనుల యాక్రమణమునం దున్న జర్మను దేశమును తన సామ్రాజ్యమునందు చేర్చుకొనెను.

అయిదవ శతాబ్దమునందు జర్మని దేశము సాక్సని, తురింగియ, స్వాబియ, ఫ్రాంకోనియ, బవేరియ అను నైదు భాగములుగ విభజింపఁబడి యుండెను. ఫ్రాంకులు బలవంతులుగ నుండిరి. ఫ్రాంకుల రాజైన క్లోవిసు రోమనుల నోడించెను; జర్మనుదేశమునందలి కొంత భాగమును తన రాజ్యమునందు చేర్చుకొనెను. కాని సాక్సనుల నోడింపఁజాలకుండెను ఫ్రాంకుల రాజ్యము రెండు భాగములై కాలక్రమమున జర్మనీ ఫ్రాన్సు దేశము లేర్పడినవి.

తొమ్మిదవ శతాబ్దము మొదట జర్మను జాతియాంతరములు తలయెత్తినవి. సాక్సనులను ఛార్లమేను గెలిచెను. దేశమంతయు నొక రాజ్యమునందు చేర్చెను. సాక్సనులు క్రైస్తవమతమును పరిగ్రహించిరి. సర్వరిపాలనము స్థాపింపఁబడినది. ధర్మశాస్త్రము నిర్మింపఁబడినది. భిన్నజాతులకుఁ గల స్వాతంత్ర్యప్రియత్వమున కాటంకములు కల్పింపఁబడినవి. ఛార్లమేను మనుమఁడైన లూయిజర్మను అనువాని కాలమునందు జర్మనుదేశమునకు రోమకసామ్రాజ్యమునందు ప్రత్యేకవ్యక్తిత యేర్పడినది. వర్డును మర్సెను సంధులవలన మధ్యయుగమునందు జర్మనుదేశములో చేరియున్న దేశమంతయును లూయియొక్క రాజ్యమునందు చేరియుండెను.

ఒకటవ హెన్రి 919-వ సంవత్సరమునందు రాజుగ నెన్నుకొనఁబడెను. వాని కాలమున దేశమునందు శాంతి స్థాపితమై యంతఃకలహములు పోయి, కోటలు కట్టఁబడి సైన్యములు నిర్మితములై ప్రజలు సుఖపడిరి. ఆయన స్లావులను మాజియారులను నోడించి దేశము సముద్రమునుండి కాపాడెను. ఆయన సుతుఁడు ఓటోమహాశయుఁడు 936-వ సంవత్సరమునందు రాజుగ నెన్నుకొనఁబడెను. ఓటోమహాశయుఁడు, రాజతంత్రజ్ఞుఁడు, కీర్తికాముఁడు.

961-వ సంవత్సరమునందు రోమక సామ్రాజ్యమునకు చక్రవర్తిగ పోపు ఓటోను సింహాసనాసీనుని చేసెను. అప్పటినుండియు ఐలాచాపెలునందు సింహాసనాసీనులైన రాజులు రోమక సామ్రాజ్యమునకు చక్రవర్తులుగ పరిగణింపఁబడుచుండిరి. చక్రవర్తిత్వము జర్మనురాజుల పేరునకు పెద్దదైనను క్రియయందు కష్టములకు కారణముగ నుండెను.



జర్మనుచక్రవర్తిగారి తమ్ముడగు ప్రిన్సు హెన్రీ. నౌకాసేనలో అధికారిగా నున్నారు.

చక్రవర్తులు దక్షిణభాగమునకు పోయినపుడు జర్మను సామంత ప్రభువులు స్వతంత్రాధికారమును పెంచుకొనుచుండిరి. జర్మనుల బలసంపదలు స్వదేశాభ్యుదయమునకై కాక విదేశవిజయములకై వినియోగింపఁబడి యుండెను. చక్రవర్తుల విదేశదండయాత్రలు స్వదేశమునందు దుర్బలస్థితికి కారణములు. పోపులకు చక్రవర్తులకు వైరభావ మేర్పడినపుడు పోపుల శక్తిసామర్థ్యములు పరరాజ్యములందే కాక స్వరాజ్యమునందు సయితము భేదభావమును పుట్టించుటకు వినియోగింపఁబడినవి. జర్మనురాజుల రోమక చక్రవర్తిత్వము దేశాభ్యుదయమున కాటంకమైనది, ప్రజాపీడకు కారణమైనది, మతకలహములకు మూలమైనది. ఇంతియేకాక, ఓటో మఠాధిపతులకు భూముల నిచ్చి రాజులను చేసెను. ఇది రాజ్యాధికారమునకు విలయము కలిగించెను.

ఓటో 973-వ సంవత్సరమునందు మృతి నొందెను. రెండవ ఓటో 983-వ సం. నను మూడవఓటో 1002-సం. నను చనిరి. మూడవ ఓటోతో నా రాజవంశము నశించినపుడు రెండవ హెన్రి రాజుగ నెన్నుకొనఁబడెను. రెండవ హెన్రి కాలమున లొరెయినునందు ఫ్లాండర్సునందు తిరుగుబాటులు జరిగెను; పోలులతో మూడు యుద్ధములు సంభవించినవి. వాని తరువాత రెండవ కాన్రాడు 1039-వ

సం. వఱకును పాలించెను. కాన్రాడు కాలమునందు బర్గండి జర్మనులకు సంక్రమించినది. ఆయన యిటలీకి పోయినప్పుడు గౌరవింపఁబడలేదు. కాన్రాడు 1037-వ సం. నందు చేసిన ప్రకటనమువలన సామంతరాజుల యాధారసత్వపుహక్కు కొడుకులకు స్థిరపడినది.

మూడవ హెన్రీ 1039-1056-వ సం. వఱకు పాలించెను. ఆయన కాలమునందు రాజ్యాధికారము సర్వమును రాజాధీనమయినది. సామంతరాజుల కిది సరిపడక వారు కలవరములు కలిగింపఁ బ్రయత్నించిరి. కాని హెన్రీవారల కుతంత్రముల నాపఁగలిగెను. క్లిమెంటు మొదలగు నలుగురు పోపులు హెన్రీవలన నియమింపఁబడిరి. హెన్రీ యొక్క రోమకసామ్రాజ్యాధిపత్యము వ్యవహారమునందును నుపయోగపడినది. కాని నాల్గవ హెన్రీకాలమునందు దీనికి ప్రత్యవాయ మేర్పడినది.

హిల్డిబ్రాండు ఏడవ గ్రిగరి పేరున 1075వ సం. నందు పోపుగ నుండెను. ఆయన మతాధిపతులు బ్రహ్మచారులుగ నుండవలెననియు లౌకికాధికారులు మతాధిపతుల నేర్పఱుచుటకు దగరనియు ప్రకటించెను. హెన్రీ హిల్డిబ్రాండు స్థానభ్రష్టుఁడని చాటించెను. హిల్డిబ్రాండు హెన్రీ మతభ్రష్టుఁడని ప్రకటించెను. మత లౌకికాధికార విషయములందు రాజులకును మతాధిపతులకును మూఁడు శతాబ్దముల వఱకు నిరంతరకలహములు కలిగినవి. ఇటలీ వినాశనమునకును జర్మనీ దుర్బలత్వమునకును నీ యధికారవైరము కారణమైనది. జర్మనీయందు కొందఱు పోపుపక్షమును కొందఱు రాజపక్షమును చేరిరి. ఇది జర్మనీ యంతఃకలహములకు కారణము.



ప్రస్తుత జర్మనీదేశపు ముఖ్యమంత్రి హెర్ వాన్ బెత్మన్ హాల్వెగ్.

హెన్రీ యనంతరము పాలించిన రాజులలో బార్బరోసా యను నామాంతరముగల మొదటి ఫ్రెడరిక్ మిక్కిలి సమర్థుఁడు. ఆయన 1152-1189-వ సం. లవఱకు సత్క్రమ పరాక్రమముతో పాలించెను. ఆయన కాలమునందు పోపుల దిక్కారమువలన నిటలీ యుద్ధములకు రంగమై కష్టములు పొందినది. ఆయన డెన్మార్కు, పోలాండు సాక్సని, బర్గండి దేశముల రాజులను సామంత ప్రభువులుగ జేసెను. ఆ రాజన్యుని విజయములు శౌర్యము, పరాక్రమ యుత్సాహమును జర్మనుల హృదయములయందు దేశభక్తినుదయింపఁజేసెను.

రెండవ ఫ్రెడరిక్కు కూడ ధీరుఁడు. ఆ రాజాఱు సారులు పట్టాభిషిక్తుం డయ్యెను. ఆయన యాడంబరమువలన దేశమునకు లాభము గలుగలేదు. ఆయన 1218-50 వ సం. ల వఱకు పాలించెను. ఫ్రెడరిక్కు కాలమునందు ప్రముఖులు క్రైస్తవు లైరి. మఱియు సామంతుల యుద్ధము లక్రమము లని నిర్ణయింపఁబడినది. హోహెన్‌స్టాఫనుల కాలమునందు జర్మనీ రాజ్యస్థితి స్థిరపడినది, పట్టణములు పెరిగినవి, ప్రజలయం దుత్సాహము పుట్టినది, నాటకాదర్శములు వ్యాపించినవి. ధర్మాభిలాష వర్ధిల్లినది. పట్టణంబులందు సభలు యేర్పడి ప్రజలకు సంఘముల మేర్పడినవి. ప్రజలకు సద్వర్తన మలవడినది. మన్యాచి శిల్పప్రయోగము వాడుకకు వచ్చినది. కాని సామంతప్రభువులు శాఖోపశాఖలుగ చీలి దేశసంక్షోభమునకు గారకు లైరి.

జర్మనీ దేశ చరిత్రమునందు 1250-1273 సం. ల కాలము నాయకుఁడు లేని రాజ్యము. జర్మను రాజ్యాధికారమును వంశపారంపర్యముగ నిలుపుటకు రాజులు యత్నించిరి. కాని పోపుల తంత్రము సామంతుల బలము ప్రతిబంధకము లైనవి. పదుమూడవ శతాబ్దమునందు రాజ్యపదము నియోజక సభాధీన మని స్థిరపడినది. నియోజకసభయం దేడ్గురుండిరి. మెయిన్జ్, కొలోను, ట్రియరు స్థానముల మతాధ్యక్షులు సాక్సని, బవేరియ ప్రభువులు బ్రాండెన్బర్గు, బొహిమియా రాజులు చేరి రాజు నెన్నుకొనెడి హక్కును గలిగియుండిరి. ఈ నియోజకసభయము జర్మను రాజ్యమునకు దౌర్బల్యమును కలిగించినది. సామంతప్రభువులందు ప్రతి ప్రభువును రాజుగావలయు నని కుట్రలు పన్నుచు నొండొరులతో కలహించుచుండిరి. నియోజకసభ దుర్బలులను రాజులుగ నేర్పఱచుచుండెను.

పదుమూడవ శతాబ్ద సంధియందు హాప్స్‌బర్గ్ వంశజుఁ డైన రుడాల్ఫు రాజుగ నెన్నుకొనఁబడెను. రుడాల్ఫు తన పుత్రులకు ఆస్ట్రియ స్టీరియ, కెరినోల కరింతియ సంక్రమించునటులు చేసి, హాప్స్‌బర్గ్ రాజవంశమును స్థాపించెను. హాప్స్‌బర్గ్ రాజుల ముఖ్యోద్దేశము తమ వంశబలమును వృద్ధిచేయుట గాని దేశాభ్యుదయము చేయుట గాదు. నేటికిని హాప్స్‌బర్గ్ రాజులు ఆస్ట్రియా దేశమును పాలించుచు దేశమును సంరక్షించుటకు సమర్థులుగా నున్నారు. హాప్స్‌బర్గ్ వంశజు లిప్పటికి 600 ఏండ్లుగ యూరపుఖండమునందు రాజులుగ నున్నారు. ఆ వంశజులు 1282-వ సం. నుండి ఆస్ట్రియాకు ప్రభువులు; 1526-వ సం. నుండి హంగెరి బొహిమియాలకు పాలకులు; 1804-వ సం. నుండి ఆస్ట్రియాకు చక్రవర్తులు; 1438-1806 సం. వఱకు జర్మనీకి రాజులు, రోమకచక్రవర్తులు; 1516-1700 సం.లు స్పెయినున కేలికలు, ఈ కాలమునం దింకను ననేక సామంతభూముల కధిపతులు,

ద్దము లని ప్రకటించెను. కాని పిమ్మట లూథరు పక్షావలంబకులను కాపాడుట కభయహస్తము నొసంగెను. లూథరు మతస్థులు మతసంరక్షణమునకై యొక సంఘమును స్థాపించిరి. ఛార్లసు 1546వ సం. నందు లూథరు పక్షావలంబకులైన సాక్సనురాజును ఇతరులను ముహ్లుబర్గ యుద్ధమునం దోడించెను. సమయమునకై వేచియుండిన ఫ్రెంచి రాజు రెండవ హెన్రి, మెట్జు వర్డును టూలు నాక్రమించుకొనెను. ఛార్లసు భయపడి రాజ్యమును ఫర్డినాండు నధీనము చేసెను.

ఫర్డినాండు ప్రొటెస్టెంటు మతమును నిర్మూలముచేయ సమకట్టెను. ఇంగ్లాండు, హాలెండు, డెన్మార్కు ప్రొటెస్టెంటు మత సంరక్షణమును చేయుటకై కంకణము, కట్టుకొనినవి. ముప్పదేండ్ల యుద్ధ మారంభ మైనది. జర్మనిదేశము 1616-48 సం.ల వఱకును యుద్ధరంగములకు నిలయము. స్వీడను రాజు గస్టవసు ఒడోల్ఫసు మహాసైన్యముతో జర్మనుదేశమున ప్రవేశించి దేశసంక్షోభమును కలిగించెను. మహాశూరుండైన ఓడోల్ఫసు లూట్జెను యుద్ధమునందు మృతినొందెను. ప్రొటెస్టెంటు పక్షపు సైన్యములును కాథలిక్కు పక్షపు సైన్యములును పట్టణములను పాడుచేసి సంక్షోభమును పుట్టించి సంహారముచేసిరి. నగరాలు ప్రజలు నశించిరి. సంపదలు పోయినవి. దేశాభ్యుదయమునకు భంగము కలిగినది. వెస్టఫేలియ యొడంబడికవలన, ఫ్రాన్సునకు మెట్జు, వర్డును, టూలు అల్సేసునందలి కొంతభాగము కలిసెను. జర్మనియందలి యుత్తరభాగములు కొన్ని స్వీడనుతో కలిసెను.

వెస్టఫేలియ సంధివలన యూరపురాజ్యములకు సమానస్థితి యేర్పడినది. పిమ్మట జరిగిన యుద్ధము లన్నియు రాజ్యలాభమునకై చేయఁబడిన యుద్ధములు. పదునేడవ శతాబ్దమునందు ఫ్రెంచిరాజు పదునాల్గవ లూయి తన రాజ్యమును వ్యాపింపఁజేయఁ దలపడెను. జర్మనురాజ్యము దుర్బలస్థితియం దుండెను. ఫ్రెంచిరాజ్యము జర్మనీ నుండి స్ట్రాసుబర్గు మొదలగు దేశములను కలుపుకొనెను.

పిమ్మట స్పెయిను దేశపు సింహాసనపు హక్కును గురించి కలిగిన యుద్ధములలో జర్మని రెండు పక్షములందును చేరి యుద్ధము చేసెను. హాప్సుబర్గువంశజులు స్పెయిను, ఆస్ట్రియ, జర్మని రాజ్యములకు రాజులుగ నుండిరి. ఆరవ చార్లసుతో హాప్సుబర్గువంశము నందు పురుషసంతతి నశించెను. మేరియా థెరీజా, ఆమె తండ్రి చేసిన ఏర్పాటుల ననుసరించి, ఆస్ట్రియాకును నితరరాజ్యములకును పాలకత్వము వహించెను. ఆమె భర్త ఫ్రాన్సిసు 1745వ సం. నందు చక్రవర్తిగా నెన్నుకొనఁబడెను. రుష్యా, సాక్సని, స్వీడనుల సహాయము గల నాస్ట్రియారాజులు జర్మనురాజ్యపాలనమును తిరిగి స్థాపింపఁదల పెట్టిరి. ఆ యుద్ధములు ఏడేండ్ల యుద్ధ మని ప్రసిద్ధికెక్కినవి. ప్రష్యా రాజైన ఫ్రెడరికు మహాశయుండు యుద్ధమునందు సంపూర్ణవిజయమును పొంది యుద్ధతంత్రజ్ఞులలో నగ్రగణ్యుఁ డని ప్రసిద్ధికెక్కి హోహెన్ జొల్లారెను వంశమును స్థిరముగ స్థాపించెను.

హాప్సుబర్గువంశజులు శత్రువుల నెదుర్కొనుచుండఁగా, హోహెన్ జొల్లారెను రాజులు తమ రాజ్యమును వ్యాపింపఁజేసి బలపఱుప నుపక్రమించిరి. ఆ వంశమువారిలో ఫ్రెడరికు విలియము 1640-1688 సం. వఱకును పాలించి ధర్మాధర్మములతో నిమిత్తములేకనే రాజ్యమును వ్యాపింపఁజేసి సంపదలను వృద్ధిచేసెను. ఆయన కుమారుఁడు ఒకటవ ఫ్రెడరికు 1688-1713 సం.ల వఱకును నేలి ప్రష్యా రాజబిరుదమును పరిగ్రహించెను. రెండవ ఫ్రెడరికు మహాశయుం డని ప్రఖ్యాతిగాంచి 1740-1786 సం.ల నడుమ నేలెను. ఆ రాజేంద్రుని కాలమునందు జర్మనుదేశమునకు నూతనయుగారంభము. రాజ్యము నందు సైలేషియ, పోలాండులోని కొంతభాగము చేర్పఁబడినవి. సైన్యము సుశిక్షితమై బలము గలిగియుండెను. ప్రజలకు జాతీయ గౌరవము ఆత్మప్రత్యయము నేర్పడినవి. ఫ్రెంచినాగరికము గలవ సహోన్మాహితు లైన ప్రజలు, ప్రత్యేకవ్యక్తిత్వము స్థాపింప నెంచిరి. రాజు నిరంకుశాధికారాభిమాని యైనను ప్రజాసేవకుఁడు. ఆకాపురుషుఁ డైనను నింగితజ్ఞుఁడు. బలవంతుఁ డైనను ధర్మప్రవర్తకుఁడు. దేశాభ్యుదయమునకై నాటకప్రతిభావంతు లైన కవులు, గాయకులు నాటకకర్తలు, తత్త్వజ్ఞులు తోడ్పడిరి.

షిల్లరు తన కావ్యములందు జర్మను జాతీయాత్మను వ్యక్తీకరించెను. ఫిచియు హెగెలును జర్మను జాతీయనిష్ఠను వ్యాపింపఁజేసిరి. కాంటు తత్త్వజ్ఞానము నుపదేశించెను. మహామహుఁడు గొయిటె గంభీరభావంబుల కనుపించునట్టి భావార్ణవంబును భావార్ణవంబున కనుకూలము లైన విశాలభావంబులను నిర్మించెను. గొయిటె కావ్య రచనలయందు కృత్రిమనిర్మాణమును దిరస్కరించి సహజమార్గము నవలంబించెను. నాయికానాయకుల గుణశీలకథనమే కావ్యమునకు ప్రాణ మని స్థాపించెను. సామాన్యమానవులను నయితము ప్రాచీనగాథలతో ప్రమేయము లేకయే, దివ్యగుణశీలములను వ్యక్తీకరించెను. హెర్డరు జర్మనుల సుగుణంబుల నగ్గడించుచు పూర్వాపరకారణంబుల ననుసరించి జర్మను జాతీయతత్త్వమును బోధించెను; ప్రబంధశైలంబులకంటె నాటకరీతియే భావపరిస్ఫుటమున కెక్కుడు ప్రయోజనకర మని తెలిపెను. షిల్లరు జర్మను ధీరుల సుగుణశీలంబులను నాటకంబులందు సంస్తుతించెను. నవలాకారులు చరిత్రాత్మకము లైన నవలలను ప్రకటించి ప్రజలకు స్వదేశచరిత్రపఠనమునం దుత్సాహము కల్పించిరి.

నూతనగ్రంథములు జర్మనులకు నూతనభావప్రపంచము నుదయింపఁజేసినవి. జర్మనులకు తమ ప్రాచీనవైభవమునందును భావిభాగ్యస్థితియందును నమ్మకము కుదిరెను. భావప్రపంచమునకు తగిన కార్యధురంధరులు కూడ జర్మను రాజ్యరంగమునందు బయలుదేఱి దేశసేవకై కంకణము కట్టుకొనిరి. రాజ్యధర్మభావము ప్రజలయం దుదయించినది. కవులు, గాయకులు, వీరులు, ధీరులు, పండితులు పామరులు, వైదికులు లౌకికులు, సామంతులు, ప్రజలు దేశారాధన పరాయణులై ఫ్రెడరికుమహాశయుని మార్గము నవలంబించిరి. ఇట్టి మహాయుగములో జాతుల చరిత్రములందు విజయములకంటెను, సైన్యములకంటెను, సంపదలకంటెను పవిత్రములై శోభాయమానములై

NIETZSCHE



కీర్తిశేషుడయిన నీట్షే. జర్మను తత్వశాస్త్రజ్ఞుడు

TREITSCHKE



కీర్తిశేషుడయిన ట్రీట్ష్కే. జర్మను చరిత్రకారుడు

VON MOLTKE



గతించిన వాన్ మోల్ట్కే. జర్మను సైన్యనిర్మాత

HERR VON JAGOW



హెర్ వాన్ జాగో. ప్రకృత జర్మను విదేశాంగమంత్రి

CROWN PRINCE OF GERMANY



జర్మనీ యువరాజు

VICE ADMIRAL INGENOHL



వైస్ అడ్మిరల్ ఇంగనోల్. జర్మను యుద్ధనౌకా సేనాధిపతి

ADMIRAL VON TIRPITZ



వాన్ టిర్పిట్జ్. జర్మను యుద్ధనావాంగ మంత్రి

CAPTAIN VON MULLER



ఎమ్డెన్ క్రూయిజరుకు కెప్టనగు వాన్ ముల్లర్

# బ్రిటీషు సామ్రాజ్యము

సుఖదుఃఖములు జయాపజయములు కలిమి లేములు కర్మఫలసంజాతములు దైవాధీనములు. లోకమునందు వ్యక్తులకు జాతులకు దశాభేదము లనంతములు. అట్లాంటిసు లెమూరియా సామ్రాజ్యము లంతరించినవి. అస్సీరియనులు గ్రీకులు రోమనులు దిగ్విజయముచేసి మహాసామ్రాజ్యములను స్థాపించిరి. కాని లోకచరిత్రమునం దింతవఱకును బ్రిటీషు సామ్రాజ్యమును బోలిన మహాసామ్రాజ్యము గానరాదు. వైశాల్యమునందును, వైభవము నందును, పరిపాలనము నందును, ప్రతిభయందును, ధర్మసంరక్షణము నందును బ్రిటీషు సామ్రాజ్యము భూతవర్తమాన సామ్రాజ్యములందు సాటిలేనిది. సామ్రాజ్యము భూతలమునం దంతటను నాల్గవభాగము నాక్రమించి వ్యాపించి యుండుటవలన దానియందు సూర్యుఁ డస్తమింపఁడు. సామ్రాజ్యసంపదలకు మితి లేదు. ఇది ప్రజాపరిపాలనా నిర్మాణములకు మాతృస్థానము; గౌరవసన్మానములకు ప్రమాణముగ నెన్నఁదగినది. ఈ సామ్రాజ్య చరిత్రమును సంక్షేపముగ నైనను నీ సంచికయందు ప్రకటించుట యలవిగాని పని. బ్రిటీషు సామ్రాజ్య చరిత్రమును వ్రాయవలయు ననిన మూఁడు నాలుగు వందల యేండ్ల లోకచరిత్రమును వ్రాయఁబూనుట యైయుండును. మఱియు బ్రిటీషు సామ్రాజ్య చరిత్రముకొంతయైనను విద్యావంతులకు తెలిసియున్నది. ఇచట బ్రిటీషు సామ్రాజ్యములోని భిన్నభాగముల వైశాల్యాది విశేషాంశములు మాత్రము తెలుపఁబడును.



బ్రిటీషు సామ్రాజ్య సైన్యము



బ్రిటీషు యుద్ధనౌక

బ్రిటీషు సామ్రాజ్యమునకు మాతృస్థానము బ్రిటీషుద్వీపములు. వానియందు ఇంగ్లాండు స్కాట్లాండు ఐర్లాండు చేరియున్నవి. వాని సంక్షేపచరిత్ర యాంధ్రభాషయందు ప్రకటింపఁబడియున్నది.

## సామ్రాజ్య భాగములయొక్క విస్తీర్ణమును జనసంఖ్యయు వ్యాపారమును

| దేశము | విస్తీర్ణము | జనసంఖ్య | దేశము | విస్తీర్ణము | జనసంఖ్య |
|---|---|---|---|---|---|
| బ్రిటీషు ద్వీపములు | 1,21,377 | 4,64,07,037 | మధ్యఅమెరికా | 8,600 | 50,000 |
| యూరపు | 121,512 | 458,78,500 | వెస్టు ఇండీసు | 12.300 | 1,730,000 |
| ఆసియా | 2,187,550 | 323,158,000 | దక్షిణఅమెరికా | 97,800 | 3,14,000 |
| ఆఫ్రికా | 3,618,245 | 49,458,150 | ఆస్ట్రేలేషియా | 3,214,685 | 6,240000 |
| ఉత్తరఅమెరికా | 3,893,020 | 7.458,000 | మొత్తము | 1,3,1,53,685 | 43,42,86.650 |

| ఖండములలోని రాష్ట్రములు | ఎట్లు లభించినది | సంవత్సరం | చతురపు మైళ్లు | జన సంఖ్య | ఎగు మతులు | దిగు మతులు |
|---|---|---|---|---|---|---|
| యూరపు | | | | | పౌ. | పౌ. |
| సంయుక్తరాష్ట్రము | మాతృదేశము ...... | — | 121,090 | 45,500,000 | 744,650,000 | 599,000000 |
| మాను ద్వీపము | ,, ...... | — | 230 | 50,000 | — | — |
| చానలు ద్వీపములు | ,, ...... | — | 70 | 97,000 | — | — |
| మాల్టా గోజా | సమాధానము మీఁద నిచ్చివేయఁబడి | 1814 | 120 | 211,000 | 2,620,000 | 980,000 |
| జిబ్రాల్టరు | ,, ,, [నది | 1713 | 2 | 20,000 | 826,000 | 24,000 |
| ఆసియా | | | | | | |
| హిందూదేశము | జయింపఁబడినది. ...... | 1757_1897 | 1,900,00 | 315,000,000 | 152,000,000 | 171,000,000 |
| సింహళము | సమాధానము మీఁద నిచ్చివేయఁబ | 1801 | 25,50 | 4,100,000 | 12,500,000 | 13,500,000 |
| స్ట్రెయిట్ సెట్టిల్మెంటులు | ,, ,, [డినది | 1785_1909 | 1,660 | 700,000 | 45,000,000 | 38,000,000 |
| సంయుక్త మలయా రాష్ట్రములు | ,, ,, ...... | 1874,1888 | 21,700 | 1,000,000 | 12,000,000 | 22,000,000 |
| ఇతర మలయా రాష్ట్రములు | ,, ,, ...... | 1909 | 14,200 | 800,000 | — | — |
| హాంగ్ కాంగు | ,, ,, ...... | 1842_1906 | 390 | 440,000 | — | — |
| వీహైవాయి | ,, ,, ...... | 1893 | 300 | 160 000 | — | — |
| ఉత్తర బోర్నియో | ఇచ్చివేయఁబడినది ...... | 1877 | 31,100 | 201,000 | 1,100,000 | 1,300,000 |
| బ్రూనెయి | సమాధానము మీఁద నిచ్చివేయఁబడి | 1888 | 4,000 | 30,000 | — | — |
| సరవాక్ | రక్షణార్థము చేరినది. [నది. | 1883 | 50,000 | 650,000 | 800,000 | 1.000,000 |
| సైప్రసు | సమాధానము మీఁద నిచ్చివేయఁబడి 1914 లో కలుపుకొనఁబడినది. [నది | 1878 | 3.600 | 275,000 | 700,000 | 790,000 |
| ఆఫ్రికా | | | | | | |
| కేపురాష్ట్రము | సమాధానము మీఁద నిచ్చివేయఁబ | 1814 | 277,000 | 5,100,000 (కేపురాష్ట్రము, నేటాలు) | 89,000,000 (కేపురాష్ట్రము నుండి రొడీషియ వరకు) | 63,000,000 (కేపురాష్ట్రము నుండి రొడీషియ వరకు) |
| నేటాలు | కలుపుకొనఁబడినది. [డినది | 1843 | 35,400 | | | |
| ట్రాన్సువాలు | ,, ,, ...... | 1900 | 110,400 | | | |
| ఆరంజిఫ్రీస్టేటు | ,, ,, ...... | 1900 | 50,400 | | | |
| బసుటోలాండు | ,, ,, ...... | — | 10,300 | 350,000 | | |
| బెచ్యునలాండు | ,, ,, ...... | 1895 | 275,000 | 126,000 | | |
| రొడీషియ | ,, ,, ...... | 1889 | 450,000 | 1,750,000 | | |
| గాంబియ | సమాధానము మీఁద నిచ్చివేయఁబడి | 1807 | 4,000 | 146,000 | 756,000 | 735,000 |
| గోల్డు కోస్టు | ,, ,, [నది. | 1672 | 80,000 | 1,400,000 | 4,025.000 | 4,307,000 |
| సీయెరాలియోను | ,, ,, ...... | 1787 | 34,000 | 1,100,000 | 1,400,000 | 1,500,000 |
| ఉత్తర నైజీరియ | ,, ,, ...... | 1891 | 255,700 | 10,000,000 | 6,500,000 (ఉత్తర, దక్షిణ నైజీరియ) | 6,100,000 (ఉత్తర, దక్షిణ నైజీరియ) |
| దక్షిణ నైజీరియ | ,, ,, ...... | 1891 | 73,000 | 7,000,000 | | |
| సోమాలిలాండు | ,, ,, ...... | 1884 | 68,000 | 300,000 | 250,000 | 215,000 |
| తూర్పుఆఫ్రిక | ,, ,, ...... | 1888 | 182,000 | 4,000,000 | 1,850,000 | 1,200,000 |
| ఉగండ | ,, ,, ...... | 1894 | 223,500 | 2,500,000 | 630,000 | 400,000 |
| జాంజిబారు | ,, ,, ...... | 1890 | 1,020 | 200,000 | 1,000,000 | 1,100,000 |
| న్యాసలాండు | ,, ,, ...... | 1891 | 300,000 | 1,000,000 | 280,000 | 175,000 |

| ఖండములలోని రాష్ట్రములు | ఎట్లు లభించినది | సంవత్సరం | చతురపు మైళ్లు | జన సంఖ్య | ఎగుమతులు | దిగుమతులు |
|---|---|---|---|---|---|---|
| ఈజిప్టు | ఆక్రమించుకొనఁబడినది. ...... | 1882 | 400,000 | 12,000,000 | 28,000,000 | 29,000,000 |
| సుడాను | జయింపఁబడినది. ...... | 1898 | 1,000,000 | 2,000,000 | — | — |
| మారిషసు | ,, ఇచ్చివేయఁబడినది. | 1810-1814 | 720 | 370,000 | 2,500,000 | 2,500,000 |
| సిషిలీసు | సమాధానముమీఁదనిచ్చివేయఁబడి | 1814 | 150 | 23,000 | 78,000 | 110,000 |
| ఆసెన్షను | ఆక్రమించుకొనఁబడి [నది. | 1815 | 40 | 150 | — | — |
| సెయింటు హెలీన | జయింపఁబడినది. ...... | 1673 | 47 | 3,500 | 42,000 | 6,000 |
| **అమెరికా** | | | | | | |
| ఒంటారియో | జయింపఁబడి ఇచ్చివేయఁబడినది. | 1759-1763 | 407,250 | | | |
| క్వీబెకు | ,, ,, ...... | 1759-1763 | 706,850 | | | |
| నోవాస్కోషియా | ,, ,, ...... | 1627-1713 | 21,500 | | | |
| న్యూబ్రన్సువికు | సమాధానముమీఁద నిచ్చివేయఁబ | 1763 | 28,000 | | | |
| ప్రిన్సుఎడ్వర్డు ద్వీపము | జయింపఁబడినది. [డినది. | 1745-1763 | 2,200 | | | |
| బ్రిటీషుకొలంబియ | అధినివేశింపఁబడినది. ...... | 1670 | 355,900 | 7,200,000 | 140,000,000 | 19,000,000 |
| మెనిటోబా | ,, ............ | 1813 | 251,900 | | | |
| ఆల్బర్టా | ,, ............ | 1670 | 255,000 | | | |
| సస్కాచివాను | ,, ............ | 1670 | 251,700 | | | |
| పశ్చిమోత్తరరాష్ట్రములు | ,, ............ | 1670 | 1,250,000 | | | |
| న్యూఫౌండ్లాండు | సమాధానముమీఁద నిచ్చివేయఁబ | 1583 | 40,000 | 240,000 | 2,700,000 | 2,400,000 |
| జమెయిక | జయింపఁబడినది. [డినది. | 1655 | 4,200 | 850,000 | 3,050,000 | 2,710,000 |
| బాహామసు | అధినివేశింపఁబడినది. | 1629 | 4,400 | 56,000 | 358,000 | 276,000 |
| లీవరు ద్వీపములు | ,, ............ | 1623-1659 | 750 | 140,000 | 640,000 | 503,000 |
| విండ్వర్డు ద్వీపములు | ఇచ్చివేయఁబడినది. ...... | 1763,1783 | 510 | 200,000 | 800,000 | 800,000 |
| బార్బొడాసు | అధినివేశింపఁబడినది. ...... | 1605 | 170 | 196,000 | 1,460,000 | 1,086,000 |
| ట్రినిడాడు,టోబాగో | జయింపఁబడినది. ...... | 1797 | 1,860 | 330,000 | 4,700,000 | 4,500,000 |
| బ్రిటీషు గ్వయానా | జయింపఁబడి ఇచ్చివేయఁబడినది. | 1803-1814 | 90,300 | 310,000 | 1,700,000 | 1,577,000 |
| బ్రిటీషు హొండురాస్ | ,, ............... | 1798 | 8,600 | 40,500 | 700,000 | 550,000 |
| బర్మ్యూడా | అధినివేశింపఁబడినది. | 1612 | 20 | 19,000 | 637,000 | 117,000 |
| ఫాక్లాండుద్వీపములు | సమాధానముమీఁదనిచ్చివేయఁబడి | 1771 | 6,500 | 3,240 | 100,000 | 620,000 |
| దక్షిణజార్జియ | ,, [నది | 1771 | 1,000 | — | — | — |
| **ఆస్ట్రేలేషియా** | | | | | | |
| న్యూసౌతువేల్సు | అధినివేశింపఁబడినది. | 1788 | 310,400 | 1,650,000 | | |
| విక్టోరియా | ,, ............ | 1832 | 88,000 | 1,320,000 | | |
| దక్షిణఆస్ట్రేలియా | ,, ............ | 1835 | 904,000 | 409,000 | 78,000000 | 80,000,000 |
| క్వీన్సులాండు | ,, ............ | 1824 | 670,500 | 606,000 | | |
| టాస్మానియ | ,, ............ | 1803 | 26,220 | 191,000 | | |
| పశ్చిమఆస్ట్రేలియా | ,, ............ | 1828 | 976,000 | 282,000 | | |
| న్యూజిలాండు | ,, జయింపఁబడినది. | 1845 | 105,000 | 1,050,000 | 31,000,000 | 22,000,000 |
| ఫీజి | స్వదేశీయులయొద్దనుండి ప్రతిగ | 1874 | 7,500 | 130,000 | 950,000 | 1,060,000 |
| పాపువ | కలుపుకొనఁబడినది [హింపఁబడినది | 1884 | 90,540 | 360,000 | — | — |
| పసిఫిక్ ద్వీపములు | సమాధానముమీఁద నియ్యఁబడినది | 1893-1906 | 12,500 | 200,000 | 570,000 | 600,000 |

# సర్వియా చరిత్రము

## ప్రాచీనగాథ

ప్రస్తుత మైరోపామహాసంగ్రామమునకు ముఖ్యకారణములుగ చెప్పఁబడుచున్న సర్వియాను ఈ రాష్ట్రమువారే. బాల్కాను ప్రజ లందఱిలోను సర్వియనులు స్వేచ్ఛాప్రాముఖ్యములు గలవారు. సర్బు లని పిలువఁబడువా రీ సర్వియారాష్ట్రమునందే గాక తక్కిన బాల్కానురాష్ట్రములలోఁ గూడ ననేకస్థలములందుఁ గలరు. వీ రతికూరులు. రణ మన్న నత్యుత్సాహము. క్రీస్తుశకము రెండు మూడు శతాబ్దములందు వీరు కార్పేథియన్ పర్వత ప్రాంతములనుండి వచ్చి బాల్కానుద్వీపకల్పమునందంతట నక్కడక్కడ ప్రవేశించిరి. వీరు క్రమక్రమముగ వృద్ధినొంది యారవ శతాబ్దము మధ్యమున దక్షిణయూరపు వంకను కొంచ కొంచ మెదలుపెట్టిరి. క్రీ. శ. 620-వ సంవత్సరమునందు హెరాక్లియ సను గ్రీసు చక్రవర్తి సర్బులను డాన్యూబునది దాఁటి దడిగట్టున నున్న దేశము నాక్రమించుకొనునట్లు ప్రోత్సాహపఱచెను. వా రట్లే ద్వీపకల్పమునందలి పశ్చిమ భాగము నాక్రమించుకొని క్రమక్రమముగ నిప్పటి మాంటినీగ్రోను గూడ చేర్చుకొనిరి; ఈ విధముగ క్రీ. శ. 650-వ సం. నాటికి బాల్కాను రాష్ట్రములో చాలభాగమును వశపఱచుకొనిరి; అప్పటి గ్రీసు చక్రవర్తికి కప్పము కట్టుచు, ఆయనకు నామమాత్రమున లోఁబడియుండిన స్వతంత్రప్రభుత్వమును గలిగియుండిరి. అప్పటి సర్బుల రాజుల పేర్లంతగ తెలియరాకున్నవి. 830-వ సం. లో వాయిస్లా వనునతఁడు రాజ్యము చేయుచుండెను. సర్బు లతిస్వాతంత్ర్యేచ్ఛ గలవారగుటచే వారి యంతశ్శాఖలవారొక నాయకునిచే నడుపఁబడ నేరక, వారి రాజ్య మంతగ ప్రబలినది గాదు.



కడపటి 1143-వ సం. లో స్టెఫెన్ నిమాన్జా యనునతని ప్రభుత్వమువఱకును తమ జాతియలక్షణమునకు తగిన పరిమితప్రభుత్వము నే కలిగియుండిరి. తూర్పుదేశములలో రాజకీయజీవనముతోఁబాటు మత జీవనము గూడ మిశ్రమమయి యుండును గావున సర్బులకు మతాభిమానము హెచ్చుగ నుండెడిది. కాన్స్టాంటైన్ మెథోడియస్ అను మతబోధకులు వీరికి ప్రచారకులైరి.

తొమ్మిదవ శతాబ్దము నడుమ సర్బుల కధ్యక్షుఁడగు రడో స్లావ్ అనునతఁడు క్రైస్తవమతమును స్వీకరించెను. అతని తరువాతి రాజును క్రైస్తవమునే స్వీకరించుటచే, క్రమక్రమముగ ప్రజ లందఱు క్రైస్తవు లయిరి. క్రైస్తవమతప్రచారముతో పాటు నాగరికత గూడ వ్యాపించి, సర్బులకు సహజమై యుండిన క్రూరలక్షణము లనేకము లంతరించెను గాని, యుద్ధాసక్తి మాత్రము వీరిని విడువమిచే, తమ ప్రాంతములం దున్న బల్గేరియారాష్ట్రముతోను తుర్కోడను వీరు తఱచుగ పోరాడుచుండిరి. వీరి యంతఃకలహములవలనఁ గ్రీసు చక్రవర్తి యధికార ముండిన యాటోమన్ రాష్ట్రము నంతటి నాక్రమించుకొనఁగలిగెను. తొమ్మిదవ శతాబ్దము చివర భాగములో నీ రెండు దేశములకు తఱచుగ పోరు సంభవించుచుండెను. ఒక్కొకసారొక్కొకరు రెండవవారిని జయించుచుండిరి. ఈ రీతి యుద్ధములను దుర్బలులగుటచే తురుష్కులు వీరిని లోఁబఱచుకొనుట కటస్థించెను.

సిమియన్ బల్గేరియా రాజుగ నుండినపుడు సర్వియనులకు చాల కష్టములు కలిగెను. సర్వియనులు బల్గేరియావారికి లోఁబడి యుండవలసివచ్చెను. బల్గేరియారాజ్యముయొక్క ప్రథమదశలో సర్వియా పేరైనను లేకుండెను. పిమ్మట బల్గేరియారాజు సిమియన్ చనిపోయెను. బల్గేరియాస్థితి తగ్గుచుండెను. చెస్లావు, బల్గేరియాలో ఖయిదీగ నుండిన పాల్ బ్రాంకోవిక్ అను సర్వియారాజు పుత్రుఁడు. ఈతఁడు ఖయిదునుండి తప్పించుకొని గ్రీసుచక్రవర్తిని సమీపించి, బల్గేరియాపై దండెత్తుటకు తనకు సహాయము చేయ వేఁడెను. మొదటినుండియు బాల్కానురాష్ట్రములలో నొకదానిపై నొకదానిని పురికొల్పి తాను లాభము నొందుట గ్రీసునకు సహజమే కావున తక్షణమే చక్రవర్తి యంగీకరించెను. వెంటనే, చెస్లావు సర్వియా ప్రవేశించి చెదరియున్న సర్బుల నందఱను సమకూర్చుకొని గ్రీసుచక్రవర్తి సాయముతో సర్వియాలో నుండిన బల్గేరియనులను పాఱఁదోలెను. క్రీ.శ. 905-వ సం. మొదలు 11-వ శతాబ్దము ప్రారంభమువఱకు సర్వియా స్వేచ్ఛగ నుండి తిరిగి 1015-వ సం. లో బల్గేరియాకు లోఁబడిపోయెను. మరల 1040-వ సం. లో స్వాతంత్ర్యము పొంది స్టెఫెన్ నిమాన్జా రాజు కాలమున, అనఁగా 1143-1149 సం. లలో సర్వియా యభివృద్ధి చెంద మొదలిడెను. ఈయన 1169-వ సం. లో బాస్నియాను గూడ సర్వియాకు చేర్చెను; సామంత రాజులను వశపఱచుకొనెను. కాని నామమాత్రమునకైనను తనపై నున్న గ్రీసుచక్రవర్తి యధికారమును తప్పించుకొనలేక పోయెను.

పిమ్మట కాన్స్టాంటినోపిలులో మాన్యుయల్ కోమ్నెనస్ అను రాజును దర్శించి తన విధేయతను చూపి, వెనిషియనులపై తాను సహాయము చేసినందులకై, సర్వియాకును మాంటినీగ్రోకును

నదును నున్న, యిప్పుడు నోవాబజా రని పిలువఁబడు, రాస్కీయా జిల్లాను ప్రతిఫలముగ సంపాదించెను. 1180వ సం. లో మాన్యుయల్ రాజు చనిపోయి కాన్‌స్టాంటినోపిలు బలహీనముగ నుండినప్పుడు నిమాన్జా తన రాజ్యమును వృద్ధిపఱచుకొనుటకు మంచి సమయ మను కొని నిస్సని తన రాజ్యమునకు చేర్చుకొని ప్రెస్టినాను తనకు ముఖ్య పట్టణముగ చేసికొనెను. ఇప్పు డితని రాజ్యము మునుపటికి రెండింత లాయెను. ఇంతటితో తృప్తి నొందక 1186వ సం. లో గ్రీసు రాజు నకు కప్పము కట్టుటను నిరాకరించి నిమాన్జా తన స్వాతంత్ర్యమును ప్రకటించెను. ఈతని ప్రభను తగ్గించుటకై గ్రీసు రాజు చేసిన యత్న ములు విఫలము లగుటచే, అతఁ డితనితో సంధి చేసికొనవలసినవాఁ డాయెను. నిమాన్జా గ్రీసు చక్రవర్తిని సమానునిఁగ చూచెను. అతని కుమారునకు చక్రవర్తి కూఁతు నిచ్చి వివాహము చేయుటచే సర్వి యా స్వాతంత్ర్య మంగీకరించిన ట్లాయెను. నిమాన్జా యింతటితో కూడ తృప్తి నొందక అప్పటి జర్మను చక్రవర్తిగ నుండిన ఫ్రిడరిక్ బార్బరోజాతో స్నేహము చేయఁదలపెట్టెను. ఆయన మతయుద్ధము నిమిత్తము చేయనుండిన ప్రయాణములో తన దేశముగుండ మార్గమును ఆ సమయమున విశ్రమించుటకు మంచి పట్టణమును నొసంగెద నని రాయబార మంపెను. సర్వియా యెక్కడ నుండినదియు తెలియని యక్కాలమున నీ వార్త వచ్చుట జర్మనీలో మిక్కిలి యద్భుతముగ నుండెను. నిమాన్జా పిలుపు ప్రకారము బార్బరోజా సర్వియాకు ముఖ్యపట్టణ మగు బెల్గ్రేడులో వచ్చి దిగెను. ఇరువురు రాజులును స్నేహశ్వాసమును వెలిపుచ్చుకొనిరి. పిమ్మట నిమాన్జా ప్రపంచవిషయ ములకు విముఖుఁడై 1196వ సం. లో తన కుమారునకు సింహాసనము వదలి ఆథాస్ పర్వతముమీఁద మఠము నొకదాని నేర్పఱచుకొని యయిదు సంవత్సరములకు పిమ్మట సిమియాన్ అను పేరుతో మర ణించెను—మఠగురు వాయెను.

అతని చిన్న కుమారుఁడు సావా ఆ పర్వతము మీఁదనే పవి త్రత నొంది మఠగురు వాయెను. పిమ్మట తన యన్నయగు స్టెఫెన్ యొక్క సింహాసనాధిష్ఠాన కాలమునందు తన చేతితో నతని శిరముపై కిరీటము పెట్టెను. అప్పటినుండి తూర్పు రాష్ట్రములలో సర్వియా యొక్క మతాధికృత హెచ్చెను. మొత్తముమీఁద స్టెఫెన్ తాను రాజ్యము చేసిన 25 సం.ల కాలములో నొక సాధిష్ఠమైన యుద్ధమునకు దిగక శాంతిని స్థాపించి దేశమం దంతటను విద్యాలయములను దేవాల యములను నెలకొల్పెను. మొట్టమొదట నాణెములితని కాలములోనే ముద్రింపఁబడెను. బల్గేరియాతోడను గ్రీసు చక్రవర్తితోడను సఖ్యము చేసికొని సర్వియాగౌరవమును హెచ్చించెను. గ్రీసు చక్రవర్తి కాన్‌స్టాంటినోపిలు సింహాసనమునకు వచ్చినప్పుడు, సర్వియా డాల్మటియా బాస్నియాలకును సమీపపు జిల్లాలకును స్టెఫెన్ రాజని యతఁ డొప్పు కొనెను. కాని దేశమునం దెంత శాంతి యున్నను డాల్మటియా బాస్నియాలను చేర్చుకొనుట హంగేరియా రాజగు రెండవ ఆండ్రూ యొక్క విరోధమునకు కారణ మయ్యెను. పదును నెన్మి యంత రాయ ములు కలిగినను, ఆరవ స్టెఫెన్ కాలములో సర్వియా ప్రభ హెచ్చియే యుండెను.

పదునాల్గవ శతాబ్దము నందు తురుష్కులు ప్రబలియుండుట చే గ్రీసు రాష్ట్రవ్యాపకమున కాటంకము కలిగెను. అందుచే గ్రీసు రాజు స్టెఫెనుకు స్టెఫెనిన్ అను తన కూఁతు నిచ్చి వివాహము చేసి యతనిని మిత్రునిఁగ చేసికొనెను. ఇందువలన 1303వ సం. లో సర్వియారాజు తన మామ పక్షమున తురుష్కులపైకి దండువెడలి వారిని గెలిచెను. పన్నెండేండ్లకు పిమ్మట తిరిగి సర్వియనులు గ్రీసులో ప్రవేశించి తురుష్కులను సముద్రము పర్యంతము లేకుండఁ జేసిరి. ఈ సందర్భమున బల్గేరియనులు సర్వియాపైకి వచ్చి దాడి పోయి సర్వియా ప్రభను మతింత హెచ్చించిరి. పిమ్మట 1330వ సం. లో బల్గేరియాశక్తి తగ్గిపోయి యొక శతాబ్దమునకుపైన సర్వియా యధి కారము క్రిందికి వచ్చెను. పది పదునొకండు శతాబ్దములలో బల్గేరి యనులు సర్వియాపై కలిగియుండిన యధికారము తిరిగి యిప్పుడు పదునాల్గవ శతాబ్దములో సర్వియాకు బల్గేరియాపైఁ గలిగెను.

సర్వియా స్టెఫెన్ దూశాన్ కాలమున సర్వోన్నతదశయం దుండెను. దూశాన్ పేరు తరతరములకును పేర్కొనఁబడుచుం డెను. 1885వ సం. లో కింగ్ మిలన్ అను సర్వియా రాజు బల్గే రియాపై దండెత్తినప్పుడు గూడ సర్వియా సైనికులు దూశాన్ దూశాన్ అను సంబోధనలతో బెల్గ్రేడునుండి వెడలిరి. దూశాన్ రాజ్యమునకు వచ్చునప్పటి కిరువది రెండేండ్లవాఁడే యయినను అప్పటి బల్గేరియాపై యుద్ధములో తాను స్వయముగ నొక సేనను నడిపి బల్గేరియారాజ్యమును ధ్వంసము చేసెను. బల్గేరియారాజును స్వహస్తముతో చంపెను. దూశానుతో పోల్చుటకు శక్తిసామర్థ్య ములందొక నెపోలియను మాత్రము సరియగును. సర్వియారాజ్యమునకు ఏడ్రియాటిక్ సముద్రములోనికి దారి యుండుట దూశానున కవసరముగ తోఁచెను. పిమ్మట టర్కీవారికిని గ్రీసువారికిని కలిగిన కలహములో దీని నితఁడు సాధించెను. ఈ కలహములో నితనికి చాల దేశములు చేకూరుటయే గాక బల్గేరియా సయితము మితని యధికారముక్రిందికి వచ్చెను. వేయేల, యించుమించు బాల్కను రాష్ట్రసంతతియు నితని క్రిందనే యుండెను.

దేశమునందు శాంతి స్థాపించినతోడనే దూశాన్ చట్టములు వ్రాయుటకు మొదలుపెట్టెను; వర్తకము ప్రబలుటకై యనుకూల మయిన చట్టములను కల్పించెను. ఏవర్తకుఁడైనను ప్రొద్దు గ్రుంకి యొక యూరు చేరినప్పు డతని కాహారసౌకర్యము మున్నగు వసతులు కలుగఁజేయుట గ్రామాధికారికి విధిగ చేసెను.

ఇది యిట్లుండ తురుష్కులు యూరపులో ప్రవేశించిరి. వారిని వెనుకకు గ్రోలుటకై 80,000 సైనికులతో దూశాన్ బయలుదేఱి కాన్‌స్టాంటినోపిలు ప్రవేశించి విజయము సిద్ధముగ నుండఁగ, జ్వరము వచ్చి 1355వ సం. డిసెంబరు 18వ తేదిన చనిపోయెను.

ఇతనితో నితని రాజ్యము కూడ క్షీణదశకు దిగఁ

SIR EDWARD GREY



సర్ ఎడ్వర్డుగ్రే: విదేశాంగమంత్రి

MR. BONAR LAW



బోనర్ లా : అధినివేశాంగమంత్రి

MR. WINSTON CHURCHILL



విన్స్టన్ చర్చిలు: ఇంగ్లీషు ప్రథమమంత్రి

G

FIELD MARSHAL EARL ROBERTS



కీర్తిశేషులయిన రాబర్ట్సు ప్రభువు

PRINCE MAURICE OF BATTENBURG



బాటెన్ బర్గు రాకొమరుడు మారిస్ (యుద్ధములో మృతినొందెను)

MAJOR GENERAL PULTENY



మేజరు జనరలు పల్టెని

# ఐరోపా మహాసంగ్రామ చరిత్ర

ఎస్. వెంకటరంగయ్య, ఎమ్. ఏ., గారు

## 1-వ ప్రకరణము

### యుద్ధ మేలాగు వచ్చినది?

అనేకసంవత్సరములనుండి ఆస్ట్రియాకును సర్వియాకును పరస్పర వైరము కలదు. సర్వియాను ఎట్లయిన దేశమునుండి కొట్టవలె నని ఆస్ట్రియావారును, ఆస్ట్రియాసామ్రాజ్యమును చీలునట్లు కొట్టవలయు నని సర్వియావారును ప్రయత్నములు చేయుచున్నారు. ఈ రెండు దేశములకును గల సంబంధము మిక్కిలి దుష్టమై యుండెను. ఏదో యొక మిష యుండవలసినదే కాని, యుద్ధము సంభవించుటలో ఆశ్చర్య మేమియు లేదు. అట్టి మిష ఆస్ట్రియావారికి 1914-వ సంవత్సరము జూను నెలలో దొరకినది. అందువలన ఈ రెండు దేశములకును యుద్ధము ప్రారంభమై, క్రమక్రమముగ ఐరోపాఖండ మంతటికిని, ఆసియా ఆఫ్రికా ఖండములలోని కొన్ని దేశములకును వ్యాపించినది.



ఆస్ట్రియా దేశమందు బాస్నియా యను జిల్లా యొకటి కలదు. దీనిలోని ప్రజలు చాలమంది సర్వియక జాతివారు గనుక, వీరికిని సర్వియా రాజ్యములోని ప్రజలకును విశేషసంబంధము కలదు. ఈజిల్లాకు సరజీవో యనునది ముఖ్య పట్టణము. ఈపట్టణమునకు 1914-వ సంవత్సరము జూను నెల 29-వ తేదిని ఆస్ట్రియాదేశపు యువరాజును ఆయన భార్యయును కల్సి రాజమార్గమున పోవుచుండగా, దుష్టులగు రాజద్రోహు లిద్దరు యువకులు వారిని తుపాకితో కాల్చి చంపిరి. ఈ శోకవార్తను విన్నతోడనే దేశములోని ప్రజలకును చక్రవర్తికిని అపారమైన విచారమును కోపమును కలిగినవి. క్రోధపరవశులైన ఆస్ట్రియాచక్రవర్తియు మంత్రులును దురాత్ములను శిక్షించుటకై కావలసిన విచారణలు చేయుచు, సర్వియాప్రభుత్వమువారే ఈహత్యాకృత్యమునకు కారకు లనియు, వారి ప్రోత్సాహ సహాయములు లేకుండ ఇది జరిగియుండ దనియు తుదకు తీర్మానించిరి. ఈ తీర్మానము సహేతుకముగ నుండకపోయినను ప్రజలందఱు దీనిని నమ్మి, హంతకుల నిద్దఱను శిక్షించుటకంటె సర్వియా ప్రభుత్వమువారిని శిక్షించుటయే ఆవశ్యక మనియు యుక్త మనియు అభిప్రాయపడిరి.

ఈ యభిప్రాయము ననుసరించి ఆస్ట్రియాప్రభుత్వమువారు జూలై నెల 23-వ తేదిని సర్వియాప్రభుత్వమువారికి యొక యుత్తరము పంపిరి. ఇందులో * పది షరతులు వ్రాయబడియున్నవి. వానినం దన్నిటి ననుసరించి సర్వియావారు రెండు దినముల లోపల నడచుకొన వలసిన దనియు, అట్లు నడచుకొనుట కంగీకరించుచు ఆయంగీకారమును 48 గంటలలోపల తెలుపవలసిన దనియు, అట్లు చేయని పక్షమున యుద్ధము సంభవించు ననియు ఆస్ట్రియావా రా యుత్తరము ద్వారా తెలియఁజేసిరి. పాపము! ఆస్ట్రియాయొక్క రాజుయొక్క కార్యములనుగూర్చి సర్వియావారి కేమియు తెలియనే తెలియదు. నిజముగ దానియందు వారికెంతటి దోషము కలుగఁ జేసికొనలేదు. ఇది గాక, వారి రాజ్యము మిక్కిలి చిన్నది; రెండు సంవత్సరములుగ శత్రువులగు తురకలతో పోరి పోరి వారు మిక్కిలి యలసియుండిరి. ఇట్టిస్థితిలో బలవంతులగు ఆస్ట్రియనులతో యుద్ధమునకు దిగుట యుక్తము కా దని జూలై నెల 25-వ తేదిని 48 గంటలలోపలనే వారు ఆస్ట్రియావారికి ప్రత్యుత్తర మంపిరి. ఆస్ట్రియావారి పది షరతులలో ఎనిమిదింటి కంగీకరించుచు, మిగిలిన

* ప్రధానమైన షరతులు: (1) ఈ కుట్ర సర్వియాకు ముఖ్యపట్టణమగు బెల్గ్రేడులో పన్నఁబడినది. (2) హంతకుల కాయుధములను నారోడ్నా ఓడ్‌బ్రానా సమాజమునకు చెందిన సర్వియా సైనికోద్యోగులు క్రాగుజేవక్ ఆయుధాగారమునుండి తీసి యిచ్చిరి. (3) సర్వియా సరిహద్దులలోని యుద్యోగులు కొందఱు చేరి హంతకులు, ఆయుధములతో బోస్నియాకు పంపఁబడుచున్నారు. (4) సర్వియా పాలిసుం డగు మిలాన్ శిగ్నొవిక్ అనువాఁడు హంతకులకు సాయము చేయుటను, పిస్తోలు కాల్చుటను నేర్పెను. (5) అనేక రహస్యపు సమాజములను బోస్నియా హెర్జిగోవినాలలో నేర్పఱచి, ప్రజలలోని ప్రభుభక్తిని సర్వియా ధ్వంసముచేయుచున్నది. (6) నిత్యమును ఆస్ట్రియా సామ్రాజ్యముపై ద్వేషమును రేపులుకొలుపు వ్యాసములను వ్రాయుచు, సర్వియా పత్రికలు అరాజకమును వృద్ధిచేయుచున్నవి. ఈ దురాత్ములను దండించుటయు సర్వియా అంగీకరించవలయును. అప్పుడు ఆస్ట్రియా హంగేరీ ప్రతినిధుల సహాయమును తీసికొనవలయును. హంతకులను ప్రోత్సాహపఱచిన యపరాధులను, సర్వియాలో నున్నవారిని, విచారించునప్పుడు ఆస్ట్రియాప్రతినిధి యుండవలయును.



యుద్ధకార్యాలయమునందు కిచెనరుప్రభువు రాబర్ట్సుప్రభువుతో సంప్రతించుట.

ఆయన యుద్ధారంభమునందు యుద్ధమంత్రిగ నియమింపఁబడినపుడు "నేను యోధుఁడను, నాకు రాజ్యతంత్రములతో ప్రమేయము లేదు." అని నుడివెను. కిచినెరు ప్రభువు సామర్థ్యమునందు సైనిక నివహంబులు, ప్రజలు, మంత్రులు సంపూర్ణ విశ్వాసముఁ గలిగియున్నారు.



యుద్ధారంభమునందు మాన్సు సమీపమున జర్మను సైనికులకును బ్రిటీషు సేనలకును హాహాహా యుద్ధము జరిగినది. జర్మనులు మైలుదూరమునందున్న ఫిరంగులతో బ్రిటీషుసైన్యమును సంహారము చేయుచుండిరి. బ్రిటీషు సేనానాయకుడు జర్మనుల ఫిరంగులను వశపరచుకొనమని సైనికులకుత్తరువుచేసెను. తొమ్మిదవ లేన్సరుల పటాలము, గుండ్లవాన కురియుచున్నను, పోయి ఫిరంగులను గాల్చువారిని జంపి ఫిరంగులను పాడుచేసి మరల వచ్చిరి; తిరిగి వచ్చునపుడును గుండ్లవానను జర్మనులు కురిపించిరి. ఆ యోధాగ్రేసరుల శౌర్యమును గొనియాడుచు విలియం వాట్సనుకవి గీతములను విరచించెను. ఈ పటము ఆ రంగమును దెలుపుచున్నది.

స్వాధీనపఱచుకొనుటకు సమయము యెప్పుడెప్పుడు దొరకునా, ఎప్పు డెప్పుడు తమకోరిక తీరేటునా యని కాలమును నిరీక్షించుచు, కడచిన నలుబది సంవత్సరములనుండియు జర్మనీవారు కాచియుండిరి. పరనియుంటేని దోచుకొనుటకు ఇన్ని ప్రయత్నములను, ఇంత దీర్ఘ దీక్షతో చేసినవారు మఱియొకరు లేరు.

1871.వ సంవత్సరము మొదలు ఫ్రెంచివారు కూడ యూరక యుండలేదు. అయినను, వీరి యుద్దేశము ఇతరదేశములను జయించుట కాదు. తమ కున్నదానితో తృప్తి పొంది, తమ రాజ్యమును శత్రుబాధలనుండి కాపాడుకొనుటయే వీరి ప్రధానోద్దేశమై యుండెను. 1870,1871. సంవత్సరములలో వీరికిని జర్మనులకును జరిగిన యుద్ధమందు వీరు పరాభవమును పొందిరి. యుద్ధము ముగిసిన తర్వాత నష్టపరిహారము లగు జర్మనులు వీరియొద్దనుండి మూడు వందల కోట్ల (300,00,00,000) రూపాయలను అల్సేసు లోరైన్ అను రెండు రాష్ట్రములను తీసికొనిరి. ఏకకాలమందింత గొప్ప నష్టమును భరింపవలసినవారై అప్పటియందు వీరిట్లో ఫ్రెంచివారు సహించిరి గాని, అది మొదలు జర్మనివారిపై పగతీర్చుకొని ఈ రాష్ట్రములను జయించి తిరిగి తమ రాజ్యములో కలుపుకొనుటకు సమయము యెప్పుడెప్పుడు వచ్చునా యని నిరీక్షించుచునే యుండిరి. ఇది గాక, జర్మనీవారు చేయుచున్న యుద్ధసన్నాహమును చూచి వీరు మిక్కిలి భయపడి, ఈ సన్నాహ మంతయు తమ్ము దండించుటకే యని తెలిసికొని, వీరు కూడ తగిన యుద్ధసన్నాహము గావింపజొచ్చిరి. జర్మనీవారివలెనె వీరు కూడ తమ దేశమందున్న పురుషు లందరికి యుద్ధమును నేర్పి గొప్ప సైన్యమును తయారుచేసిరి. జర్మనులు తమదేశముపై వచ్చుటకు వీలు లేకుండునట్లు తూర్పుభాగమందంతటను పెక్కు కోటలను కట్టి వానియందు ఫిరంగులు మొదలగు అనేకయుద్ధపరికరములను సిద్ధపఱచి యుంచిరి; వీరును విశేషధనము వ్యయపెట్టి యుద్ధనౌకలను కట్టిరి.

ఇట్లు ఫ్రెంచివారును జర్మనులును నలుబది సంవత్సరములనుండి ఒకరితో నొకరు పందెము వేసికొనినట్లు యుద్ధసన్నాహమునందు ఒకరిని మించి యొకరు పనిచేయుచుండినను, ఫ్రెంచివారు కుదరక జర్మనులతో తులతూగలేకపోయిరి. జర్మనీ దేశములోని జనసంఖ్యయు పురుషుల సంఖ్యయు మిక్కిలి యధికముగ వృద్ధియగుచుండుటవలనను ఫ్రెంచివారి సంఖ్య యట్లు వృద్ధికాక యథాప్రకారముగ నుండుటవలనను జర్మనుల సైన్యములు ఫ్రెంచిసైన్యములకంటె అధికముగ యుండియుండెను. ఏలటను ఫ్రెంచివారికంటె ఎక్కువ సొమ్మును నావలపై ఖర్చుపెట్టుచుండుటవలన జర్మనీవారి యుద్ధనౌకల సంఖ్య కూడ ఫ్రెంచివారి యుద్ధనౌకల సంఖ్యను మించియుండెను. కావున యిట్టి సందర్భమున జర్మనులతో తమకు యుద్ధము సంభవించినయెడల 1871.వ సంవత్సరమున యుద్ధమందువలెనె మరల తమకు అపజయము కలుగునేమో యని ఫ్రెంచివారు భయపడసాగిరి. ఇట్లుండ, కొన్ని కారణములవలనను, ఫ్రెంచివారి యదృష్టవశమునను, 1891.వ సంవత్సరము మొదలు రషియావారును, 1905.వ సంవత్సరము మొదలు ఇంగ్లీషువారును వీరికి స్నేహితులై సహాయము చేయుట కంగీకరించిరి. ఇట్టి సహాయము లేక వీ రొంటరిగా నున్నప్పుడే వీరిని జయింపవలయు నని జర్మను లెన్ని మార్లో ప్రయత్నము చేసిరి గాని, వారి ప్రయత్నములు సఫలములు కాకపోయినవి.

### 3 జర్మనీ, రషియా, ఫ్రాన్సు

జర్మనీవారు ఐకమత్యము లేక మిక్కిలి బలహీనులుగ నుండినంతవఱకును వారివలన రషియావారి కేలాటి భయమును లేకయుండెను. కాని 1871.వ సంవత్సరములో జర్మనీ సామ్రాజ్య మొక చక్రవర్తి యాధిపత్యముక్రింద స్థాపింపబడిన దినమునుండి జర్మనీవారు క్రమక్రమముగ బలవంతులు కాజొచ్చిరి. ఇది గాక, యెల్లప్పుడును వీరు యుద్ధసన్నాహమందే కాలము గడుపుచుండిరి. దీని నంతయు చూచి రషియావారు జయించుటకొఱకె యీ సన్నాహమంతయు జర్మనులు చేయుచున్నారని రషియావా రనుమానింపుటకు మొదలిడిరి. క్రమక్రమముగ కాలక్రమమునవలన ఈ యనుమానము వృద్ధిపొంది విరోధభావముగ పరిణమించెను.

1875.వ సంవత్సరములో జర్మనీవారు ఫ్రెంచివారితో యుద్ధమును కలపెట్టగా, రషియా చక్రవర్తి తాను ఫ్రెంచివారికి సహాయము చేసెద నని బెదిరించి జర్మనుల ప్రయత్నములను విఫలము గావించెను. 1880.వ సంవత్సరములో టర్కీ విషయమై యొక పెద్ద సభ జరిగినది; ఆ సభకు ఇంగ్లండు రషియా మొదలగు యూరోపుదేశముల యొక్క రాయబారులు వచ్చిరి. బిస్మార్కును సభాధ్యక్షునిగ నిర్ణయించుకొని సభ చేసిరి. ఆ సభలో బిస్మార్కు రషియావారి విరుద్ధముగ నడచి, రషియావారు పొందదగిన లాభములను కొన్నిటిని పొందనీయక, టర్కీలో నేలాటి హక్కును కలిగియుండని యాష్ట్రియావారికి హక్కుగలదని యను పరగణాల కంటిని ఇప్పించెను. ఈ సభ ముగిసిన తర్వాత రషియావారికి జర్మనుల మీద కలిగిన క్రోధము మరింత యభివృద్ధి గాంచెను. దీనివలన ఈ రెండు దేశములవారికి యుద్ధము కూడ సంభవించునట్లుండెను. దీనిని చూచి రాజనీతియందు చక్కని నేర్పు గల బిస్మార్కు ఇతరదేశముల సహాయమును సంపాదించుట యవశ్యకమనియు, అట్లు చేసినయెడల రషియా నోడించుట సులభ మనియు, గ్రహించి తత్క్షణమే యాష్ట్రియా చక్రవర్తిని కలిసికొని వారితో నొక యేర్పాటు చేసికొనెను. అది మొదలు రషియాతో యుద్ధము సంభవించినయెడల జర్మనీవారును ఆష్ట్రియావారును కలసి యుద్ధము చేయవలయు నని ఆష్ట్రియా చక్రవర్తియు జర్మను చక్రవర్తియు అంగీకరించిరి. ఆష్ట్రియావారు జర్మను లనియు వీరికిని స్లావు లగు రషియావారికిని బద్ధవైర మున్నదనియు, ఇదివఱకే మనకు తెలియును. వీనికి విరోధు లయిన యాష్ట్రియావారితో జర్మను చక్రవర్తి యొడంబడిక చేసికొన్నాఁ డని విని నంతనే రషియావారి కోపమునకు మితి లేకపోయెను. కాని బిస్మార్కు జర్మనీకి మంత్రిగ నుండినంతవఱకు రషియా చక్రవర్తిని ముఖస్తుతి చేసియు ఆయనకును ఆయన మిత్రులకును భేదము కల్పించి యు

సంపాదించుటకై యెన్నియో ప్రయత్నములు చేయుచుండెను.

బిస్మార్కు మంత్రిపదవియం దుండినంతవఱకును జర్మనులు కూడ ఇంగ్లీషువారియెడల స్నేహభావము కలిగియే ప్రవర్తించుచుండిరి. ఆతనితర్వాత ఇప్పటి చక్రవర్తి యగు కెయిజరు విలియము సర్వాధికారము వహింపగనే ఇది యంతయు మాఱిపోయెను. ఇంగ్లండు జర్మనీకంటె చాల చిన్న దేశ మైనప్పటికిని, జర్మనుల సంఖ్యకంటె ఇంగ్లీషువారి సంఖ్య చాల తక్కువ యయినప్పటికిని, ఇంగ్లీషువారు ప్రపంచములో నాలిగవ భాగమునకు ప్రభువులై యుండుటయు, 35 కోట్ల నల్లవారు వీరి పరిపాలనలో నుండుటయు జూచి, జర్మనీవారు రసూయపడసాగిరి. ఈ యసూయయే క్రమక్రమముగ విరోధముగ మాఱి యిప్పటి మహాయుద్ధమునకు ప్రధానకారణ మైనది. ఈ యసూయ పుట్టినది మొదలు ఇంగ్లీషువారి నోడించి దేశాంతరములలో వారి పరిపాలనయందున్న రాష్ట్రములను స్వాధీనము చేసికొనుటకై జర్మనులు ప్రయత్నములు చేయసాగిరి. ఎంతయో ధనము కర్చుపెట్టి సైన్యములను వృద్ధిచేయుచుండినను, ఇంగ్లండు సముద్రమధ్యమం దొక ద్వీపమగుటవలనను, ఇంగ్లీషు పరిపాలనకు లోబడిన దేశములు సముద్రమున కావల నుండుటవలనను, నౌకాబలము లేకుండ వీరిని జయించుట యసాధ్య మని జర్మనులు గ్రహించిరి. అది మొదలే కోటను కోట్లకొలది రూపాయలు వ్యయము చేసి యుద్ధనౌకలను కట్టుటకు మొదలిడిరి. కడచిన పది పండ్రెండు సంవత్సరములనుండియు జర్మనులు యుద్ధనౌకలకొఱకు 450 కోట్ల రూపాయలు కర్చుపెట్టిరి.

### ఆంగ్లేయులు జర్మనులను శంకించుట

ఇంగ్లీషువారు జర్మనుల నౌకాబల మభివృద్ధి యగుచుండుటను జూచి "జర్మనీవారి కింత నౌకాబల మెందుకు? జర్మనీకి శత్రువు లయిన రష్యావారును ఫ్రెంచివారును సైన్యములతో భూమిమీఁద యుద్ధము చేయువారే కాని సముద్రముమీఁద యుద్ధము చేయువారు కారు. వారిని జయించుట కింత నౌకాబల మవశ్యకము కాదు గదా! ఏ యుద్దేశముతో జర్మనులు యుద్ధనౌకల నిమిత్తమై యింత ద్రవ్యము కర్చుపెట్టుచున్నారు?" అని యాలోచించుటకు పూనిరి. జర్మనులయెడ ఇంగ్లీషువారు స్నేహభావమును గౌరవమును కలిగియుండువారు గనుక జర్మనులకు ఇంగ్లీషు దేశముల నపహరింపవలె ననుయుద్దేశ మున్న దని వారు మొట్టమొదట నమ్మకొనలేదు. కాని క్రమక్రమముగ రహస్యము బయలుపడజొచ్చెను. జర్మను చక్రవర్తియొక్క మాటలవలనను పనులవలనను ఆతని యుద్దేశ మేదియో స్పష్ట మాయెను. దక్షిణాఫ్రికాలో ఇంగ్లీషువారికిని బోయర్లకును యుద్ధము సంభవించినపుడు, జర్మను లింగ్లీషువారికి మిత్రులవలె నుండినను, బోయర్ల జయమునే కోరుచు వారికొఱకై యెంతయో పాటుపడిరి; ఇంగ్లీషువారి సైన్యము లాయుద్ధములో అక్కడక్కడ కొన్ని యపజయములు పొందగా, ఆ సైన్యము నెగతాళిచేయ మొదలిడిరి. ఇట్టి సందర్భమున జర్మనులను గురించి ఇంగ్లీషువారి కనుమానము కలిగెను. ఈ యనుమానమే కాలక్రమమున విరోధ మాయెను. ప్రెసిడెంటు క్రూగరు నభినందించుచు దక్షిణాఫ్రికాయుద్ధము జరుగుచున్నప్పుడు కెయిజరుగా రొక తంత్రీవార్త నంపి ఇంగ్లీషువారికి మిక్కిలి యాగ్రహము కలిగించిరి.

జర్మనుల యుద్దేశము ఇట్టి దని తెలిసికొనినప్పటినుండి ఇంగ్లీషువారు తమ నౌకాబలమును వృద్ధిపఱచుకొనుటయే గాక, ఇతర దేశములతో తమ కదివఱకు గల వైరమును మాని వానితో స్నేహము సంపాదింపసాగిరి. రెండు వందల సంవత్సరములుగ ఫ్రెంచివారితోను, వంద సంవత్సరములనుండి రష్యావారితోను ఇంగ్లీషువారికి విరోధ ముండినది. రష్యావారు టర్కీ పర్షియా అఫ్గనిస్థానము మొదలగు దేశములను జయించి తుదకు ఇండియాపైకి వచ్చి, ఈ దేశమునుండి ఇంగ్లీషువారిని తఱిమివేయ నుద్దేశించియున్నా రని ఇంగ్లీషువారికి వంద సంవత్సరములనుండియు అభిప్రాయముండి, రష్యావారితో రెండు మూడు మార్లు యుద్ధము కూడ చేసియుండిరి. 1700 సంవత్సరము మొదలు 120 సంవత్సరములవఱకు ఇంగ్లీషువారు ఫ్రెంచివారితో యుద్ధము చేసి వారివద్దనుండి కనడా మొదలగు దేశములను సంపాదించి, 1750వ సంవత్సరము ప్రాంతమున వారిని మన దేశమునుండి తఱిమివేసి వారి చక్రవర్తి యగు నెపోలియనుయొక్క యాశల నన్నిటిని 1815వ సంవత్సరమునాటికి భంగము కావించిరి. 1880వ సంవత్సరము మొదలు ఈజిప్టు విషయమై కూడ ఇంగ్లీషువారికిని ఫ్రెంచివారికిని వివాదములు జరుగుచుండెను. తమ యధీనములో ఈజిప్టు నుంచుకొనవలయు నని ఇంగ్లీషువారును, తమ యధీనములో నుంచుకొనవలయు నని ఫ్రెంచివారును వివాదపడుచు, ఇంగ్లీషువా రా దేశమును వశపఱచుకొనిన తర్వాత కొన్ని సంవత్సరములకు వారితో ఫ్రెంచివారు (1898వ సంవత్సరములో) యుద్ధము కూడ తలపెట్టిరి. 1899వ సంవత్సరము మొదలు 1902వ సంవత్సరము వఱకు ఇంగ్లీషువారు బోయర్లతో యుద్ధము చేయుచున్నప్పుడు, వారి కపజయము రావలె నని కోరినట్టి విరోధులే కాని జయము కలుగవలె నని కోరిన మిత్రులు యైరోపాఖండమందలి బలవంతులలో నొకరు కూడ లేకయుండిరి. ఇంగ్లీషువా రా యుద్ధమం దపజయము పొందినయెడల, ఇండియాపైకి దండెత్తివచ్చుట సులభ మగు నని రష్యావారును, ఈజిప్టును స్వాధీనపఱచుకొనుట సులభమగు నని ఫ్రెంచివారును, ఆలోచించుచుండిరి. కాని, యా యుద్ధము ముగిసిన తర్వాత, ఫ్రెంచివారితోను రష్యావారితోను విరోధము వహించియుండుటవలన లాభము లేదనియు, జర్మనీవా రందఱికిని విరోధులుగ నుండుటవలన వారినుండి యేలాటి భయమును లేకుండుటకై మిగిలినవా రందఱు నొకరితో నొకరు కలసియుండుట యుక్తమనియు, ఇంగ్లీషువారు నిశ్చయించుకొనిరి. ఈ నిశ్చయము ననుసరించి 1904వ సంవత్సరములో ఇంగ్లీషువారును ఫ్రెంచివారును అప్పటివఱకు తమ కుండిన పరస్పరవివాదముల నన్నిటిని పరిష్కరించుకొని జర్మనీతో యుద్ధము సంభవించినయెడల పరస్పరము సహాయము చేసికొనవలయు నని యొడంబడిక గావించుకొనిరి. ఇట్లే 1907వ సంవత్సరములో రష్యావారికిని తమకును గల వివాదముల నన్నిటిని

ఇంగ్లీషువారు పరిష్కరించుకొనిరి; జర్మనీతో రహస్య యుద్ధము సంభవించినప్పుడు తూర్పుదేశములయందు కల్లరులు చేయకుండుటకై 1905-వ సంవత్సరములో జపానువారితో కూడ నొక సమాధానము చేసికొనిరి. కనుక 1902-వ సంవత్సరములో స్నేహితులచే కలిసియుండని ఇంగ్లీషువారు 1907-వ సంవత్సరమునాటికి రష్యా, ఫ్రాన్సు, జపాను దేశములవారి స్నేహమును సంపాదింపఁగలిగిరి. ఆ కాలమునం దాంగ్ల మంత్రులలో నొకరైన చేంబర్లీను గారాంగ్లసామ్రాజ్యస్థితిని గురించి ముచ్చటించుచు 'మిత్రరహిత మైన సుస్థితియందు సామ్రాజ్య మున్న' దని గర్వముతో పలికిరి. శ్రీ యెడ్వర్డు చక్రవర్తి సార్వభౌముని రాజనీతికలన నాంగ్లసామ్రాజ్యమునకు మిత్రత్వ మేర్పడి బలవత్తర మయ్యెను.

## III-వ ప్రకరణము

### ఇరుపక్షములవారి బలాబలములు

ఇంగ్లండు ఫ్రాన్సు సర్వియా రష్యా మాంటినిగ్రో బెల్జియము జపాను ఇటలీ దేశములవా రొక పక్షమునను, జర్మనీ ఆష్ట్రియా టర్కీ దేశములవారు మరియొక పక్షమునను చేరి, పోరుచున్నారనుట యిప్పు డీ యుద్ధమునకు పూర్వపు రెండవ ప్రకరణములో వివరింపఁబడిన విషయములనుండి మనకు తెలియుచున్నది. సమస్త దేశములయందును సమస్త కాలములయందును ఇదివఱ కెన్నియో యుద్ధములు జరిగినవి కాని, వానిలో నొక్కటి కూడ ఇప్పటి యుద్ధముతో సమానమైనది కాదని నిస్సంశయముగ చెప్పవచ్చును. బలవంతులని ప్రసిద్ధిగాంచినట్టి ఇన్ని దేశములవారు ఇదివఱ కేకాలమందు యుద్ధమున ప్రవేశించినది లేదు. ఇదివఱ కెప్పుడు గాని ఇప్పటివలె లక్షలకొలది మనుష్యులను వందలకొలది యుద్ధనౌకలను రణరంగమునకు తీసికొని వచ్చినవా రెవరును లేరు. ఇదివఱ కే యుద్ధమందును గాని ఇంత చిత్రవిచిత్రము లయినట్టియు ఇంత ప్రాణోపద్రవకరము లయినట్టియు, ఇంత దూరము తమ శక్తిని వ్యాపింపఁజేయునట్టియు విమానములను,



జలయంత్రములను, ఫిరంగులను శత్రునాశనముకొఱకు నెవరును ఉపయోగపఱచినది లేదు. ఏ యుద్ధఫలమును కూడ నొక్కటి యంతయు ఇంత యాతురతతో నిరీక్షించినది లేదు. ఇప్పటి యుద్ధమువలన లాభమో నష్టమో పొందని దేశము ప్రపంచమం దొక్కటి కూడ నుండదు. యుద్ధము ముఖ్యముగా నొక భూభాగమునందు మాత్రమే జరుగుచున్నను దాని శక్తి మాత్రము సర్వదేశములయం దును వ్యాపించి సమస్తప్రాణులను ఆకర్షించుచున్నది. "ఈ యుద్ధమం దెవరు గెలిచిన నా కేమి? ఎవరు ఓడిన నా కేమి!" అని యుదాసీనభావముతో నుండు మనుష్యుఁ డొకఁడు కూడ లేఁడుగదా! ఆలో చించి చూచినయెడల, ఈ యుద్ధము పురాణములలో వినఁబడు దేవాసుర యుద్ధముతోను, రామరావణ కురుపాండవ యుద్ధములతోను పరిపోల్చుటకు తగియున్నదే కాని మరియొకటి కాదు. ధర్మము కొఱకును సత్యముకొఱకును ఒకపక్షమువారు పోటులాడుచుండుటయు, వానిని నాశనము గావించి వాని స్థానమున అసత్యమును అధర్మమును నాటుటకు మరియొకపక్షమువారు ప్రయత్నించుచుండుటయు చూడ, ఇది పురాణయుద్ధములవంటిదే యని తోఁచుచున్నది. ఆ యుద్ధములవలె ఇదియు సంవత్సరముల పర్యంతము జరగినను జరగవచ్చును కాని తుదకు సత్యముకొఱకై పోరాడుచున్న ఇంగ్లీషువారును వారిమిత్రులును జయము సంపాదింతు రనుట నిస్సంశయము. "ధర్మమే జయము" మనుదానిలో అసత్య మే మున్నది!

యుద్ధమం దెంత ఘోరమును ఎంత క్రౌర్యమును ఉన్నదో! ధర్మయుద్ధము లైనను అధర్మయుద్ధము లైనను జీవహింస తప్పదు గదా! శత్రువులు యుద్ధరంగమునకు తీసికొనివచ్చు సైన్యముల నెల్ల "అయ్యో! పాపము!!" అనక నాశనము చేయుటయే కదా ఇరుపక్షములవారి విధి! యుద్ధమువలన ఎంత ప్రాణనష్టము కలుగుచున్నదో యని యొక నిమిష మాలోచించి చూచినయెడల యుద్ధము చేయుటకంటె పాపకృత్యము ప్రపంచమందు మరియొకటి లే దని తోఁచును. కాని రెండు దేశములకు సంభవించిన పరస్పరవివాదములను మంచిమాటలు తీర్చలేకపోయినప్పుడు యుద్ధము తప్పదుగదా! ధర్మమును నెలకొల్పుటకును దుష్టులను శిక్షించుటకును అనాదిగ యుద్ధమే ప్రధానమార్గమై యున్నది.

ఇప్పటి ఘోరయుద్ధమునకు జర్మనీవారే ప్రధానకారకు లని మన కిదివఱకే తెలిసియున్నది. బలహీను లగువారిని జయించి వారి దేశములను స్వాధీనము చేసికొనవలయు ననెడి దురాశ వీరి నెన్నఁ డందు పట్టి పీడింపసాగినదో ఆక్షణమునుండియే ఈ యుద్ధము ప్రారంభమైనది గాని, ఇది ఆగస్టునెల 4-వ తేదిని ప్రారంభమైనది కాదు. ఆక్షణమునుండియే వీరి యభిప్రాయమును గ్రహించిన యింగ్లీషువారును ఫ్రెంచివారును రష్యావారును యుద్ధసన్నాహము చేయవలసినవారైరి. కడచిన పది పదునైదు సంవత్సరములనుండియు రెండు పక్షములవారికిని ప్రబలుచుండిన పరస్పరవిరోధము పదునొకండు మాసములనాఁ డీ యుద్ధరూపమున పరిణమించినది. ఈ యుద్ధము అకస్మాత్తుగ వచ్చినది కాదు. అనేకసంవత్సరములనుండి ఇరుపక్షముల

వారును ఇట్టియుద్ధము వచ్చు నని యే తీర్మానించుకొని సమయము కొఱకు మాత్రమే నిరీక్షించుచుండిరి. ఇదివఱకు వీరు యుద్ధసన్నాహము నిమిత్తమై చేయుచుండిన ప్రయత్నములను ధనవ్యయమును వీరు యుద్ధము నపేక్షించుచుండి రనియు తెలుపుచున్నవి. 1900వ సంవత్సరము మొదలు వీరు సైన్యములకొఱకును యుద్ధనౌకలకొఱకును కర్చుపెట్టుచుండిన సొమ్ము ఇంతంత కాదు.

| సంవత్సరము | కోట్ల రూపాయల వ్యయము | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | జర్మని | ఆస్ట్రియా | ఫ్రాన్సు | రష్యా | ఇంగ్లండు | జపాను | మొత్తము |
| 1900 | 60 | 28 | 63 | 67 | 195 | 21 | 434 |
| 1901 | 65 | 30 | 64 | 69 | 225 | 16 | 469 |
| 1902 | 65 | 30 | 62 | 70 | 150 | 13 | 390 |
| 1903 | 65 | 31 | 60 | 75 | 108 | 12 | 351 |
| 1904 | 64 | 32 | 57 | 78 | 99 | 5 | 335 |
| 1905 | 69 | 39 | 64 | 79 | 93 | 6 | 350 |
| 1906 | 74 | 33 | 70 | 76 | 88 | 21 | 362 |
| 1907 | 82 | 33 | 68 | 79 | 87 | 31 | 380 |
| 1908 | 87 | 40 | 70 | 82 | 88 | 33 | 400 |
| 1909 | 96 | 39 | 72 | 93 | 94 | 25 | 419 |
| 1910 | 96 | 33 | 75 | 96 | 102 | 25 | 427 |
| 1911 | 95 | 41 | 78 | 96 | 105 | 28 | 443 |
| 1912 | 112 | 42 | 80 | 106 | 108 | 28 | 476 |
| మొత్తము | 1,030 | 451 | 883 | 1,066 | 1,542 | 264 | 5,236 |

బెల్జియము సర్వియా మొదలగు చిన్నచిన్న రాజ్యములు సైన్యముల నిమిత్తమై కర్చుపెట్టుచున్న సొమ్మును ఈ 5,236 కోట్ల రూపాయలలో చేర్చినయెడల, 13 సంవత్సరములలో సుమారు ఆఱువేల కోట్ల రూపాయలను వీరు యుద్ధసాధనములకై కర్చుపెట్టి రని మనకు స్పష్టమగుచున్నది.

యుద్ధసాధనములకై కర్చుపెట్టుటకు బదులు రోడ్లు ఆస్పత్రులు రైళ్లు కాలువలు పాఠశాలలు మొదలగువానికొఱకై ఇంత సొమ్ము నాదేశములవారు కర్చుపెట్టియుండినయెడల వారి కెంత లాభమును క్షేమమును కలిగియుండునో యాలోచించి చూడుడు! ఇన్ని కోట్ల రూపాయల పన్నులను దొరతనమువారికి చెల్లించుటలో ఆ దేశములలోని ప్రజ లెన్ని కష్టనష్టములను పొందిరో? మన మీనాటి కెన్నియో పన్నులు చెల్లించుచున్నను మన దొరతనము వారికి నేటి ముప్పది కోట్లకంటె ఎక్కువ యాదాయము వచ్చుట లేదు. ఆ దేశములు మన దేశముకంటె నెంతయో చిన్నవి; వాని లోని జనసంఖ్య కూడ మన దేశములోనిదానికంటె చాల తక్కువ; అయినప్పటికిని వారు మనకంటె నెన్నిరెట్లు అధికముగ పన్నులు చెల్లింపవలసియున్నారో కదా! ప్రజలను నిర్బంధపఱచి ఇంత ద్రవ్యమును వసూలుచేసి ఆయాదేశముల దొరతనములవారు ఆ ద్రవ్యమును ఏవిధముగా కర్చుపెట్టిరి? శత్రువులు రణరంగమునకు తీసికొనివచ్చు మనుష్యులను కనికరము లేకయే కసాయివాండ్రవలె చంపుటకు తగిన మార్గములను కనిపెట్టి దానికి తగిన యేర్పాటులను చేయుట యందును, సైన్యములను తయారు చేయుటయందును కదా ఇంత ద్రవ్యమును వారు కర్చుపెట్టిరి! సైన్య మనగా నేమి? మనవలె సామాన్యవిద్యను నేర్చుకొని జీవించు మనుష్యులతో కూడినట్టిది కాదు. సైన్యములోనివారు నేర్చుకొను విద్యలు రెండు విధములుగ నున్నవి. మొదటిది యొకరిని చంపుట; రెండవది తాను చచ్చుట. దీనిని నేర్చుటకై వీరి కన్నవస్త్రములు నిచ్చి పోషించుటయందే ఈ యాఱు వేల కోట్ల రూపాయలలో చాల భాగము కర్చగుచున్నది. గ్రామదేవతకును కాళికాదేవికిని బలియిచ్చుటకై కొలది పర్యంత మొక మృగమును పోషించునట్లు సంవత్సరముల పర్యంతము సైన్యములోనివారిని పోషించి తుదకు రణరంగ మను బలిభూమికి వారిని తీసికొనిపోయి "శత్రువులను చంపుడు; లేదా, మీరైన చావుడు" అని వారి కాజ్ఞాపించుట యనాదినుండి ప్రపంచమం దాచారముగ నున్నది. ఈ యాచారము ననుసరించియే వీ రింత ద్రవ్యమును వ్యయము చేసిరి. దీనినిబట్టి యిది యెంతయు దుర్వ్యయ మని చెప్పుటకు వీలు లేదు. యుద్ధసన్నాహముయొక్క యుద్దేశములు రెండు విధములుగ నున్నవి: (1) అన్యాయముగ నితరదేశములపైకి వెళ్ళి వానిని జయించి స్వాధీనపఱచుకొనఁ గోరుట మొదటి యుద్దేశము. ఇది మిక్కిలి నింద్యమైనది. దీనిని నెఱవేర్చుకొనుటకై ప్రయత్నము చేయువా రందఱును దోపిడికాండ్రు. ఈ ప్రయత్నములో వ్యయమగు సొమ్మంతయు దుర్వ్యయము. (2) ఇట్టి దురుద్దేశముతో ప్రవర్తించుచుండు

THE FRENCH ARMY IN BELGIUM



FRENCH LANCERS ENTERING A BELGIAN VILLAGE.
*Wielders of the Dreaded Steel.*



FRENCH INFANTRY.



FRENCH CAVALRY.



FRENCH ZOUAVES.

ఫ్రెంచిసైన్యము బెల్జియములో నిగుట

TAKING THE ENEMIES GUNS



మిత్రమండలి గుఱ్ఱపుదళము జర్మనుఫిరంగులనుబట్టుట

కలరు. కనుక జర్మనీవారు సాధ్యమైనయెడల 57 లక్షల మందిని, ఇంగ్లీషుపక్షమువారు 106 లక్షలమందిని, ఇంతవరకు తయారుచేసి యుద్ధభూమికి పంపగలరు. 57 లక్షలకు మించి జర్మనీవా రెక్కటికిని తయారు చేయలేరు. ఇంగ్లీషుపక్షమువారు మాత్రము అవసర ముండినయెడల 106 లక్షలే గాక దానికంటె రెండు మూడు రెట్లధికమైన సైన్యములను కూడ సిద్ధపఱుపగలరు. ఏలనగా, ఇంగ్లీషువారు ప్రపంచమం దెన్నియో దేశములను పరిపాలించుచున్నారు. మంచి వయస్సులో నున్నట్టియు, యుద్ధము చేయుటకు తగినట్టియు, పురుషు లీ దేశములం దెంతలో యున్నారు. 32 కోట్ల జనసంఖ్య గల మన దేశమం దట్టివా రెందఱు లేరు! ఇట్లే యింగ్లీషువారి యధీనమం దుండు కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండు, దక్షిణాఫ్రికా మొదలగు దేశములయం దట్టివారు లక్షల కొలంది యున్నారు. వీరు గాక, యునైటెడ్ కింగ్డములో నుండువారు మాత్రమే 3,500,000 మంది కలరు. ఇట్లే రష్యావారును ఫ్రెంచివారును దేశాంతరము లందలి దేశములపై రాజ్యాధిపత్యము చేయుచున్నారు. కావలసిన యెడల ఆ దేశములలోనుండి కూడ వారు సేనలను సిద్ధపఱచి యుద్ధభూమికి తీసికొని రాగలరు. జర్మనీవారి కట్టి దేశములు లేవు. కనుక 57 లక్షలకంటె యెక్కువమంది వీరి లెక్కకెక్కిన లభింపరాదు.

సైన్యములు విశేషముగ నున్నంతమాత్రముననే యొక్కొక్కప్పుడు జయము రాకపోవచ్చును. సైర్యము నేర్పును లేని సైన్యము లెన్ని యున్నను లాభము లేదు. కొన్ని విషయములలో రెండు పక్షములవారి సైన్యములును సమానశక్తి కలిగినవైనప్పటికిని మరికొన్ని విషయములలో ఇంగ్లీషువారి సైన్యములు జర్మను సైన్యముల నతిశయించియున్నవి: (1) శిక్ష.—ఫ్రెంచి జర్మనీ సైన్యములలోనివారు ఇంగ్లీషు సైన్యములలోనివా రంతటి శిక్షను పొందుట లేదు. ప్రతి యింగ్లీషు సైనికుడును తదేకదీక్షతో నేడు సంవత్సరముల కాలము యుద్ధము చేయుటకు నేర్చుకొనుచున్నాడు. జర్మనులు దీనికై మూడు సంవత్సరములు మాత్రమే వినియోగించుచున్నారు. (2) ఉత్సాహము.—జర్మను సైన్యములకును ఇంగ్లీషు సైన్యములకును ఈ విషయమం దెక్కువ భేద మున్నది. ప్రతి పురుషుడును సైన్యములో చేరి యుద్ధము నేర్చుకొనవలయు నను చట్టము జర్మనీలో నుండుటవలన జర్మను సైన్యములలోనివా రనేకులు నిర్బంధమువలన దానిలో చేరియున్నారు. ఇట్టి చట్టమును నిర్బంధమును ఇంగ్లీషువారిలో లేనికారణమున యుద్ధము చేయుటయం దెవరికి ఇష్టమును ఉత్సాహమును నుండునో యట్టివారే యింగ్లీషు సైన్యములం దున్నారు. ఇట్టి యుత్సాహము లేక, "ఇది నా కర్మము. నన్ను యుద్ధము చేయు మని బలవంతపెట్టుచున్నారు. నా కిష్ట మైనట్టి సేద్యము, వ్యాపారము మొదలగువానిని వదలుకొని దీని లోనికి రావలసివచ్చినది. ఏమి నా తలవ్రాత!" అని విసుగుకొను వారు జర్మను సైన్యములలో ననేకులు గలరు. ఇంగ్లీషు సైన్యములలో ఇట్టి నిరుత్సాహముతో పనిచేయువా రొకరు కూడ లేరు.

(3) ధైర్యము.—ఎన్ని కష్టములు వచ్చినను జంకక తలపెట్టిన పనిని చేయుటయే ధైర్యము. దీనికే మనోబల మని చెప్పుదురు. శరీరబలము లేకపోయినను మనోబల ముండినయెడల మన మనుకొనిన కార్యము లన్నియు మనము చేయగలిగి యుందుము. ఈ మనోబలము మన కన్ని సమయములయందు నుండవలెను. మనము చేయఁబూనిన పని మంచి దని మనకు తోఁచినప్పుడే మనకీ బల ముండును. అప్పుడే మన కన్ని యడ్డములు కలిగినను వానిని గణింపక మనము పనిచేయఁ బూనెదము. దుష్కార్యము చేయుచున్నప్పుడు మనలు నిందింతు రను భయ మొకప్రక్కను, పాపకార్యము చేయుచున్నాము గదా యను విచార మొకప్రక్కను మనలను బట్టి బాధించుచునే యుండుటవలన మనస్సు నంతయు మనము చేయఁదలఁచిన పనిమీఁద నిలుపుట దుస్సాధ్యముగ నుండును. తాము చేయునది పాపకార్య మని జర్మనులకు తెలియును. దుష్కార్యము చేయు వారి కెందు మనోబలము వారియం దెట్లుండును? తాము చేయునది ధర్మకార్య మనియు, దీనులగు బెల్జియమువారిని రక్షించుట యనియు, సత్యవాక్యమును పరిపాలించుట యనియు తెలిసి, యింగ్లీషువారు యుద్ధము చేయుచున్నారు. రాక్షసులవలె తమ దేశమును దోఁచుకొని తమ స్వాతంత్ర్యమును నాశనము చేసి, తమ మానమునకు భంగము కలిగించుటకై జర్మనులు వచ్చి రనియు; ఎప్పుడో యొకప్పుడు చావవలసినదే గనుక దేశసంరక్షణార్థమై యుద్ధము చేసి వీరస్వర్గమును పొందుటయే యుత్తమ మనియు; జర్మనులకు సేవకులై యుండుటకన్న చచ్చుటయే మే లనియు; ఎంచి ఫ్రెంచి వారును బెల్జియమువారును పట్టుదలతో యుద్ధము చేయుచున్నారు. ఇట్టి సందర్భమున వీరి కున్నంత మనోబలము జర్మనుల కెట్లుండఁగలదు? లీజ్, ఆంట్వెర్పు, కోటలలో యుద్ధముచేసిన బెల్జియము మహాశూరులను ప్రశంసింపనివాఁ డొకఁడైనఁ గలఁడా?

(4) స్థైర్యము:—శత్రువులగ్ని వర్షమును కురిపించుచుండినను దానిని లక్ష్యము చేయక యున్నచోటును వదలి పాఱిపోక యుండుటయే స్థైర్యము. ఈ గుణ మింగ్లీషువారిలో నున్నట్లు మఱియెవరియందును లేదు. ఈ యుద్ధమందే కాదు; ఇదివఱకు యూరోపాఖండమం దింగ్లీషువారు చేసిన యుద్ధము లన్నిటిలోను, ఇందుకే వారు ప్రఖ్యాతి గాంచి యున్నారు. 1815వ సంవత్సరములో వాటర్లూ యుద్ధమందు నెపోలియనువంటి మహాశూరుని వశపఱచుకొనఁ గలిగినది యీ స్థైర్యమే. ఇందువలననే యిప్పటి యుద్ధమందు కూడ శత్రుసైన్యములకంటె తమ సైన్యము చాల చిన్నదైనను భయ మన్నది లేక శత్రువుల నతిశయించి యింగ్లీషువారు యుద్ధము చేయఁగలిగి యున్నారు. (5) అనుభవము:—1871వ సంవత్సరము తర్వాత జర్మను సైన్యములు యుద్ధము చేసినది లేదు. అంతే గాక, ఇంగ్లీషువారును రష్యనులును ఇటీవల నెన్నియో యుద్ధములు చేసిరి. 1877, 1898 సంవత్సరములలో తురకలతోను, 1904 మొదలు 1906వ సం. వఱకు

జపాన్ వారితోను రష్యావారు యుద్ధము చేసియున్నారు. ఇంగ్లీషువారు కటేలనే దక్షిణాఫ్రికాయందు బోయర్లతో యుద్ధము చేసిరి. కనుక వీరి సైన్యములును సేనాధిపతులును యుద్ధములందు మిక్కిలి యనుభవము కలిగి బాగుగ ఆరితేరియున్నారు. జర్మన్ సైన్యముల కిట్టి యనుభవము గాని జర్మన్ సేనాధిపతుల కింత పేరు గాని లేదు. (6) సైన్యకులకును సేనాధిపతులకును ఫ్రెంచి యింగ్లీషు సేనలలో నున్నంత పరస్పరానురాగము జర్మన్ సైన్యములలో లేదు. జర్మన్ దేశమం దింకను కొన్ని జాతిభేదము లున్నవి. అన్ని జాతులవారికిని సైన్యమం దుద్యోగములు దొరకుట లేదు. ఈ గొప్ప యుద్యోగము లన్నియు నొక జాతిలోనివారికే లభించుచున్నవి. మిగిలిన జాతులలోనివారు సామాన్యసైనికులుగ నుండవలసినదే. ఫ్రెంచి సేనలలో నిట్టి భేదములు లేవు. ఎంత హీనకులమందు పుట్టినవాడైనను శక్తిసామర్థ్యములను చూపినయెడల సేనాధిపతి యగుట కవకాశమున్నది. (7) సమయస్ఫూర్తి:- యుద్ధము ప్రారంభము కాకపూర్వమే శత్రువుపై కేమార్గమున వెళ్ళవలసిన దనియు, ఓడిపోయినయెడల ఈ మార్గముగుండ తప్పించుకొని రావలసిన దనియు, ఈపద్ధతి ననుసరించి శత్రుబలములను సంహారింపవలసిన దనియు ఇరుపక్షములవారును ఒకరికి తెలియకుండునట్లు నొకరొకరు నిర్ణయించుకొనెదరు. ఈ యేర్పాటుల ననుసరించి వెళ్ళుటకు వీలు లేనప్పుడును, అకస్మికముగా ఇదివఱ కనుకొనని యాపద యేదైన తటస్థించినప్పుడును, సందర్భానుసారముగ మరియొక మార్గము నవలంబించి, ఆయాపదలను [illegible]నుకొని జయమును సంపాదించుటయే సమయస్ఫూర్తి కలిగియుండుట. సమయము ననుసరించి తగినట్లు ప్రవర్తించు శక్తి ప్రపంచానుభవమును విశేషముగ కలిగియున్న యింగ్లీషువారి కున్నట్లు జర్మనులకు లేదు.

పైచెప్పిన గుణములు జర్మన్ సైన్యములయందు లేనికారణముచే కొన్ని విషయములలో వా రింగ్లీషువారికి వెనుక చిక్కియున్నారు. దీనినిబట్టి జర్మనులు మూఢు లనియు, శౌర్యహీను లనియు, మన మనుకొనగూడదు. నలువది సంవత్సరములనుండి యేకదీక్షతో జర్మను ప్రభుత్వమువారీ సైన్యములను తర్ఫీతు చేసియున్నారు. ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు వీరతిశీఘ్రముగ ప్రయాణము చేయగలరు. సేనాధిపతుల యాజ్ఞ ననుసరించి నడచుటలో వీరికి సమానులు మరియొకరు లేరు. ప్రాణనష్టము కలుగునను భయము లేక ఎంతటి స్వల్పకార్యమును వేలకొలది సైనికుల చేత చేయుటకు ప్రయత్నించెదరు. శక్తిసామర్థ్యములయందు తమ్ము మించినవారొకరు లేరనియు, తమకు జయము తప్పక లభించుననియు, శత్రువుల నోడించుట యొక కష్టమైన పని కాదనియు వీరికి మూఢవిశ్వాసము కలదు. కనుక, తుదకు వీ రోడిపోవువారైనను, గట్టిగ యుద్ధము చేసి, తమ చేతనైన ప్రయత్నములను గావించియే, వీరు రణరంగమును వదలుదురు. ఇందువలననే యుద్ధము నడపించుటకై మన చక్రవర్తిగారు నియమించిన కిచనర్ ప్రభువుగారు జర్మనుల పరిపూర్ణముగ నోడించుటకు మూడు సంవత్సరముల కాలము పట్టు నని యిదివఱకే చెప్పిరి.

## II. ఆయుధములు

శత్రుబలమును మాపించుటయే యుద్ధముయొక్క ప్రధానోద్దేశము. శత్రుసేనలలోని మనుష్యులను చంపుట, వారికి గాయములు కలిగించుట, వారిని ఖైదీలుగ పట్టుకొనుట, శత్రువుల కోటలను వశపఱచుకొనుట మొదలగునవి యుద్ధమునకై చేయవలసిన పనులలో ముఖ్యము లయినవి. ఈ పనులను వట్టిచేతులతో చేయుటకు వీలు లేదు. వీని కన్నిటికిని వివిధవిధములైన యాయుధము లెన్నో కావలసియున్నవి. పూర్వకాలమందు శత్రుసంహారము చేయుటకై మన ఋషులకు మంత్రజలములును శాపవాక్యములును ఆయుధములుగ నుండెను. రాక్షసులు యుద్ధము చేయునప్పుడు బండలను చెట్లను రాళ్లను ఆయుధములుగ నుపయోగించుచుండిరి. క్షత్రియవీరులు ధనస్సును బాణమును ప్రధానాయుధములుగను, కత్తి గొడ్డలి బల్లెము మొదలగువానిని ఉపాయుధములుగను, వాడుచుండిరి. కొన్ని యస్త్రము లేకకాలమందు నూర్లకొలది జనులను సంహరించు శక్తి కలిగియుండిన వనియు, మరికొన్ని ప్రపంచ సంతతిని వ్యాపించునట్టి ప్రభావము కలిగియుండిన వనియు, బ్రహ్మాస్త్రము పాశుపతము చక్రము మొదలగువాని నడ్డగించెడి యాయుధము లెక్కడను లేవనియు, మనము పురాణములలో చదువుచున్నాము. ఇట్టి యస్త్రములను సంపాదించుటకొఱకే క్షత్రియవీరులు తమ జన్మమును గడపుచుండిరి. వారి పరిశ్రమయొక్కయు తపస్సులయొక్కయు ఉద్దేశము లిదియే. వీని నుపయోగించు క్రమమును నేర్చుకొనుటయే క్షత్రియుల విద్య. దూరమందుండునట్టియు, స్థిరముగ నొకచోట నుండక కదలుచుండునట్టియు, పదార్థములమీద గురితప్పకుండ బాణము వేయుటయందు నేర్పును సంపాదించి వీరు మిక్కిలి ప్రఖ్యాతి గాంచుచుండిరి. శత్రుప్రాణముల కేయాయుధము వలన నెక్కువ నష్టము కలుగుచుండెనో ఆయాయుధమునే ప్రశస్తమైనదానినిగ వారు గణించుచుండిరి.

ఇప్పటి యుద్ధమందు ధనుస్సును బాణమును నుపయోగించువా రెవరును లేరు. వీనికంటె నెక్కువగ ప్రాణనష్టమును కలిగించెడి యాయుధము లిరుపక్షములవారి యొద్దను నున్నవి. ఇవియే ఫిరంగులు తుపాకులు మొదలయినవి. ఒక ఫిరంగి దెబ్బతో వేలకొలది మనుష్యుల నేకకాలమందు చంపవచ్చును. ఎంత గట్టికోటయు నీఫిరంగిదెబ్బతో ముక్కలు ముక్కలుగ పడిపోవును. కొన్ని ఫిరంగులు 13,14,15,23, మైళ్ల దూరములో నుండు శత్రువులను కూడ చంపగలవు. సైన్యములో నుండు ప్రతిమనుష్యుని యొద్దను ఒక తుపాకి యుండును. దీనిని కాల్చియే వీరు శత్రుసంహారము చేయుదురు. దీని దెబ్బ 1, 1½ మైలు దూరము పోవును. ప్రతి సైనికుని యొద్దను ఒక పెద్ద కత్తి కూడ నుండును. శత్రువునకు చాల దూరముగ నున్నప్పుడు తుపాకిని, శత్రువును కలసికొన్నప్పుడు కత్తిని వీ రుపయోగించెదరు.

సిన సమాచారము నంతయు సేనాధిపతికి తీసికొనివచ్చి చెప్పెదరు. అటుతర్వాత యుద్ధము చేయుట లాభకరమని తోఁచినయెడల, యుద్ధమునకు పూనుటయు లేనియెడల మానుటయు సంభవించును. శత్రువుల బలము తన బలముకంటె హెచ్చుగ నున్నట్లు తెలిసిన యెడల సేనాధిపతి యాప్రదేశమును విడిచి పాఱిపోవుటకు ప్రయత్నించును. సేనాధిపతియొక్క యుద్దేశమును పోఁగొట్టి, స్వపక్ష సైన్యమును రక్షించుటచే గుఱ్ఱపు దళములు తోడ్పడును. 2. ఇట్లే యొక ప్రదేశమందు రెండు సైన్యములును చేరి యుద్ధము చేయుచున్నప్పుడు శత్రువుల బలము తగ్గుచున్నదో హెచ్చుచున్నదో వారు ధైర్యముతో యుద్ధము చేయుచున్నారో లేక భయపడి పాఱిపోవుటకు ప్రయత్నము చేయుచున్నారో మొదలగు విషయములను



[illegible] బ్రిటిషు, ఫ్రెంచి, జర్మను అశ్వసేన [illegible]

తెలిసికొని గుఱ్ఱపు రౌతు లప్పుడప్పుడు సేనాధిపతికి వర్తమానము తీసికొని వచ్చుచుందురు. 3. ఇది గాక, యుద్ధమధ్యమందు శత్రు సైన్యములపైఁ బడి వారిలో కలవరము కలిగించి వారి కేమి చేయుటకును తోఁచకుండునట్లు గావించుటయందు కూడ ఈ గుఱ్ఱపు దళములుపయోగించును. 4. యుద్ధము ముగిసిన తర్వాత, ఓడిపోయిన పక్షములోనివారు శత్రుబాధను తప్పించుకొనుటకై పరియొక దూర ప్రదేశమునకుఁ గాని, ఒక కోటలోనికిఁ గాని, సురక్షితముగ నుండు పరియొక స్థలమునకుఁ గాని, అతిశీఘ్రముగ పాఱిపోవుట కారంభింతురు. ఇట్లు వీరు పరుగెత్తి యొక కోటలో ప్రవేశించినయెడల, యుద్ధములో జయము సంపాదించినందుకవు తగిన ఫలమేమియు నుండదు. జయము పొందినవారు తిరిగి యా కోటను ముట్టడించి పట్టుకొనవలసియుందురు. అటుగా వారు చేసిన పనినే తిరిగి చేయవలసిన ట్లుండును. ఇట్టి సందర్భములలో పాఱిపోవుచుండు శత్రు సైన్యములను పాఱిపోకుండ చేయుట మిక్కిలి యవశ్యము. అతి వేగముగ పరుగెత్తఁజాలినవి గనుక, శత్రువులు పాఱిపోవుచున్నారని తెలియఁగనే వారి నడ్డగించుటకై సైన్యాధిపతి తనగుఱ్ఱపుదళములంపును. గుఱ్ఱపు రౌతులు వెళ్ళి శత్రువులను తఱిమితఱిమి తునకలు వారిని చెల్లాచెదరు చేసియో లేక వారి మధ్యమున ప్రవేశించి వారి బలమును పరిపూర్ణముగ నాశనము చేసియో విడువక మానరు.

కనుక శత్రువుల స్థితిగతులను గుఱించి సమాచారము తావలసినప్పుడును, శత్రునాశనము మొదలగు పనులు బహువేగముగ చేయవలసినప్పుడును, గుఱ్ఱపు దళములవంటి యుపయోగము గల



[illegible] సైనికులు [illegible]

సాధనములు మఱివేఱు లేవు. ఇట్టిపనులను ఇంత వేగముగను ఇంత జయప్రదముగను కాల్బలము మెన్నటికిని చేయఁజాలదు. యుద్ధము ప్రారంభమైనప్పుడు

| | | | | |
|---|---|---|---|---|
| ఇంగ్లీషువారియొద్ద | | 50,000 | గుఱ్ఱపు రౌతులు. | |
| ఫ్రెంచి | ,, | 50, 000 | ,, | 200,000 |
| రష్యా | ,, | 100, 000 | ,, | |
| జర్మని | ,, | 70,000 | ,, | |
| ఆస్ట్రియా | ,, | 50,000 | ,, | 120,000 |

ఉండెను.

మోటారుబండ్లు.— వీని యుపయోగమును గుఱించి విశేషముగ జెప్పవలసినది లేదు. సైన్యములను గాని సైన్యోపకరణములను గాని యొక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు మిక్కిలి వేగముగ తీసికొని పోవలసి వచ్చినపుడు ఈ బండ్లు చాల సహాయముచేయును. రైలుమార్గము లుండిన యెడల ఈపని యింతకంటె సులభముగ జరుగును కాని, ప్రతి గ్రామమునందును ప్రతిపల్లె యందును కావలసినప్పుడు రైల్లు వేయుట మిక్కిలి కష్టమగుటయే గాక యెక్కువ ధనవ్యయమును కలిగించును. కనుక సైన్యము లొక చోటునుండి మఱియొక చోటికి వెళ్లవలసినప్పుడు, ఈ యుద్ధములో మోటారుబండ్ల నుపయోగించుచున్నారు. జర్మనీ వారు వీని నెక్కువ నుపయోగించుచున్నట్లు తెలియుచున్నది.



మోటారుసైకిలెక్కి ఫ్రెంచియుద్ధభటులు పోరుసల్పుట

IV.వ ప్రకరణము

నౌకాబలము

ఇంగ్లండును స్వాధీనపఱచుకొనుటకు ప్రయత్నించు శత్రువు లెల్లప్పుడు సముద్రమును దాటుటకు వీలయిన మార్గమును వెదకుచుందురు. శత్రువులు కట్టి సముద్రమును దాటి ఇంగ్లండుపై దండెత్తి వచ్చుట వనమ్మకమాత్రముల కెవరికిని సాధ్యము కాదు. లక్షల కొలది సైన్యములను విమానముల యందుంచుకొని యాకాశమార్గమున ప్రయాణముచేసి యింగ్లండుపైకి వచ్చుటకు సామర్థ్య మెవరికిని లేదు. ఇంత గొప్ప విమానముల నెవరు నిర్మింపగలరు? కావున యపరిమితమైన నౌకాబలము గలవారే యింగ్లండును జోడింపగలిగెదరు కాని, అట్టి బలము లేనివారు మిగిలిన విషయములయందెంత యాధిక్యము గలిగియున్నను, ఇంగ్లీషువారిని జయించుకొనజాలరు. ఇంగ్లీషువారిని రక్షించుచుండు కోటగోడ సముద్రము. ఇట్టి సముద్రుని స్వాధీనపఱచుకొన దగినది నౌకాబలము గాక మఱియేమున్నది?



రోగము వచ్చినతర్వాత మందు పుచ్చుకొనుటకన్న రోగము రాకుండ దేహమును కాపాడుకొనుట మంచి పద్ధతి కదా? అట్లే శత్రువులు సముద్రమును దాటి యింగ్లండులో నడుగు పెట్టిన తర్వాత వారిని తమ సైన్యములచే జోడించి జయము చేయుటకన్న నసలు శత్రువులను సముద్రము దాటనియ్యకుండుటయు, దాటుటకు ప్రయత్నించుచుండు శత్రుసైన్యములను నాశనము చేసి సముద్రుని పాలు కావించుటయు నుత్తమమార్గమని యావారిగ్రహించి, ఇట్టి పనిని నెరవేర్చుకొనుటకు యుద్ధనౌకలు తప్ప వేఱే యుపకరణములు లేవని తమ నౌకాబలమును హెచ్చుచేయుటనుండి యింగ్లీషువారు వృద్ధిపఱచుకొనుచునే యున్నారు. రెండు మూడు దేశముల వారొక్కటిగ చేరి తమపైకి యుద్ధము చేయవచ్చినను వారందఱి యుద్ధనౌకలకంటె నెక్కువ యుద్ధనౌకల నింగ్లీషువారెల్లప్పుడు సిద్ధము చేసికొని యుందురు. శత్రువులు తమదేశముపై కెటనుండైనను రాగలరని ఇంగ్లీషువారు తమ యుద్ధనౌకలను నాలుగువైపుల సముద్రములయందు నుంచియుందురు. కావుననే యింగ్లీషువారికంటె నెక్కువ యుద్ధనౌకలు కలిగియుండువారే యింగ్లీషువారిని జోడింపగలరు గాని, ఈ సాధనము లేనివారెట్టి యుపాయమును కల్పింపజేయలేరు. శత్రువు లెందఱో యెన్నిమార్లో ఫ్రాన్సు, జర్మని రష్యా మొదలగు సమస్తదేశముల వారెవరైన దండెత్తి ఆదేశములలోని భాగములను వశపఱచుకొనగలిగిరి కాని తొమ్మిదివందల సంవత్సరములనుండి యింగ్లండుపై దండెత్తగలిగిన శత్రువొకడును లేడు. దీని కంతటికిని ఇంగ్లీషువారి నౌకాబలమును శత్రువుల నౌకాబలహీనతయు మాత్రమే కారణములు. ఫ్రెంచి చక్రవర్తి యగు నెపోలియను యిరోపాలోని సమస్తదేశములను జయించి సమస్తప్రజలను లోబఱచుకొనెను గాని ఈ నౌకాబలలోపమువలననే యెన్నియో ప్రయత్నములు చేసియు ఎన్నిమార్లో బెదరించియు ఇంగ్లండుపై దండెత్తి యింగ్లీషువారిని మాత్రము స్వాధీనము చేసికొనలేకపోయెను.

ఇంగ్లండు గాక యింగ్లీషువారి పరిపాలనకు లోబడిన దేశములు ప్రపంచమం దనేకము లున్నవి. వానిలో (1) మన హిందూదేశము (2) కనడా (3) ఆస్ట్రేలియా (4) న్యూజిలండు (5) దక్షిణ ఆఫ్రికా (6) ఈజిప్టు ముఖ్యములైనవి. ఇవి యన్నియు సముద్రముల కావల ఐరోపాకును ఇంగ్లండునకును చాల దూరమం దున్నవి. ఐరోపాలోని శత్రువు లెవరైన ఈ దేశముల కుపద్రవము కలుగఁజేయుటకు గాని వానిని జయించుటకుఁగాని ప్రయత్నింతు రేని, అనేక సముద్రములను వారు దాటి రావలసియుండును. యుద్ధనౌక లనేకము లున్నఁ గాని యిది సాధ్యమగు పని కాదు. ఈ దేశములు శత్రువులపాలు గాకుండ, కాపాడుకొనుటకు కూడ ఇంగ్లీషువారి కెంతయో నౌకాబల ముండవలయును. శత్రునౌకలకన్న ఇంగ్లీషువారినావ లధికముగ నుండవలయును శత్రువులు సముద్రమును దాటి యీ దేశములపైకి వచ్చుటకు సాహసింపఁజాలరు. సైన్యము లున్నను లేకపోయినను నౌకాబలము లేకుండ ఇంగ్లీషువారి దేశములను జయించుట యసాధ్య మనియు, శత్రువుల నౌకాబలముకన్న అధికబల మింగ్లీషువారియొద్ద యుండినయెడలనే ఇంగ్లండునకును ఇంగ్లీషువారి యితర రాష్ట్రములకును శత్రుబాధ తప్పు ననియు, ఇందువలన స్పష్టమగుచున్నది. ఈ కారణమువలననే, ఇతరదేశములవారు ప్రతిపురుషుండును యుద్ధముచేయుటకు నేర్చుకొనవలయు నని యేర్పాటు చేసికొని తమతమసైన్యములను వృద్ధిపఱచుకొనుచున్నను, ఇంగ్లీషువా రట్టి యేర్పాటు చేసికొనక స్వల్పసైన్యములతోనే తృప్తిపొంది, తమ యుద్ధనౌకలను మాత్ర మధికము చేసికొనుచున్నారు. ఇంగ్లీషువారిని కాపాడుచుండునది వారి నౌకాబలమే; కాని వారి సైన్యములు కావు.

జర్మనీవారు దీని తెలిసికొని, కడచిన పది పదునైదు సంవత్సరములనుండియు ఇంగ్లీషువారి నౌకాబలముతో సమానమైన నౌకాబలమును తాము గూడ సంపాదింపఁగోరి యేటేటను పెక్కు కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి యుద్ధనౌకలను కట్టుటకు మొదలిడిరి. ఈ పదునైదు సంవత్సరములుగ ఇంగ్లీషువా రూరకయుండియుండిన యెడల, ఇప్పటికి జర్మనీవా రింగ్లీషువారితో సమానమైన బలమును సంపాదించియే యుందురు. అట్లు గాక, ఇంగ్లీషువారుకూడ జర్మనులకంటె నెక్కువ శ్రద్ధతో తమ నౌకలను వృద్ధిపఱచుకొనుచుండినందువలన యుద్ధము ప్రారంభమగునప్పటి కింగ్లీషువారియొద్ద జర్మనులయొద్ద కంటె రెండింతల నౌక లుండినవి.

యుద్ధమం దిరుపక్షములవారును వినియోగించుచున్న నౌకలు అనేక రకములుగ నున్నవి. యుద్ధము ప్రారంభమైనతర్వాత రెండు పక్షములవారును తమతమ నౌకాబలమును వృద్ధిపఱచుకొన సాగిరను, ప్రారంభములో వారి నావలసంఖ్య యీక్రింద విధముగ నుండెను:—

| వివరము | ఇంగ్లండు | | ఫ్రాన్సు | | రష్యా | | ఇటలీ | | జర్మని | | ఆస్ట్రియా | | టర్కీ | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | కట్టినవి | కట్టబడుచున్నవి | కట్టినవి | కట్టబడుచున్నవి | కట్టినవి | కట్టబడుచున్నవి | కట్టినవి | కట్టబడుచున్నవి | కట్టినవి | కట్టబడుచున్నవి | కట్టినవి | కట్టబడుచున్నవి | కట్టినవి | కట్టబడుచున్నవి |
| యుద్ధనావలు | 58 | 14 | 21 | 10 | 8 | 7 | 9 | 5 | 35 | 6 | 14 | 2 | | |
| బ్యాటిల్ క్రూయిసర్లు | 9 | 1 | | | | 4 | | | 4 | 3 | | | 3 | |
| క్రూయిసర్లు | 47 | | 24 | | 12 | | 9 | | 9 | | 2 | | 4 | |
| లైట్ క్రూయిసర్లు | 65 | 20 | 8 | | 2 | 8 | 14 | 4 | 43 | 6 | 9 | 3 | | |
| టార్పిడో వెసల్సు | 25 | 1 | 3 | | | | 3 | | | | 11 | | | |
| టార్పిడోబోటు డిస్ట్రాయర్లు | 201 | 36 | 80 | 7 | 95 | 45 | 30 | 16 | 133 | 12 | 15 | 3 | 8 | |
| టార్పిడోబోట్లు | 106 | | 153 | | 25 | | 94 | 1 | 80 | | 58 | 27 | 3 | |
| సబ్‌మెరైనులు | 69 | 27 | 50 | 26 | 25 | 18 | 18 | 2 | 24 | 14 | 6 | 5 | | |

దీనినిబట్టి ఇంగ్లీషుపక్షమువారియొద్ద జర్మనీపక్షము వారియొద్దకంటె రెండు మూడు రెట్లధికముగ యుద్ధనౌక లున్న వని స్పష్టమగుచున్నది.

ఇరుపక్షములవారి నౌకాబలముల తారతమ్యమును మరియొకవిధముగ మనము కనిపెట్టవచ్చును. అన్ని నావలు నొకే వైశాల్యము కలిగియుండవు. కొన్ని పెద్దవిగను మరికొన్ని చిన్నవిగను నుండును. ఎక్కువ వైశాల్యము గల యోడ యొక్కటి తక్కువ వైశాల్యము గల రెండు మూడు వోడలకంటె పెద్దదిగ నుండవచ్చును. ఓడ పెద్దది యయినయెడల, దానియం దెక్కువ మంది యుద్ధభటు లుండెదరు; ఎక్కువ ఫిరంగు లుండును. కనుక పైచెప్పఁబడిన పర్యాయములయిన

యుద్ధనౌకల వైశాల్య మీ క్రిందివిధమున నున్నదని తెలిసికొనుట యుపయోగకరము.

| | ఇంగ్లీషు పక్షము | జర్మనీపక్షము |
|---|---|---|
| డ్రెడ్‌నాట్ల వైశాల్యము | 1,704,828 టన్నులు | 728,962 టన్నులు |
| క్రూయిజర్లు ,, | 1,153,779 ,, | 272,287 ,, |
| డిస్ట్రాయర్లు ,, | 290,274 ,, | 99,222 ,, |
| మొత్తము | 3.148,681 | 1,100.471 |
| | (సుమారు 32 లక్షల టన్నులు) | (11 లక్షల టన్నులు) |

ఇంగ్లీషు పక్షమున జర్మనుల పక్షముకంటె మూడింతల యధిక వైశాల్యము గల నావ లున్నవి.

ఈ యుద్ధనౌకలలో నొక్కొకదాని కలవ నొక్కొకవిధమైన యుపయోగము కలుగుచున్నది. వీని యన్నిటిలో "డ్రెడ్‌నాట్లు" మిక్కిలి గొప్పవి. వీని పొడుగు 390 అడుగులు మొదలు 580 అడుగులవఱకు నుండును. వీని వైశాల్యము 15,000 టన్నులు మొదలు 27,500 టన్నులవఱకు నుండును. వీనిలో నొక్కొక దానిని కట్టుటకును 150 లక్షల రూపాయలు మొదలు 350 లక్షల రూపాయలవఱకు పట్టును. ప్రతి "డ్రెడ్‌నాటు" నందును 10 మొదలు 25 మైళ్ల దూరమువఱకు గుండును పంపెడి ఫిరంగు లనేకము లుండును. ఈనౌకలు గంటకు 20 మొదలు 28 మైళ్లవఱకు ప్రయాణము చేయఁగలవు. వీనిలోనొక్కొకదానియందు 750 మొదలు 1000 మంది మనుష్యు లుందురు. శత్రువులయొక్క డ్రెడ్‌నాట్లను వెదకి వానిని నాశనము చేయుటయే వీనియొక్క ప్రధానమైన పని. సముద్రయుద్ధమందు జయాపజయములను నిర్ణయించు యుద్ధనౌక లివియే.



న్యూజిలాండు క్రూయిజర్

హెలిగోలాండ్ యుద్ధములో అగష్టు 28-వ తేదీన అయిదు జర్మను యుద్ధనావలను ముంచిన బ్రిటిషు క్రూయిజరులలో నొక్కటి.

"క్రూయిజర్లు" ఇవి రెండవ తరగతి యుద్ధనౌకలు. యుద్ధకాలములో నివి చేయుపని సైన్యములలోని గుఱ్ఱపు దళముల పనివలెనే యుండును. ఇవి డ్రెడ్‌నాట్లకంటె చిన్నవిగను తేలికగను నుండుటయే గాక, వానికంటె నెక్కువ వేగముగ ప్రయాణము కూడ చేయఁగలవు గనుక, శత్రువుల యుద్ధనౌక లెక్కడ నున్నవో, వాని బల మెంతమాత్రమో శత్రునౌకాధిపతుల యుద్దేశము లెట్టివో ఈ మొదలగు శత్రువుల స్థితిగతులను తెలిసికొనుట యందివి ముఖ్యముగా నుపయోగింపఁబడుచున్నవి. ఇవి యతివేగముగ ప్రయాణము చేయఁగలిగినవి కావున, నౌకాధిపతి కేదైన సమాచారము శీఘ్రముగ తెలియవలసియుండిన నివేల యొక క్రూయిజరును పంపి కావలసిన సమాచార మాతఁడు తెలిసికొనును. ఇది యీయుద్ధనౌకలు చేయు ముఖ్యమైన పని. వీని పొడుగు 400 మొదలు 500 అడుగులవఱకును, వైశాల్యము 2000 టన్నులు మొదలు 15000 టన్నులవఱకును నుండును. ఇవి గంటకు 25 మొదలు 36 మైళ్లవఱకు ప్రయాణము చేయఁగలవు. సమాచారములను తీసికొని వచ్చుటయే గాక, ఇవి మఱికొన్ని పనులను కూడ చేయుచుండును. శత్రువుల క్రూయిజర్లు ఎక్కడనైన కనబడినయెడల, వానితో తక్షణమే యుద్ధముచేసి వానిని నాశనము గావించుటయు, వ్యాపారము చేయుచుండు శత్రువుల నావను పట్టుకొని తమదేశమునకు తీసికొనివచ్చుటయు నివిచేయునట్టి ఇతర కార్యములు. ఇవి డ్రెడ్ నాట్లతో యుద్ధమున నెప్పుడును సాహసింపవు. వీనిలోని ఫిరంగు లంత గొప్పవి కావు. డ్రెడ్‌నాటులకంటె నెక్కువ వేగము కలిగియున్నవి గనుకనే ఆ యుద్ధనౌక యొకటి కనుపింపఁగనే ఇవి పరుగెత్తిపోవును.

"డిస్ట్రాయర్లు":—ఇవి మూడవ తరగతి యుద్ధనౌకలు. "డిస్ట్రాయ" న్లనఁగా నాశనము గావించునవి యని యర్థము. వీనిలో వివిధము లైనవి యున్నవి. కొన్ని జలముపై నుండియే శత్రునౌకలను నాశనము చేయును; మఱికొన్ని జలములోపల దాఁగియుండి సమయము వచ్చినప్పుడు పైకి వచ్చుచు శత్రునౌకలకు నష్టము కలిగించును. ఇవి యన్నియు చిన్న నావలు. వీనిలో నొక్కొకదానియందును కొన్ని చిఱుగొట్టము లుండును. ఇవియే టార్పెడో లనఁబడును. ఈ గొట్టములలో మందు తోటాలు మొదలగువాని నుంచి శత్రునౌక కనఁబడినప్పుడు రహస్యముగ యంత్రసహాయమున ఆ గొట్టములను దానిపైకి పంపుదురు. శత్రునౌకను తాఁకఁగనే యీ గొట్టమునందున్న మందు రగులుకొని గుండును

పైకి పంపును. ఈ గుండు తగులగనే శత్రునౌక పగులుటయో మునుగుటయో లేక మరియేవిధమైన నష్టము నొందుటయో సంభవించును. ఇట్టి డిస్ట్రాయర్లు రెండు పక్షములవారికొద్దను అనేకము లున్నవి.

వీనికి శత్రునౌకలను నాశనము చేయుశక్తి యున్నను, ఈ యుద్ధమందు వీనివలన విశేషలాభము కలుగలేదు. దీనికి రెండు ముఖ్య కారణము లున్నవి. ఇవి మిగుల మెల్లగా ప్రయాణము చేయును. కనుక వేగముగ నడచు డ్రెడ్నాట్లను గాని క్రూయిజర్లను గాని వెంబడించి పోవుటకు వీనికి శక్తి లేదు. జలాంతర్గాములు నీళ్ల లోపలనుండి పని చేయును. డిస్ట్రాయర్లు ఎల్లప్పుడు జలములోపల నుండలేవు. అప్పుడప్పుడు గాలి పీల్చుకొనుటకు పైకి రావలసి యుండును. ఇవి పైకివచ్చినప్పుడు శత్రునౌకలు చూచిన యెడల తక్షణమే అవి కాచియుండి వీనిని నాశనము చేయఁగలిగియుండును. శౌర్యముతో బహిరంగముగ, యుద్ధము చేయుటవలన కలుగు నంతటి లాభము ఇట్టి రహస్యపు పనులవలన ఎన్నటికిని కలుగఁ జాలదు. ఇది గాక, ఈ డిస్ట్రాయర్లలోని గొట్టములు చాల సున్నితమైనవి. ఎంతమాత్రము మరామతు కలిగినను, ఇవి నిరుపయోగము లైపోవును. ఈ న్యూనత్వములవలన ఇవి సాధారణమైన చిన్న చిన్న రోడలను నాశనము చేయఁగలిగియుండును. కాని గొప్ప గొప్ప యుద్ధనౌకల నెన్నటికిని ముట్టుకొనలేవు. కనుకనే యిదివఱకు వీనివలన పెద్దనావల కేలాటియపాయము కలుగలేదు.



జలాంతర్గామి [illegible]

ఈ వైవిధ్యములనుండి సముద్రము మీఁద సంచరించుచుండు శత్రువుల యుద్ధనౌకలను నాశనము చేయుటకై ఇరుపక్షముల వారికిని ఎన్నియో సాధనము లున్నవని స్పష్టమగుచున్నది. డ్రెడ్నాట్లు డ్రెడ్నాట్లను, క్రూయిజర్లు క్రూయిజర్లను, డిస్ట్రాయర్లు అన్ని రకముల నావలను, నాశనము చేయుటకై యుపయోగింపఁబడుచున్నవి.

1 సముద్రయుద్ధములో జయాపజయములను నిర్ణయించుటయందు యుద్ధనౌకలకంటె ఎక్కువ ప్రధానమైన హేతువు మరియొకటి యున్నది. నావికులయొక్క నేర్పు యీ హేతువు. సముద్రముమీఁద యుద్ధము చేయు నేర్పు సులభముగ లభించునట్టిది కాదు. ఇది యనుభవమువలన కలుగునదే గాని దీనిని సంపాదించుటకు వేఱు మార్గము లేదు. ఇట్టి యనుభవమునకు ఇంగ్లీషువారి

కన్నంత యవకాశము వరోపాలోని మరియే దేశస్థులకును లేదు. ఇంగ్లండు ద్వీప మగుటవలన వానిలోని ప్రజ లందఱు సముద్రము యొక్క మంచిచెడ్డలు బాగుగ గుర్తెఱిగి యున్నారు. అనాదినుండి సముద్రముమీఁద ప్రయాణము చేయుట వీరికి సహజమై యున్నది. ఈ దేశమునం దొడ్డ రేవు లనేకము లుండుటవలన ఇది వ్యాపారమున కత్యంత మనుకూలముగ నున్నది; అందుచేత ఇంగ్లీషువారు చాల కాలమునుండి దేశదేశములతో వ్యాపారము చేసి నావికులలో నెల్ల నగ్రగణ్యు లని ప్రసిద్ధి గాంచియున్నారు. సముద్రము మీఁద యుద్ధము చేయుటను వీరు నిన్న నేఁడు నేర్చుకొన్నవారు కారు. వీరు పట్టినది మొదలు వీర కిదియే వృత్తియై యున్నది. ఇంత యను భవము మరి యెవరికిని లేదు. జర్మనుల కిటీవలివఱకు యుద్ధనౌకలే లేవు. వీరి దేశముయొక్క సముద్రతీరము చాల చిన్నది. భూయుద్ధమం దున్నంత నేర్పు వీరికి సముద్రయుద్ధమందు లేదు. ఇది గాక, విశాలమైన యోడరేవులు వీరి దేశమందు లేవు. ఈకారణముచే సముద్రము మీఁద ప్రయాణము చేయుటకు కూడ జర్మనుల కెక్కువ యవకాశము లేదు. వందలకొలఁది సంవత్సరములనుండి సముద్రయుద్ధములో ఆరితేరిన యింగ్లీషువారి కెని పది పదునైదు సంవత్సరములుగ దీనిని నేర్చుకొనుటకు ప్రయత్నము చేయుచున్న జర్మనులకును ఎంత మాత్రము పోటి లేదు. జర్మనులు బెల్జియమును ఆయుంచి స్వాధీనపఱచుకొనుటకు ప్రయత్నించుటలో ఈ విషయమై తమ స్థితిని బాగుపఱచుకొనుటయే వారి ప్రధానోద్దేశము. బెల్జియము దేశములోనివారు మిక్కిలి నేర్పు గల నావికులు. ఈ దేశపు సముద్రతీరమున ఆంట్వెర్పు మొదలగు విశాలమైన యోడరేవు లనేకము లున్నవి. కనుక బెల్జియము స్వాధీనమైన యెడల, ఈదేశపు ప్రజలను నావికులుగ నుపయోగించుకొనుటకును, ఈ యోడ రేవులలో గొప్ప యుద్ధనౌకలను తయారు చేయుటకును ఎక్కువ యవకాశము కలుగును. ఇదిగాక, పోలెండు పైని కూడ జర్మనీవారు చాల కాలమునుండి కన్ను వేసియుండుటకు కూడ, ఇదియే కారణమై యున్నది. ఈ విషయములను బట్టి ప్రస్తుత కాలమందు ఇంగ్లీషువారి కున్నంత నేర్పు సముద్రయుద్ధమందు జర్మనులకు లేదని స్పష్టమగుచున్నది.

యుద్ధ మెంత కాలము జరుగునో యంతవఱకును యుద్ధము చేయుచుండు సైనికులకును నావికులకును సమృద్ధిగ అన్నపానములు దుస్తులు మొదలగు పోషణసామగ్రి యుండవలయును. కడుపు నిండ తినుట కాహారమును, ఎండ గాలి వాన మంచు శత్రువుల ఆయుధములు మొదలగువానివలన కలుగు బాధలనుండి తప్పించుకొనుటకు కావలసిన బట్టలును లేనియెడల, సైనికులు బలహీనులై యుద్ధము చేయలేక శత్రువుల వశము కావలసినవా రగుదురు. యుద్ధరంగమం దిప్పుడు సుమారు రెండు కోట్ల జను లున్నారు. వీరి కందఱికి కావలసినంత యాహారసామగ్రిని రెండు పక్షములవారును సిద్ధముగ నుంచుకొని యుండవలయును. ఇది గాక యుద్ధము జరుగుటకు మఱికొన్ని పదార్థములు కూడ కావలసియున్నవి. వీనిలో ముఖ్యము లైనవి (1) తుపాకి మందు; గోళాలు (2) పెట్రోలు అను చమురు (3) రబ్బరు; (4) గుఱ్ఱములు. వీనియొక్క సప్లయి యెవ్వరిపక్షమువారికి తగ్గిపోవునో అప్పుడే యా పక్షమువారు యుద్ధమును మానవలసియుందురు.

ఆహారము:—యుద్ధము లేనప్పుడు మామూలుగ ఈ రెండు పక్షముల దేశములలోనివారును తమకు కావలసిన యాహారపదార్థములను ఏవిధముగ సంపాదించుచున్నారో మనము తెలిసికొనవలయును. వీరిలో రష్యావారు మాత్రము వ్యవసాయము ప్రధానవృత్తిగాఁ గలవారై తమకు కావలసిన గోధుమలు మొదలగువానిని తమ దేశమునందే యుత్పత్తిచేసి తమకు కావలసినంతవఱకు దేశమందుంచుకొని మిగిలిన ధాన్యమును ఇతర దేశములకంపి లాభము పొందుచున్నారు. కనుక వీరికి కావలసిన ధాన్యమంతయు వీరి దేశములలో పండును. జర్మనీవారికి కట్టి పరుపాయము విశేషముగ లేదు. వీరు కూడ వ్యవసాయము చేయుచున్నారు. కాని వీరి భూములలో పండు ధాన్యము ప్రజ లందఱికి చాలదు. ప్రజలకు కావలసిన ధాన్యములో మూడు వంతులు మాత్రమే జర్మనీయం దుత్పత్తి యగుచున్నది. మిగిలిన యొకవంతును వితరదేశములనుండి వ్యాపారమూలమున తెప్పించుకొనుచున్నారు. ఇంగ్లీషువారి కిటువంటి యవకాశము కూడ లేదు. వీరికి సేద్యము ప్రధానవృత్తి కానే కాదు. వీరిలో ముప్పాతిక భాగము బట్టలు నేయుట గనులనుండి లోహములను తీయుట, ఇనుము మొదలగువానితో సామానులను యంత్రములను చేయుట, దేశాంతరములతో వ్యాపారము చేయుట, మొదలగు వానివలన జీవనము సంపాదించుకొనెదరు. వీరికి కావలసిన యాహారపదార్థములలో పదియవ వంతుకూడ వీరి దేశమున పండుట లేదు. ఇతర దేశములతో వ్యాపారము చేసి, ధాన్యము విస్తారముగ పండెడి యిండియా, కనడా, మొదలగు దేశములనుండి, వీరు తమకు కావలసిన యాహారపదార్థములను తెచ్చుకొనుచున్నారు. ఈ దేశములం దొకచోట క్షామము సంభవించినయెడల, ఇంగ్లండులో క్షామము సంభవించినట్లే. ఫ్రాన్సు, ఆస్ట్రియా దేశములలోనివారు కూడ తమకు కావలసిన యాహారపదార్థములలో కొన్నిటిని తమ భూములయందే పండించుకొనుచున్నను మఱికొన్నిటి నితరదేశములనుండి కొని తెప్పించుకొనెదరు. కనుక దీనినిబట్టి యొక్క రష్యావారు తప్ప మిగిలిన వారందఱికి కావలసిన యాహారపదార్థము లితర దేశముల నుండి రావలసియున్న దని స్పష్టమగుచున్నది.

యుద్ధము లేనప్పుడే వీరి స్థితి యిట్లు లున్నది. యుద్ధము సంభవించఁగనే వీరికీ విషయమై మరింత కష్టము కలుగును. వ్యవసాయము చేసి గనా భూమినుండి ధాన్యము నుత్పత్తి చేయుట. యుద్ధము లేనప్పుడు కష్టపడి పనిచేయఁగలిగినట్టియు మంచి యౌవనమునం దున్నట్టియు రైతులు కూలివాండ్రు అనేకులు సేద్యము చేయుచుందురు. యుద్ధము ప్రారంభించిన దినముననే ఇట్టి యువకు

రందఱు తమ పొలములను విడిచి సేద్యమును మాని సైన్యములో చేరి యుద్ధరంగమునకు వెళ్ళవలసి యుందురు. ఇందువలన యుద్ధమునం దుపయోగపడని యాడువాండ్రు ముసలివాండ్రు పిల్లవాండ్రు మాత్రము సేద్యము చేసి ధాన్యము నుత్పత్తి చేయుచుందురు. సాధారణముగ ప్రజలకు కావలసిన ధాన్యములో మూడు భాగములు జర్మని యందే యుత్పత్తి యగుచున్నను, యుద్ధసమయములో ఇది సాధ్యము కాదు. పని చేయలేని యాడువాండ్రు మొదలయినవారు సేద్యము చేయుటవలన భూములలో మామూలుగ పండుచున్నంత పంట పండదు కదా? కనుక వ్యవసాయము చేసి తమ దేశములోనే ధాన్యమును కొంతవఱకు పండించుకొనుచున్న జర్మనులు ఫ్రెంచివారును యుద్ధకాలమం దట్లు చేయలేక, ఇతర దేశములనుండి మామూలుకంటె నెక్కువ యాహారపదార్థములను తెచ్చుకొనవలయును. ఇదివఱకు తమ దేశమందు మూడు కోట్ల పుట్లు పండుచున్న యెడల, సేద్యము చక్కఁగ చేయుటకు వీలులేని యుద్ధకాలమందు జర్మనులు రెండు కోట్ల పుట్లనే పండింపఁగలరు. కనుక నెప్పటికన్న నిప్పుడొక కోటి పుట్ల ధాన్యము నెక్కువగ వీ రితరదేశములనుండి కొని తీసికొని రావలయును. ఇతరదేశముల స్థితి కూడ నిట్టిదే. యుద్ధము లేనప్పుడును యుద్ధము సంభవించినప్పుడును ఆహారపదార్థముల విషయమై యొకటే స్థితియందుండు దేశ మొక ఇంగ్లండు మాత్రమే. యుద్ధము లేనప్పుడు కూడ వీ రితర దేశములనుండియే తమకు కావలసిన ధాన్యములను తెచ్చుకొనెదరు. యుద్ధకాలమందు కూడ వీ రట్లే చేయుదురు.

ఆహారపదార్థములను గురించి మఱిరెండు విషయములను మనము తెలిసికొనవలయును: (1) ఇంగ్లీషువారు, జర్మనులు, ఫ్రెంచివారు తమకు కావలసిన ధాన్యము నితరదేశములనుండి యేలాగు సంపాదించుచున్నారు? మామూలుగ వీరు చేయు పని యీవిధముగ నుండును. ఇతరదేశస్థుల కెన్నియో సరుకులు కావలసియున్నవి. బట్టలు లోహపు సామానులు, యంత్రములు మొదలగువాని నితర దేశస్థులు వీరివలె నంత నేర్పుతోను చౌకగాను చేయలేరు. మన దేశములో ప్రత్తి పండుచున్నను మనము వీరినుండి విస్తారముగ బట్టలను తెప్పించుచున్నాము. అట్లే యితరదేశములవారు కూడ చేయుదురు. కనుక ఇతరదేశస్థులకు కావలసిన వారికైన సరుకుల నింగ్లీషువారు చేసి వాని నితరదేశములకు పంపి వానికి బదులాహారపదార్థములను తీసికొనెదరు. వీ రెక్కువ బట్టల నిచ్చిన, ఇతరదేశస్థు లెక్కువ యాహారపదార్థముల నిచ్చెదరు. వీరు తక్కువ యిచ్చిన ఇతరులు కూడ నట్లే చేయుదురు.

యుద్ధము సంభవించిన తర్వాత వీరి కాహారపదార్థములు పూర్వముకంటె నెక్కువగ నితరదేశములనుండి రావలసియున్న దని యిదివఱకె మనము తెలిసికొనియుంటిమి. దీనికిగాను వీరు మామూలుకన్న నెక్కువగా బట్టలు మొదలగు సరుకులను చేసి ధాన్య ముత్పత్తి యగు దేశముల కంపవలయును. ఇట్లు పంపినం గాని వీరికి కావలసినన్ని యాహారపదార్థములు దొరకఁజాలవు. యుద్ధకాలమందు బట్టలు మొదలగువానిని మామూలుకంటె నెక్కువగ చేయుట కష్టమైన పని. మామూలుగ చేయుచున్న సరకులను చేయుట కూడ దుస్సాధ్యము. ఏలనఁగా, నేత, గనులు త్రవ్వుట యంత్రములు చేయుట, మొదలగు పనులను చేయుచున్న మగవారందఱు యుద్ధము ప్రారంభము కాఁగానే, కొలువులను విడిచి సైన్యములో చేరుదురు. కనుక పిల్లవాండ్రు ముసలివాండ్రు మాత్రమే యీపనులను చేయుచుందురు. దీనివలన మామూలుకంటె తక్కువ సరుకులు జర్మనీ మొదలగు దేశములయం దుత్పత్తి యగును కాని యెక్కువ సరుకు లుత్పత్తి కాఁజాలవు. ఇతరదేశములనుండి యెక్కువ యాహారపదార్థము లిప్పుడు వీరికి కావలసియున్నను వీనిని సంపాదించుటకు వీరైన బట్టలు మొదలగువానిని వీ రప్పటికంటె నెక్కువగ చేయలేరని మనకు విశదమగుచున్నది.

(2) ఇట్టి స్థితిలో రెండు పక్షములవారును ఆహారసామగ్రిని సంపాదించుటకై యేమి చేయవలయును? దీనికి బదులుగ ఇతర పదార్థములను విశేషముగ నియ్యలేనప్పుడు, వీరు ధనము నిచ్చి దీనిని కొనవలసియున్నది. ఇదివఱకు బట్టలు అద్దపుసామానులు ఔషధములు మొదలగువాని నిచ్చి జర్మనులు మనయొద్దనుండి నూనెలు మొదలగువానిని తీసికొనుచుండిరి. ఇప్పుడు వాని నెక్కువగ చేసి పంపుటకు వీలు లేదు. కావున వీరు రూపాయల నిచ్చి యీ యాహారపదార్థముల నితరదేశములనుండి కొనవలసియున్నారు. ఇట్టి స్థితిలో వీరియొద్ద విస్తారము ధన ముండవలయును. యుద్ధకాలమందు ధనము లేకుండ నే పదార్థమును దొరకదు. కనుక నేపక్షమువా రెక్కువ ధనవంతులో వారికే జయము లభించును; ధనము లేనిపక్షమున కపజయము లభించును. మామూలుగ యుద్ధములు లేనప్పుడు ఇంగ్లీషువారును ఫ్రెంచివారును విశేషధనము కూడఁబెట్టి కావలసినవారికి కప్పిచ్చుచు వడ్డీ సంపాదించుచుండువారు. వీరి వ్యాపారము మహత్తరమై యుండుటవలన వీ రెక్కువ ధనమును గడింపఁగలిగిరి. ఎట్టి కష్టమును లేక వీరి కెంత ధనము కావలసియున్నను దొరకును. జర్మనీవా రట్టి స్థితిలో లేరు. సాధారణముగ వీ రప్పు తీయువారే కాని యితరుల కప్పిచ్చునంత మంచిదశలో లేరు. కనుక తమకు కావలసిన పదార్థములను కొనుటకు విస్తారమైన ద్రవ్యము వీరియొద్ద లేదు. ఎంతయో కష్టముమీఁద గాని వీరి కిప్పుడు అప్పు దొరకదు. యుద్ధమునకు ముందు కూడఁబెట్టిన ధనముండునంతవఱకును కావలసిన పదార్థములను కొనుచుందురు; కాని యది తఱిగిపోవఁగనే వీరు యుద్ధమును నిలుపవలసియుందురు.

**మందు, తోటాలు.**—ఇవి యుండినఁ గాని ఫిరంగులను తుపాకులను యుద్ధమం దుపయోగించుటకు వీలు లేదు. వీనిని చేయుటకు రాగి యిత్తడి మొదలగు పదార్థము లనేకములు కావలయును. ఈ పదార్థములు జర్మనియందు విశేషముగ దొరకవు. ఇతరదేశములనుండియే జర్మనులు ఇంగ్లీషువారును వీనిని కొనవలసి యున్నారు.

పెట్రోలు:— కిరసనాయిల్ గనులనుండి తీయఁబడెడి యొకవిధమైన చమురు. దీనిని విస్తారముగ విమానములకొఱకును మోటారుబండ్లకొఱకును వాడుదురు. ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు సైన్యములను మిక్కిలి వేగముగ పంపవలసినప్పుడు మోటారు బండ్లే నుపయోగింతురు. పెట్రోలు చమురు లేకుండ విమానములు గాని మోటారుబండ్లు గాని ప్రయాణము చేయలేవు. రబ్బరు కూడ వీనికొఱకే విస్తారముగ నుపయోగింపఁబడుచున్నది. ఈ రెండు పదార్థములును జర్మనీయందు దొరకుట కష్టము.

గుఱ్ఱములు:— గుఱ్ఱపు దళములు యుద్ధమునందు చేయవలసిన పనులు చక్కఁగ జరుగుటకు గుఱ్ఱములు కావలసియున్నవి. వీనిని గూడ నితరదేశములనుండియే యిరుపక్షములవారును తెచ్చుకొనవలయును.

### యుద్ధనౌకలు చేయు పని

ఇంగ్లీషువారు జర్మనులకంటె నెక్కువ యుద్ధనౌకలు కలిగియున్నారని మన కిదివఱకే తెలిసియున్నది. ఈ యుద్ధనౌకల నింగ్లీషువా రేవిధముగ నుపయోగించెదరో యవి చేయు పను లెవియో మన మిప్పుడు తెలిసికొనవలయును. యుద్ధనౌకలు చేయవలసిన పనులు నాలుగున్నవి. (1) శత్రువుల యుద్ధనౌకలను యుద్ధమునకు పురికొల్పి వానిని నాశము చేయుట మొదటి పని. (2) శత్రువుల వ్యాపారమును నిలిపివేయుట రెండవ పని. (3) శత్రువులవలన తమ దేశస్థుల వ్యాపారమున కేలాటి భంగమును కలుగకుండునట్లు చేయుట మూడవ పని. (4) తమ దేశమునకును తమ ప్రభుత్వమునకు లోబడియుండు నితరదేశములకును గల సంబంధము తెగిపోకయుండునట్లు కాపాడుట నాలుగవ పని. ఈ పనుల నేవిధముగ రెండు పక్షముల వారలును చేయఁగలరో మనము విచారింతము.

### మొదటిపని

శత్రువుల యుద్ధనౌకలను యుద్ధమునకు పురికొల్పి వానితో యుద్ధము చేసి వానిని నాశనము చేయుటయే సముద్రయుద్ధము యొక్క ప్రధానోద్దేశము. యుద్ధము ప్రారంభమైనప్పుడు ఇంగ్లీషువారి పక్షమున జర్మన్ పక్షమునకంటె నెక్కువ నౌకాబల ముండినది కదా? ఇట్టి సందర్భములో జర్మనుల నావలు సాహసించి సముద్రమధ్యమునకు వచ్చినయెడల వాని నోడించుట యింగ్లీషువారి కంత కష్టమైన పని కాదు. జర్మనుల కంత సాహసము చేయుట కిష్టము లేకపోయెను. అందువలననే వారి నావలన్నియు సముద్రములోనికి రాక రేవులయందే యుండవలసి దాఁగియున్నవి. దాఁగుకొనియుండు యుద్ధనౌకలతో యుద్ధము చేయుట యెట్లు సంభవించును? ఏ విధముగనైన వీని నోడరేవులనుండి బయటికి వచ్చునట్లు చేయవలయు ననియు, అట్లు వచ్చినప్పుడు సమయము చూచి వానిని హరింపవలె ననియు, ఇంగ్లీషు యుద్ధనౌక లన్నియు జర్మనీకిని ఇంగ్లండునకును నడుమ నున్న యుత్తరసముద్రమునం దతిజాగరూకతతో సంచరించుచున్నవి. జర్మనుల నావలతో యుద్ధము సంభవింపవలసినదే కాని యట్టి యుద్ధములో తమకు తప్పక జయము కలుగు నని యింగ్లీషువారు దృఢముగ నమ్మియున్నారు. జర్మనులవలె వీరు భయపడి రేవులలో దాఁగికొనక నిర్భయులుగా తిరుగుచు నెప్పుడెప్పుడు యుద్ధము వచ్చునా యని కుతూహలపడుచున్నారు.

జర్మనుల యోడరేవులలోనికి వెళ్లి వారి నావల నెల్ల నాశనము చేయఁగూడదా యను సందేహము కొందఱికి కలుగవచ్చును. ఇట్లు చేయుట మిక్కిలి యపాయకరము. ఇది పులినోట చేయి పెట్టుటయే గాని మఱియొకటి కాదు. జర్మనుల రేవుల చుట్టును బలిష్ఠములగు కోట లనేకము లున్నవి. వీనిలో గొప్పగొప్ప ఫిరంగు లుంచఁబడియున్నవి. వీని తప్పించుకొని రేవులోనికి ప్రవేశించుట సులభమైన పని కాదు. ఇది గాక రేవుల దగ్గఱ సముద్రమందంతటను నెక్కు "డిస్ట్రాయర్లు" దాఁగియున్నవి. మార్గములో నీటియందు యంత్రసహాయమున పెక్కు మందుగనులను జర్మనులు చేసియున్నారు. ఈ డిస్ట్రాయర్లు ఈ మందుగనులు ఎక్కడ నున్నవో సరిగ తెలిసికొనుటకు సాధ్యము కాదు. రేవులోనికి ప్రవేశించుటకు ప్రయత్నము చేసెడి యింగ్లీషు యుద్ధనౌక లొకవేళ ఈ డిస్ట్రాయర్లకు తగిలి మునిఁగిపోవచ్చును. కనుక రేవులో నుండు జర్మను నావలతో యుద్ధము చేయుట తగని కార్యము. దీనివలన నపాయము కలుగుట నిశ్చయము. కనుకనే యింగ్లీషువారు రేవులోనికి పోక బయటనే తిరుగుచు జర్మను వారలు రేవులను వదలి సముద్రములోనికి వచ్చునా యని వేచియున్నవి.

అనేకసంవత్సరములనుండి కోట్లకొలఁది ద్రవ్యమును వ్యయము చేసి యింగ్లీషువారి నోడించు నుద్దేశముతో నెన్నియో యుద్ధనౌకలను జర్మనులు కట్టిరి, ఇప్పు డేల యుద్ధము చేయుటకు వీరు భయపడుచున్నారు? ఇంత భయపడువా రింత ద్రవ్యము నెందుకు వ్యయము చేయవలెను? ఎప్పటికైన నింగ్లీషువారలతో యుద్ధము చేయవచ్చునను యాశ వీర కేమైన నున్నదా? దాఁగుకొనియుండుటలో జర్మనీవారి యభిప్రాయ మేమిటో తెలియకున్నది. ఇంగ్లీషువారి యుద్ధనౌకలు జర్మనుల నావలకంటె నధికముగ నుండుటవలన వానితో యుద్ధము చేయుటవలన అపజయము కలుగునను భయము జర్మనుల కున్నది. కనుక ఏదో యొక విధమున కొన్ని యింగ్లీషు నావలను నాశనము గావించి, తర్వాత మిగిలినవానితో యుద్ధము చేయవలయు ననియే వీరి యభిప్రాయము. దీనికొఱకై జర్మను లింగ్లండు చుట్టుప్రక్కల నుండు సముద్రము లన్నిటిలోను డిస్ట్రాయర్లనుంచియున్నారు; అన్ని భాగములయందును మందుగనుల నెదఁజల్లియున్నారు. దురదృష్టవశమున ఇంగ్లీషు యుద్ధనౌక లీగనులు మొదలగు వానిని తాఁకి సముద్రమందు మునిఁగిపోయినయెడల వీరి నౌకాబలము తగ్గిపోవు ననియు అటుతర్వాత వీరిని జయించుట సులభ మనియు వా రూహించుచున్నారు. ఇట్టి గనులను తాఁకుటవలన ఇంగ్లీషునావ లిదివఱకే కొన్ని మునిఁగిపోయినవి. కాని ఇంగ్లీషువారు కూడ ఇట్టి

గములను వెడలనీయకుండుటవలన జర్మని నావలు గూడ కొన్ని మునిఁగి పోయినవి. కనుక ఈ పద్ధతివలన ఇంగ్లీషువారి నౌకాబలము జర్మని బలముతో నెప్పుడుపోల్చినను క్షీణించు నదిగా నుండకపోవుట నిజము.

దీనినిబట్టి యింగ్లీషువారికిని జర్మనులకును సముద్రముమీఁద త్వరలో యుద్ధము జరుగు నని చెప్పుటకు వీలు లేకయున్నది. దీని వలన ఇంగ్లీషువారికి నష్టమేమియు లేదు. జర్మను నావలు సముద్రములలో సంచరించుచు ఇంగ్లీషువారి వ్యాపారమునకుఁ గాని రాజ్యమునకుఁ గాని యేదైన నుపద్రవము కలుగఁజేసినయెడల నష్టము కలుగును కాని అవి రేవులలో దాఁగియుండునంతవఱకు ఎట్టినష్టమును ఇంగ్లీషువారు పొందఁజాలరు. సముద్రముమీఁద యుద్ధము జరుగకపోయినను, జర్మను నావలు సురక్షితముగ నున్నను, యుద్ధము వలన ఇంగ్లీషువారి కెట్టి లాభము కలుగునో అది యిదివఱకే కలిగినది. యుద్ధము జరిగియుండినయెడల జర్మను నావలు నాశనము పొందియుండును. యుద్ధము జరుగకపోయినను జర్మను నావలు దాఁగియుండుట వలన అవి నిరర్థకములై యున్నవి. నిరర్థకములై యుండు యుద్ధనౌకలు నశించిన నేమి, సురక్షితముగ దాఁగియుండిన నేమి? వాని వలన ఇంగ్లీషువారి కేలాటి హానియు కలుగఁజాలదు.

### రెండవ పని

శత్రువుల వ్యాపారము నిలిచిపోవునట్లు చేయుటయే యుద్ధనౌకల రెండవ పనియై యున్నది. ఈ కాలమున ఇంగ్లండు జర్మని మొదలగు పశ్చిమదేశముల యైశ్వర్యమున కంతటికిని వ్యాపారమే మూలకారణమై యున్నది. వ్యాపార మెప్పుడు నిలిచిపోవునో ఆ క్షణమందే ఈ దేశముల సంపద క్షీణించుటకు మొదలిడును. తాము చేసిన పదార్థములను విక్రయించుటయు, తమకు కావలసిన పదార్థములను కొనుటయు లేకదా వ్యాపారము. ఇదియే యా దేశములలోని వారికి జీవనాధారమై యున్నది. ఇది చక్కఁగ జరుగుచుండువఱకును ఆ దేశములలోని ప్రజలు శ్రీమంతులై యుండఁగలరు. ప్రజలు మంచి స్థితిలో నుండువఱకును ప్రభుత్వమువారు పన్ను లనేకము వసూలు చేసి సైన్యములను నావలను వృద్ధిపఱుచుకొనఁగలిగియుందురు. ఇది వృద్ధి యగుచుండువఱకును వీరు ఇష్టమువచ్చినన్ని యుద్ధములు చేయుచుండవచ్చును. అట్లు గాక, వ్యాపారము నశించి, ప్రజలు నిరుపేదలై కష్టము లనుభవించునప్పుడు ప్రభుత్వమువారికి పన్నులు దొరకుట గాని, సైన్యములు వృద్ధియగుట కాని, యుద్ధము చేయుట కాని, సంభవింపదు.

ఇది గాక, ఆహారము మొదలగువానిని గుఱించి మనము విచారించినప్పుడు యుద్ధకాలమందు కావలసిన ధాన్యము, లోహములు, పెట్రోలు మొదలగు పదార్థములు యుద్ధము చేయుచుండు దేశములలో విశేషముగ నుత్పత్తి యగుట లేదనియు, వ్యాపారమూలమున ఇతరదేశములనుండియే వీనిని ఇరుపక్షములవారును సంపాదింపవలె ననియు తెలిసికొనియుంటిమి. ఏదైన కొన్ని కారణములచేత వ్యాపారము నిల్చిపోయినయెడల ఈ పదార్థములు వీరికి దొరకఁజాలవు. అందువలన వీరు యుద్ధమును మానివేయవలసియుందురు. కనుకనే, ఇంగ్లండు ఫ్రాన్సు మొదలగు దేశములలోని కీ వస్తువులు రానీకుండుటకై జర్మనీవారును, జర్మనిలోని కివి రాకుండునట్లు చేయుటకై ఇంగ్లీషువారును, మొదటినుండియు ప్రయత్నము చేయుచున్నారు. వీరిలో ఎవరి ప్రయత్నము సఫలమగునో వారికి తుదకు జయమును ఎవరిది విఫలమగునో వారికి పరాజయమును సంభవింపఁగలదు. వ్యాపారము నిలిచిపోవుటవలన కలుగు నష్టమిట్టిది. యుద్ధము చేయుటకు కావలసిన సామానులు తమయొద్ద లేనప్పుడు యుద్ధము చేయుట దుస్సాధ్యమైపోవును గదా?

జర్మనిదేశస్థులు ప్రతిసంవత్సరమును ఎంతయో విలువగల సరుకుల నితరదేశములకు పంపుచున్నారు; ఇట్లే యెంతయో విలువ గల సరుకుల నితరదేశములనుండి కొని తమ దేశమునకు తెచ్చుకొనుచున్నారు. జర్మనిలో బట్టలు నేయుట, యంత్రములను చేయుట మొదలగునవి యనేకులకు జీవనోపాయములై యున్నవి; అనఁగా ఈ పనులలో కూలి చేసి యనేకులు తమ సంసారములను పోషించుకొనుచున్నారు. ఈ పను లెప్పుడు నిలిచిపోవునో అప్పుడే వీరికి కూలి కూడ దొరకఁజాలదు. వీరును వీరి సంసారములును పస్తుండవలసినవారగుదురు. మన దేశములో వర్షములు లేక క్షామము సంభవించినపుడు ప్రజలస్థితి యెట్లుండునో కొంచెము యాలోచించి చూడుఁడు. పొలములనిండ పైరున్నప్పుడే కూలివాండ్రకు పని కలుగుట, పప్పులు నూర్చుట మొదలగు పనులయందు కూలి దొరకుటయు వీరు మంచి స్థితిలో నుండుటయు కలుగుచున్నది; క్షామము సంభవించినప్పుడు పైరంతయు యెండిపోవుటవలన కూలివాండ్రను పనికి పిలుచువారే యుండరు. అట్లే జర్మనిదేశమం దిప్పుడు ప్రజలు మిక్కిలి దుస్థితియందున్నారు. ఇతరదేశములనుండి యెన్నియో సరుకులు వచ్చినఁ గాని జర్మనివారు బట్టలు నేయుట మొదలగు పనులు చేయఁజాలరు. నేత్రము చేయుటకు పత్తి యెట్లవశ్యమో ఈ పనులు చేయుటకీ సరుకు లంత యావశ్యకము. పత్తి లేనప్పుడు నేత్రము నిలిచిపోవుటయు, కూలివాండ్రకు పని లేకుండుటయు, ప్రజలు కష్టపడుటయు ఎట్లు కలుగునో, ఈ సరుకులు లేనప్పుడు నేత మొదలగు పనులు నిలిచిపోవుటయు, కూలివాండ్రు కష్టపడుటయు కలుగును. బట్టలు నేయుటకు ప్రతిసంవత్సరమును జర్మనీవారు

45 కోట్ల రూపాయల విలువ గల ప్రత్తిని
8 " " " జనుమును
12 " " " గొఱ్ఱెబొచ్చును

కొని తెచ్చుకొనుచున్నారు. యుద్ధమువలన వ్యాపారము నిలిచిపోయినయెడల, ఇవి జర్మనిదేశమునకు రాఁజాలవు. ఇవి రానియెడల జర్మనీయం దుండెడి నేత ఫ్యాక్టరీ లన్నియు పనులు చాలించును; ఈ ఫ్యాక్టరీలలో పని చేయుచుండు వారందఱు జీవనాధారము లేకుండ నుండవలసినవా రగుదురు. ఇట్లే ప్రతిసంవత్సరము జర్మని వారు 22 కోట్ల రూపాయల విలువ గల రాగిని

10 కోట్ల రూపాయల విలువగల తోళ్ళను
10 ,, ,, ,, నెట్లునువ్వును
60 ,, ,, ,, ఆహారపదార్థములను,

తెచ్చుకొనుచున్నారు. ఇంగ్లీషువారి ప్రయత్నములు కొనసాగిన యెడల, ఈ సామానులు వచ్చుట కూడ నిలిచిపోవును. ఇందువలన మరికొందఱు ప్రజ లపరిమితకష్టమును పొందెదరు. వ్యాపారము నిలిచిపోవుటవలన ప్రజల కెంత కష్టమును నష్టమును కలుగునో, జీవ నోపాయము కూడ లేక యెట్లు దారిద్ర్యము ననుభవింపవలసి యుండునో స్పష్టముగనున్నది.

ఈ వ్యాపారమును నిలిపివేయుటలో, ఇంగ్లీషు యుద్ధనౌకల ప్రయత్నము సఫల మయినదో జర్మను యుద్ధనౌకల ప్రయత్నము సఫల మైనదో చూతుము.

ఈ రెండు దేశముల వ్యాపార మంతయు సముద్రమార్గమున జరుగుచున్నదే కాని భూమార్గమున కాదు. అనేక సముద్రములను దాటి ఇండియా, అమెరికా మొదలగు దేశములనుండి వర్తకనౌక లీ సరుకులను తీసికొని వచ్చుచుండెను. యుద్ధారంభమున జర్మనీవారి యుద్ధనౌక లే డెనిమిది తప్ప మిగిలినవన్నియు రేవులలో దాగవలసి వచ్చెను. ఇంగ్లీషునౌక లట్లుకాక, అన్ని సముద్రములలో నెప్పుడును సంచరించుచునే యున్నవి. వర్తక నౌకకును యుద్ధ నౌకకును గల భేద మందఱు నెఱిగినదే. యుద్ధనౌకలయందు ఫిరంగులు మొదలగు యుద్ధసాధనము లుండును. వర్తక నౌకలయం దిట్టివి యుండవు. శత్రువుల వర్తకనౌక యుద్ధనౌకకు కనబడిన యెడల యుద్ధనౌక తత్క్షణమే దానిని పట్టుకొని సాధ్యమైన యెడల తన దేశమునకు తీసికొనివచ్చి దానిలోని సరుకుల నపహరింప గలదు. ఇట్లు తీసికొనిపోవుట సాధ్యము కానియెడల ఫిరంగులను కాల్చి వర్తకనౌకను ముంచివేయును. జర్మను యుద్ధనౌక లలో నొకటి యగు "ఎమ్డెన్" చేయుచుండిన పని యిట్టిదే. తప్పించుకొని సముద్రములో తిరుగుచుండిన యే డెనిమిది జర్మను నావలు నుండినంతవఱకును ఇంగ్లీషువారి వర్తకమునకు కొంచెము నష్టము కలుగుచుండినది కాని, ఇప్పు డా నావల నన్నిటిని ముంచివేసినారు గనుక ఇంగ్లీషువారి వర్తకమున కేలాటి యాటంక ములును లేవు. యుద్ధ మారంభ మైనది మొదలు జర్మనుల వర్తక నౌకలను నూర్ల పర్యంతము ఇంగ్లీషువారు పట్టుకొనిరి. ఇప్పుడు జర్మను వర్తకనౌక యొక్కటి కూడ సముద్రమందు తిరుగుట లేదు. ఇంగ్లీషు యుద్ధనౌకల మహిమవలన జర్మనులు జర్మను నావల నుండ చేయు చుండిన వ్యాపార మంతయు నిలిచిపోయినది.

జర్మనీవారి వర్తకనౌక లేవియు వారికి కావలసిన సామాను లను తీసికొనిపోవునట్టి స్థితిలో లేవు. ఇది గాక, ఇతరుల నావలు జర్మనీవారికి కావలసిన వస్తువులను తీసికొనిపోవుచున్నయెడల వానికి కూడ నిర్బంధము కలుగజేయుటకు తగిన యధికార మింగ్లీషువారి కున్నది. ఇంగ్లండునకును ఫ్రాన్సునకును నడుమ నింగ్లీషు చానల్ అనెడి యిఱుకైన సముద్రము కలదు. దీనియం దెల్లప్పుడు నింగ్లీషు నావ లనేకము లుండును. ప్రపంచమం దేదేశమునుండి యైనను జర్మ నీకి సరుకులు వెళ్లవలెనన్నయెడల, ఈ చానల్ సముద్రమును దాటియే వెళ్లవలెను. సుఖమైన మార్గము మరియొకటి లేదు. కనుక ఇతరు లెవరైన యుద్ధమం దుపయోగకరమైన సరుకులను జర్మనీవారికి తీసికొనిపోవుచున్నయెడల, ఆ సరుకులను పట్టుకొనుటకు ఇంగ్లీషు వారి కధికార మున్నది. ఇట్టి స్థితిలో క్రమక్రమముగ జర్మనీవారి వ్యాపార మంతయు నిలిచిపోవు ననియు, వారికి కావలసిన పదార్థ ములు దొరకకుండా లవనియు వేఱుగ చెప్ప నక్కఱ లేదు.

నేలమీద జరుగు యుద్ధము లెట్లు ముగిసినను, ఇంగ్లీషువారి నౌకాబలమువలన జర్మనీవారి వ్యాపార మంతయు నిలిచిపోవుననుట నిస్సంశయము. దేశములోని ప్రజ లందఱు జీవనాధారములు లేక ప్రా ణపీడితులై మహాకష్టముల ననుభవించు స్థితిలోనికి వచ్చెదరు. ఇట్టి స్థితి కలుగుటకు కొంత కాలము పట్టిన పట్టవచ్చును, కాని తుదకు యుద్ధమువలన జర్మనీవారు మహాదురవస్థ యిట్లుండు ననియు మనమూ హించుటలో నతిశయోక్తి యేమియు లేదు. యుద్ధమువలన మన కిట్టి కష్ట ములు సంభవించెనని గదా యని ప్రజలు విచారపడుచుండ, జర్మను చక్రవర్తి యుద్ధము నేలాగు చేయగలఁడు? ఇట్టి సందర్భమందు కూడ యుద్ధమును మాననియెడల జర్మనులు తమచక్రవర్తితో కలహించి, యుద్ధమును నిలుపుట కావలెనని బలవంతపెట్టెదరనుట నిస్సంశయము. కనుక ఇంగ్లీషు యుద్ధనౌకలకును జర్మను యుద్ధనౌకలకును సముద్ర మునమీద యుద్ధము జరుగకపోయినను, ఇంగ్లీషు యుద్ధనౌకలు జర్మ నుల వర్తకము నంతను నాశనము చేసి, జర్మనీయందు క్షామబాధను కలిగించి, జర్మను సైన్యములను తుద కోడింపగల వని మనము నిస్సంశయముగ చెప్పవచ్చును. జర్మనీవారి గర్వమును అధికారమును అణచునది ఇంగ్లీషువారి నౌకాబలము కాని మరియొకటి కాదు.

### మూడవ పని

శత్రువుల యుద్ధనౌకలవలన తమ దేశస్థుల వ్యాపారమున కేలాటి భంగమును కలుగకుండునట్లు చేయుట యుద్ధనౌకల మూడవ పనిగా నున్నది. ఈ పని యెంత యవశ్యమో యిప్పుడు విస్తారముగ వివరించి చెప్పవలసినది లేదు. సమస్తదేశముల సౌఖ్యమును వ్యాపా రముమీఁదనే నిలిచియున్న దని యిదివఱకే చెప్పియుంటిమి. ఈ వ్యాపారము నిలిచిపోవుటవలన ఇరుపక్షములవారికి నెంత నష్టము కలు గునో, యుద్ధము చేయుట కూడ యెట్లు దుస్సాధ్య మగునో తెలిపి యుంటిమి. ఎవరెవరి వ్యాపారమును వారివారి యుద్ధనౌకలు కాపాడు కొనుట సిద్ధము యున్నది. ఇట్లు చేయనియెడల దేశములోనికి రావలసిన సరుకులు వచ్చుటయు, దేశమునుండి పోవలసినవి పోవుటయు సంభ వించదు. ఇంగ్లండు దేశమం దాహారపదార్థము లేవియు నుత్పత్తి యగుట లేదు గనుక, ఇంగ్లీషు వర్తకనౌక లితరదేశములకు వెళ్లి ప్రజలకు కావలసిన ధాన్యమును తీసికొని రావలయును. ఇట్లు చేయని యెడల ఇంగ్లీషువా రందఱు క్షామబాధచే పీడితులై శత్రువులను

కరణము పొందవలసినవా రగుదురు. ఇట్టి దుస్థితి రాకుండుటకై ఇంగ్లీషు యుద్ధనౌకలు సముద్రములలో తిరుగుచు పోలీసువారు దొంగలను వెతికినట్లు జర్మనీయుద్ధనౌకలను వెతికి పట్టుకొను చుందురు. శత్రువుల యుద్ధనౌక లన్నియు ఇట్లు పట్టుబడినప్పుడు నిర్భయముగ ఇంగ్లీషు వర్తకనౌకలు దేశదేశములకు వెళ్లి ప్రజలకును సైన్యములకును కావలసిన వస్తుసామగ్రిని తేగలిగియుండును. జర్మను యుద్ధనౌకలకంటె ఇంగ్లీషువారి యుద్ధనౌక లెక్కువగ నుండుట వల్లను జర్మనుల యుద్ధనౌకలు దాగియుండుటవల్లను, ఇంగ్లీషువారి వర్తకనావలు యథాప్రకారము దేశదేశములకు వెళ్లి వ్యాపారము చేయుచున్నవి.

## నాలుగవ పని

యుద్ధము ప్రారంభమైనప్పుడు ఇంగ్లీషువారి సైన్యములు జర్మనీవారి సైన్యములకంటె చాల చిన్నవిగా నుండెను క్రమక్రమముగ కొంత కాలములో పెద్దవి కాగల వనియు, ఇండియా కనడా ఆస్ట్రేలియా మొదలగు దేశములు ఇంగ్లీషువారి ప్రభుత్వమునకు లోబడి యుండి యుండుటయు, వీనిలోని పురుషు లనేకులు ఇంగ్లీషు సైన్యములలో చేరి యుద్ధము చేసి తమ రాజభక్తిని చూపుటకు కోరుచుండుటయు ఈ సైన్యాభివృద్ధికి ప్రధానకారణ మనియు, మూడవ ప్రకరణములో తెలిపియుంటిని. ఇండియాలో లక్షల కొలది సైన్యము సిద్ధముగ తయారై యున్నవి; మరి యెన్ని లక్షలు కావలసియున్నను తయారు చేయగలరు. ఇట్లే కనడా మొదలగు రాష్ట్రములయందును ఎన్నియో సైన్యము లున్నవి. అయినను యుద్ధరంగము ఈ దేశములలో లేదు; యుద్ధ మంతయు ఈ దేశములకు వేలకొలది మైళ్లదూరమందు సముద్రముల కావల విరోధిఖండములలో జరుగుచున్నది. ఈ రాష్ట్రములయం దుండెడు సైన్యములు విరోధులలోని యుద్ధభూమికి వెళ్లగలిగినయెడల కదా, ఇంగ్లీషువారికి లాభము కలుగుటయు వారి సైన్యములు వృద్ధి యగుటయు తుదకు వారికి జయము కలుగుటయు సంభవించును! ఇండియా మొదలగు దేశములను వదలి ఈ సైన్యము లంత దూరము ప్రయాణము చేయలేనియెడల వీనివలన ఇంగ్లీషువారి కించుమాత్రపు టుపయోగ



మును కలుగజాలదు. కనుక ఈ సైన్యములన్నిటిని దూరరాష్ట్రములందుండి యుద్ధరంగమునకు తీసికొనిపోవుట కేదైన సాధన మొకటి యుండవలయును. ఇంగ్లీషువారి యుద్ధనౌకలే ఇట్టి సాధనముగ నున్నవి.

ఇదివరకే మన దేశమునుండి గొప్ప సైన్యమొకటి విరోధులకు వెళ్ళి జర్మనులతో యుద్ధము చేయుచున్నది. ఇట్లే ఆస్ట్రేలియా కనడా మొదలగు దేశములనుండి కూడ పెక్కువేల సైన్యము తయారై యుద్ధరంగమం దున్నది. ఇంత దూరదేశములనుండి సముద్రముమీద ప్రయాణము చేయుచున్నప్పుడు జర్మనుల యుద్ధనౌక లీ సైన్యముల నెదుర్కొని యుండిన, వీని గతి యేమై యుండును? యుద్ధనౌకల ఫిరంగుల దెబ్బలవల్ల ఈ సైన్యము లన్నియు సముద్రమున కాహారము కావలసినవే కదా! జర్మను యుద్ధనౌకల నీ సైన్యముల కడ్డుపడనీయక, వీనిని విరోధుల సురక్షితముగ చేర్చినది ఇంగ్లీషువారి నౌకాబలమే. ఇంగ్లీషువారి యుద్ధనౌక లనేకములు సముద్రములలో తిరుగుచుండు నంతవరకును జర్మనుల నావలు రేవులలో నుండి బయటికి వచ్చి ప్రయాణము చేయుచుండు సైన్యములను సముద్రునిపాలు చేయుట కల్లు సాహసింపగలవు? ఇంత గొప్ప యుద్ధము జరుగుచున్నను ఇంగ్లండులోనివారు తమ ప్రభుత్వములో నున్న యిండియా, మొదలగు దేశములకును, ఈ దేశములలోనివారు ఇంగ్లండునకును, మామూలుగ యుద్ధము లేనప్పు డెట్లు రాకపోకలు చేయుచుండిరో అట్లే యిప్పుడు కూడ చేయుచున్నారు. జర్మనుల యుద్ధనౌకలు చూచుచుండగనే ఇంగ్లీషువారి సైన్యములును మన సైన్యములును ఫ్రాన్సు దేశమును ప్రవేశించి ఫ్రెంచివారికి సహాయముగ యుద్ధము చేయుచున్నవి. దీని నంతయు చూచుచు జర్మనుల నావ లూరకుండవలసియుండెను. ఇది యంతయు ఇంగ్లీషువారి నౌకాబలము యొక్క మహిమయే.

జర్మనీవారి కంత నౌకాబలము లేని కారణమువలనే, ఆఫ్రికా ఏషియా మొదలగు దేశములలో తమ ప్రభుత్వమునకు లోబడి యుండు దేశములకు తమ సైన్యములను పంపి వానిని రక్షించుకొనలేనంతటి దుస్థితిలో నున్నారు. ఇందువలననే యీ దేశము లన్నియు నొకటి వెంబడి యొకటి యింగ్లీషువారియొక్కయు వారి మిత్రుల యొక్కయు పరిపాలనలోనికి వచ్చుచున్నవి.

THE SUBMARINE



నీళ్లలో మునిగియున్న జలాంతర్గామి

THE STEEL HATCH



జలాంతర్గామిలో ఫిరంగు లమర్చుబడిన పెట్టె

GUN SWINGING UPWARDS



పైకి ఫిరంగిని త్రిప్పుట

C



LOADING THE SUBMARINE GUN

ఫిరంగులోనికి మందు నింపుట



IN POSITION FOR FIRING

కాల్చుటకు సిద్ధముగ

జలాంతర్గాములు:— వర్తమాన సంగ్రామమున నీటియందు మునిగిపోవు యుద్ధనౌకలకు ప్రాముఖ్యత కలిగినది. వాటియందు శత్రువుల నౌకలను పాడుచేయుటకు టార్పిడో నొట్టములుండును, శత్రువుల విమానములను నాశనము చేయుటకై ఫిరంగులమర్చబడియున్నవి. ఈపటము జలాంతర్గామిపై నమర్చబడిన 14 పౌండ్లను కొలుపుచున్నది. ఇది మొదటను పడవపైత్తివిూద నమర్చబడియుండి త్వరలో లోపల నమర్చుటకు వీలుండును. ఈఫిరంగులకు సులోచనము లమర్చబడియుండును గాన ఫిరంగులను గాల్చువారు సులభముగ గురిపెట్టుటకు వీలుండును. దానికై నియమించిన ముగ్గురిలో నొకడు మందునిచ్చును, రెండవవాడు నింపును, మూడవవాడు కాల్చును. ఫిరంగిని వన్నిపై పులకును, నడినెత్తికిని, త్రిప్పుటకు వీగినటు లమర్చబడినది. మొదటిపటమునందు సమముగనున్నటులును రెండవదానియందు నడినెత్తికి గురిపెట్టినటులును జూపబడినది.

# ఆకాశయానములు

పాలపర్తి రామమూర్తిగారు

సృష్టియందలి సకలజీవరాశిలో మానవుఁడే శ్రేష్ఠుఁడని చెప్పనొప్పును. మానవునందలి విజ్ఞానమే యీ శ్రేష్ఠత్వమునకు ముఖ్యకారణము. ఈ జ్ఞానమువలన మానవుఁడు పంచభూతములను పరిశోధించి వాని ధర్మగుణముల గ్రహించి యవి మానవుని సౌఖ్యమునకును అక్కఱకును నుపయోగపడఁగల వని గ్రహించెను.

జ్ఞాన వర్ధకమైన కొలఁది సృష్టియందలి నూతన శక్తులను గ్రహించి మానవుఁడు దినదినాభివృద్ధి గాంచుచున్నాఁడు. ప్రథమమున పాదచారి యగు మానవుఁడు చిన్న శకటము నేర్పాటు చేసి తిరుగుచుండెను. దానికన్న వేగముగ పోవలె నని యుద్దేశించి సైకిళ్లను మోటారు బండ్లను, ధూమ శకటములను నిర్మించి ప్రయాణము సలుప మొదలిడెను.

అటులే జలమును దాటయత్నించి చేఁపలు నీటిలో నీఁదుటను చూచి మానవుఁడు హస్తముల సాహాయ్యమున నీటిలో నీఁద మొదలిడెను. తరువాత మహానదులను హస్తసాహాయ్యమున నీఁదుట దుష్కరమని యెంచి తరువులు నీట తేలుట గని కొన్ని కొయ్యలను చేర్చి తెప్పగా నిర్మించి నదులను దాఁటఁ గలిగెను. రాను రాను చిన్న పడవలను నిర్మించెను. తరువాత మహాసముద్రములను సయితము దాట నుద్దేశించి యోడలను ధూమనౌకలను గనిపెట్టి స్వేచ్ఛగా జలరాశిని దాటఁ గలుగుచున్నాఁడు.

చేఁపలు నీటిలో నీఁదుటను చూచి మానవుఁడు నీటిని దాటఁ గలిగినటులే పక్షులాకసమున నెగురుటను గని మానవుఁ డంతరిక్షమున నెగురవలె నని ప్రయత్నములు సలుప మొదలిడెను. ఈ ప్రయత్నములయొక్క ఫలితముగా నాకాశయానము చేయుటకు విమానములు కనిపెట్టఁబడినవి.



విమానములు మార్గాన్వేషణము చేయుట

## విమానములు--పురాణ నిదర్శనము

పెక్కు ప్రాచీనగ్రంథములలో నక్కడక్కడ విమానము లుండినట్లును పురాణవీరులు వానిపై నెక్కి తమ యిచ్ఛ వచ్చిన చోటుల కెల్ల గ్రుమ్మరుచుండినట్లును చెప్పఁబడియున్నది.

పురాణములను చదివినవారలకు పుష్పక సౌంగికవిమానముల పేర్లు విదితములు. అంతేకాక, యించుమించు 2,500 సంవత్సరములకు పూర్వము బోధిరాజుకొరినుండి తప్పించుకొనుటకై యతనిశిల్పి దారువిమానమును నిర్మించి కుటుంబసమేతము దానిపై నెక్కి యెగిరి పాఱిపోయె నని యొక కథ కూడ కలదు. మనవలెనె గ్రీకులు కూడ తమ పూర్వుల కాకాశయానము చేసినట్లు చెప్పుచున్నారు.

పదునాలవ శతాబ్దమున ఇటాలి దేశస్థుఁ డొకఁడు వివిధములగు పక్షుల ఱెక్కలను జేర్చి తనబాహువుల కంటఁ గట్టుకొని యొక కోట గోడపైనుండి పైకెగురుటకు యత్నించెను. కాని యతఁడు భూమిపైఁ బడి కాలు విఱుగఁగొట్టుకొనెను. పూర్వపుచిట్టి పిచ్చిప్రయత్నము లెన్నియో జరుగుచుండెను. ప్రథమమున నాకాశయానమునకు త్రోవఁ జూపినవాఁడు జెసుయిటు ఫాదరి యైన "లానా" యని చెప్పవచ్చును. ఈయన 1670 వ సం. న వ్రాసిన గ్రంథమందు ఆకాశయానమున కనుకూలించు కొన్ని యూహలను వ్యక్తీకరించియుండెను.

అంగుళములో 235వ వంతు మందము గల రాగిరేకుతో 25 అడుగుల వ్యాసపు కొలత గల గుండ్రని నాలుగు గోళములను నిర్మించి యందలి వాయువును దీసివేసి మూతులను బిగియించి యీ నాలుగు గోళముల నొక చిన్న పడవ కంటఁగట్టినచో, నది యాకసమున తేలఁగల దని "లానా" తన పొత్తమునందు లిఖియిం

# ఆకాశయానములు

పాలపర్తి రామమూర్తిగారు

సృష్టియందలి సకలజీవరాశిలో మానవుఁడే శ్రేష్ఠుఁడని చెప్పనొప్పును. మానవునందలి విజ్ఞానమే యీశ్రేష్ఠత్వమునకు ముఖ్యకారణము. ఈ జ్ఞానమువలన మానవుఁడు పంచభూతములను పరిశోధించి వాని ధర్మగుణములను గ్రహించి యవి మానవుని సౌఖ్యమునకును అక్కఱకును నుపయోగపడఁగల వని గ్రహించెను.

జ్ఞాన వర్ధకమైన కొలఁది సృష్టియందలి నూతన శక్తులను గ్రహించి మానవుఁడు దినదినాభివృద్ధి గాంచుచున్నాఁడు. ప్రథమమున పాదచారి యగు మానవుఁడు చిన్న శకటము నేర్పాటు చేసి తిరుగుచుండెను. దానికన్న వేగముగ పోవలె నని యుద్దేశించి సైకిళ్లను మోటారు బండ్లను, ధూమశకటములను నిర్మించి ప్రయాణము సలుప మొదలిడెను.

అటులే జలమును దాట యత్నించి చేపలు నీటిలో నీఁదుటను చూచి మానవుఁడు హస్తముల సాహాయ్యమున నీటిలో నీఁద మొదలిడెను. తరువాత మహానదులను హస్తసాహాయ్యమున నీఁదుట దుష్కరమని యెంచి తరువులు నీట తేలుట గని కొన్ని కొయ్యలను చేర్చి తెప్పగా నిర్మించి నదులను దాఁటఁ గలిగెను. రాను రాను చిన్న పడవలను నిర్మించెను. తరువాత మహాసముద్రములను సయితము దాట నుద్దేశించి యోడలను ధూమనౌకలను గనిపెట్టి స్వేచ్ఛగా జలరాశిని దాటఁ గలుగుచున్నాఁడు.

చేపలు నీటిలో నీఁదుటను చూచి మానవుఁడు నీటిని దాటఁ గలిగినటులే పక్షులాకసమున నెగురుటను గని మానవుఁ డంతరిక్షమున నెగురవలె నని ప్రయత్నములు సలుప మొదలిడెను. ఈ ప్రయత్నములయొక్క ఫలితముగా నాకాశయానము చేయుటకు విమానములు కనిపెట్టఁబడినవి.



విమానములు మార్గాన్వేషణము జేయుట

## విమానములు--పురాణ నిదర్శనము

మన ప్రాచీనగ్రంథములలో నక్కడక్కడ విమానము లుండినట్లును పురాణవీరులు వానిపై నెక్కి తమ యిచ్ఛ వచ్చిన చోటుల నెల్ల గ్రుమ్మరుచుండినట్లును చెప్పఁబడియున్నది.

పురాణములను చదివినవారలకు పుష్పక సౌంధిక విమానముల పేర్లు విదితములు. అంతేకాక, యించుమించు 2,500 సంవత్సరములకు పూర్వము భోధరాజు భార్యనుండి తప్పించుకొనుటకై యతనిశిల్పి దారువిమానమును నిర్మించి కుటుంబసమేతము దానిపై నెక్కి యెగిరి పోయెను అని యొక కథ కూడ కలదు. మనవలెనె గ్రీకులు కూడ తమ పూర్వులు ఆకాశయానము చేసినట్లు చెప్పుచున్నారు.

పదునాలుగవ శతాబ్దమున ఇటాలీ దేశస్థుఁ డొకఁడు వివిధములగు పక్షుల రెక్కలను చేర్చి తనబాహువుల కంటఁ గట్టుకొని యొక కోట గోడపైనుండి పైకెగురుటకు యత్నించెను. కాని యతఁడు భూమిపైఁ బడి కాలు విఱుగఁగొట్టుకొనెను. పూర్వ పద్ధతి విచ్ఛిన్న ప్రయత్నము లెన్నియో జరుగుచుండెను. ప్రథమమున నాకాశయానమునకు త్రోవఁ జూపిన వాఁడు జెసుయీటు ఫాదరి యైన "లానా" యని చెప్పవచ్చును. ఈయన 1670 వ సం. న వ్రాసిన గ్రంథమందు ఆకాశయానమున కనుకూలించు కొన్ని యూహలను వ్యక్తీకరించియుండెను.

అంగుళములో 235-వ వంతు మందము గల రాగిరేకుతో 25 అడుగుల వ్యాసపు కొలత గల గుండ్రని నాలుగు గోళములను నిర్మించి యందలి వాయువును దీసివేసి మూతులను బిగియించి యా నాలుగు గోళముల నొక చిన్న పడవ కంటఁగట్టినచో, నది యాకసమున తేలఁగల దని "లానా" తన పొత్తమునందు లిఖియిం

# ఆకాశయానములు

పాలపర్తి రామమూర్తిగారు

సృష్టియందలి సకలజీవరాశిలో మానవుఁడే శ్రేష్ఠుఁడని చెప్ప నొప్పును. మానవునందలి విజ్ఞానమే యీశ్రేష్ఠత్వమునకు ముఖ్యకారణము. ఈ జ్ఞానమువలన మానవుఁడు పంచభూతములను పరిశోధించి వాని ధర్మగుణములను గ్రహించి యవి మానవుని సౌఖ్యమునకును అక్కఱకును నుపయోగపడఁగల వని గ్రహించెను.

జ్ఞాన మధికమైన కొలఁది సృష్టియందలి నూతన శక్తులను గ్రహించి మానవుఁడు దినదినాభివృద్ధి గాంచుచున్నాఁడు. ప్రథమమున పాదచారి యగు మానవుఁడు చిన్న శకటము నేర్పాటు చేసి తిరుగుచుండెను. దానికన్న వేగముగ పోవలెనని యుద్దేశించి సైకిళ్లను మోటారు బండ్లను, భూమ శకటములను నిర్మించి ప్రయాణము సలుప మొదలిడెను.

అటులే జలమును దాట యత్నించి చేపలు నీటిలో నీఁదుటను చూచి మానవుఁడు హస్తముల సాహాయ్యమున నీటిలో నీఁద మొదలిడెను. తరువాత మహానదులను హస్తసాహాయ్యమున నీఁదుట దుష్కరమని యెంచి తరువులు నీట తేలుట గని కొన్ని కొయ్యలను చేర్చి తెప్పగా నిర్మించి నదులను దాఁటఁ గలిగెను. రాను రాను చిన్న పడవలను నిర్మించెను. తరువాత మహాసముద్రములను సయితము దాట నుద్దేశించి యోడలను ధూమనౌకలను గనిపెట్టి స్వేచ్ఛగా జలరాశిని దాటఁ గలుగుచున్నాఁడు.

చేపలు నీటిలో నీఁదుటను చూచి మానవుఁడు నీటిని దాటఁ గలిగినటులే పక్షులాకసమున నెగురుటను గని మానవుఁ డంతరిక్షమున నెగురవలె నని ప్రయత్నములు సలుప మొదలిడెను. ఈ ప్రయత్నముల యొక్క ఫలితముగా నాకాశయానము చేయుటకు విమానములు కనిపెట్టఁబడినవి.



విమానములు మార్గాన్వేషణము చేయుట

## విమానములు--పురాణ నిదర్శనము

మన ప్రాచీనగ్రంథములలో నక్కడక్కడ విమానము లుండినట్లును పురాణవీరులు వానిపై నెక్కి తమ యిచ్ఛ వచ్చిన చోటుల కెల్ల గ్రుమ్మరుచుండినట్లును చెప్పఁబడియున్నది.

పురాణములను చదివినవారలకు పుష్పక రాంత్రికవిమానముల పేర్లు విదితములు. అంతేకాక, యించుమించు 2,500 సంవత్సరములకు పూర్వము చోధరాజుగారినుండి తప్పించుకొనుటకై యతనిశిల్పి దాయివిమానమును నిర్మించి కుటుంబ సమేతము దానిపై నెక్కి యెగిరి పాఱిపోయె నని యొక కథ కూడ కలదు. మనవలెనె గ్రీకులు కూడ తమ పూర్వులాకాశయానము చేసినట్లు చెప్పుచున్నారు.

పదునాలవ శతాబ్దమున ఇటాలియాదేశస్థుఁ డొకఁడు వివిధములగు పక్షుల ఱెక్కలను చేర్చి తనబాహువుల కంటఁ గట్టుకొని యొక కోట గోడపైనుండి పైకెగురుటకు యత్నించెను. కాని యతఁడు భూమిపైఁ బడి కాలు విఱుగఁగొట్టుకొనెను. పూర్వపిచ్చి పిచ్చిప్రయత్నము లెన్నియో జరుగుచుండెను. ప్రథమమున నాకాశయానమునకు త్రోవఁ జూపిన వాఁడు జెసుయిటు ఫాదరి యైన "లానా" యని చెప్పవచ్చును. ఈయన 1670 వ సం. న వ్రాసిన గ్రంథమందు ఆకాశయానమున కనుకూలించు కొన్ని యూహలను వ్యక్తీకరించియుండెను.

అంగుళములో 235-వ వంతు మందము గల రాగిరేకులో 25 అడుగుల వ్యాసపు కొలత గల గుండ్రని నాలుగు గోళములను నిర్మించి యందలి వాయువును దీసివేసి మూతులను బిగియించి యీ నాలుగు గోళముల నొక చిన్న పడవ కంటఁగట్టినచో, నది యాకసమున తేలఁగల దని "లానా" తన పొత్తమునందు లిఖియిం

డిరిజబిల్సు అని పేరు. వీనినే గాలిఓడ లని పిలుతురు. 1852వ సం. న, గిఫార్డను గారు పదునొకటుకు నీలగుఱ్ఱ విమానమును నిర్మించిరి. ఈ విమానము 114 అడుగుల పొడవును, 39 అడుగుల వ్యాసము కొలతయును గలిగి పొగచుట్ట యాకారమున నుండెను. గుండ్రముగా నుండక పొగచుట్ట రూపమున నుండుటచే గుమ్మటము తల్లక్రిందగుట కవకాశ ముండెదు. కాని మరికొన్ని యిక్కట్టులు సంభవించుచుండెను. గాలిఓడకు సూర్యరశ్మి సోకినప్పుడు దాని వాయుకోశము యొక్క మధ్యభాగ మతికి పెద్ద దగుటయు, శీతలవాయువు సోకినప్పుడును, మేఘముల చాటునకు వచ్చినప్పుడును కోశములోని యుదజనివాయువు తగ్గిపోయి గుమ్మటము ముడిచికొని యాకారమునందు మార్పు చెందుచుండెను. ఈ మార్పును నివారించుటకై వాయుకోశముయొక్క మధ్యభాగమున నొక తిత్తి చేర్చబడెను. గుమ్మటము ముడిచికొని పోయినప్పుడు ఈ తిత్తిలోనికి వాయువును చొప్పించి వాయుకోశముయొక్క పరిమాణము యథాప్రకారముగ నుండునట్లు చేయఁబడును. వాయుకోశ మతికినప్పుడు కోశము పగిలిపోకుండ దానిలోని కొంత వాయువు కవాటముద్వారా వెలుపలికి పంపఁబడుచుండును. ఈ తిత్తి చాలు గాటలాడు గాలిబంతిలోని ఉప్పుకతిత్తివలె నుండు నని గ్రహింపవచ్చును. పై నుదహరించిన యేర్పాటులకుఁ దోడు మూఁడు గుఱ్ఱముల శక్తి గల యావిరియంత్రమీ గాలిఓడ క్రిందిభాగమున కమర్చఁబడెను. ఈ యంత్రము నూరుపౌనుల బరువుండును. ఈ యంత్రసాహాయ్యమున గాలిఓడ గంటకు 6 మైళ్లవంతున నడువఁగలిగియుండును.




తరువాత కొందఱు హస్తములతోను విద్యుచ్ఛక్తితోను నడచు గుమ్మటములను కొన్నిటిని కనిపెట్టిరి. ఇప్పుడు పెట్రోలు (కిరోసిన్ నూనె)తో విమానములను నడపు నేర్పాటు గావింపఁబడినది. ఈ పెట్రోలు ఇంజను కనిపెట్టఁబడిన తరువాత, వాయువును స్వాధీనపఱచుకొనుట సాధ్య ప్రయోజన నిరాకరణచేయఁబడెను.

తరువాత గిఫార్డుగారు నిర్మించిన గుమ్మటముకన్న కొన్ని నూతనములైన యేర్పాటులతో క్రొత్తగా నొకదానిని నిర్మించిరి. ఈ గుమ్మటమునకు వార్నిసు పూసిన చీనాపట్టుగుడ్డతో నిర్మింపఁబడిన వాయుకోశమును, ప్రమాదములు రాకుండుటకు వెదురుకఱ్ఱలతోఁ గట్టిన యొకతొట్టెను వారు దేర్పాటుచేసిరి; ఈ తొట్టెకు వెనుక భాగమున నొక నిలువుచుక్కానిని, దానికి వెనుక పైకి లేచుటకును, క్రిందికి దిగుటకును గాను మరొక యడ్డచుక్కానిని నమర్చిరి. ఆ గుమ్మటమునకు 9 గుఱ్ఱముల శక్తి గల విద్యుచ్ఛక్తి మోటారు ఇంజను నుంచెను. దీని సాహాయ్యమున గుమ్మటము గంటకు 14 మైళ్ల వేగమున నడువఁగలిగియుండెను.

ఈ గుమ్మటముల ద్వారా కొందఱు యింజనీర్లు తమ నైపుణ్యమును జూపుటకుఁ గొన్ని ప్రదర్శనములను జేయుచుండిరి. ఫ్రాన్సులోని ఏఫియల్ గోపురమును జుట్టి వచ్చుటకు పందెము వేసికొని డూమాంటుగారొక చోటునుండి పయనమై తిరిగి బయలుదేఱిన స్థానమునకు అరగంటలోపు కాలములో వచ్చి చేరెను. చుట్టి వచ్చిన దూరము 7 మైళ్లుండును. ఈ పందెమును గెలిచినందులకు డూమాంటుగారికి 60 వేల రూప్యముల బహుమానము వచ్చెను.

వీటిమీఁద కోన లేవిధముగా నడచునో యావిధముగా గుమ్మటములు వాయువులో నడచును. అందుచేత వీనికి గాలిదోనె లని పేరు వచ్చెను. ఇవి నాన్-రిజిడ్డు, సెమి-రిజిడ్డు, రిజిడ్డు అని మూఁడు విధములు.

నాన్‌రిజిడ్డు గాలిదోనెలు:—ఇవి ముఖ్యముగా లోపలి కోశములోని వాయువుపై నాధారపడియుండును. కోశములో వాయువు సంపూర్ణముగా నుండిన, కోశము బిగువుగా నుండి యాకాశమున నే విధముగు నట్లంతరము లేక సంచరింపఁగలవు. ఈ వాయుకోశము పొగచుట్ట యాకారమున నుండును. అట్లుండుటచే గుమ్మటము గాలిని స్వేచ్ఛగా నెట్టుకొని పోఁగలుగును. పైకి పోయినకొలఁది కోశములోని వాయువు కొఱవడుచుండును. అప్పుడు గుమ్మటము భూమికి దిగ నారంభించును. అట్టియిబ్బందిని నివారించుటకై కోశము యొక్క మధ్యభాగమునందు గాలిబంతిలోని రబ్బరుతిత్తివంటి యొక తిత్తి యమర్పఁబడెను. పెద్ద కోశములోని వాయువు తగ్గి కోశము మెత్తనయినప్పుడీ చిన్నకోశమును వాయువుతో నింపి తన్మూలమున పెద్దకోశము గట్టిగాను, బిగువుగాను నుండునట్లు చేయఁబడును. ఈ రకపు గాలిదోనె లొక గంటకాలములో ముడిచి సులువుగాఁ గొని పోవుటకు వీలుండును. ప్రథమమున నిర్మింపఁబడినవి గంటకు 25 మొదలు 33 మైళ్లదూరము పోఁగలిగియుండెను. ఇప్పుడు నిర్మింపఁబడునవి గంటకు 40-50 మైళ్ల వేగమున పోఁగలిగియున్నవి.

సెమిరిజిడ్డు గాలిదోనెలు:—వీని కోశము గట్టిదైన తేలిక యగు లోహపు పలకపై నుంచఁబడును. ఈ పలక నాధారముచేసికొని ఇంజనును, ప్రయాణికులబండియు క్రిందిభాగమున ప్రేలాడఁ గట్టఁబడియుండును. ఈ యేర్పాటువలన గాలిదోనె యటునిటు దొరలక సమభారమున నుండును.

1902-వ సం.న నొక యింజనీరు 200 అడుగుల పొడవును 7 గుఱ్ఱముల శక్తియుఁ గల యింజను గలిగిన యొక సెమిరిజిడ్డు గాలిదోనెను నిర్మించెను. ఇది గంటకు 25 మైళ్ల చొప్పున నడువఁగలిగి యుండెను. కాని 1906-వ సం.న నీ గాలిదోనె యొకచోట లంగరు వేయఁబడియుండఁగా, పెద్దగాలి వీచుటచే, నది ధ్వంసమయ్యెను. తరువాత 1909-వ సం.న, "లా-రిపబ్లిక్కు" అను పేరుతో నొక గాలిదోనె నిర్మింపఁబడెను. ఇది ఫరాసువారి యుద్ధభూమినుండి



స్వస్థానమగు మ్యూనిక్ పట్టణమునకు వచ్చుచుండఁగా ప్రొపెల్లరు (ముందునకు త్రోయు యంత్రము) యొక్క పలకలలో నొకటి విఱుగుటచేతను, వాయుకోశము చినిఁగిపోవుటచేతను 700 అడుగుల యెత్తునుండి క్రింద పడిపోయెను. దానిమీఁద నున్న నలుగురు వైమానికులు తక్షణమే మృతినొందిరి.

నాన్-రిజిడ్డు గాలిదోనెలకంటె సెమి-రిజిడ్డు గాలిదోనెలు అవసరమగు స్థలములకుఁ గొనిపోవుటకు, త్వరలో ముడుచుటకు మిగుల సమకూలముగ నుండును. ముఖ్యముగ సంగ్రామములందివి పనికివచ్చును.

రిజిడ్డు గాలిదోనెలు:—ఈ మాదిరి గాలిదోనెలు జర్మనీ దేశీయుఁడైన కౌంటు జెప్లిన్‌గారిచే నిర్మింపఁబడినవి.

అవి తుపాను కొట్టుటచేతను, వాయుకోశము నుండి పోవుటచేతను చెడిపోయెను. కాని యవి చెడిపోవుటకు కారణము లారసి వాని లోపములను సవరించి యితఁడు కొన్ని మార్పులతో క్రొత్త గాలిదోనెలను నిర్మించెను. ఇవి నిర్మించుటకు లేక కాన్స్టెన్సుకొఱ్ఱ పెద్దపెద్ద కర్మశాలలు నిర్మింపఁబడెను. ఇవి నైర్వేయిజను లందు కాలలవలె నుండును. గాలిదోనెలు తేలిక లోహమగు అల్యూమినము నూలములతో సరిక్రమముగా నిర్మింపఁబడి రబ్బరుపూఁత పూయఁబడిన వారగుడ్డతో పైన మూయఁబడియుండును. జెప్లిన్ నిర్మించిన కడపటి గాలిదోనె దానికి సంబంధించిన వైమానికులు గాక 30 మంది ప్రయాణికులను సయితము తీసికొనిపోవుటకు వీలుగ నుండును. దీని పొడవు 410 అడుగులు. అడ్డుకొలత 40 అడుగులు. ఇది 32 పలకలు గలిగి సుందరముగ నుండును. దీని నడుపుటకు 110 గుఱ్ఱముల శక్తి గల రెండు ఇంజనులు ముందును వెనుకను నమర్పఁబడియుండును. ఈ గాలిదోనె యొక పెద్ద తుపానువల్ల కొట్టుకొనిపోయి కొండల మీఁద నున్న చెట్లకుఁ గొట్టుకొని పూర్తిగ పగిలిపోయెను. దాని మీఁద నున్న ప్రయాణికు లేదో యొకవిధముగా చావు తప్పించుకొనిరి. ఎన్ని విపత్తులు సంభవించినను జెప్లిన్ తన పట్టును విడువక లోపములను దిద్దుకొనుచు నూతనపద్ధతులతో గాలిదోనెలను నిర్మించుచుండెను.

జెప్లిన్ నిర్మించిన యాధునికపు గాలిదోనెలయొక్క వాయుకోశము 17 గదులుగ విభజింపఁబడి యొక్కొక్క గదియం దొక్కొక్క గాలితిత్తి యమర్పఁబడియుండును. వీనిలో 5-6 తిత్తుల వాయువు పూర్తిగా పోయినను గాలిదోనె లేవిధమైన యపా

యము లేక యది యాకసమున నుండఁగలదు. వాయుకోశమున నమర్పఁబడియుండును.

ఏవిధమైన యుపాయము గలుగకుండ దాని యుపరిభాగ మున్క తీఁగెలలోఁ సంధింపఁ బడిన యల్యూమినపు రేకులలోఁ మూయఁబడి యుండును. సూర్యరశ్మికిని, వర్షమునకును, మంచునకును కోశములోని వాయువు మార్పు చెందకుండ కోశము మైనపు గుడ్డలోఁ మూయఁబడియుండును. ఈ గాలిమోడ 450 అడుగుల యడ్డకొలతఁ గలిగి, 450 అడుగుల పొడవు గలిగియుండును.



విమానము - గాలిమోడ

గాలి మోడ కెల క్రిందు కాకుండ నుండుటకు చేపల కుండు రెక్కలవలె దీని కిరుప్రక్కలను పొడవగు పలకలు గలవు. రెండు నిలువు పలకలు క్రింది యడ్డపలకమీఁద నున్న యుతికలలోఁ నుంచఁబడి కిటికీ రెక్కలవలె వాడుచుండును. మరియు క్రింది పలక యొక్క మధ్యభాగమందు రొక పెద్దచుక్కాని యుండును. ఈ చుక్కాని కల్లను రెండు నిలువు పలకల కల్లను గాలిమోడ యడ్డముగా నడువఁ గలిగియుండును. గాలిమోడ నిలువుగా పైకి పోవుటకుముందును వెనుకను నాలుగేసి పలకలవంతున 8 పలక లొకప్రక్కను, 8 పలకలు రెండవప్రక్కను సయితము తిరుగుటకు వీలగునట్లు నిర్మింపఁబడినవి. ఇట్టి గాలి మోడ

జెప్లిన్ నిర్మించిన యుద్ధపు గాలిమోడలు మిగుల బలిష్ఠములయి యుద్ధమున కుపయోగపడు మందు, గుండు సామానులను, మూఁడు ఫిరంగులను మోసికొని గంటకు 60-70 మైళ్ల వేగమున పోఁగలిగియుండును. ఇవి 10 వేలు మొదలుకొని 11 వేల యడుగుల యెత్తున కెగురఁగలవు. ఈ గాలిమోడలు 125 మొదలు 150 గుఱ్ఱముల శక్తిగల నాలుగు పెట్రోలింజనులవల్ల నడుపఁబడును.

మరియు యుద్ధపు గాలిమోడ మీఁద రెండు, మూఁడు ఫిరంగులను, బాంబులను క్రిందికి విడుచుటకు తగుయంత్ర సామగ్రియు, 136 మణుగుల తుపాకి మందును, చుట్టు రెండు వందల మైళ్లలోనుండి వార్తలను గొనుటకు వీలగునట్టి తీఁగెలేని వార్తాయంత్ర సామగ్రియు నుండును. గాలిమోడ క్రింద నున్న తొట్టిలోనుండి ఫోటోగ్రాఫులను తీయుటకును చుట్టుప్రక్కల నున్న శత్రుసేనల గుట్టుమట్టులను గమనించుటకును గొంద అబ్జర్వేషను స్థలముకూడ నీగాలిమోడమీఁద నుండును. వీనిలోఁ గొన్ని సీటమీఁద

యుండును. ముం దున్న మీటపలకలును, వెనుక నున్న చుక్కాని పలకలును విమానమున కంతకు నాధారముగా నున్నవి. ఈ మర లన్నియు వైమానికుని స్వాధీనములో నుండును.

## మానోప్లేను

మానోప్లేను నిర్మాణమునకును, బైప్లేను నిర్మాణమునకును వ్యత్యాస మధికము. బైప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగము నిలువుచుక్కాని నుంచుటకు మాత్రమే యాధారముగా నుండును. మానోప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగమును ఫ్యూజిలేజి యందురు. అనగా పిట్టయొక్క పొట్ట యేవిధముగా దానితలకు, ఱెక్కలకు, తోఁకకు నాధారమో అటులే మానోప్లేనుయొక్క వెనుకభాగము విమానమున కంతకు నాధారమై యుండును. మానోప్లేనుయొక్క ఫ్యూసిలేజి (పొట్టము) పిట్టయొక్క యాకారమును బోలి యుండును. ఇది పూర్తిగా మూయఁబడియుండును. ఇది నిర్మాణమందు వంపుగా నుంచుటచేగాలి సుడిగాఁ దిరుగుటకు వీ లుండదు. దీనియొక్క స్వరూపము చేఁపవలె ముందుభాగము లావుగా నుండి వెనుకకు పోను పోను సన్నమై కూచిగా నుండును.

పిట్టయొక్క శిరస్సు దాని శరీరముయొక్క ముందుభాగమునం దుండినట్లు మానోప్లేను విమానముయొక్క ముందుభాగమునందు ప్రోపెల్లరుయంత్ర ముండును. ఈ ప్రోపెల్లరు వెనుకనె యింజను నుండును. దీని యిరుసునకు ముం దున్న ప్రోపెల్లరు సంధింపఁబడి యుండును. ఇంజనువెనుక వైమానికునిపీఠ ముండును. బైప్లేను కున్నట్లు దీనికిని వెనుకభాగమున తోఁకవలె నొకపలక యుండును. దీనినె టెయిల్ ప్లేను అని పిలుతురు. ఇది యంత్ర మంతకు నాధారభూతమై యుండును.

మానోప్లేను యొక్క ఱెక్కలు క్రిందికి మీఁదికి నాడించుటచేతనె విమానము ఆకసమున నిలువఁగలుగుచున్నది. ఈ కదలిక వైమానికునియొద్ద నున్న తీఁగెలద్వారా గలుగు చుండును. మానోప్లేనుయొక్క ఱెక్కలును బైప్లేనుయొక్క పలకలును పొడవగు తేలికయైన కఱ్ఱలతో గదులుగదులుగ నొక చట్టముగ నిర్మింపఁబడి వానిపై నారగుడ్డ బిగువుగ బంధింపఁబడియుండును.

## పైకి క్రిందికి పోవువిధము

విమానము ప్రథమమున ముందుకు జరుపఁబడి ఎలివేటరు (మీట) సాహాయ్యమున క్రిందికి దిగుచుండును. ఇట్టి యెలివేటరు బైప్లేనులో ముందుభాగమున నుండును. మానోప్లేనులో వెనుక నుండును. బైప్లేనులో నెలివేటరుయొక్క లోపలికొన లుతకలలో నుంచఁబడును. వెలుపలి కొనలు పైకి క్రిందికి లేపుటకు వీలగును. మానోప్లేనులో మధ్యభాగమునందు బందులతో సంధింపఁబడిన తీఁగలవల్ల క్రిందికి మీఁదికి లేపఁబడును.

## కుడి యెడమలకు నడచువిధము

నిలువుచుక్కానివల్ల విమానము కుడియెడమలకు త్రిప్పఁబడును. ఈ చుక్కాని యన్నిరకముల విమానములలోను వెనుకభాగముననే యుండును. కొన్ని విమానములలో నొక్క చుక్కానియు మరికొన్నిటికి రెండు చుక్కానులును నుండును. ఈ రెండు చుక్కానులు నొకదానిప్రక్క నొకటిగాఁ గాని, యొకదానిపై నొకటిగాఁ గాని యుండును. నిలువుచుక్కాని కుడిప్రక్కకు త్రిప్పిన విమానము కుడిప్రక్కకు తిరుగును. ఎడమప్రక్కకు త్రిప్పిన ఎడమ ప్రక్కకు తిరుగును. ఈ నిలువుచుక్కానికి తగిలెడి గాలి తాకుడువలన విమానముయొక్క ముందుభాగము (ముఖము) దిక్కులకు తిరుగుచుండును.

## సంచరించు విధము

బైప్లేను గాని మానోప్లేను గాని యొకటి రెండు ప్రోపెల్లరుల వల్ల నడుపఁబడును. ఇది విమానముయొక్క ముందు భాగమున నుండును. ఈ ప్రోపెల్లరులకు విద్యుచ్ఛక్తి విసనకఱ్ఱల కుండెడి యాకులవలె రెండు గాని మూఁడు గాని యాకు లుండును. ఈ యాకులు నిమిషమునకు వేయి సార్లు వంతున ఇంజను సాహాయ్యమున తిరుగుచుండును. ఇట్లు తిరుగుటచేతనే విమానమునకు ముందుకు జరుగు శక్తి కలుగుచున్నది. మఱమేకు తలయొద్ద నులితో త్రిప్పుటవలన మేకు కేవిధముగా కొయ్యలోనికి చొచ్చుకొనిపోవునో యారీతిగా ప్రోపెల్లరు యంత్రపు సాహాయ్యమున విమానము గాలిలో మార్గము చేసికొని ముందునకు నెట్టుకొనిపోవును.

## నీటిమీఁద నడుచు విమానములు

కొన్ని విమానములు నీటిమీఁద దిగినప్పుడు మునిగిపోకుండ విమానములయొక్క యడుగుభాగము దోప్పవలె వంపుగా చేయఁబడి యుండును. ఈ వంపువలన అంగుళముల కెరటము వచ్చినను నపాయ ముండదు. పెద్ద పెద్ద యల లున్నప్పుడు గాని తుపాను గొట్టుచున్నప్పుడు గాని విమానము నీటిమీఁద దిగఁజాలదు. విమానముయొక్క భారమునకుఁ దగినట్లు క్రిందిభాగము వంపుచేయఁబడును. ఇట్టి విమానములు యుద్ధ సమయములలో శత్రువులయొక్క గుట్టుకట్టులను కనుగొనుటకు ప్రతి యుద్ధనౌకమీఁదను నుండును.

విమానములనుగూర్చి శాస్త్రజ్ఞులు శోధనలు చేసి దినదినాభివృద్ధి గాంచుచున్నారు. అందువల్ల నీ విషయమై యింతటితో ముగించుటకు వీలుండదు. ప్రథమమున గుమ్మటములు కనిపెట్టఁబడెను. తరువాత బుద్ధివికాసము పెంపొందినకొలఁది శోధనలు చేసినకొలఁది నీగుమ్మటములలో నెన్నియో మార్పులు చేయఁబడి గాలిమోడలు విమానములు, నీటిమీఁద దిగు విమానములు, యుద్ధమున కుపయోగపడు విమానములు మొదలగునవి కనిపెట్టఁబడెను. ఒక్కమనుష్యుని కన్న నెక్కువమందిని తీసికొనిపోవుటకు వీలులేని విమానము లిప్పుడు పలువు రెక్కిపోవుటకు తగినట్లు చేయఁబడెను. అంతియేగాక వేల కొలఁది పౌనుల బరువు గల ఫిరంగులను, సామగ్రులను తీసికొనిపోఁగల శక్తియు గలిగింపఁబడెను. ఇంక నెన్ని యాశ్చర్యకరములైన క్రొత్త యేర్పాట్లు గావింపఁబడనున్నవో యోచించుట దుస్తరము. సర్వేశ్వరునిచే సృజియింపఁబడిన మనుష్య మాత్రుఁడే ఇట్టి మహాద్భుత కార్యములను చేయుచుండ, నిఁక సృష్టికర్తయైన యా పరాత్పరుని మహిమలు అగమ్యగోచరము లయి వర్ణనాతీతములుగ నుండును గదా!

యుండును. ముందున్న నీటిపలకలును, వెనుక నున్న చుక్కానిపలకలును విమానమున కంతకు నాధారముగా నున్నవి. ఈ మరలన్నియు వైమానికుని స్వాధీనములో నుండును.

### మానోప్లేను

మానోప్లేను నిర్మాణమునకును, బైప్లేను నిర్మాణమునకును వ్యత్యాస మధికము. బైప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగము నిలువుచుక్కాని నుంచుటకు మాత్రమే యాధారముగా నుండును. మానోప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగమును ఫ్యూజిలేజి యందురు. అనగా పిట్టయొక్క పొట్ట యేవిధముగా దానితలకు, ఱెక్కలకు, తోఁకకు నాధారమో అటులే మానోప్లేనుయొక్క వెనుకభాగము విమానమున కంతకు నాధారమై యుండును. మానోప్లేనుయొక్క ఫ్యూజిలేజి (పట్టము) పిట్టయొక్క యాకారమును బోలి యుండును. ఇది పూర్తిగా మూయఁబడియుండును. ఇది నిర్మాణమందు వంపుగా నుంచుటచే గాలి సుడిగాఁ దిరుగుటకు వీ లుండదు. దీనియొక్క స్వరూపము చేపవలె ముందుభాగము లావుగా నుండి వెనుకకు పోనుపోను సన్నమై కూచిగా నుండును.

పిట్టయొక్క శిరస్సు దాని శరీరముయొక్క ముందుభాగమం దుండునట్లు మానోప్లేను విమానముయొక్క ముందుభాగమునందు ప్రొపెల్లరు యంత్ర ముండును. ఈ ప్రొపెల్లరు వెనుకనె యింజను నుండును. దీని యిరుసునకు ముందున్న ప్రొపెల్లరు సంధింపఁబడి యుండును. ఇంజనువెనుక వైమానికుని పీఠ ముండును. బైప్లేను కున్నట్లు దీనికిని వెనుకభాగమున తోఁకవలె నొకపలక యుండును. దీనినె టెయిల్ ప్లేను అని పిలుతురు. ఇది యంత్ర మంతకు నాధారభూతమై యుండును.

మానోప్లేను యొక్క ఱెక్కలు క్రిందికి మీఁదికి వాడించుట చేతనె విమానము ఆకసమున నిలువఁగలుగుచున్నది. ఈ కదలిక వైమానికునియొద్ద నున్న తీఁగెలద్వారా గలుగు చుండును. మానోప్లేను యొక్క ఱెక్కలును బైప్లేనుయొక్క పలకలును పొడవగు తేలికయైన కఱ్ఱలతో గదులుగదులుగ నొక చట్టముగ నిర్మింపఁబడి వానిపై నారగుడ్డ బిగువుగ బంధింపఁబడియుండును.

### పైకి క్రిందికి పోవువిధము

విమానము ప్రథమమున ముందుకు జరుపఁబడి ఎలివేటరు (నీట) సాహాయ్యమున క్రిందికి దిగుచుండును. ఇట్టి యెలివేటరు బైప్లేనులో ముందుభాగమున నుండును. మానోప్లేనులో వెనుక నుండును. బైప్లేనులో నెలివేటరుయొక్క లోపలికొన లుఁకలలో నుంచఁబడును. వెలుపలి కొనలు పైకి క్రిందికి తేఁపుటకు వీలగును. మానోప్లేనులో మధ్యభాగమునందు బందులతో సంధింపఁబడిన తీఁగెలవల్ల క్రిందికి మీఁదికి లేపఁబడును.

### కుడి యెడమలకు నడచువిధము

నిలువుచుక్కానివల్ల విమానము కుడియెడమలకు త్రిప్పఁబడును. ఈ చుక్కాని యన్నిరకముల విమానములలోను వెనుకభాగముననే యుండును. కొన్ని విమానములలో నొక్క చుక్కానియు మఱికొన్నిటికి రెండు చుక్కానులును నుండును. ఈ రెండు చుక్కానులు నొకదానిప్రక్క నొకటిగాఁ గాని, యొకదానిపై నొకటిగాఁ గాని యుండును. నిలువుచుక్కాని కుడిప్రక్కకు త్రిప్పిన విమానము కుడిప్రక్కకు తిరుగును. ఎడమప్రక్కకు త్రిప్పిన ఎడమ ప్రక్కకు తిరుగును. ఈ నిలువుచుక్కానికి తగిలెడి గాలి తాకుడువలన విమానముయొక్క ముందుభాగము (ముఖము) దిక్కులకు తిరుగుచుండును.

### సంచరించు విధము

బైప్లేను గాని మానోప్లేను గాని యొకటి రెండు ప్రొపెల్లరుల వల్ల నడుపఁబడును. ఇది విమానముయొక్క ముందు భాగమున నుండును. ఈ ప్రొపెల్లరులకు విద్యుచ్ఛక్తి విసనకఱ్ఱల కుండెడి యాకులవలె రెండు గాని మూఁడు గాని యాకు లుండును. ఈ యాకులు నిమిషమునకు వేయిసార్ల వంతున ఇంజను సాహాయ్యమున తిరుగుచుండును. ఇట్లు తిరుగుటచేతనే విమానమునకు ముందుకు జరుగు శక్తి కలుగుచున్నది. మఱమేకు తలయొద్ద మలిగో త్రిప్పుటవలన మేఁకు ఏవిధముగా కొయ్యలోనికి చొచ్చుకొనిపోవునో యా రీతిగా ప్రొపెల్లరు యంత్రపు సాహాయ్యమున విమానము గాలిలో మార్గము చేసికొని ముందునకు నెట్టుకొనిపోవును.

### నీటిమీఁద నడుచు విమానములు

కొన్ని విమానములు నీటిమీఁద దిగినప్పుడు మునిగిపోకుండ విమానములయొక్క యడుగుభాగము దోనెవలె వంపుగా చేయఁబడి యుండును. ఈ వంపువలన అంగుళముల కెరటము వచ్చినను సహాయ ముండును. పెద్ద పెద్ద యలలున్నప్పుడు గాని తుపాను కొట్టుచున్నప్పుడు గాని విమానము నీటిమీఁద దిగఁజాలదు. విమానముయొక్క భారమునకుఁ దగినట్లు క్రిందిభాగము వంపుచేయఁబడును. ఇట్టి విమానములు యుద్ధ సమయములలో శత్రువులయొక్క గుట్టుగట్టులను కనుగొనుటకు ప్రతి యుద్ధనౌకమీఁదను నుండును.

విమానములనుగూర్చి శాస్త్రజ్ఞులు శోధనలు చేసి దినదినాభివృద్ధి గాంచుచున్నారు. అందువల్ల నీ విషయమై యింతటితో ముగించుటకు వీలుండదు. ప్రథమమున గుమ్మటములు కనిపెట్టఁబడెను. తరువాత బుద్ధివికాసము నొందినకొలఁది శోధనలు చేసినకొలఁది నీగుమ్మటములో నెన్నియో మార్పులు చేయఁబడి గాలిబోడలు విమానములు, నీటిమీఁద దిగు విమానములు, యుద్ధమున నుపయోగపడు విమానములు మొదలగునవి కనిపెట్టఁబడెను. ఒక్కమనుష్యుని కన్న నెక్కువమందిని తీసికొనిపోవుటకు వీలులేని విమానము లిప్పుడు పలువు రెక్కిపోవుటకు తగినట్లు చేయఁబడెను. అంతియెగాక వేలకొలఁది మానుల బరువు గల ఫిరంగులను, సామగ్రులను తీసికొనిపోఁగల శక్తియు గలిగింపఁబడెను. ఇంక నెన్ని యాశ్చర్యకరములైన క్రొత్త యేర్పాట్లు గావింపఁబడనున్నవో యోచించుట దుస్తరము. సర్వేశ్వరునిచే సృజియింపఁబడిన మనుష్య మాత్రుఁడే యిట్టి మహాద్భుత కార్యములను చేయుచుండ, నీ సృష్టికర్తయైన యా పరాత్పరుని మహిమలు అగమ్యగోచరము లయి వర్ణనాతీతములుగ నుండును గదా!



ఆకాశయానముల వ్యాసమునందు విమానములకు గాలిబోడలకుగల భేదము తెలుపబడినది. ఫ్రాన్సు ఇంగ్లాండు రష్యా మొదలగు దేశములందు సయితము జెప్లినుకంటె గాలిబోడలు నిర్మింపబడుచున్నవి.



యుద్ధసమయములందు పెంపుడు పావురంబులను వార్తల నంపుటకును శత్రువుల గుట్టును కనుఁగొనుటకును బంపువాడుక గలదు. పావురములను వెంటను తీసికొనిపోయి మూఁడు నాలుగు వందల మైళ్ల దూరమున వానిమెడలో చీట్లను కట్టి వదలిన నవి స్వస్థలమును చేరును. ఆయుత్తరమును జదువుటవలన స్వపక్షపు స్థితి తెలియును. శత్రువులగుట్టును గనుఁగొనుటకై పావురంబులమెడయందు ఫోటోగ్రాఫులను తీయుపెట్టెలను గట్టుదురు. అవి మిక్కిలి చిన్నవిగనుండును. వానికి స్వతస్సిద్ధముగ బొమ్మలను దీయు మర లమర్పబడియుండును. పిట్ట యెగురునప్పుడు రెండుమూఁడునిమిషములకొకసారి ఫోటో పడును. ఆ ఫిలుమునుండి ఫోటోలను తయారు చేయుటకై నం 4. సాధనము చేయబడినది. ఇట్టి సాధనములను జర్మను వేగులవాండ్రు పరదేశములలోని రహస్యములను గనుఁగొనుటకు వాడుచుండిరని ప్రతీతిగలదు. కోటలమీఁద నెగిరెడిపావురము లిపుడు కాల్చి చంపఁబడుచున్నవి. నం 2. కామిరాలో క్రింది వస్తువులు మాత్రము ప్రతిబింబించును. పావురముమెడయం దున్న కామిరాలో క్రింద నెదుట నున్న వస్తువులు ప్రతిబింబించి బొమ్మ లేర్పడును.

THE 42 C. M. KRUPP HOWITZER



42 సెంటిమీటర్ క్రుప్ హొవిట్జర్ ఫిరంగిని రైలుమీద పెట్టినంపుట

IN ACTION



ఫిరంగిని [illegible] ప్రయోగించుట

A SHELL FROM 42 C. M.



ఫిరంగినుండి ప్రయోగింపబడిన గుండు

జర్మను 42 సెంటిమీటరు ఫిరంగినుండి ప్రయోగింపబడిన యీ రాక్షసిగుండు (సాధారణముగా ఒక మనిషియెత్తు) 5 అడుగు లున్నది. 7½ మైళ్ల దూరమునుండి వచ్చి వర్డన్ కోటవద్ద పడినది. కాని బ్రద్దలుకాలేదు. దీని బరవు ఒక్కటన్నుకు 133 రతులు తక్కువగా నున్నది. ఇది ఫ్రెంచివారి వశమునం దిప్పుడున్నది.

చెప్పిరి. కావలసినంతవఱకు దోచుకొని ఆగ్రామమును ఈనరనా గరకులు వదలిపోయిరి. ప్రజలును వీరి బాధలను పడజాలక కొద్ది పాటి జర్మను గుఱ్ఱపు దళముగాని సైనికులు గాని చేతిలో చిక్కినప్పుడు బెల్జియనులును వారిని తగినరీతిని పరాభవించు చుండిరి.

### డినాంటు, లీజు, లోవేన్ యుద్ధము

లీజుపట్టణము పడినను కోటలన్నియు వశము కానందున జనరలు ఎమ్మిక్ గారు పురబహిర్భాగమున నివసించుచుండిరి. 14-వ ఆగష్టు తేదీన ఫ్రెంచిసైన్యములు బెల్జియనుల సహాయార్థము వచ్చుచున్న వనియు, వారివారి యుద్యోగీయులు యుద్ధక్రమమును గురించి పరిష్కరించుకొనిరనియు తెలిసెనది. 13 ఆర్మికోరులు (కోరు అనగా 40,000 సైనికులు) ఫ్రాంసును వదలి బెల్జియము రక్షణార్థమై వచ్చుచున్నారనియు వదంతులు పుట్టెను.

### డినాంటు యుద్ధము

బెల్జియములోని ఈ డినాంటుకును ఫ్రెంచివారి సరిహద్దు గ్రామమగు గివెట్‌కును దూరము 14 మయిళ్లు మాత్రమే. ఇది మ్యూజునదికి తీరమున నున్నది. ఇప్పటికే కొంత ఫ్రెంచిసేన పంపబడెను. ఇంతవఱకుం దిప్పటనున్న బెల్జియముసేనకు సరియైన తుపాకులుగాని ఫిరంగులుగాని లేవు. జర్మనులు 15-వ ఆగష్టు తేదీన మ్యూజునదికి క్రిందిభాగమున దాటి నామూరువిూదికి వెళ్లగలయుదమని ప్రయత్నించు చుండిరి. ఫ్రెంచివా రాకస్మికముగా నిర్భ్యూట తాకబడినను ధైర్యముతో పోరాడిరి. ఒక ఫ్రెంచిసేన అరగంటలో నాలుగు మయిళ్లు పరుగెత్తుకొని వచ్చెను. ఫ్రెంచివారు జర్మనుల పతాకమును గురిపెట్టి కాల్చి పటాపంచలు చేసిరి. ఇప్పుడు ఫ్రెంచివారికి తాళజాలక డినాంటు కోటపయియు పయిగా నదిని దాటుటకయి జర్మనులు వెళ్లిమండిరి. ఇప్పుడు తాత్కాలిక వారధి కట్టి దాటుచున్న జర్మనులు ఫ్రెంచివారి ఫిరంగులకు సరియయినగురి యయిరి. వంతెన ముక్కలుముక్కలుగా చేయబడెను. ఆ సేనలు శత్రువులు జలమరణమును పొందిరి. కాని మధ్యాహ్నము రెండుగంటలకు జర్మనులు డినాంటుపట్టణమునే ముట్టడించిరి. వారిని ఆపుట కెవరికిని శక్తి లేకపోయెను. ఇప్పుడు ఫ్రెంచివారి అరపటాలము రొయొడింపబడెను. దుర్గముపయిని జర్మనులు తమ పతాకమును పాతిరి. దుర్గమునుండి మెషీను గన్నులను ప్రయోగించి నిరపరాధులగు పురజనుల ననేకులను చంపిరి. ఇంతలో ఫ్రెంచివారికి కావలసిన సేన మోటారు బండ్లలో రాగా సాయంకాల మయిదుగంటలగునప్పటికి నది కిరు పార్శ్వములను నతి తీవ్రముగా జర్మనులకును, ఫ్రెంచివారికిని పోరు జరుగుచుండెను. దుర్గమువిూది జర్మనుపతాకమును రెండుపర్యాయములు గురిపెట్టి కొట్టి ఫ్రెంచివారు ఆకసములో నెగురునట్లు చేసిరి. ఫ్రెంచి 75-వ నెంబరు ఫిరంగులు శత్రువులను భస్మముచేయుచుండెను. జర్మనువారి 7-వ కోరు (40,000 సైన్యము) రెండుగా చీల్చబడి ఒకటి గివెట్టుప్రక్కకును రెండవది అన్సీప్రక్కకును పరుగెత్తెను. సాయంకాలము 7 గంటలకు డినాంటులో శత్రువులు లేరు. బోవెన్సు సీనే గ్రామములకు మధ్యనున్న నదీతీరమునందు జర్మనుపీనుగులు 3000 లెక్కింపబడినవి. సుప్రసిద్ధమైన కెయిజరుగారి ఇంపీరియలుగార్డు ఈయుద్ధములో నామమాత్రావశిష్ట మయ్యెను.

### లీజుకోటలు పడకుండుట

ఈకోటలు జర్మనుల వశము కానందున జనరలు వాన్ ఎమ్మిక్ ఆత్మహత్య చేసికొనెనని వదంతులు పుట్టెను. లీజునకు కొంతదూరమందుండి 41,000 జనసంఖ్యగల సెరెంగునొద్ద కఠినయుద్ధము జరిగెను. జర్మనులు రూఢూరెపట్టు స్థలమునుండి తరుమబడిరి. ఇప్పుడునే 71-వ జర్మను కాల్బలమునకు సేనాధిపతియగు ప్రిన్సు విలియం ఆఫ్ లిప్పి గారును, ఆయన పదునాలుగు సంవత్సరముల తనయుడును కీర్తిశేషులయిరి. లీజు సేనాధిపతియగు లీమెన్ గారికి ఒక షెల్లువలన గాయము తగిలినను మడతకుర్చీలో కూర్చుండి యుద్ధవిధానమును నడుపుచుండెను. ఈ పట్టణమున కంతకును ఫ్రెంచి ప్రెసిడెంటుగారగు పోయిన్‌కేరుగా రింత ధైర్యోత్సాహములతో పోరినందుకయి క్రాస్ ఆఫ్ ది లీజియన్ ఆఫ్ ఆనర్ అను గౌరవమును నొసంగి సన్మానించిరి.

### యుద్ధస్థితి

డినాంటు యుద్ధమునాటికి బెల్జియములో స్థితి యీవిధముగా నుండెను:—లీజ్ కోటలు కొన్ని శత్రువుల వశ మింకను కాలేదు. నామూరువిూద జర్మనులు వెడలలేదు. మ్యూజునదీప్రాంతమున ఫ్రెంచివారిప్పుడే చూపిన సాహసమును బట్టి గొప్పగా సహాయములగుదురను నమ్మకము కలిగినది. ఆంట్వెర్పు అభేద్యమయిన దుర్గముగా బరిగ్రహింపబడుచుండెను. ఒకవేళ జర్మనులు ఈ కోటను సమీపించినను కాలువలను తెరచి నీళ్లతో ముంచివేయవచ్చు నను ధైర్యము బెల్జియనుల కుండెను. బ్రసెల్సు ముఖ్యపట్టణము కోటలను గలదికాక పోయినను, దానికిని శత్రుసేనకును మధ్య, బెల్జియను సేనలో నతి పరాక్రమవంతమయిన పటాలము లున్నవి. ఇంగ్లీషువారును బెల్జియనులకు సహాయము చేయుటకు వచ్చుచున్నారు. కాని తత్కాలము జర్మనుల ఉగ్రము ఆపబడినను అనేక లక్షల సైన్యమును నిర్జించగల శక్తి వారికి గలదని బెల్జియనులు చక్కగా గుర్తెంగి యుండిరి.

### జర్మనుల విజృంభణము

మ్యూజునదిని నూతనసేనలతో హైవద్దదాటి లీజు, నామూరులకు మధ్యనున్న బెల్జియను అశ్వసేనను పారదోలి 2 లక్షలమంది జర్మను సైనికులు పశ్చిమమున బ్రసెల్సు ముఖ్యపట్టణమును పట్టుటకయి చనుచుండిరి. జర్మనుసమూహములముందు నిలువజాలక అతి పరాక్రమముతో పోరినను, బెల్జియనులు వెనుకకు తగ్గిపోయిరి. గీటు బెట్టుకద్దను, బూడింజెన్‌కద్దను అశ్వసైనికులకు పోరు జరిగెను. రణరంగము ఆరుమైళ్ల పొడవుండెను. కాని శత్రుసేన అత్యధికముగుటవలన బెల్జియనులు చాల సేపు పోరి, గొప్పనష్టమును గలిగించి పిదప వెనుకకు తగ్గిరి. తరువాత డీస్టు, ఏర్‌షాట్, టర్లమాంట్, లావేన్



బెల్జియము అశ్వసైనికులు [illegible] జర్మను [illegible]

పట్టణముల మీద ఎడతెగక జర్మను ఫిరంగుల ధార కురిసెను. టిర్లమాంట్ బ్రసెల్సునకు 28మైళ్ల దూరమందే కలదు. ఇచ్చట ఘోరమయిన యుద్ధము జరిగినది. మంగళవారమునాటి రాత్రి ఎనిమిది గంటలకు విచ్చుటుకొని టిర్లమాంటును, ఒక్కగంట విచ్చుట [illegible] ఉండిపోగను. అనేక గ్రామములు చుట్టు ప్రక్కల తగులబడినవి. కాని యుద్ధము జరుగుచునే యుండెను. తరువాత బెల్జియనులు లావేన్ నగరము దక్షిణకు పారిపోయి అచ్చట యుద్ధమున కుపక్రమించిరి. ఈ యుద్ధములో మూడవ బెల్జియము సేన 600 మంది దిగంతముల దాకను ప్రఖ్యాతిని గడించిరి. ఈ గుఱ్ఱపుదళము 10000 జర్మను కాల్బలము మీద దుమికి వెక్కసంపలను చంపిన తరువాత ఏమగును తప్ప మిగిలిన వారందరును వీరస్వర్గమున కేగిరి.

ఆరాత్రి వెక్కుమంది జనులు దిక్కులేక బ్రసెల్సు నగరము నకే పోవ మొదలిడిరి. బెల్జియము రాజు ఆల్బర్టుగారు ఒక్క అంగరక్షకునితో తమమోటారుబండి నెక్కి వెక్కు తావుల తిరుగుచు జనులకు ధైర్యమును బురికొల్పుచు, సైన్యము ప్రాణ ముందుమునుకొను పోకానునట్లు చేయుచుండిరి. ఒక సైనికుడు శ్రీవారిని "మహారాజా" అని సంబోధించగా వాని చేతిని బట్టుకొని చిఱునవ్వు నవ్వుచు నన్నట్లు పిలువరాదు. మన మందఱమిప్పుడు చెలికాండ్రము. నన్ను "ఆల్బర్టు అని పిలువుము" అని శ్రీవారనిన మాటలు జేకముంటే [illegible] తెలిసి వారియందు ప్రజలకున్న

ప్రేమ మరింత వృద్ధియయ్యెను. లెఫ్టినెంటు హెహ్వాక్జ్ అను వతడు ఫిరంగులతో సమర్చబడిన తనమోటారుబండిని ప్రతియుద్ధము నెక్కి జర్మను సైనికులను తెండాడుటకయి బయలుదేరి సుమారు దెబ్బది మందిని నొక్కడే చంపుట సుప్రసిద్ధము.

## ఆల్సేస్ లోరైన్

ఫ్రాన్సుమీద దాడివెడలుటకు జర్మనులకు రెండు మార్గములు కలవు. మొదటిమార్గము ఉత్తరమున బెల్జియము, లక్సెంబర్గులకును, దక్షిణమున స్విట్జర్లండునకును మధ్య ఫ్రెంచి-జర్మనీవారి సరిహద్దుగానున్న రెండువందల మయిళ్ల పొడుగుభూమి. రెండవమార్గము బెల్జియములో ప్రవేశించి ఉత్తరఫ్రాంసు నాక్రమించుకొనుట. కాని యీ రెండువందల మయిళ్ల సరిహద్దులలో ప్రతి ముప్పది మయిళ్లకును అభేద్యములగు కోటలను ఫ్రెంచివారు కట్టిరి. ఈకోటలలో వర్డన్, టూల్, ఎపినాల్, బెల్ఫోర్టు లనునవి ఒకటిక్రింద నొకటి కలవు. వీనిలో 10 లక్షల సైన్యము సకల యుద్ధపరికరములతో జర్మను లెత్తి వచ్చినయెడల ఓడించుటకయి సర్వసిద్ధముగా నుంచబడెను. ఒక కోటకును నింకొక కోటకును మధ్యనున్న స్థలములో జర్మనులు పోవుటకు వీలులేనంత దూరము పారగల ఫిరంగు లుంచబడినవి. ఇచ్చట




ఫ్రెంచి, జర్మను సరిహద్దులు. వానియందలి కోటలు

ఇఁక ఫిరంగులమాట విచారించెదమేని 13.5 ఇంచి ఫిరంగులు ఇంగ్లీషు యుద్ధనావలలో 188 గలవు. ఈశ్రేష్ఠమయిన ఫిరంగులు ఇంకొకరికి లేవు. 12 ఇంచి ఫిరంగులు మిత్రమండలికి 500 లును, శత్రుమండలికి 158 యు గలవు. 11 ఇంచి ఫిరంగులు శత్రువులకు 90 ఎక్కువగా గలవు. 4.7 యించి ఫిరంగులు, 4 ఇంచివి, 3.9 ఇంచివి మిత్రమండలివారికి 302 అధికముగా గలవు. 6.5 ఇంచి, 6 ఇంచి 5.5 ఇంచి ఫిరంగులు శత్రుమండలికి 110 హెచ్చుగా నున్నవి. ఇటలీగూడ యుద్ధములో దిగుటవలన మిత్రమండలియొక్క బలము మిక్కుట మయినదని వ్రాయనవసరము లేదు.

యుద్ధము ప్రకటింపఁబడిన పదిదినములలో జర్మనుపతాకము నెగురవేయుచున్న సముద్రముమీది వర్తకనావలన్నియు ఇంగ్లీషు యుద్ధనావలచే ఒక్క ఫిరంగికాల్పుబడకుండ పట్టుకొనబడెను. ఈపది దినములలోనే జర్మనీవారి ఎగుమతి వ్యాపారము అంతరించెను. కొన్ని జర్మనువ్యాపారనావలు తటస్థదేశముల నౌకాశ్రయములకు పరుగెత్తి శరణుకొచ్చెను. జర్మనీవారికున్న నౌకలు మొత్తము 100 టన్నులకు మించినవి 2090. ఇంగ్లీషువారివలన పట్టుకొనబడినవి 129. జర్మను రేవులలో నున్నవి 738. బాల్టిక్, నల్లసముద్రములలో నుంచబడినవి 71. మిత్రమండలివారి రేవులలో నున్నవి 166. తటస్థదేశపు రేవులలో శరణుజొచ్చినవి 646. లెక్కకురాకుండ 500 టన్నులకు పైగానున్న నౌకలు 125. లెక్కతేలని చేపలబోట్లు 353. చిన్న పడవలు మాయ మయినవి 381. జర్మనీవారి డ్రెస్డెన్ క్రూయిజరు ఆగష్టు 5వ తేదిన లూసిటానియా యనునావను ముంచ జూచెను గాని యది చిక్కలేదు. ఈలూసిటానియాయే తరువాత ఈసంవత్సరము మే నెలలో సబ్మెరయిను వలన ముంచివేయబడినది. లూసిటానియాకు సోదరినౌకయగు మారిటానియాను కార్ల్స్రూ క్రూయిజరు అట్లాంటిక్ సముద్రములో పట్టుకొనజూచెను గాని ఎసెక్సు క్రూయిజరువచ్చి దానిని రక్షించెను. ఆగష్టు



5వ తేదిని సముద్రములో గనులను విడ్చులచేయుచు వెళ్లుచున్న జర్మనువారి కోనిగిన్ లూయిస్ యనునావను ఆంఫియన్ అను ఇంగ్లీషు లైటుక్రూయిజరు ముంచివేసెను. కాని ఆంఫియన్ యుద్ధనౌకయు మరునాఁడుదయమున కోనిగిన్ లూయిస్ వెదజల్లిన గనులలో నొకటి తగిలి మునిగిపోయెను. ఇందలి నావికులలో 139 మంది తప్ప తక్కినవారు కాపాడబడిరి. ఆగష్టు నెలయంతయు జర్మనుయుద్ధనావలు బయలుదేరి యుద్ధమునకు వచ్చునేమోయని ఆంగ్లనౌకలు నోరుతెరచుకొని యుండెను. కాని యొక జర్మను అడ్మిరలు జర్మను యుద్ధనావ లెందువలన పోరాడవో కారణములనిట్లొక యుపన్యాసమునందు దెలిపెను. "మనము పోరాటమునకై ఇంగ్లీషువారితో సముద్రమునందు పోరితిమేని నౌకలు వోడిపోవుదుమనుట నిస్సంశయము. పోయిన నావలకు బదులుగా క్రొత్తనావలను కట్టుటకును, అవి ఈయుద్ధమునకు పనికివచ్చునటులును వీలు ఎంతమాత్రమును లేదు. సముద్రయుద్ధములో తప్పక బలముగల మనము ఓడిపోతిమేని మన సముద్రతీరమంతయు శత్రువులచేత ధ్వంసముచేయబడి జర్మనుభూమిపయిని మనశత్రువులు దిగి యుద్ధముచేయుటకు కవకాశము సమకూరును. మన యుద్ధనావలను కదల్పకుండ కాపాడుకొంటిమేని సంధి జరుగునప్పుడు మనమాటలు అవశ్యముగా ఆలకింపబడును. మన మప్పుడు బలహీనులముగా పలుకవలసిన యావశ్యకముండదు." ఇందువలన సముద్రయుద్ధమునకు జర్మనులు దిగక సబ్మెరయినులచేత హానిని కలిగింప వలయునని కలపెట్టి యున్నారు. ఆగష్టు 11వ తేదిన జర్మను సబ్మెరయినులు బ్రిటిషు క్రూయిజరగు బర్మింగుహాము టార్పిడో వేసి ముంచుటకయి రాగా ఈ యుద్ధనావయు, కొన్ని బ్రిటిషుడిస్ట్రాయరులును వానికి నష్టము కలుగచేసి తరిమివేసెను. ఈరోజుననే జర్మను సబ్మెరయిను 15 యు నెంబరుగలదానిని బర్మింగుహాము క్రూయిజరే సముద్రములో ముంచివేసెను.




పొగ ఓడలపైన మైనులు నీటిలో వేయక పూర్వము వ్రేలాడుచుండెడి విధము.

మైను నీటియందు నిలిచియుండు రీతి.

మేకు ఊడి (మ) యందు గనుపరచిన లివరు అక్షమునుండి నిలువుగా లేచుట.

ఊడినమేకు కేపును ప్రేల్చుటవలన మైను ప్రేలి ఓడలను ముంచును.

## రుష్యా రణరంగమున ప్రవేశించుట



యుద్ధమునకు కొంతకాలమునకు పూర్వము రష్యాదేశము శాంతిభూయిష్ఠమయియుండెను. పరిశ్రమలవలన జీవించువారు సమ్మెకట్టులు కట్టి నానా కొల్లరులు చేయుచుండిరి. "వీరా జర్మను యజమానుల నెదిరింపగలట్టివారు!" అని జర్మనులు నవ్వుచుండిరి. కాని యుద్ధము శాంతిని రాజభక్తిగా మార్చివేసెను. తమ 'చిన్ని తమ్ములగు' సర్వియనులను ఆస్ట్రియా దురాగ్రహమునుండి కాపాడుటకయి, రష్యను భల్లూకము కత్తిని దూసెను. రష్యా ప్రభుత్వము మొదట అపనమ్మకము గలిగియున్న పోలులకు తగిన వాగ్దానములు చేసియు, కిన్లండు ప్రజలకు స్వపరిపాలన మొసంగెదమని ప్రకటించియు, ఆస్ట్రియాలో భాగమగు గలీషియాలోని స్వజాతివారగు స్లావులను తమలో చేర్చి జాత్యభ్యుదయమును గోరుదమని యుత్సాహపఱచియు, రష్యాలోని యూదులను సంతృప్తిపఱచియు, వారి కెట్టిభయము లేకుండ చేసియు, తమ సామ్రాజ్యమంతటను జారుగారు దేశభక్తి నవీనముగా పురికొల్పిరి. జూలయి 28-వ తేది యుద్ధము ప్రారంభమయినది. 2 వ ఆగస్టున కప్పుడే కొంత రష్యనుసేన జర్మనీలో ముఖ్యరాజ్యమగు ప్రష్యా సరిహద్దులలో ప్రవేశించెను. ఇంతకుముందు స్వల్పమగు రష్యా నావిక బలమును జర్మని కీల్లంను గల్ఫునందు మూసివేసి ఆలాండుద్వీపములను వశముచేసికొనియెను. రష్యామీద నేల యుద్ధమునకు జర్మని 15 లక్షల సైన్యమును సిద్ధముగా నుంచినది. రక్షణములేని సరిహద్దులలోని అనేకములగు రష్యా గ్రామములను ముందుగా జర్మనులు తగులబెట్టి ప్రజలను నానాకష్టములపాలు సేసిరి. ఈ యుద్ధములో మొట్ట

M. SOZONOFF



రుష్యా విదేశాంగ మంత్రి ఎం. సొజొనోఫ్

ADMIRAL GEORGEOVITCH



అడ్మిరలు జార్జిగొవిచ్ సర్వియా యుద్ధ వ్యవహారాంగమంత్రి

KING OF MONTENEGRO



మాంటెనీగ్రో రాజు

CROWN PRINCE OF AUSTRIA



ప్రస్తుత ఆస్ట్రియా యువరాజు

GRAND DUKE NICHOLAS



గ్రాండ్ డ్యూక్ నికోలస్. రష్యా సర్వసేనాధిపతి

GENERAL IVANOFF



జనరల్ ఇవనోఫ్. రష్యా నైరృతి సేనాధ్యక్షుడు

GENERAL RENNENKAMPH



జనరలు రెన్నెన్ కాంఫ్

GENERAL SAMSONOFF



కీర్తిశేషుడయిన జనరలు సాంసనోఫ్

ఈ చోట పడకుండనున్నచో ప్యారిసు సామీపమునకు సులభము, శత్రువులు వెళ్లుట కవకాశ మీయక పట్టిరి. ఫ్రెంచివారు నామూరును రక్షించుటకయి పంపిన సహాయము ఆలస్యముగా చేరినందున ప్రయోజనము లేకపోయెను.

## మాలిన్సు, ఆస్టెండులు జర్మనుల వశమగుట

24.వ తేదిన బెల్జియము సేన ఆంట్వెర్పునకది బ్రుసెల్సుకు నడుమట 14 మైళ్లలో నున్న లౌవెన్ అను చోట మూడు జర్మను డివిజనులతో తలపడెను. జర్మనులు విలోర్డ్ వరకును తరుముబడిరి. సదు గాత్రము వీరు మాలిన్సు కైస్త్రవా గారమును పాడుచేసి పోయిరి. జర్మనులు బ్రుసెల్సునుండి, తిరిగి 40,000 సేనతో వచ్చి బెల్జియముల కోడిం చుటచే వారు ఆంట్వెర్పునకు పరుగెత్తిరి. మాలిన్సువద్ద బెల్జియము రాజుయొక్క మోటారుబండి ముందరనే ఒక షెల్లు బ్రద్దలాయెను. దైవవశమున ఆయన కపాయము కలుగలేదు. బండియొక్క చక్రములు తునకలయినవి. మాలిన్సునుండి జర్మనులు సముద్రతీరమున నున్న ఆస్టెండునకు వెళ్లిరి.

ఇక్కడ కొన్ని వందలు నట్టుకేయున్న బెల్జియము సేన బాగుగా పోరాడెను. ఇంగ్లీషు సముద్రసేన 7000 ల మంది నేలమీద నావికా ఫిరంగులతో ఆస్టెండులో ప్రవేశించి బెల్జియములకు చాల సహాయముచేసి అనగరమును కొన్ని దినములు కాపాడెను. కాని జర్మనులు అనేకవేలతో వచ్చుటవలన ఇంగ్లీషువారికలు యోడ లెక్కి తరలి పోయిరి. ఆస్టెండు జర్మనుల వశమాయెను.

## ఛార్లీరాయి యుద్ధము

ఇప్పటికి ఇంగ్లీషువారి సేనయు ఫ్రెంచివారి సేనయు సరిక ముగా బెల్జియమునకు చేరెను. ఇంగ్లీషువారు మాన్సు నాక్రమించుట



ఫ్రాన్సులో మొట్టమొదట దిగిన ఆంగ్ల సైనికులకు ఫ్రెంచివారాహ్వానించుట



జర్మనులతో పోరాడుటకయి వచ్చిన టర్కో (నీగ్రో) సైనికులకు ఫ్రెంచి గృహస్థులొసగిన మొదలగు

కయి పంపబడిరి. ఛార్లీరాయిని రక్షించుపని ఫ్రెంచివారు పెట్టుకొనిరి. 21.వ ఆగష్టు శుక్రవార ముదయ మూడుగంటలకు శత్రువులు వచ్చుచున్నవార్త తెలిసినది. 7 గంటలకు వారి మొదటి ఫిరంగిగుండు ఛార్లీరాయిలో పడినది. జర్మనుల మీదపడుటకయి ఫ్రెంచివారి ఆఫ్రికా అధినివేశములనుండి వచ్చిన (అరబ్బులకును, నీగ్రోలకును బుట్టినవారగు) టర్కోలు వదలబడిరి. వీరందరును మహాచ్చురీయులకంటె వీరావేశముతో జర్మనులతో నతిసాహసముతో పోరి బల్లెములతో జర్మనుల శరీరములను చీల్చిరి. కాని ఒక ప్రాకారాగారములో దాచియుంచబడిన యంత్రపు ఫిరంగులు వీరి రూపు మాపెను. ఒక్కపటాలములో 100 మంది మాత్రమే గాయములు తినక తిరిగి ఫ్రెంచివారిలో కలియ గలిగిరి.

సంఖ్యాధిక్యత గల జర్మనులు ఫార్లిరాయి నగరములోనే తరువాత ప్రవేశించిరి. మరునాడుదయమున ఫార్లిరాయివద్ద తిరిగి గొప్పపోరు జరిగెను. పురవీధులు శవములగల కుప్పలతో నిండియుండెను. ఈ పురము ఫ్రెంచివారి వశమయ్యెను. ఈవిధముగా నయిదుపర్యాయము లీనగరము చేతులుమారెను. ఒక్కపర్యాయము టర్కోలు జర్మనులను రెండుమయిళ్లవరకును దరిమి కసిదీర వారిని జంపిరి. ఫిరంగి యుద్ధము తీవ్రముగా నిచ్చట జరిగెను. కాని జర్మనులకున్న అధిక సంఖ్యగలవ ఫార్లిరాయివద్ద పోరుట జననష్టము గాని లాభము లేదని ఫ్రెంచివారు వదలిపెట్టి వెళ్లిపోయిరి. ఫార్లిరాయి యుద్ధమున జర్మనులే జయించిరి.

## మాన్సువద్ద జరిగినపోరు

ఇంగ్లీషుసేన ఫ్రాన్సులో దిగగానే ఆ జనుల యానందమింతింతకాదు. బ్రిటిష్ సైనికులకు ఫ్రెంచిస్త్రీలు పూలహారములు వేసిరి. అన్నము, పానీయములు కొఱత లేకుండ నొసంగబడెను. అప్పుడు పొలము లన్నియు పంటలతోను, పండ్లతోను పువ్వులతోను పండి శోభాతిశయ మొసరించుచుండెను. జనులు శాంతికేంద్రలయి హాయిగా కాలము గడుపుచుండిరి. కొన్ని దినములలో నీ స్థితి యంతయు మారవలసియున్నది. ఇండ్లు పంటలు పొలములు పాడుపడ వలసియున్నవి. సంసారములు కూలవలసియున్నవి.



మాన్సువద్ద నున్న అశ్వసైనికుల కచ్చిన బ్రెంచిగ్రామస్థులు [illegible]

21వ ఆగష్టున ఇంగ్లీషువా రచ్చట పోరవలసి యున్నదియు, సర్ ఫ్రెంచిగారికి తప్పు యితర జాడలును తెలియదు. సాంబ్రేనదిమీద ఫ్రెంచి వారి యెడమవైపున నున్న సైన్యమును రక్షించుటకయి బించి-మాన్సు-కాండేయను ప్రదేశములనుకలుపు పంక్తిమీదికి పంపబడిరి. మాన్సుకాలువకు తూర్పున నున్న భాగమును రెండవసైన్యములో సర్ హోరేస్ స్మిత్ డోరియన్ గారు కాపాడుటకయి నిర్దేశింపబడిరి. మాన్సువద్ద యీసైన్యములో నొక భాగము బ్రిటిష మొదటి సేనాధిపతియగు సర్ డోగ్లస్ హేగు గారి ఎడమప్రక్కను కాచుచుండెను. అశ్వసేనాధిపతియగు అలన్బీ గారిసేన రిజర్వులో నుండునట్లును ఎవరికి నచ్చట సహాయము కావలయుననిన నచ్చటికి పంపబడునట్లును పరిష్కరింపబడినది. బ్రిగేడియరు జనరలు సర్ ఫిలిప్ ఛాట్వుడ్ గారి గుఱ్ఱపురౌతులు కొందరు శత్రువులజాడ తీయుటకయి పంపబడిరి. ఈ భాగమున నొకటి రెండు ఆక్రమణలకంటెను; † ఒక అశ్వసేన డివిజను కంటెను, హెచ్చుగా ముట్టడికి జర్మనులు పంపరని ఫ్రెంచి సేనాధిపతి జోఫ్రేగారు ఇంగ్లీషు సర్వసేనాధిపతికి చెప్పియుండెను. ఆకాశ విమానములును, ఛెట్వుడ్ గారి రౌతులును అదే వర్తమానములను తెచ్చిరి. ఈవిషయములో ఫ్రెంచి ఇంగ్లీషు సేనాధిపతులు మోసపోయిరి. జర్మను లిచ్చట నొక చమత్కారమయిన యుక్తి చేసిరి. వారు బ్రసెల్సును పట్టుకొనిన తరువాత వారిసైన్యము మూడు పెద్ద భాగములుగా విభజింపబడెను. ఒకభాగము వాటర్లూగుండ నివెల్లిసుదగ్గరకు వెళ్లి, అచ్చటనుండి తిరిగి రెండు భాగములయి ఒకటి మాన్సు మీదికిని, రెండవది బించి-ఫార్లిరాయి మీదికిని నడచెను. మూడవది ఈ సేనాధ్యక్షుడు జనరలు వాన్ క్లూక్ క్రింద హాలుపట్టణము మీదుగా తిరిగి ఎంఘెయిన్, అచటినుండి బోర్నాయిమీదికి వెళ్లెను. దినమునకు ముప్పదిమైళ్లు నిద్రాహారములు లేక, రాత్రింబవళ్లు జర్మనులు నడచుచుటవలన నింతసేన నొక్కపర్యాయము ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును కామకొన లేకపోయిరి. వారిసైన్యముకంటె జర్మనుసైన్యము పదిరెట్లుండెను.

### ప్రారంభము

ఇంగ్లీషువారి సేనలమీద నొకవిమాన మొక బాంబును వేసి నల్లపొగ బయటికి వచ్చుటతో మాన్సుయుద్ధము ప్రారంభమయినది. ఇరువది నిమిషములలో జర్మనుఫిరంగులు వడగండ్లవలె విరామము లేక నాలుగు దినములవరకు కురిసెను. ఈ నాలుగు దినములును ఒక్క అంగుళము స్థలమయిన నొసంగక బ్రిటీషుసేన రాక్షసులవలె పోరాడి అనేకవేల జర్మనులను బరిమార్చెను. బ్రిటీషువారికిని గొప్ప నష్టము కలిగెను. బ్రిటిషుమిడిలు సెక్సు రెజిమెంటులో 4000మంది యుండగా

† అశ్వికదళము [illegible] సైన్యము క్రింద [illegible]

GERMAN ATROCITIES ON FRENCH FAMILIES



ఒక ఫ్రెంచి గ్రామములో గృహిణిని బిడ్డలతో వెడలగొట్టి ఇంటిలోని పడక మీద జర్మనుసైనికుడు నిదురించు చున్నాడు.
ఒకచేతియందు సారాయిబుడ్డి రెండవచేతిలో తుపాకి వీనికిగలదు

FIERCE HAND TO HAND FIGHT WITH HUNS IN A BED ROOM



ఒక యింటిలోని పడకగదిలో స్త్రీలకు బదులుగా ఫ్రెంచిసైనికులు దాగియుండి జర్మనులను పొడుచుట

A FRENCH FAMILY MURDERED




జర్మను రాక్షసుడొక ఫ్రెంచికుటుంబమును వధించుట

THE MURDERER KILLED



హంతకుని ఆఫ్రికా తురాయిదారు అశ్వసైనికులు చంపుట

THE MURDERERS TAKEN PRISONERS



ఇట్టి హంతకులను ఫ్రాన్సుభటులు ఖయిదీలుగా చేయుట

GENERAL VON KLUCK



జనరలు వాన్‌క్లక్

FIELD MARSHAL VON HINDENBURG



ఫీల్డుమార్షలు వాన్ హిండన్‌బర్గ్

DUCHESS OF LUXEMBURG



లక్సెంబర్గు ప్రభ్విణి

f

QUEEN OF HOLLAND



హాలెండు రాణి

EMPEROR OF JAPAN



జపాను చక్రవర్తి

COUNT OKUMA



జపాను ముఖ్యమంత్రి ఒకూమా ప్రభువు

PRINCE HENRY OF HOLLAND



హాలెండు రాణిగారి భర్త ప్రిన్సు హెన్రీ

A VETERN SUBADAR MAJOR



45 వ రాటరే సిక్కు పటాలములోని వృద్ధుడగు సుబేదారు మేజరు

నావలను తుర్కీకి జర్మనులు అమ్మివేసినట్లు కాగితములను పుట్టించి వానికి తురుష్కపు పేరులను పెట్టిరి. ఇప్పటికిని నవి తురుష్కుల కడ నుండే కలవు. అప్పుడప్పుడు నల్లసముద్రములోని రష్యా రేవులమీద కాల్పుటకు వెళ్లుచుండును.

ఏడ్రియాటిక్ సముద్రములో మాంటినీగ్రినుల రేవగు అంటి వారిమీద కాల్చుటకయి పంపిన ఆస్ట్రియాముల యుద్ధనావలు, ఫ్రెంచి వారి నావలు పోరుటకయి వచ్చుచున్నవనిన వార్తవిని పోలా రేవును పరుగెత్తెను. కాని ఫ్రెంచివారు జంటాయను నొక క్రూయిజరును, ఇంకొక నావను ముంచివేయగలిగిరి. యుద్ధప్రారంభ మయిన పది దినములలో ఆస్ట్రియాసముద్ర వ్యాపార మంతయు ఏడ్రియాటిక్ ముఖద్వారమును (45 మైళ్లు పొడుగు) ఫ్రెంచివారు తమ నావలచే మూసివేయుటచేత అంతరించెను. మధ్యధరాసముద్రములోను, ఆసియా ఖండములోను, ఆస్ట్రేలియాలోను ప్రయాణము చేయుచున్న ఆస్ట్రియా వ్యాపార నావ లన్నియు మిత్రమండలివారికి వశమయ్యెను. ఆస్ట్రియా రేవులు ఫ్రెంచియుద్ధనావల వారికి గుత్తయయ్యెను. ఒక యాస్ట్రియా వ్యాపారనావ ఆస్ట్రియావారు పెట్టియుంచిన గనికి తగిలి 300 మంది ప్రయాణికులతో మునిగిపోయెను. పోలా రేవు మాత్రము బాగుగా కాపాడబడి యుండుటచేత మిగిలిన యుద్ధనావలన్నియు నందు దాగుకొనెను. ఆఫ్రికాలో లేక వ్యాపా యుద్ధమున్న బ్రిటీషువారి గ్లెండో లెన్ అను స్టీమరు కొన్ని ఫిరంగులను దీసికొని హేగెనిస్మాన్ అను పేరుగల జర్మనువారి ఫిరంగినావను ముంచివేసి నావికులను ఖయిదీలనుగా బట్టుకొనెను. పశ్చిమతీరమున డొరెస్సలాము నొద్ద జర్మనువారి సర్వేపడవను ఒక బ్రిటీషుక్రూయిజరు ముంచెను.

అట్లాంటిక్ మహాసముద్రము:

ఈ సముద్రములోనున్న జర్మనువారి కార్లుస్రూ, డ్రెస్‌డెన్ క్రూయిజరులును, వర్తకనావమీద ఫిరంగులు పెట్టుటచే యుద్ధనావగా మారిన క్రోన్‌ప్రిన్సు విలిహెం నావయు బ్రిటీషువర్తక నావలను ముంచుటకయి తిరుగుచుండెను. బ్రిటీషు ఆర్మరు క్రూయిజరు సఫక్కు కొకపర్యాయము కార్లుస్రూ పడెను గాని దాని వేగమధికముగుటవలన తప్పించుకొనెను. తరువాత బ్రిస్టల్ అను ఇంకొక బ్రిటీషు క్రూయిజరుకు మార్గమున కనుపడి త్వరగా పరుగెత్తి రెండవపర్యాయము తప్పించుకొనెను.

ఈ జర్మను క్రూయిజరులకే సముద్రములో కిరోసినాయిలు వగయిరా అందించుచున్న లెడా అను వర్తకనావను సఫక్కు క్రూయిజరు పట్టుకొని ఒక బ్రిటీషు రేవులో నొప్పగించెను. కెయిజరు విలిహెం డర్ గ్రోసీయను 14,000టన్నుల వర్తకనావ యుద్ధనావగా మార్చబడి, యుద్ధము ప్రారంభమయిన రెండుదినములకే అట్లాంటిక్ సముద్రములోనికి జర్మనులచేత పంపబడగా ఇంగ్లండునకవచ్చు నొక బ్రిటీషు చేపలబోటును, కెన్‌ఫుడ్, నైయాంజ నావలను, ఇంకొక వర్తక నావను ముంచివేసెను. ఇచ్చటనుండి ఈ కెయిజరు విలియం డర్ గ్రోసి నావ ఆఫ్రికాతీరముకడ నావలను ముంచుటకయి వెళ్లెను. కేపుట వును నుండివచ్చుచున్న 'గలేషియాను' అను బ్రిటీషు నావలోని మైని కోద్యోగులని, వారి నవుకరుని ఖయిదీలుగా బట్టుకొని, పడవయొక్క కాగితముల నపహరించి, అందుకు రశీదిచ్చి, తీగెలులేని తంత్రీయంత్రము ను చెడగొట్టి "బిడ్డపాపలను స్త్రీలును" ఇందుండుటవలన పడవను ముంచనని చెప్పి కప్తాను గలేషియాను నావను ఇంగ్లండునకు పోనిచ్చెను. తరువాత 'ఖల్వారా' యను బ్రిటీషు నావయొకటి దీనివలనచే ముంచబడెను. ఇంతటితో కెయిజరు విలిహెం డర్ గ్రోసీకి ఆయుష్షా యము నుండినది. బ్రిటీషువారి క్రూయిజరగు హైఫ్లైయర్ యనునది ఒకగంట పోరాడి దీనిని పశ్చిమ ఆఫ్రికాతీరమున రియోడీఓరో వద్ద సముద్రమున కొప్పజెప్పెను. జర్మను నావికోద్యోగులు ఖయిదీలుగా బట్టుకొనబడినను తగిన మర్యాదలు చూపబడిరి.

బాల్టిక్ సముద్రములో రష్యనులవున్న నావలుకొద్ది. జర్మనీ వున్న యుద్ధనావల ముందర నిలువకిరి ఆగవు. తీరాంతరముమీదను, ఆలండుద్వీపములమీదను జర్మనునావలు ఫిరంగులను కాల్చి అప్పు డప్పుడు నష్టముగలిగించినవి. లైటుహౌసులను పడగొట్టినవి. గల్ఫ్ ఆఫ్ ఫిన్లండువరకును వెళ్లిసంచారము చేసి వచ్చినవి.

హెలిగోలాండు బైట్‌లో సముద్రయుద్ధము.

ఆగస్టు 28-వ తేదిన రెండు బ్రిటీషు సబ్మెరయినులు జర్మను నౌకాశ్రయమగు హెలిగోలాండు బైటువద్దకు వెళ్లి, త్రోవతప్పిపోయి అపాయములయి నిలువబడినవానివలె కదలక సముద్రపు వైభాగమున నుండెను. వీనిని రక్షించుటకయి ఫియర్‌లెస్ అను బ్రిటీషు క్రూయిజరు పరుగెత్తుకొనివచ్చుచుండెను. ఈ మాటిని గూడ నిముషములో పట్టుకొనవచ్చునని, జర్మను టార్పెడోబోట్లు, డిస్ట్రాయరులు, క్రూయిజరులు రేవునుండి బయటికి వచ్చెను. బ్రిటీషు నావలు కదల జొచ్చెను. జర్మనులు వెంబడించిరి. ఈ విధముగా వంచి ఎత్తుచేసి జర్మనునావలను వారి కోటలలోని ఫిరంగుల సంరక్షణము నుండి తప్పించి, కమ్మందరు కీసుగాను ఉత్తరసముద్రములోనికి లాగుకొని పోయిరి. జర్మనుల వెనుకకొట్టనుటకయి యిచ్చట బ్రిటీషు డిస్ట్రాయరులు, లైటుక్రూయిజరులు నిశబ్దముగా వ్యూహమును పన్ని సిద్ధముగానుండెను. ఉదయము 8 గంటలకు మంచు కురియుచుండగా, ఏమియును కనబడకపోయినను యుద్ధము ప్రారంభమయ్యెను. జర్మనులు వీరావేశముతో పోరిరి. ఇంగ్లీషువారి అరథూసా డిస్ట్రాయరును జర్మనువారివి రెండు డిస్ట్రాయరులును 50 నిముషములు ముట్టడించి యూపిరాడకుండ చేసెను, ఇతర సహాయమువలన నీ రెండును ముంచివేయబడెను. ఇంగ్లీషువారి లిబర్టీ, లార్టెస్ డిస్ట్రాయరులను జర్మనువారివి ముట్టడించి చీకాకుపరచెను. లార్టెసు నావకు కప్తాను అగు బార్ట్‌లెట్ మీద ఒక షెల్లు పడుటవలన వరిను మృతినొందెను. ఈ నావకు దెబ్బలు పూర్తిగా తగులుట వలన వెనుకకు తగ్గిపోయెను. మరి రెండు జర్మను డిస్ట్రాయరులలో నొకటి ఫిరంగిగుండ్లవలన బొర్లబడి మునిగిపోయెను. రెండవది మునిగిపోయినను నావికులు బ్రిటీషువారివలన రక్షింపబడి ఖయిదీలు

# ఆకాశయుద్ధములు

అక్టోబరు ఎనిమిదవ తేదిన డసల్‌డార్ఫులోని జర్మను జెప్పెలిను కర్మాగారము మీద బాంబులనువేసి బ్రిటిషువైమానికులు అందలి జెప్పెలినులను తగలబెట్టిరి. ఇంతకు ముందాగష్టు 21వ తేదిన, అంట్వెర్పు ఆస్టెండు నగరములమీద జర్మనులు బాంబులను వేసి విధ్వంసించిరి. ప్యారిసు మీద అనేకపర్యాయములు జెప్పెలినులు బాంబులను వేసినట్లు వినుచునే యున్నాము. ఇటీవల ఇంగ్లీషుతీరమున చాలపర్యాయములు బాంబులు వేయబడెను. లండనుమీద సయితము ప్రయోగింపబడినవి. జర్మనీలోని నగరముల మీదను తిరుగుగా మిత్రమండలి వారు బాంబులను ప్రయోగించి నష్టము కలుగజేయు చున్నారు. ఒక నెల క్రిందట కార్ల్స్రూపట్టణ మీవిధముగా నష్టపడినందున కైజరుగారు [illegible] నేయుట కార్ల్స్రూ ప్రజలకు శత్రువిమానములు నష్టము



డసల్ డార్ఫులోని జెప్పెలిను కర్మాగారము మీదను బాంబుల నాంగ్ల వైమానికులు వేయుట

కలుగజేసినందున కనికరపడుచున్నదని తంత్రీవార్త నొసంగియుండిరి. జూ౯ నెల మధ్యమున వార్నెఫోర్డు అను ఆంగ్లవైమానికుడొక జెప్పెలినుమీద నెగిరి నాలుగు బాంబులను వేసి దానిని భస్మముచేసినందుకయి జార్జిచక్రవర్తిగారు విక్టోరియా క్రాసు బిరుదమునొసంగిరి. శత్రుదేశముల హద్దులన్నియు రాత్రింబగళ్లును అనేకవందల విమానములచేత శత్రువిమానములు రాకుండ కావలి కాయబడుచున్నవి. అయినను ఆకాశమార్గము మతి విశాలమయినదగుటచే కొన్ని తప్పించుకొని నష్టము కలుగజేయుచునేయుండును. పెద్ద పెద్ద పట్టణములలో భవనముల శిఖరముల మీదికెక్కి దూరదర్శని యంత్రములను పెట్టుకొని నిరంతరము శత్రువిమానములు వచ్చుచున్నవేమోయని చూచు చుందురు. సెప్టెంబరు 6వ తేదిన రష్యాసైన్యముల మీద నెగురుచున్న యొక జెప్పెలిను భూమిమీద పోజానద్ద కూల్పబడి ప్రయాణికులందరు ఖయిదీలు చేయబడిరి. [illegible] లేనందున విమానబాణములను గురించియు, వివిధ విమాననిర్మాణమును గురించియు, ఈసంచికలో వేరొకచోట వ్రాయబడిన వ్యాసములను ముద్రింపబడిన పటములను చదువరులు చూడవలెను.



టార్పిడో మర




టార్పిడో



## రష్యా జయములు

జనరలు వాన్ క్లక్కు గారి సైన్యపు ఫిరంగులధ్వని ప్యారిసునగరములో వినబడుచుండగా రష్యనులు తూర్పుప్రష్యాను, గలీషియాను పట్టుకొనుటకయి సర్వప్రయత్నములను చేయుచుండిరి. మొట్టమొదట ఆకస్మికముగా ఫ్రాన్సు నోడించి తరువాత రష్యాను మట్టుపెట్టవచ్చునని తలంచిన కెయిజరు గారి యుక్తి లేనియు కొనసాగలేదు. రష్యా తూర్పుప్రష్యాలో ప్రవేశించుటవలన పడమట ఫ్రాంసు ఇంగ్లండులమీది దుడుకు తగ్గెను. జనరలు సాంసనోఫ్ క్రిందను చాలదేశమును రష్యను లాక్రమించుకొనిరి. జర్మనీ వారు ఒకదిక్కునుండి రష్యనుపోలండులో ప్రవేశించుటకును, ఆస్ట్రియా వారు గలీషియానుండి దక్షిణమున రష్యారాష్ట్రీయగు లబ్లినును వాక్రమించుకొని, ఇచ్చట జర్మనులతో గలిసి రష్యను సేనలను నాశము చేయుటకును వ్యూహములు పన్నబడి యుండెను. ఇందుకయి ఆస్ట్రియనులు లబ్లినుమీదికి కదిరిరి. ఆస్ట్రియావారి యత్నము నెరిగియున్న రష్యావారు సైన్యమును రెండుగా విభజించుకొని త్రికోణమువలె వ్యూహమును పన్ని రెండు సేనలును ఆస్ట్రియాలోని గలీషియాకు ముఖ్యపట్టనమగు లెంబర్గులో గలుసుకొనునట్లు సంకల్పించిరి. లెంబర్గులో లబ్లినుకు వెళ్లిన సేనకు సహాయము చేయుటకయి ఆస్ట్రియను లుంచిన మూడు ఆర్మీకోరులును, మూడు అశ్వసేనలును (డివిజనులు) గలవు. వీనిమీద రష్యనులు పడి జనరలు రసీగారి యాధిపత్యము క్రింద లెంబర్గు నాక్రమించుకొనిరి. లెంబర్గు రష్యను పడినదో అప్పుడే

ADMIRAL SIR JOHN JELLICOE



ఆంగ్లయుద్ధనౌకాసైన్యాధిపతి: అడ్మిరల్ సర్ జాన్ జెల్లికో

ADMIRAL LORD FISHER



అడ్మిరల్ లార్డ్ ఫిషర్

REAR ADMIRAL MADDEN



రేర్ అడ్మిరల్ మాడెన్: ఆలోచనసభాధిపతి

REAR ADMIRAL MOORE



రేర్ అడ్మిరల్ మూర్

ADMIRAL SIR HENRY JACKSON



మధ్యధరాసముద్రములోని యుద్ధనౌకాధిపతి: అడ్మిరల్ సర్ హెన్రీజాక్సన్

COMMODORE TYRWITT



కమడోర్ టైర్విట్

REAR ADMIRAL BEATTY



రియర్ అడ్మిరల్ బియాటి

COMMODORE KEYS



కమడోర్ కీస్

GURKHAS MARCHING TO THE FRONT



గూర్ఖాలు రణభూమికి నడచుట

THE DEADLY KUKRI



భయంకరమగు గూర్ఖాల ఖడ్గము

ఒరనుండి దీసి లోకపర్యాయము చూచినపిదప వారి గూర్ఖావారిధర్మము ప్రకారము రక్తమునుకార్చి తీరవలయును. ఒరలో మరిరెండు చిన్న ఖడ్గములును ఉండును.

KILLING THE ENEMY



జర్మనులను గూర్ఖాలు పొడుచుట

GURKHAS ON A DEADLY ERRAND



గూర్ఖాలొక చలికాలపు రాత్రివేళ జర్మనులను చంపుటకయి పోవుచుండుట

CUTTING THE THROATS OF GERMANS WITH THE KUKRI



కుక్రీతో జర్మనుల కంఠములు కోయుట

గిరి. అందుచే జర్మను పటాలములలో 100 కి 90 మంది యిచ్చట కీర్తిశేషులయిరి. వైప్రెసు యుద్ధము అనేక దినములు జరిగినది. ఇంగ్లీషువారు ఫ్రాంసు ఉత్తరతీరమునకు జర్మనులను వెళ్లనీయకుండ ఇనుపగోడలవలె నిలబడిరి. జర్మను లెన్నో వేల సైన్యమును గోలుపోయిరి. ఫ్రెంచి బెల్జియము ఇంగ్లీషు సేనలకును కాలలేనంతనష్టము కలిగెను. కాని జర్మనువారికి కోరిన మీదేకనది కాదు. అటు తూర్పువైపు వారి గ్గ పడలేదు. ప్యారిసు, కాలెయి పట్టణముల వశము కాలేదు. అందుచే కెయిజరు గారికి కలిగిన మనస్సంతాపమునకు మితి లేకపోయెను.

## సముద్ర యుద్ధము

అక్టోబరు కడపటి వారములో బ్రిటీషువారి క్రైటు క్రూయిజరు డర్డనెల్సు నుండి తిరిగివచ్చుచుండగా జోరకు జలసంధిలో ముంచబడినది. జర్మనులు ఐరిషుసముద్రములో ఇష్టమువచ్చినట్లు మందుగుండులను వెదజల్లిరి. వర్తకమార్గములను గనులతో నింపియుండెను. అమెరికా, ఇంగ్లీషువారలకు కొన్ని స్టీమరులు మునిగిపోయెను. ఒక బ్రిటీషు గనికి తగిలి యార్కు అను జర్మను క్రూయిజరు 382 మంది నావికులతో జర్మనీ ఉత్తరయున్న జాహాదేఖార్ వద్ద మునిగిపోయెను.

దక్షిణ అమెరికాలోని చిల్లీదేశమందు కోరోనెల్ వద్ద వ్యాపార నావలను ముంచుచున్న ఆరు జర్మను క్రూయిజరులు స్కార్నహార్స్టు న్యూరెంబర్గు, నైపెజిక్, డ్రెసెన్, లీప్జిగు, డ్రెస్డెన్ అనునవి వానిని వెదకుటకయి వెళ్లిన మాన్ మౌతు, గుడ్ హోపు, గ్లాస్గో అను మూడు బ్రిటిషు క్రూయిజరుల నెదుర్కొని ఒక్కగంట కాలము పోరాడెను. మాన్ మౌతు, గుడ్ హోపు, నావలు మునిగిపోయినవి గ్లాస్గో క్రూయిజరుకు నిప్పంటుకొనినది. అదితప్పించుకొని పారిపోయినది. జర్మను నావలకు కలిగిన నష్టమంతగా గొప్పదికాదు. సముద్రయుద్ధములో జర్మను లింతవరకు గెలిచిన దీయుద్ధమే.



మాన్‌మౌతు గుడ్‌హోపు యుద్ధనావలు తగులబడి మునిగిపోవుట

నవంబరు 8వ తేదిని ఎమ్డెను యుద్ధనావ కీలింగుద్వీపమునొద్ద ఆస్ట్రేలియావారి క్రూయిజరగు సిడ్నీవలన కొట్టింపబడి, ఒడ్డునకు తరిమి వేయబడి, ముంచివేయబడెను. నవంబరు కడపటివారములో జర్మనుల వశమయియున్న జీబ్రుజ్జినగరముపయి ఇంగ్లీషునావలు అనేక దినములు ఫిరంగులను వేసి, సబ్మెరయినులు కట్టబడుచున్న స్థానమును పాడుచేసి, నష్టములేకుండ ఇంగ్లాండునకు తిరిగివెళ్లెను. జర్మనులు వర్తకనావలను సబ్మెరయిను టార్పిడోలచేత ముంచుట ప్రారంభించి లోకమంతటను హాస్యమునకు పాలయిరి.

డిసంబరు 8వ తేదిని దక్షిణ అమెరికాలో అర్జెంటయినా తీరమున ఫాల్కులాండు వద్ద జర్మను క్రూయిజరులు న్యూరెంబర్గు స్కార్నహార్స్టు నైసినా, లీప్జిగ్, అనునవి బ్రిటీషు అడ్మిరలు స్టర్డీగారి నావలచేత ముంచబడినవి. డ్రెస్‌డెన్ నావలు తప్పినవి. కాని ఇంగ్లీషునావలు తిరుముచుండెను. జర్మను అడ్మిరలు తనయిద్దరు పుత్రులతోను ఈ యుద్ధములో నావలతో మునిగి చనిపోయెను. ఈ యుద్ధమునకు అయిదు గంటలు పట్టెను.



జర్మను యుద్ధనావలు ఫాక్లులాండు యుద్ధములో మునిగిపోవుచుండుట

ఇంగ్లీషువారిదాన లేవియు నష్టపడలేదు. డిసంబరు 10_వ తేదిని ఒక బ్రిటిషు జలాంతర్గామి డార్డనెల్సు జలసంధిలో ప్రవేశించి అయిదు పంక్తుల గనులను తప్పించుకొని మెసూదియా అను పెద్ద యుద్ధనావను టార్పిడోవేసి ముంచి తప్పించుకొని దాటి పోయెను. జర్మను క్రూయిజరులును ఇంగ్లండునకు తూర్పుతీరమందున్న స్కార్బరో, హార్ట్లిపూలుమీద ఫిరంగులను గాల్చి డిసంబరు 15_వ తేదిని గొప్పనష్టమును గలిగించెను. 200 మందికి గాయములు తగిలెను. కొంతమంది చచ్చిరి.

## ఆకాశ రంగము

ఫ్రాంసులో నొకరయిలుస్టేషనుమీద జర్మనువిమానమెగురుచుండగా నవంబరు మొదటితేదిని రయిలుబెక్కబోవుచున్న యుండియనులు దానిని కాల్చి నేలగూలంజేసిరి. నవంబరు 8వ తేదిన బెల్జియములోని బ్రూజెసుపట్టణమి మిత్రమండలివారు బాంబులను వేసిరి. కొన్ని పాయిలు చెరువుల సామీప్యమున బడెనుగాని మీద పడలేదు. ఫ్రైబర్గ్ వద్ద రెండు మిత్రమండలివారి విమానములు కొల్పోలిన సహారాపయి బాంబులనువేసి దారిగుండా డాట్ ప్రక్కకు నవంబరు 18_వ తేదిని వెళ్లెను. ఫ్రెంచివారు క్రప్పుకర్మాగారముపై డిసంబరు మొదటివారములో బాంబులను వేసిరి. నష్టమెంత కలిగించిరదియు తెలియలేదు. డిసంబరు 24_వ తేదిని ఇంగ్లండులోని షియర్ నెస్ మీద జర్మనువిమానములు బాంబులను వేయుటకయి రాగా ఇంగ్లీషుపైమానికులు వారిని పారదోలిరి. అయిన జర్మను విమానములు వార్సాపట్టణముపై 40 బాంబులను డిసంబరు 28_వ తేదిని వేసెను. 21 మంది కీడులలో చచ్చిరి. కొన్ని యిండ్లకు నిప్పంటుకొనెను.

## తుర్కీ

జర్మనుల కుట్రలవలన తుర్కీ కారణము లేకుండ, యుద్ధము ప్రకటింపకుండ బ్రెస్లా, గోబెన్ యుద్ధనావలను రష్యావారి నల్లసముద్రపు రేవులమీదికిబంపి కాల్పించి యుద్ధములోనికి దిగెను. ఇంతకు ముందే తుర్కీసైన్యము నంతయు జర్మనుద్యోగియులు తరఫీయతు జేయుచుండిరి. కాన్ స్టాంటునోపిలును బలపఱచిరి. నౌకాశ్రయములలో దగిన యేర్పాటులను జేసిరి. గోబెన్, బ్రెస్లా లలోని జర్మనుద్యోగులను, ఫిరంగులను దీసివేసి ఆనావలను పోర్టురులో గట్టివేయవలసినదనియు, బ్లాక్ సీ రేవులమీద అకారణముగా గాల్చినందునకు సమాధాన మొసంగవలసినదనియు మిత్రమండలివారడిగిరి. తుర్కీ కొన్ని కుంటి సమాధానములను జెప్పెను. ఆలస్యము విషమగునని మిత్రమండలివారి రాయబారులు కాన్ స్టాంటినోపిలునుండి తిరిగివచ్చుట కాజ్ఞాపింపబడిరి. తుర్కీతో దగవునకు ప్రబలమైన కారణములను జూపుచు, యుద్ధారంభమునుండియు జర్మనీవారి చేతిలోపడి ఎట్లు దుర్మార్గమునకు దిగినదియు మన రాజప్రతినిధిగారు తేటతెల్లముగా వెల్లడించిరి. మహమ్మదీయుల తీర్థప్రదేశములు మక్కా, మెడీనా మొదలగునవి ఇంగ్లీషువారిచే నతి పవిత్రముతో గాపాడబడునని తెలుపబడెను. ఇండియాలోని మహమ్మదీయులు బ్రిటిషు సింహాసనము మీద దమకుగల రాజభక్తిని దెలుపుచు వేలకొలది సభలను జేసిరి. ఇండియాలో జర్మనులనుకొనిన కొట్లాటలొందరులును ముసల్మానులవలన గలుగక వారి నిరుపమాన రాజభక్తియే వెల్లడియయ్యెను. అనేకవేల మహమ్మదీయులిప్పటికే పశ్చిమరంగమున బోరుచునే యుండిరిగదా! నిజాముగారును తమ రాజభక్తిని దృఢముగా వెల్లడించి, మహమ్మదీయులను, తమ ప్రజలను శాంతివహించి, రాజభక్తి కలిగియుండవలసినదని ప్రకటించిరి.

ఇంగ్లీషువారి యుద్ధనావ . మైనర్వా యనునది ఏషియాలోని అకాబా కోటలపై గాల్చి సైనికులను జంపెను. కిరోసినాయిలు చెరువులకు నిప్పంటుకొనెను. డార్డనెల్సు జలసంధిమీద ఇంగ్లీషువారి నావలు ఫిరంగులను విడిచెను. కోటలలోని ఫిరంగులు యుద్ధనావలకు తగులునంత దూరము పోవని గానంబడెను. ఈజిప్టులో మార్షల్ లా ప్రకటింపబడెను. పాలనయంత్రము సైనికాధికారుల చేతులలో నుండెను. ఈజిప్టులోని మహమ్మదీయ నాయకులందరును రాజభక్తి గలవారమని సేనానాయకులగు జనరలు మాక్సువెల్ గారి కడ్డకువచ్చి చెప్పిపోయిరి. ఈజిప్టులోగాని సరిహద్దులలోగాని జరుగు యుద్ధపు వ్యయముల నింగ్లీషువారే భరించెదరనియు, ఈజిప్టు సేనలు తురుష్కులమీద పోరుటకు తీసికొని పోబడవనియు, ఈజిప్టియనులు శాంతము వహించి యుండిన జాలునని యును జనరలు మాక్సువెల్ గారు ప్రకటించిరి.

ఇండియానుండి అరేబియా మీదికి పంపబడిన హైందవసేన పరిష్యను గల్ఫులో షాటెలుఆరబ్ నదీ ముఖమునను న్న ఫావోను బట్టుకొనెను. తరువాత బాస్రానగరము నాక్రమించుకొనబడెను. ఈనగరమునకుట్టు నున్న గ్రామములు అత్యంత ఐశ్వర్యవంతమయినవి. అరబ్బులు తురుష్కులు అతిసాహసముతో పోరిరిగాని భారతీయులముందు చాలకపోయిరి. ఈ ప్రాంత్యదేశమంతయు బ్రిటీషువారి అధీనదేశమయినదని బ్రిటిషు జనరలు ప్రకటించి, పన్నులను వసూలుచేసి దేశము నేలుచున్నారు. ఈసైన్యము పేరునయ్యరు గ్రామమును పట్టుకొని కేపు బేసిల్ మాండెపునకు తూర్పుననున్న కోటలను వశముచేసికొనెను. డిసంబరు నెలలో టైగ్రిస్, యూఫ్రటీసునదులు సంగమించుస్థానముందున్న కుర్నానగరమును గాయుచున్న అరబ్బులను, తురుష్కులను పారదోలి దానిని ఆంగ్లోహైందవసేన ఆక్రమించుకొనెను.

THE CHARGE OF THE BENGAL LANCERS AGAINST THE GERMANS



బెంగాలు లాంసరులు జర్మనులపైకి ఉరుకుట

CHARGING ON FOOT WITH THE LANCE



జర్మను కందకములను బెంగాలు లాంసరులు పట్టుకొనఁ బోవుట

HAND TO HAND FIGHTING



కందకములో జర్మనులను తుపాకులతో పొడుచుట

THE TRENCH CAPTURED



కందకములోని శత్రువుల నందరిని జంపి దానిని వశము చేసికొనినట్లు చాటుకొనుట.

FIELD MARSHAL VON DER GOLTZ



జర్మనుఫీల్డుమార్షల్ వాన్ డర్ గోల్జు, తురుష్క సర్వసేనాధిపతి

THE EX KHEDIVE OF EGYPT



పదభ్రష్టుడయిన ఈజిప్టు పాలకుడు

SULTAN HUSSAIN



ప్రస్తుత ఈజిప్టు పాలకుడు, సుల్తాన్ హుస్సేన్

ఈ దారుణ సంగ్రామమునందెట్టి ఫలమును ప్రయోజనముగ నిర్ణయించుట దుస్తరము.

జయాపజయములు సైన్యబలమును నౌకాబలమును విమానబలమును ననుసరించియు కాక ముఖ్యముగ ద్రవ్యబలము ననుసరించి యుండును. యుద్ధస్థితిని నిర్ణయించుటకుఁ గాను సైన్యబలమును, నౌకాబలమును, విమానబలమును, ద్రవ్యబలమును, ధర్మబలమును మూడు ఖండములందుఁ గల రంగములకు సమన్వయము చేయవలయును. ప్రతిభావంతులైన సేనాధ్యక్షులకు నయితే యిది యలవిగాని పని యని గ్రహించినపుడు సామాన్యులమాట వేరుగ చెప్పవలసిన పని లేదు. ధీమంతులు సకలబలములను సమన్వయము చేసి యుద్ధస్థితిని నిర్ణయింపవలసి యుందురు. యుద్ధవార్తలందు మనము ప్రతిదినము చదివెడి జయాపజయముల వార్తలవలన యుద్ధస్థితిని గ్రహించుటకు వీలుండును కాని యుద్ధఫలమును నిర్ణయించుటకు వీలుండదు. యుద్ధఫలమును ప్రస్థానక్రమముయొక్క సకలమైన సాధక బాధకములను సమన్వయము చేసి నిరూపించుట ప్రయోజనకరము.



ఆగురు బ్రిటిషు సైనికులు జర్మను కందకములో ప్రవేశించుచున్నారు

## జర్మనుల తంత్రము

జర్మనుల యుద్ధ ప్రస్థానక్రమము మొదట ఫ్రాన్సును పిమ్మట రుష్యాను తదనంతరము ఇంగ్లాండును నోడించుట యనియు నీ పని యతిశీఘ్రముగ ముగియవలయు ననియు జర్మను యుద్ధతంత్రజ్ఞుఁడు బర్న్‌హార్డి గారు రచియించిన గ్రంథమునందు వివరముగ తెలుపఁబడినది. ఆ వ్యూహమునందు జర్మనుల మనోరథములు విఫలములైన దని ధ్రువపడినది. జర్మనీ బెల్జియము నోడించి యా దేశము నాక్రమించుకొనినది. ఫ్రాన్సునందును రుష్యాయందును కొంతభాగము నాక్రమించుకొనఁజాలినది. కాని ఫ్రాన్సు, రుష్యా, ఇంగ్లాండులను నోడింపఁజాలకున్నది. జర్మనులు తమ మొదటి సంకల్పము నెఱవేఱదని గ్రహించినపుడు క్రొత్త వ్యూహమును పన్న నారంభించిరి. యుద్ధ మంతయు శత్రువుల దేశములందు జరుగవలయు ననియు జర్మను దేశము యుద్ధోపద్రవమునకు లోను గాకుండవలయు ననియు జర్మనులు తలపెట్టిరి. ఈ పద్ధతి నవలంబించుటవలన జర్మనులకు యుద్ధము చిరకాలము చేయుటకు నవకాశము కలుగును. జర్మను దేశమునందు యథాప్రకారము పంటలు పరిశ్రమలు సాగుటకు వీలుండును. అన్ని ప్రక్కలను జర్మనికి సముద్రాగమన మార్గములు బంధింపఁబడినవి. దీనికితోడు యుద్ధములు జర్మను భూములందు జరిగిన జర్మనులు బ్రతుకుటకు వేరు త్రోవ లేకుండును. జర్మను లీ రహస్యమును గ్రహించి తమ భూమిని యుద్ధోపద్రవమునుండి కాపాడుటకై విశేషమైన నష్టమును భరించుచున్నారు. జర్మనులు శత్రువుల దేశములందు కందకములను త్రవ్వి స్థిరవాసములను నిర్మించి శత్రువు లాకస్మికముగ మీఁద పడకుండుటకు తగిన సదుపాయములను కల్పించి సమయము దొరకినపుడు శత్రువులపైఁ బడుచున్నారు. కాలహరణము గాకుండుట జర్మనుల యుద్ధతంత్రమునందు మొదటి యంశము. తప్పనిసరిగ కాలహరణమైనపుడు యుద్ధములను శత్రువుల దేశములందు చేయుట రెండవ యంశము.

## మిత్రమండలి యుద్ధతంత్రము

మిత్రమండలి యుద్ధతంత్రములో మొదటి యంశము శత్రువులను తమ దేశమునుండి వెడలఁగొట్టుటయు నది సాధ్యము గానపుడు కాలహరణము చేయుటయునై యున్నది. జర్మనులు తమ ఫ్రానికను త్రిప్పించుటకు పూర్వరంగమునుండి పశ్చిమరంగమునకును పశ్చిమరంగమునుండి పూర్వరంగమునకును నవసరమును బట్టి మారుచుందురు. మిత్రమండలివారు జర్మనుల ఫ్రానికను పాడుచేయుటకై పూర్వరంగమునందును పశ్చిమరంగమునందును జర్మనుల సైన్యమును పెడత్రోవలు పట్టించుచుందురు. మిత్రమండలి నిష్కారణముగ సైన్యవినాశనమును అంగీకరింపదు. ఈ విషయమును గమనించినవారల కుభయపక్షముల సైన్యములు ముందునకు వెనుకకు పోవుటకుఁ గల కారణంబులు విదితములు. ఆ కారణంబుల ననుసరించి యుద్ధప్రస్థాన క్రమం

బును విలోకించినచో నుభయపక్షముల జయాపజయములు, బలాబలములు, బాధనష్టములు సుబోధ్యము లగుచున్నవి.

## ముట్టడి యుద్ధము

మిత్రమండలి సైన్యములు ఫ్రాన్సు బెల్జియము దేశములలోని కొన్ని ప్రదేశములందు జర్మను సైన్యములను కొన్ని వందల గజములు ముందునకు నెట్టిన వనియును, మరికొన్ని ప్రదేశములందు జర్మను సైన్యములు మిత్రమండలి సైన్యములను వెనుకకు నెట్టిన వనియును వార్తల సారాంశమై యున్నది. కాని పడమటి రంగమునందు ముఖ్యముగ గమనింపదగిన విషయ మొకటి గలదు. ఆల్సేసునందు ఫ్రెంచి సైన్యములు క్రమక్రమముగ చొరబడుచున్నవి. ఆ మార్గమునను ఫ్రెంచి సైన్య నివహములు జర్మను దేశమునందు చొరబడు వనియును జర్మను



గాయపడిన ఫ్రెంచి సైనికుని హైందవ సైనికుండు శిబిరమునకు తీసికొనిపోవుట

సామ్రాజ్యాంతర్భాగమైన బవేరియాయందు కలవరము గలుగుచున్నటులను వదంతి. జర్మనులు మిత్రమండలి సైన్యములను కలై, ఈప్రెస్, సిస్సోన్సు మార్గములనుండి గాక ఫ్రాన్సు దేశమునందలి ఆగ్నేయ దిశనుండి భేదింప ప్రయత్నించుటకై 20,00,000 సైన్యనివహముల నాయత్తపఱచుచున్నటులు యుద్ధకోవిదులు ఊహించుచున్నారు.

## రుష్యనులు వెనుకకు మరలుట

పడమటి రంగపు స్థితి యిటు లుండఁగా, తూర్పు రంగపు స్థితి యును సంతోషముగ నున్నటు లూహింపఁదగియున్నది. తూర్పు ప్రష్యాయందు రుష్యనుల పురోగమనమునకు జర్మను సైన్యములవలన నిరోధ మేర్పడినటులు రుష్యనుల ప్రకటనలవలన స్పష్ట మగుచున్నది. టిల్సిటునకు పోయిన రుష్యను సైన్యములు విపులములైన జర్మను సైన్యనివహముల యొత్తిడివలన వెనుకకు తగ్గుచున్నటులు తెలియుచున్నది. జర్మను చక్రవర్తి సేనాధ్యక్షుఁడు హిండెనుబర్గ్ ఇక్ష్టకెబర్గునందుఁ గూడ యుద్ధప్రస్థానక్రమమును రూపించు నటులు తెలియుచున్నది. తూర్పు ప్రష్యా ప్రాంతములందు రుష్యనులు యుద్ధారంభమునందువలె వెనుకకు పడవలసివచ్చునటులు తోఁచుచున్నది. పోలాండునందు జర్మను రుష్యను సైన్యము లెప్పటి స్థితియం దున్నవి.

## గలీషియాయందు రుష్యనుల గెలుపు

కార్పేథియను కనుమలందు రుష్యనులకు విజయమును ఆస్ట్రియనులకు పరాజయమును గలుగుచున్నది. తూర్పురంగమునందు పదునైదు దినములలో 40,000 మంది జర్మను ఆస్ట్రియను సైనికులు నిహతు లైనటులు దృష్టాంతము గలదు. తురుష్కులు ఆర్మీనియా, పర్షియా, కాకసస్ ప్రాంతములందు పరాజితు లగుచున్నటులు వార్తలవలన తెలియుచున్నది. నల్ల సముద్రమునందును డార్డనెల్సునందును మిత్రమండలి యుద్ధనౌకలు తురుష్కుల నావలను సైన్యములను పదార్థములను నాశనము చేయుచున్నటులు తెలియుచున్నది. ఆఫ్రికాయందు రాజద్రోహులు పలు రైరి. జర్మనుల దేశమునందు ఆంగ్ల సైనికులు చొరబడుచున్నారు. సర్వియనుల వృత్తాంత మిటీవల నేమియు వినవచ్చుట లేదు. మొత్తముమీద యుద్ధ ప్రస్థాన క్రమము భూమియందు మిత్రమండలి కనుకూలముగ నున్న దని గ్రాహ్యమగుచున్నది. ముట్టడి యుద్ధ మారంభమైన తరువాత యుద్ధ ప్రస్థాన క్రమమునందు నూతన విధాన మేర్పడినది. విచిత్రములైన వ్యూహములను పన్నుటకుఁ గాని గొప్ప విజయములను పొందుటకుఁ గాని యవకాశములు తగ్గినవి. ఉభయ పక్షముల సైన్యము లొండొరులను మార్కొనుటకు కందకములు నడుమ నున్నవి. గుండ్లవానతో కందకములను నాశనము చేసినఁ గాని సైన్యనివహంబులకొక గజమైనను ముందునకు పోవుటకు వీలు గలుగుట లేదు. అందువలననె యీ యుద్ధము ముట్టడి యుద్ధముగ పరిణమించుచున్నది.

## ఫ్రాన్సు

ఫ్రెంచి సేనాధ్యక్షుఁడు జోఫ్రే మార్ను యుద్ధము ముగిసిన తరువాత సైన్య నివహంబులను సిద్ధము చేయుచుండెను. జనవరి మొదట మ్యూజునదీతీరమునం దున్న స్టీకావాచియొద్ద గుండ్ల వానను కురిపించి జర్మనులను పరాసు లోడించిరి. జనవరియం దంతటను సిస్సోన్సువద్దను ఈప్రెసువద్దను నుభయ పక్షముల సైన్యములు ముందు వెనుకలకు పోవుచుండినవి. జర్మను చక్రవర్తి రణరంగమునకు స్వయముగ 17-వ తేదిని వచ్చియుండెను. సిస్సోన్సువద్ద జర్మనులు 1,000 మంది పరాసు సైనికులను పట్టుకొనిరి. వానలు కురి

ఆస్ట్రియనులు సర్వియా రాజధాని యైన బెల్‌గ్రేడును నిప్పుగుండ్లతో కాల్చిరి. సర్వియనులు సెమిలినును కాల్చిరి.

## రుష్యను సైన్యముల విధి

తూర్పు రంగమునందు రుష్యనులు నెఱవేర్చవలసిన యుద్ధతంత్రము పడమటి రంగమునందలి జర్మనుల యొత్తిడిని తగ్గించుటయై యున్నది. ఆ భారమును నిర్వహించుటకు రుష్యను బలములు చాలియున్నవి. సంఖ్యయందు రుష్యను బలములు జర్మను బలములతో తులతూఁగఁగలవు. కాని యుద్ధసన్నాహములందు తులదూఁగఁజాలవు. ఆంగ్ల ఫ్రెంచి సైన్యములు యుద్ధోపకరణములందు సమానత్వము వహించినను, సంఖ్యలయందు సమానత్వము వహింపఁజాలవు. జర్మను యుద్ధతంత్రజ్ఞుల కీవిషయము తెలిసియున్నది. కావుననే వారు తూర్పు సరిహద్దునుండి పడమటికిని పడమటి సరిహద్దునుండి తూర్పునకును నతిత్వరముగ సైన్యనివహంబులను గొనిపోవుటకు చాలిన రైలు మార్గములను దేశమునం దంతటను వలవలె నిర్మించిరి. ఇందువలన నవసరమును బట్టి 20 లక్షల మంది సైనికులు తూర్పునుండి పడమటికి పడమటినుండి తూర్పునకు యుద్ధ మారంభ మైన పిమ్మట రెండు మూడు సారులు మార్చఁబడిరి. పడమట జర్మనుల యొత్తిడిని తగ్గించుటకై రుష్యనులు తూర్పుప్రష్యాయందును దక్షిణమున హంగరీయందును కార్పాసునందును ప్రవేశించిరి. ఈ వ్యూహమునకు ప్రతివ్యూహముగ రుష్యన్ పోలండునందు జర్మను సైన్యములు స్థిరముగ నిలిచినవి. పోలాండు ప్రష్యకును గలీషియాకును నడుమ నున్నది. పోలాండులోని జర్మను సైన్యములు క్రొత్త సైన్యముల చేరికవలన బలవత్తరము లై యుత్తరమున ప్రష్యకును దక్షిణమున గలీషియాకును వ్యాపించి రుష్యనుల యుద్ధప్రస్థానమునకు విఘ్నము కల్పింపఁగలవు.

## పోలాండు ప్రస్థానము

వర్షాకాలమునందును శీతకాలమునందును తూర్పురంగమున మార్గములు బురదతో నిండియుండుటవలన విశేషసంఖ్యాకంబులైన సైన్యనివహంబులు నడచుటకు వీలు లేదు. వైశాఖ మాసాంతరము వీలు కలదు. ఆ సదుపాయమును బట్టి రుష్యనులు మార్చి యేప్రిలు మాసములలో తూర్పు ప్రష్యాయందును గలీషియాయందును చొఱఁబడ నారంభించిరి. మార్చి మొదటి భాగమున రుష్యనులు పోలాండునందు ప్రాస్నిష్ణిజ్నావా ప్రాంతములందు గెలుపొంది జర్మను ఖైదీలను యుద్ధసామగ్రిని పట్టుకొనిరి. పోలాండులో నీయన ప్రాంతములందు జయాపజయములు రెంటికిని సమానముగ నున్న వని చెప్పవచ్చును. జూను నెల యారంభమునుండియు యుద్ధప్రస్థానము జర్మనుల కనుకూలముగ నున్నట్లు వార్తలవలన తెలియుచున్నది. జర్మనులు పడమటి రంగమునుండి తూర్పురంగమునకు 20 లక్షల మంది సైనికులను మార్చుటయే యీ యనుకూల్యమునకు కారణము.



గలీషియాలో ఒక రష్యను దొరను నౌకరు నరుకుచున్నాడు

## ఆస్ట్రియనుల దుర్గతి

గలీషియా యుద్ధరంగము మేయి చివరవఱకు రుష్యనుల కత్యంతానుకూలముగ నున్నది. ఆస్ట్రియాకు జెందిన గలీషియా రుష్యాకు దక్షిణమునం దున్నది. ఆ దేశము నడుమ కార్పేథియను పర్వతములు గలవు. ఆ పర్వతములను దాటినప్పుడు హంగరీదేశము స్వాధీనము కాఁగలదు. ఆ కొండల కుత్తరమున సుబలరక్షితము లైన లెంబర్గు క్రాకో ప్రెమిసిలు కోటలు గలవు. కొండలందు కూడ సురక్షితము లైన కనుములు గలవు. రుష్యనులు కోటలను కనుములను స్వాధీనము చేసికొనినఁ గాని హంగరీలో చొఱఁబడుట సాధ్యము కాదు. ప్రెమిసిలు ముట్టడిని రుష్యనులు యుద్ధారంభమునం దారంభించిరి. మార్చి 23వ తేదిని పట్టణము రుష్యనులకు లోఁబడినది. లక్షమంది ఖయిదీలు ఫిరంగులు విశేషమైన యుద్ధద్రవ్యములు రుష్యనులకు దక్కినవి. మార్చి 25వ తేదిని హంగరీయందలి స్టాక్నినయొద్ద రుష్యనులు గెలిచిరి. కార్పేథియనులలోని దూక్లా, ఉస్జోకు, లప్కోవు మొదలగు కనుములు రుష్యనుల వశ మైనవి. ఏప్రిలు మాసమునందు రుష్యనులు తిరిగి యాస్ట్రియనుల నోడించి హంగరీదండయాత్ర కుపక్రమించిరి. హంగేరియనులు భయకంపితులై వెనుకకు మరలిరి. జర్మనులు వెంటనే సహాయము చేయకున్న, వారు సంధిచేసికొనెద రను వదంతి కలిగినది. వియన్న బెర్లిను నగరములందు విభ్రాంతి కలిగినది. రుష్యా చక్రవర్తి గలీషియాకు వచ్చి సేనానాయకులను సైనికులను సంస్తుతించి వారిని సన్మానించెను. మేయి నెల మధ్యభాగమువఱకును రుష్యనుల విజయయాత్ర కొనసాగుచుండెను.

## జర్మనుల నూతనప్రస్థానము

అప్పుడు జర్మను యుద్ధమంత్రులు కార్యాలోచన కుపక్రమించిరి; పడమటి రంగమునుండి సైన్యములను తూర్పు రంగమునకు మార్చిరి. మూఁడు లక్షల సైనికులను, అమిత మైన యుద్ధసామగ్రిని, మహాశక్తిము లైన శతఘ్నులను జర్మనులు తూర్పురంగమునందు ప్రవేశపెట్టిరి.

జూను నెల మొదట వారు బాల్టికు సముద్రతీరమునం దున్న లిబా పట్టణమును వశపఱచుకొనిరి; వార్సాకు దక్షిణదిశ నుండి రుష్యాదేశమునందు చొఱబడి రుష్యనుల యుత్తర దక్షిణ సైన్యములను చీలదీసి యోడించుటకై మహావ్యూహమును పన్నిరి. జర్మనుల యొత్తిడికి తాళఁజాలక రుష్యనులు వెనుకఁబడ నారంభించిరి; వార్సాక్షేత్రములనుండి వెనుకకు పోయిరి. క్రమముగ లెంబర్గు పట్టణము తిరిగి యాస్ట్రియనుల వశమైనది. పోలండునందును గలీషియాయందును జర్మనుల బలము హెచ్చినది.

## మిత్రమండలి యుద్ధతంత్రము

కాని, యీ విజయఫలమును నిర్ణయించుటకు తగిన సాధనములు లేవు. 1870-వ సంవత్సరమున జరిగిన ఫ్రెంచి జర్మను రాజ్యముల యుద్ధములందు ఫ్రెంచి సైన్యములు దుర్గములం దుండినవి. వేలువేలుగ దుర్గములు ముట్టడింపఁబడి పట్టుకొనఁబడినవి. ఫ్రెంచి సైనికులను జర్మనులు ఖయిదీలుగ చేసిరి. ఆ యనుభవమును ఫ్రెంచి సేనాధ్యక్షుఁడు మఱవలేదు. సెప్టెంబరు మాసమునందు జర్మను సైన్యములు ఫ్రాన్సుదేశముపై దాడి వెడలినప్పుడు సేనాధిపతి కోటలలోని సైనికులకు కోటలను వదలి వెనుకకు పోవునట్లు ఉత్తరువు చేసెను. మాఱు కోట మార్గమీ పద్ధతి నవలంబింపకుండిన యెడల ఫ్రెంచి సైన్యమునకు విశేషమైన నష్టము కలిగెడిది. జర్మను సైన్యములకు చిక్కుఁబడక ఫ్రెంచి సైన్యములు క్రమక్రమముగ వెనుకకు పడినప్పుడు జర్మను సేనాధ్యక్షుఁడైన వాన్ క్లక్కుగారి యుద్ధతంత్రము పారలేదు; జర్మనులు పార్యిసును పట్టుకొను నిచ్ఛను నిరాశ చేసికొని వెనుకకు మరలిరి. సైన్యసంయోగమువలన బలమును, విభాగమువలన దౌర్బల్యమును కలుగునను సిద్ధాంతము సర్వజనవిదితము. గలీషియా ప్రస్తావమునందు రుష్యా సేనాధ్యక్షుఁడు నికోలసు ప్రభువు సైన్యముల ప్రతిభకై బలమును కోల్పోక సైన్యసంయోగమునకు భంగము రాకుండుటకై సైన్యములను వెనుకకు పోన నాజ్ఞాపించి నట్లు యుద్ధతంత్రజ్ఞులు తలఁచుచున్నారు. ఇంతవఱకును రుష్యను సైన్యములను భేదించుటకు జర్మనులకు సాధ్యము కాలేదు. గలీషియా దండయాత్రయందు జర్మనులకు జయము కలిగినను విశేషమైన నష్టము కూడ కలిగిన దని వార్తలవలన తెలియుచున్నది. రెండు రంగములందును నీ విధముగ విశేషసంఖ్యాకు లగు జర్మను సైనికులను వినాశనముపాలు చేసి విజయమునకై కాలహరణమును నమ్మియుండుట మిత్రమండలివారి యుద్ధవ్యూహతంత్ర మని వారి పక్షపు యుద్ధకార్యాభిజ్ఞులు తలంచుచున్నారు. గలీషియాయందు జర్మనుల విజయయాత్రకు ముఖ్యకారణము వారికి గల ఘనమ్ములైన యుద్ధసామగ్రులే. రుష్యనులు చాలినన్ని యుద్ధపరికరములు లేక వెనుకకు మరలిరి. ఈ యుద్ధపరికరములు రుష్యాలో చాలినంత చేయుటకు వీలుపడలేదు. ఇంగ్లండు, ఫ్రాంసు, ఇటలీలనుండి పంపుటకు దార్డినల్సు మార్గములను తురుష్కులు మూసివేసిరి. బాల్టికు సముద్రము జర్మనుల వశమందున్నది. అమెరికాలో కొని జపాను తీరమునకు పంపి, వ్లాడివాస్టకునుండి 10,000 మైళ్లదూరము రష్యా సైబీరియా రయిలుమీఁద తెప్పించుచున్నారు. జపాను నుండి కొనవలయు, ననిన నింతదూరము రయిలుమీఁద పంపవలసినదే. ఇచ్చట ముద్రింపఁబడిన పటమును చూడఁగలరు. రుష్యను లింకను కొన్ని ప్రాంతములందు వెనుకకు పోవుచున్నారు. ఏప్రిలు మేయి నెలలయందు జర్మనులు విషవాయువులను విషద్రవములను ప్రయోగింప నారంభించిరి. ఇవి కూడ రుష్యనుల పరాజయమునకు కారణములైనవి.




## పశ్చిమ రంగము

పడమటి రంగమునందు యుద్ధక్రమము సంపూర్ణముగ ముట్టడి యుద్ధమునకు మాఱినది. జర్మనుల కందకములను మిత్రమండలియు మిత్రమండలి కందకములను జర్మనులును నాక్రమించుకొనుటచే విజయమునకు మూల మైనది. పడమటి రంగమునందు లిల్లీ కోట




లిల్లీకోట

మైనది. లిల్లీకి నెక్కు రైలు మార్గములు పాటలు గలవు. దాని యాక్రమణమువలన జర్మనుల కనేకసదుపాయములు కలిగినవి. మిత్రమండలికిని కలుగగలవు. సర్ జాన్ ఫ్రెంచి లిల్లీ నాక్రమించుటకై ప్రయత్నించెను. ఈయన కాలువలో నారంభ మైన ప్రస్థానక్రమము న్యూషాపలెలో నంతము నొందినది. న్యూషాపలెయొద్ద మిత్రమండలికి విజయము కలిగినను, జర్మనుల దూరదృష్టిగలవను సేనానాయకుని విలంబమువలనను లిల్లీ పట్టుపడ లేదు. ఈసను, న్యూషాపలె, 60-వ నెంబరు కొండ, డిక్స్మూడు మొదలగు ప్రదేశములందు ముట్టడి యుద్ధములు జరిగినవి. బెల్జియను లాంగ్లేయుల కీ యుద్ధములందు తోడ్పడుచుండిరి.



కందకములందుండి యింటికి ఉత్తరము వ్రాయుట

### పరాసులు మెల్లగా ముందునకు పోవుట

ఫ్రెంచివారు అర్రాసు, సాంక్వెయిను, అర్గాయిన్, అల్సేసు, లోరెయిన్, వాస్జెసు, సెయింటు మార్బి మొదలగు ప్రదేశములందు క్రమ క్రమముగ విజయములను పొందుచుండిరి. ఫ్రెంచి సేనాధ్యక్షుడు జోఫరు యుద్ధతంత్రజ్ఞుడు. ఆయన వర్తమాన సంగ్రామమునందు క్రొత్త యుక్తు నెత్తెను. ఆయన యనవసరముగ తన సైనికుల నాశనమున కొప్పుకొనడు; నెమ్మదిగ శత్రుసైన్యమును నాశనము చేయుటకు యత్నించును. ఈ యుద్ధతంత్రము ఫ్రాన్సును రక్షించినది. గంటకు రెండు లక్షల షెల్లుల నంతున ప్రయోగించెడి సామర్థ్యము కలుగనంతవరకు శత్రుసైన్యముపై బడుట కవకాశము లేదని జోఫరు మతము. ఫ్రాన్సుదేశమునుండి జర్మనులు నెమ్మదిగ నెట్టబడుచున్నారు. అల్సేసు లొరెయిను ప్రాంతములందు పరాసులు నెమ్మదిగ జర్మను దేశములో చొరబడుచున్నారు. జర్మనులు తిరిగి కలెయి మార్గమున ప్యారిసును సమీపించుటకు యత్నించి విఫలమనోరథు లైరి. ఆ సమయమునందు జర్మను చక్రవర్తి స్వయముగ నాయకత్వము వహించి సేనలను విజయమునకు పురికొలిపెను. మే జూన్ మాసములందు హంగరీదేశమునకు సిద్ధముగ నున్న ముప్పును తప్పించుటకై జర్మను బలములలో విశేష భాగము పడమటి రంగమునుండి తూర్పురంగమునకు మరల్పబడినది. ఆ మార్పువలన ఫ్రాన్సునందు జర్మను సైన్యములకు బలము తగ్గి పరాజయమును, తూర్పు రంగమునందు బలము హెచ్చి విజయమును కలిగినవి. జూను మాస మంతమువఱకును పడమటి రంగమునందలి కందకములను స్వాధీనపఱచుకొని ముందునకు మెల్లగా పోవుటయే మిత్రమండలి ప్రస్థానక్రమమై యున్నది.



ఒక రష్యను సైనికుడు జర్మను కందకములో చేసిన వధ

## తుర్కీ

### రుష్యనుల విజయము

కాకససు ప్రాంతములందలి తుర్కాయి పరిశాల్యమును ఆక్రమించి మిరాము గ్రామములను రుష్యనులు వశపఱచుకొని 41,300మంది ఖైదీలను ఫిరంగులను పట్టుకొనిరి. కాకోస్లాము ఎనిక్సై అక్కనెంబల దగ్గఱ రుష్యనులు సంపూర్ణముగ తురుష్కుల నోడించిరి. పిదప మొద్ద తురుష్కు లోడింపఁబడిరి. టాబ్రిజ్ సాంగ్ల నేసలు వశపఱచుకొనినవి. ముష్కాతు మశెరావద్ద బ్రిటీషు సైనికులు తురుష్కుల నోడించిరి. హార్డింజి ప్రభువు పారశీక సంయుక్తాగ్రఖదమునకు పోయి బస్రా కోటామొర మొదలగు స్థలములను సందర్శించెను. రుష్యనులు ట్రెబిజాండును వశపఱచుకొనిరి. డార్డెనెల్సు జలసంధిని వశపఱచుకొని కాన్‌స్టాంటినోపిలును స్వాధీనపఱచుకొనుటకై మిత్రమండలి ప్రయత్నించుచున్నది. అప్పటి మందుగనులు తీసి వేయఁబడుచున్నవి.



డార్డెనెల్సు ముట్టడి

తుర్కీ దండయాత్రయందు మంచి ప్రయోజనము కలదు. తురుష్కుల రాజధాని యైన కాన్‌స్టాంటినోపిలును ముట్టడించుటకై మిత్రమండలి చేయు ప్రయత్నము తురుష్కుల సైన్యమును యూరప్ ప్రాంతమునుండియు ఆసియాభాగములనుండియు స్వదేశసంరక్షణార్థమై మరల్చుచున్నది. తురుష్కుల సహాయమునకై జర్మను సైన్యమునందు విభాగ మేర్పడుచున్నది. డార్డెనెల్సు జలసంధియు బాస్ఫరసు జలసంధియు స్వాధీన మైనపుడు రుష్యా దేశపు సంపదలు వెలుపలకు టకును రుష్యాకు యుద్ధసామగ్రి శీఘ్రముగ చేరుటకును వీ లేర్పడును. అన్ని కారణములకంటె ముఖ్య మైనది బాల్కను రాష్ట్రములందు మిత్రమండలి ప్రతిష్ఠ హెచ్చి సంశయావస్థయం దున్న బాల్కను రాజ్యములు మిత్రమండలి పక్షమున చేరవచ్చును. ఈ కార్యసిద్ధికై నల్లసముద్రమునుండి రుష్యనులును డార్డెనెల్సునుండి యాంగ్ల ఫ్రెంచి సైన్యములును ప్రయత్నించుచున్నారు.

మార్చియం దాంగ్ల ఫ్రెంచి నౌకలు డార్డెనెల్సునుండి విస్ఫోటగుండ్లను ప్రయోగింప నారంభించినవి. ఎలిజబెత్తు యుద్ధనౌకనుండి పెద్ద షెల్లులు డార్డెనెల్సు ముఖద్వారమునం దున్న కిల్లుబహారు, కాంకతేపి, సుల్తాను, మెజ్జి, కోపి, నగర కోటలపై ప్రయోగింపఁబడి కోటలు నాశనము చేయఁబడినవి. ఆంగ్ల జలాంతర్గాములును యుద్ధనౌకలు డార్డెనెల్సునందు చొఱఁబడి తురుష్కులకు భయము పుట్టించినవి. మెయి నెల మొదటి వారమునందు బ్రిటీషు సైన్యములు గ్యాలిపోలియందును ఫ్రెంచి సైన్యములు ఆసియాకియందును దిగి తురుష్కులను పారఁద్రోల నారంభించినవి. రుష్యా యుద్ధనౌకలు బాస్ఫరు ప్రాంతములందు నష్టము కలిగించినవి. మెయి చివర గను లు తగిలి యాంగ్ల యుద్ధనౌకలు ట్రయంఫు మెజెస్టిక్ డార్డెనెల్సునందు మునిఁగిపోయినవి. ఇపుడు తిరిగి డార్డెనెల్సుముట్టడి మెల్ల మెల్లగ సాగుచున్నది.

## కాక్ససు యుద్ధము

కాక్ససు ప్రాంతములందేప్రిలు మేయి నెలలలో తురుష్కులు పరాజితులైరి. ఈజిప్టునందును తురుష్కుల కపజయము గలిగినది. సూయజుకాలువను సంరక్షించుటకై యింగ్లీషుపటాలము నాంగ్లేయులు నియమించిరి. సర్ ఇయన్ హేమిల్టను మధ్యధరా సముద్రములోని యాంగ్ల సైన్యమునకు సేనాధ్యక్షుడుగ నియమింపబడెను. ఆయన నాయకత్వముక్రింద డార్డనెల్సు యుద్ధప్రస్థానము త్వరగా ముగియగల దని విశ్వసింపబడుచున్నది. తురుష్కులు పెరషియాయెమెను సూయజు ప్రాంతములందును నోడింపబడిరి. మిత్రమండలి సైన్యము స్మర్నాను ముట్టడించినది. సాహోరాముండి తురుష్కులు వెడలగొట్టబడిరి.

## సముద్రరంగము

జర్మనుల పరాభవమున కాంగ్లేయులు పన్నిన నౌకావ్యూహము ప్రశస్తము. ఆంగ్లనౌకాదళము జర్మనుల వ్యాపార నౌకాదళమును పోనుచేసి వారి దేశమునకు రాకపోకలను బంధించినది. ఆవ్యూహము జర్మనుల కాగ్రహమును కలిగించినది. అన్ని రోడలను విడువక లేక యుండుటకు జర్మనులు ఫిబ్రవరి నెలలో సిద్ధపడిరి. జనవరి ఫిబ్రవరులందు ముంచబడిన మిత్రమండలివారి నౌకల వివరము:— ఫోర్మిడేబులు (యుద్ధనౌక) మునిగినప్పుడు 517 గురు నావికులు మృతినొందిరి; మిత్రమండలివారి నాలుగు పొగనోడలను క్రోన్ ప్రింజెవిల్ హెల్మ్ ముంచినవి; 30 టార్పెడోస్టీమరులు, ఒక ట్రాలరు, ఒక ఫ్రెంచి జలాంతర్గామిని, దర్వాడ్యు స్టీమరు ముంచి వేయబడినవి. లింకాను మునుగుబడిన 270 మంది మృతి నొందిరి. సండాల్గాండి, కార్ఫ్రొమొరల్, టోకోమారు, క్రైస్ట్నాక ఆవ్ ట్రియన్, ఇకారియాన్, డర్విచ్, కాంబాంక్, డికోరా, ఎంటుస, ఫ్రాక్స్ మఫ్లెక్, రిడెమెపోర్స్, వార్వాలిషన్, ఓక్బీ, లాక్మార్కొటన, కలవ ముంచివేయబడినవి.

డార్డనెల్సునందును నల్లసముద్రమునందును కొన్ని తురుష్క నౌకలు, బాల్టిక్నందు రెండు జర్మను స్టీమరులు, ఉత్తరసముద్రమునందు కొన్ని జర్మను స్టీమరులు ముంచబడినవి.



THE DARDANELLES



డార్డినల్సు జలసంధిమార్గమున మిత్రమండలివారి యుద్ధనావలు బంధించుట.

A DREADNAUGHT



డ్రెడ్నాటనే యుద్ధము చేయునౌక ఒక (డ్రెడ్నాటు), అందలి భాగముల వివరము.

THE GUNS OF THE "QUEEN ELIZABETH" IN ACTION



క్వీను ఎలిజబెత్తు యుద్ధనావనుండి ఫిరంగులు శత్రునావలమీద డార్డనెల్సులో 20 మైళ్ల దూరమునకు గాల్చబడుట

DISTANCE COVERED BY THE MODERN NAVAL GUNS



డార్డనెల్సులో బ్రిటిషువారి యుద్ధనావనుండి గాల్చిన 12 యంచి ఫిరంగిగుండ్లు 22,500 అడుగుల యెత్తున లేచి
15 మైళ్లదూరములో కొండల నెక్కించుకొని పోవుచున్న తుర్కీనావలమీద పడుట



LORD HALDANE

హాల్డేను ప్రభువు



MR. L. HARCOURT

మి. హార్కోర్టు



LORD GLADSTONE

గ్లాడ్స్టన్ ప్రభువు. దక్షిణాఫ్రికా గవర్నరు జనరలు



MR. JOHN REDMOND

జాన్. రెడ్మండు. ఐరిషు నాయకుడు



LUSITANIA

లూసిటేనియా



HARBOUR DEFENCE AGAINST SUBMARINES

సబ్మెరయినుల నుండి హార్బరు కాపాడు విధము

హార్బరులలోని యుద్ధనావలను కాపాడుటకయి అనేకమందు గనులు పెట్టబడియున్నట్లు ఈ పటమునందు జూడనగును. వీనికి తగిలినను సబ్మెరయిను నాశనమగును. హార్బరు ద్వారములందు ఉక్కు స్తంభములు దించబడి వాని చుట్టును తెగని యినుపవలలు నీళ్లలో కట్టుదురు. సబ్మెరయిను వలలలో జిక్కుకొనును. ఇట్టిసంరక్షణములవలన యుద్ధనావ లందు హార్బరులకు సబ్మెరయినుల భీతిలేదు.




సేనాధిపతి బోథా ఆఫ్రికాయందు జర్మనుల నోడించెను. దక్షిణ పశ్చిమ ఆఫ్రికాలోని జర్మనులు గ్రూటుఫాంటీన్ తరలి పోయిరి. దక్షిణాఫ్రికా సైన్యములు వాటర్వాడును, గ్రూటు-ఫాంటీను, మరువారును పట్టుకొనెను. క్రమక్రమముగ నాఫ్రికాలోని జర్మనుదేశ మంతయు మిత్రమండలికి వశమగుచున్నది.

# కోటలు కందకములు మొదలైనవి

## కోటలు

జర్మనుల దిగ్విజయయాత్రకు బెల్జియములు లీజి నామూరు కోటల యాధారమువలన సైంధవునివలె నడ్డపడి ఫ్రెంచి సైన్యము కూడుట కవకాశము కల్పించి వారికి చేసిన సహాయము పత్రికాపాఠకులకు విదితము. కాని, కోటలలో నవీనపద్ధతి ననుసరించి బ్రియాల్మాంటు అనునతఁడు నిర్మించిన కోటలకును ప్రాఁత కోటలకును వ్యత్యయము కలదు. ఆ కోటల నిర్మాణక్రమము నీ పటము తెలుపుచున్నది.



కోటయొక్క రక్షణమునకై యనేక సాధనములు నిర్మింపఁబడినవి. కోటల పునాదులు మాత్రము సామాన్యముగ సిద్ధము చేయఁబడియుండును. యుద్ధము ప్రారంభము కాఁగానే, అదివఱ కమర్పఁబడియుండిన భాగములందు యుద్ధోపకరణము లుంచఁబడి శత్రుబలములను భేదించుటకు తగియుండును.






1. ఫిరంగు లమర్పఁబడిన కోట. 2. ముండ్ల తీఁగెలను దాఁటుటకై శత్రుసైన్యములు నిచ్చెనలను తీసికొనిపోవుట. 3. ముండ్లతీఁగెలు. 4. భూమియందు మందును నింపి పైన రాళ్లను వేసి కప్పి శత్రువులు వచ్చినప్పుడు మెఱుపుశక్తిచేత ప్రేల్పఁబడెడి మందు గనులు. 5. ముండ్ల తీఁగెలు. 6. కాల్బల ముందు స్థలము. (పదాతులు నీరు లేని కందకములందు దాఁగియుందురు.) 7. ఫిరంగుల దళము. 8. యంత్రశతఘ్నుల దళము. 9. ముట్టడి యంత్రశతఘ్నులు. 10. యంత్రశతఘ్నులు. 11. లోపలి కందకపు బాటలు, రైలుమార్గములు.

శత్రుబలము ముళ్లతీఁగెలను సమీపించినపుడు వారి ఫిరంగుల శబ్దము మాఁపఁబడును. అపుడు కోటలోని ఫిరంగులు శత్రువులపై కాల్పఁబడును. మందుతో నింపిన గనులు ప్రేల్పఁబడును. శత్రువులు కోటను రాత్రివేళలందు ముట్టడించినపుడు విద్యుద్దీపము వారిపై ప్రసరింపఁజేయఁబడును. వారి చూపులు మెఱుపుకాంతివలన కనుపింపకుండును. కందకములందు పొంచియుండు పదాతులు శత్రువులను తాఁకి నాశనము చేయుదురు.

ఇట్టి కోటలను బెల్జియనులు జర్మనులు ఫ్రెంచివారు తమతమ సరిహద్దు ప్రదేశములందు శత్రుసైన్యముల నాఁపుటకై కట్టిరి. కాని యవి 12,14,15 అంగుళముల ఫిరంగులవలన నుగ్గునుగ్గుగ చేయఁబడిన విషయము లీజ నామూరు ఆంట్వర్పు లిలీ మాబ్యూజ్ మొదలగు కోటల చరిత్రమువలన తెలియుచున్నది.

సరిహద్దు మార్గములను సౌకర్యములను నదీముఖములను పరసైన్యమునుండి రక్షించుటకై వర్తమానకాలమునందు ఘనపుకోటలు నిర్మింపఁబడుచున్నవి. వానికి క్యుపోల యని పేరు గలదు. ఆ కోటలయందు యంత్రశతఘ్నులమర్పఁబడి గుండ్రనైన గోపురములను పోలియుండును. ఆవరణము దట్టమైన యుక్కుచే నిర్మింపఁబడును. ఆ కోటలు సిమెంటు పునాదిమీఁదఁ గాని యుక్కు పునాది మీఁదఁ బుట్టి గాని యమర్పఁబడి చుట్టిచుట్టి తిరుగుచుండును. నున్నని శిఖరములు మాత్రము కనుపించుచుండును. అవసరమైన దిక్కులందు కోట తిరుగుట నాఁపి గుండ్లవాన కురిపించి శత్రుసంహారము చేయుటకు వీలుగలదు. ఈ క్రింద చూపిన పటములోని కోట యిట్టి విధమున నిర్మింపఁబడినదే.

## కందకములు



కందకములలో సైనికులు వరుసగా నుపాయింపు చేయుచున్నారు. ఒక కందకమునుండి యింకొకదానికి పోవుమార్గములు గలవు.

కందక మను పద మింతవఱకు కోటకు చుట్టును నుండు నట్టి యగడ్తకు వాడఁబడుచున్నది. కాని యిచట కందక మను పదము సైనికులు భూమియందు గుహలవలె నిర్మించుకొనిన పొడవైన స్థలముల కన్వయించుచున్నది. రెండు సైన్యములును యుద్ధమునకు సిద్ధముగ నున్నపుడు సంరక్షణార్థమై కందకములు నిర్మింపఁబడుచున్నవి. సైనికుల మొన పెక్కు మైళ్లు దూరము వ్యాపించియుండును. కొన్ని ప్రదేశములందు కదలుటకు వీలు లేకుండును. కొన్ని ప్రదేశములందు సులభముగ శత్రువులు మీఁదఁ బడుటకు వీలుండును. అట్టి సులభమైన స్థలములందు కందకములు నిర్మింపఁబడి సైన్యరక్షణోపాయములు బలపఱుపఁబడును. ఒక పక్షపు సైన్యములు కందకములను దాఁటినఁ గాని రెండవ పక్షపు సైన్యమును తాఁకుటకు వీలుండదు. సైన్యసమూహములు కందకముల చాటున నుండి కందకములలోని సైనికులకు విశ్రాంతి నిచ్చుచు బదులు పంపుచు వీలైనప్పుడు శత్రువులతో యుద్ధము చేయుచుండును. కందకములందు సేనానాయకులకు సైనికులకు ఫిరంగులకు యుద్ధద్రవ్యములకు భోజనాదులకు యథాయోగ్యముగ వీలు చేయఁబడియుండును.



[illegible]





కందకములు భూమియందయి దా రమగుల లోతు కలిగి యుండును. కందకముల గోడలు నేల సిమెంటు పూయఁబడి నివసించుటకు తగియుండును. పైభాగము కప్పు కలిగి యుండును. కొన్ని ప్రదేశము లందలివి సామాన్యపు నేలవలెఁ గన్పించుచుండును. సైనికులు తుపాకులను ఫిరంగులను కాల్చుటకును కాఁపరులు చూచుచుండుటకును కంతలుండును. కందకముల మధ్యమున నచ్చటచ్చట యంత్రశతఘ్ను లగోచరముగ సమర్పఁబడియుండును. కందకములముందు ముండ్ల తీఁగెలుండును. ఫిరంగిగుండ్లు కందకములను సంపూర్ణ

ముగ పాడుచేయఁజాలవు. శత్రువులపై పడుటకు ముందు ముళ్లతీఁగెలను కందకములను పాడుచేయవలయును. లక్షల కొలఁది ఫిరంగిగుండ్లు వానవలె కురిపించి కందకములను పాడుచేసి శత్రువులను తాఁకి యోడింప వలయును.

## గ్రెనాడులు







గ్రెనాడు అనుపదము దానిమ్మపండు అను నర్థము నిచ్చుమాటనుండి పుట్టినది. అవి దానిమ్మ పండువంటి యాకృతిని గలిగియుండుట వలన నీపేరుగలిగినది. ఇవి మొదటను 16 వ శతాబ్దమునందు వాడుకకు వచ్చినవి. 1660 సంవత్సరానంతర మీసాధనములు గ్రెనాడియరులను ప్రత్యేక సైనికులచే వాడఁబడుచుండెడివి. పదియేను పదునెనిమిది శతాబ్దములలోని యుద్ధములందివి తరుచుగ నున్నను పందొమ్మిదవ శతాబ్దమునం దివి అనుపయోగము లైనవి. కాని పోర్టుఆర్థరు ముట్టడియందు తిరిగి ఇవి వాడుకకు వచ్చినవి. అప్పుడు వాటియందు షెల్లులందువలె బలముగ ప్రేలెడి మందుంచుట వాడుకకు వచ్చినది. షెల్లులవలె ప్రేలి నష్టమును గలుగఁజేయఁగలవు. వర్తమాన మహాసంగ్రామమునందు పరాసులు వీటిని విశేషముగ నుపయోగించు చున్నారు. ఈపటములందు పదునారు పదునేడు శతాబ్దములందు గ్రెనాడులను వేసెడి విధము, ప్రస్తుతము వాటిని వేసెడివిధము చేసెడి విధము చూపబడినది.







కందకములను పాడుచేసి కందకములలోని సైనికులను చంపుటకు గ్రెనాడులను నాగ్నేయగోళములు వాడఁబడు చున్నవి. ఫ్రెంచి సైనికులు వానిని తోటాలవలె కాల్చి జర్మనుల కందకములపై వేసి సంక్షోభము కలిగించుచున్నారు. గ్రెనాడుల నడుమ గంధకము సురాకారము తుపాకిమందుగలవు. ఇవి యినుప గుల్లయందుంచఁబడి నిప్పంటించి రగిలినపిదప శత్రువులపై వేయఁబడును.






## గుండ్లు ప్రేలి ముక్క లగుట

ఫిరంగుల ముఖములనుండి వెలువడెడి గుండ్లు ష్రాప్నెలులు షెల్లులు అని రెండు విధములుగ నున్నవి. ష్రాప్నెలునందు సుమారు 300 చిన్న రవ్వ లుండును. ఫిరంగిని కాల్చిన తరువాత ష్రాప్నెలు కొంత దూరము పోయి ప్రేలినపుడు కవచము చిన్నచిన్న ముక్క లగును; రవ్వ లన్ని దిశలందును వ్యాపించును. ఇనుపముక్కలు రవ్వలు జనులను చంపుటకు చాలియుండునే కాని గోడలను గృహములను ఛేదింపజాలవు.



షెల్లులు నిర్మాణమునందు ష్రాప్నెలును బోలియున్నను, కవచమునందు తుపాకిమందు లిడ్డైటు మొదలగు ప్రేలెడు పదార్థము లుండును. షెల్లు ప్రేలుటకు రెండు కారణములు. షెల్లుమొన వేఱొక పదార్థమునకు కొట్టుకొనవలయును; లేక షెల్లునందు, ఫిరంగులను కాల్చుటవలనఁ గలిగెడి వేడికి రగిలెడి వత్తి యుండుట వలన, నది ప్రేలవలెను. షెల్లు ప్రేలి ముక్కముక్కలుగ బ్రద్దలై సర్వసంహారము చేయును. షెల్లుల బరువు 60 మొదలు 2,500 రతులవఱ కుండును. ఈ పటమునందొక షెల్లు పగిలిన విధము చూపఁబడినది.

## గుండ్లవాన కురిపించు యంత్రము

జర్మనులు తమ కందకములనుండి పెల్లులవాన కురిపించుటకై యొక యంత్రమును నిర్మించిరి. ఆ యంత్రము ముఖమున పెల్లులను చెంబులను నుంచి మఱను త్రిప్పిన, నవి దూరమునం దుండు శత్రువులపైఁ బడి శత్రుసంహారమునకు తోడ్పడును. ఈ పట మా యంత్రాకారమును చూపుచున్నది.





జర్మనులు రాత్రులందు పెల్లులను గాల్చునపుడు చీకటివలన గురిపెట్టుటకు వీలుండుటకై యొక యుపాయమును గనిపెట్టిరి. ప్రతి పెల్లునకును నొక పారచ్యూటు కట్టియుండును. పారచ్యూటు ముడచబడియుండును. పెల్లు పగిలినపుడు పారచ్యూటు విడి పెల్లులోని రవ్వలంటుకొని పెద్దదీపమువలె కొన్ని నిమిషములు వెలుతురు నిచ్చును. ఆ వెలుతురునుబట్టి శత్రుసైన్యములను గుర్తించుచు పెల్లులను గాల్చుటకు వీలుగలుగును. దీనిని క్రూపు యంత్రాలయాధిపతులు నిర్మించిరి. ఇట్టి నిర్మాణము లితరరాజ్యములకును గలవు. వాటికి నక్షత్రగుండ్లని పేరు గలదు.

ఈ పటమునందు జర్మనులు పెల్లునకుగట్టిన పారచ్యూటు విడివెలిగి వెలుతురు నిచ్చెడి విధము చూపబడినది.

ప్రారంభించెను. కాశిమీరు మహారాజు 1333-వ సంవత్సరము మొదలు 1370-వ సం. వఱకును రాజ్యము చేసెను. ఈయనకు రైతుల యెడ మిక్కిలి యభిమానము. "రైతుల ప్రభు"వని యీయనకు పేరు కలదు. సుప్రసిద్ధమగు క్రాకో విశ్వవిద్యాలయమును నీయనయే స్థాపించెను. గెలీషియా రాష్ట్రమును, లెంబర్గ్ వోలుహీనియా పరగణాలును ఈయన రాజ్యకాలములోనే సంపాదింపఁబడినవి. జగధిరెవంగు లిథూనియా రాష్ట్రము ఈశాన్యభాగమున బాల్టిక్ సముద్ర ప్రాంతమునుండియు తూర్పుభాగమున దాదాపు మాస్కో పట్టణము వఱకును వ్యాపించి యుండెను. 1386-వ సంవత్సరమున నీ రాష్ట్రము పోలండు దేశమునకు కలుపఁబడెను. అందువలన దీని విస్తీర్ణము ద్విగుణీకృత మయ్యెను. ఈ క్రొత్త రాష్ట్రము పోలండులో కలుపుటకు ప్రయత్నము జరిగినదే కాని చివర కది నెరవేఱలేదు.

పదునాల్గు పదునేను శతాబ్దములందు పోలండు దేశము మిక్కిలి యున్నతస్థితి యందుండెను. అప్పటికైనను దీనిలో నదియు వేఱు రాష్ట్రము వేఱుగా నేర్పడెనే కాని యిది యేకరాజ్యముగ నుండలేదు. దీనికి పూర్ణమైన స్వాతంత్ర్యము లేదు. భాషయందును, ఆచారవ్యవహారములందును, ధర్మమునందును ఒక రాష్ట్రములోని ప్రజలకును, మఱియొక రాష్ట్రములోని ప్రజలకును పరస్పర వైరుధ్యము కలదు. వీరియందు సమానప్రత్యయభావము లేదు. ఒకరిని చూచిన మఱియొకరికి చుక్కెదురు. చిట్టచివరకు పోలండునకు దారుణమైన యవస్థ సంభవించినది. దేశములోని లోపములను కొంచెము చూచిన వారికి సులభముగ, దీని కిట్టి యవస్థ తప్ప దను సంగతి ముందుగనే తెలియుచునే యుండెను.

దొరతనము విషయమై యాలోచించితిమా, పోలండు పేరునకు మాత్రము ప్రజాస్వామికమే యైనను నిజముగ నెల్లప్పుడును నియమబద్ధమగు పాలనము క్రిందనే యుండెను. ఆరంభదశలో పాలకునకు రాజ్యాధిపత్యము వంశపారంపర్యముగ వచ్చెడిది. పదునేడవ శతాబ్ద మధ్యమున సామంతులు కొందఱు బయలుదేఱి క్రమక్రమముగ రాజ్యవ్యవహారముల నన్నిటిని లోబఱుచుకొని తామే స్వయముగ నిర్వహింపసాగిరి. రాజుల మరణానంతరము ఈ సామంతులు రాజ్యాధికారముకొఱకు ఒకరితో నొకరు పెనఁగులాడుచుండెడివారు. వీరికి వేఱువేఱుగ ఆస్ట్రియా రష్యా ప్రష్యా సాక్సనీ స్వీడను రాజకుటుంబములు సహాయభూతములై నిలిచి వీరి కలహములను పెంచుచు, దేశమును కేవల మరాజకస్థితిలోనికి తెచ్చినవి. ఈ కారణమున రాజ్యాధికారము వంశపారంపర్యముగ వచ్చు పూర్వాచారము తఱచుగ నతిక్రమింపఁబడుచుండెను. ఇట్టి పారంపర్యరహిత మగుటచేనందున సింహాసనము కొఱకు లెక్కలేని కుట్రలును దురంతములును ప్రబలుచుండెడివి. మేటి స్వతంత్రరాజులకు మేక్యవెలి మేధావుల నాటి యిటాలి యందు కూడ నిట్టి దారుణములు జరిగినట్లు తోఁచదు.

పోలుల దేశపాలనాతంత్రమునం దొక విశేష ముండెను. లోకమునం దెన్నియో ప్రతినిధిసభ లున్నవి. వీనిలో కొన్నిటియందు ఎక్కువమంది సభ్యుల మాట చెల్లుచుండును. కొన్నిచోట్ల రెండు వంతులకుంటె యధికసంఖ్యను బట్టి వ్యవహారములు నిర్ణయింపఁబడుచుండును. కాని, పోలండులో సభ్యు లందఱు నంగీకరించిన యే వ్యవహారము నైనను ఒక సభ్యుఁడు సమ్మతి లేకముగ నిలిచి పోగనివ్వక పోవచ్చును; "నా కిష్టము లే" దని పలికి వ్యవహారమును నిలిపివేసి, సభను విచ్ఛేదము చేయవచ్చును. రాజ్యాంగమునం దిట్టి దురాచార మెక్కడను లేదు. ఈ "స్వేచ్ఛావాగ్నిరోధపద్ధతి" పోలుల దేశవినాశనమును తెచ్చిపెట్టినది. సామంతులలో దుర్నీతి హెచ్చసాగెను. ఇందువలన ఏ విదేశప్రభుత్వమైనా లేక యభిమానము కల మఱియొకరో, ముందునకు వచ్చి కొంత అధికారమును నియమించి ప్రతినిధిసభా కార్యములను జరుపుట సులభసాధ్య మయ్యెను.

దేశములోని నడిమితరగతివారు జర్మనులు. వీరు వర్తకులు, కర్మకారులు మున్నగు వృత్తులం దారితేఱినవారు. వీరిలో కొందఱు అన్యమతస్థులును కలరు. పోలులలో సామాన్యజనులు వ్యవసాయకులు. వీరు గ్రామములలో నివసించుచుందురు. వీరి దుస్థితి వర్ణనాతీతము, శోచనీయము. వీరికి స్వాతంత్ర్యము లేదు. వీరు కానిపనులు చేయుచు దరిద్ర భూములను దున్ని జీవించెదరు. వీరి మాట గణనకు వచ్చునా? యజమానులు నిరంకుశులై యుందురు. వారికి తోఁచినట్లు వారు చేయుదురు.

వ్యవహారములందును సాంఘికార్థికస్థితిగతులలోను 17-18 శతాబ్దములందు పోలండు దేశము దక్కిన యూరోపా రాజ్యముల కంటెను వెనుకఁబడి యుండలేదు. ఈ దేశములకంటె నుత్తమనాగరక లక్షణములందు పోలులే శ్రేష్ఠులుగ నుండిరి. లెక్కలేనన్ని విశ్వవిద్యాలయములును పాఠశాలలును నుండెను. ప్రజలు విశేషముగ వీనిలో చదువుకొనుచుండిరి. భాష ప్రవర్ధమాన మయ్యెను. వేలకొలఁది గ్రంథములు వెలువడుచు వచ్చినవి. క్రాకో విశ్వవిద్యాలయము నుండి కోపర్నికసు బయలుదేఱి, విశ్వవైభవమును సర్వవిధముల సమన్వయింపఁజేసి సంచితవిశ్వాసము లగు మానవులకు బోధింప నారంభించెను. ఈయన బోధించిన ప్రకృతితత్త్వము నేఁటికిని మహాశయులు తమవారికి సంపూర్ణముగ లోకమునకు ప్రదర్శించెను. గానమునందును ఇతరకళలందును పోలుల ప్రతిభ యితరులకే లోకప్రశంసాపాత్ర మైనది.

రాజ్యాంగమునం దేమి, కార్యతంత్రమునం దేమి, శౌర్య విజృంభణమునం దేమి, పోలండు దేశము వన్నెకెక్కుచు వచ్చెను. 1683-వ సంవత్సరము పోలండు రాజ్యచరిత్రమునందు సుప్రసిద్ధము. పరాక్రమశాలి యగు జాను సోబిస్కీ నాయకత్వముక్రింద పోలండు దేశపు సేనలు తురుష్కసైనికనికాయమును చీల్చి చెండాడి వియన్నా నగరపు ముట్టడిని విడిపించినవి; ఈ నగరరాజమును యూరోపా పడమటి భాగముల నాగరకమును తురుష్కసేనల కాహుతి గాకుండ రక్షింపఁగలిగినవి.

స్వార్థపరత్వము సకలానర్థములకును మూలము. ఈ సిద్ధాంతము

## ఒకటవ నికోలాస్ ప్రభుత్వము

### 1860-1896

డానిలోకు పిమ్మట వరని యున్న కుమారుఁడగు మొదటి నికోలాస్ సింహాసనమునకు వచ్చెను. ఇతఁడు కడు సమర్థుఁడు; ప్యారిస్ నగరములో విద్యాశిక్షణ నొందెను, ఫ్రెంచి భాష నతి చాకచక్యముతో మాట్లాడెడివాఁడు. ఇతనిని చూచినవారిలోనితని గొప్ప లక్షణములను కనిపెట్టనివారు లేరు. ఇతని ప్రభుత్వారంభము ననే తురుష్కులతో యుద్ధము పొసఁగెను. ఇందుమాత్రము తురుష్కులకే జయము కలిగెను. కాని తుదకు స్కూటరీయొద్ద సంధి జరిగెను. ఇందలి కఠినమైన షరతులు మాంటినీగ్రోనులపై నిర్ణయింపఁబడెను. పదునాల్గేండ్లు గడచిన తర్వాత దేశములో క్షామము ప్రవేశించెను, కలరా వ్యాపించెను. ఈసందర్భమందు ఫ్రెంచివారు చాల సహాయము చేసిరి. దైవానుగ్రహమున నివి త్వరలో శాంతి నొందినవి.

కడచిన యుద్ధమునకు ఫలితముగ, నింతవఱకుండిన యుద్ధపు కట్టుబాట్లు చాల వని గ్రహించి నికోలాసు ఫ్రాన్సులో పెక్కు తుపాకులను లాటరీలో కొనెను. మూఁడవ నెపోలియను, జారు, సర్వియా రాజగు మికెయిల్, మఱియొక సుప్రముఖుఁడును కలసి సొమ్ము పెట్టుఁబడి పెట్టిరి. సర్వియా రాజు ఫిరంగుల కర్మాగారమును నిర్మించువాని నొకనిని పంపెను. దీనిని సెటింజిలో స్థాపించిరి. ఇవి యన్నియు సమకూర్చుకొని నికోలాస్ సైనికాభివృద్ధికి ప్రారంభించెను. 1870వ సం. లో కప్టైన్ వ్లాహోవిక్ అనునతఁడు సైన్య శిక్షణాప్రకరణము వ్రాసి [illegible]. యుక్తవయసు వచ్చిన ప్రతిమనుజునకును ఒక తుపాకియు కొన్ని తోటాలును నొసంగఁబడెను. వారు తుపాకులను తమ పిల్లలకన్న యెక్కుడుగ ప్రేమించిరి. 1895వ సం. లో రషియనుజారు తన పేరున బహుమతిగ 30,000 తుపాకులను పెక్కు ఫిరంగులను తోటాలు మున్నగువానిని ఆంటివరికి పంపెను. రషియన్ సైనిక శిక్షకులు పోడ్గోరికాలో నొక సైనికోన్నత శిక్షాలయమును స్థాపించిరి. సెటింజెయొద్ద సైనికు లుండుట కొక యుద్ధశాల కట్టఁబడెను. ఈ విధముగనే విద్యాశాఖ గూడ చేర్పడి విద్య యభివృద్ధి యయ్యెను. అప్పటికి ప్రయుక్తి విద్య ముఖ్యముగ నేర్పఁబడెను. కాని యుద్ధసమయములో [illegible] కలములకు బదులు కత్తులను మార్చెడివారు.

1876వ సం. లో మాంటినీగ్రోనులు తురుష్కులపై యుద్ధము ప్రకటించిరి, ఇందు కూడ భాగ్యముగ జయము నొందిరి. ఈ యుద్ధమునందు వీ యేడ్రియాటిక్ సముద్రతీరమున ముప్పది మైళ్ల దేశమును సంపాదించిరి. ఇది యింగ్లీషువారి సహాయమువలన వచ్చిన దని నేఁటి వఱకు ప్రతిదేశభక్తుఁడును గ్లాడ్‌స్టన్ మంత్రివర్యుని నామము స్మరించుచుండును. దేశమునందు బాటలు విస్తరిల్లుట దేశమున కపాయకర మను ప్రాచీన సిద్ధాంతమును విడిచి, నికోలాసు దేశమునందలి ముఖ్యపట్టణముల నన్నింటిని మంచి బాటలతో కలిపెను. పిమ్మట తుర్కీతో నొకసారి కలహము కలిగినను, అన్ని వైపులను చుట్టుకొనియుండుటచే ఆస్ట్రియా తుర్కీకన్న గొప్ప శత్రు వాయెను. రషియా చక్రవర్తి కుటుంబముతో చేసిన సంబంధములవలన మాంటినీగ్రోకు రష్యా పరమమిత్ర మాయెను.

## రుమేనియా రాజ్యము

రుమేనియా యూరపుదేశ మంతటిలో ఫలవంతమయినది. ఇయ్యది, బాల్కను రాష్ట్రములలో చేరినది కాకుండుటచే 1912-13 లో జరిగిన బాల్కను యుద్ధమునందు జోక్యము కలుగఁజేసికొనలేదు. కాని చిట్టచివరకు బల్గేరియా తక్కిన బాల్కను రాష్ట్రములతో వ్యతిరేకముగ నుండినపుడు రొమేనియా బల్గేరియాపై దండెత్తి బల్గేరియానుండి 2,85,000 మంది జనులు గల 7,609 చతురపు మైళ్ల భూమిని సంపాదింపఁగలిగెను.

ఈ దేశపు వైశాల్యము 52,700 చతురపు మైళ్లు. జనసంఖ్య 7,500,000; ఆదాయము 22,000,000 పవనులు; ఋణము 63,000,000 పవనులు; వ్యాపారము 41,000,000 పవనులు; సైన్యము శాంతిసమయమునందు 98,500 మంది, యుద్ధసమయమునందు 420,000 మంది; ఇందు 56,164 టన్నుల పరిమాణము గల 34 వర్తకపుస్టీమరులును, 56,842 టన్నుల పరిమాణము గల 36 సాధారణపు టోడలును గలవు.

# రష్యా సామ్రాజ్యము

వ్యక్తులకువలె జాతులకును బాల్య కౌమార యౌవన వార్ధక్యములు సహజావస్థలు. ఇప్పటి యూరపుజాతుల స్థితిని గమనించిన నీస్థితి తెలియుచున్నది. గ్రీకు రోమక జాతులు గతించినవి. వాని స్థానములందు క్రొత్త జాతులు పుట్టి విజృంభించినవి. ఆ జాతులిపుడు దశాభేదములందున్నవి. కొన్ని జాతులు యౌవనదశను దాటినవి. మరికొన్ని జాతులు యౌవనదశయందున్నవి. తక్కినకొన్ని యౌవనదశను పొందనున్నవి. జర్మనుజాతి యౌవనదశయందున్నది. ఆ జాతియొక్క తివ్విబ్బ్యాల కా దశయే కారణమై యుండెను. రష్యా దేశమునకు యౌవనదశ యింకను రానున్నది. ఇదియే యీ జాతి వెనుకబడి యుండుటకు కారణ మయియున్నది. రుష్యా దేశ చరిత్రము 9-వ శతాబ్దములో ప్రారంభమైనట్లున్నను, నిశ్చయముగ 17-వ శతాబ్దమునందు పీటరు మహామహునితో ప్రారంభమైన దని యెంచవచ్చును.

రషియాసామ్రాజ్యపు వైశాల్య మఖండము. జనసంఖ్య యతి బహుళము. తక్కిన రాష్ట్రముల చరిత్రముల రీతిని దీని చరిత్రమును వ్రాయుట యున్న గ్రంథములు నింపుటయే యగును. వైశాల్యమున బ్రిటీషు సామ్రాజ్యమునకు పిమ్మట నిదియే పెద్దది. ఈ దేశ మంతయు దాదాపు ఏకఖండముగ నున్నది. యూరపుఖండమునందు సగపాలును ఆసియాఖండమునందలి యుత్తరభాగ మంతయు నిది యాక్రమించి యున్నది. పూర్వార్ధగోళమునందలి యుత్తరభాగము నంతటి నిది యాక్రమించియుండుటచే నిది యతిశీతలముగా నుండును. దీని తీరములు సంవత్సరములో సగముకంటె నెక్కువ కాలము ఘనీభవించియే యుండును. ఆ ప్రాంతములు పంటల కననుకూలములై కొంత కాలము వఱకు మాత్రము పచ్చికబయళ్లుగ నుపయోగపడును. ఈ సామ్రాజ్యపు వైశాల్యము 8,770,703 చతురపు మైళ్లు. జనసంఖ్య 173,359,900. ప్రజలలో నూటికి 65 గురు మాత్రమే రషియనులు, 6 గురు పోలులు; తక్కినవారిలో జూ్యలు ఆర్మీనియనులు కకేషియనులు టార్టారులు ఫిన్‌లు మంగోలియనులు మున్నగు ననేకజాతులవారు గలరు. రష్యనులు చాలమంది గ్రీకు చర్చికి సంబంధించిన క్రైస్తవులు.

ఈ యఖండ మయిన విశాలదేశము, జనసంఖ్యను బట్టి చూచినచో, దాదాపు నిర్మానుష్యప్రదేశముగనే కనబట్టును. యూరోపు రష్యాలో, బాల్టిక్ బ్లాక్ సముద్రముల నడుమ నుండు దేశము మాత్రము ప్రజాబాహుళ్యము గలది. ఇదియే కొంతవఱకు ఫలవంత మయిన భూమియు నయియున్నది. 1912-వ సం. పు లెక్కలను బట్టి యింత విశాల మగు దేశములో 361,045,686 ఎకరములు మాత్రమే సాగుబడిలో నున్నవి. ఈ విధముగ పశుసంరక్షణమునకు తగిన భూమి తక్కిన ప్రదేశములలో సమృద్ధిగ నుండుటచే, 1912-వ సం. లో 48,896,000 పశువులును, 74,066,000 గొఱ్ఱెలు మేకలు మున్నగునవియు, 13,508,000 పందులును, 33,169,000 గుఱ్ఱములును రష్యాదేశమునం దుండినట్లు తేలినది. దీనిని బట్టి ప్రస్తుతమహాసంగ్రామములో వీరికి గల యాశ్వికబలాధిక్యత నిర్వివాదాంశము.

## సైన్యము

రషియా సామ్రాజ్యములోని యాసియా భాగములలోను యూరపునందలి ఫిన్లండులోను తప్ప, తక్కిన రష్యాలోని ప్రజలందరకును సైనికశిక్షణము విధిగా యున్నది. 21—45 సం. ల వయస్సు గలవా రందఱును సైనికశిక్షను పొందవలసినవారే.

## విద్య

ఒక్క ఫిన్లండులో తప్ప, తక్కిన రష్యాదేశ మంతటిలోను ఏదో యొక భాషను చదువను వ్రాయను నేర్చినవారు నూటికి పది మందికంటె నెక్కువ లేరు.

## రైలుమార్గము

1913-వ సంవత్సర ప్రారంభమున నీదేశములో 46,839 మైళ్ల రైలుమార్గము గలదు. దీనిపై 1912-వ సంవత్సరములో ప్రయాణము చేసిన 235,179,600 మంది ప్రయాణీకులవలనను, కొనిపోబడిన 229,283,479 టన్నుల సరకులమీఁది సుంకములవలనను 113,419,600 సవరనుల యాదాయము వచ్చెను.

## వర్తకపు టోడలు

1913-వ సం. లో 790,075 టన్నుల పరిమాణము గలిగిన 716 పొగయోడలును 184,103 టన్నుల పరిమాణము గలిగిన 500 సాధారణపు టోడలును రషియా పతాకముతో సముద్రముపై నడచుచుండెను. పొగయోడలపై 17,157 గురును సాధారణపు టోడలపై 12,333 గురును నావికులుగ నుండిరి. సముద్రముపై వీరి నౌకాస్థితి తక్కువగ కనబట్టుచున్నను, దేశాంతర్స్థితములగు సరస్సులలోను నదులలోను నింతకు మించిన పరిమాణము గల నావలును వానికి తగినంతమంది నావికులును నుండుట కవకాశము గలదు.

## ఆదాయ వ్యయములు

1914-వ సం లో 300,000,000 సవరనుల యాదాయము వచ్చెను; ఋణము 945,000,000 సవరనులు; 268,000,000 సవరనుల వర్తకము జరిగెను; సైనికవ్యయము 2,82,20,000 సవరనులు; నౌకావ్యయము 26,149,294 సవరనులు.

## నిర్బంధ సైనికశిక్షణము

శాంతి సమయమునందు 15,00,000మంది సైనికు లుందురు; యుద్ధసమయములందు వీరికి తోడు వెనుకటి రెండు పంక్తులలోను మాత్రము 19,25,000మంది సైనికు లధికముగా నుందురు. అసాధారణ సమయములందు విశేష సైన్యము సమకూర్చుట కవకాశము కలదు.

## నౌకాదళము

| నౌకావివరణము | ఇదివఱ కున్నవి | నిర్మింపఁబడుచున్నవి |
|---|---|---|
| యుద్ధనౌకలు | 9 | 7 |
| బాటిల్ క్రూయిసర్లు | ,, | 4 |
| ఆర్మర్డు క్రూయిసర్లు | 6 | ,, |
| ప్రొటెక్టెడ్ క్రూయిసర్లు | 6 | 6 |
| ఇతరమైన క్రూయిసర్లు | 4 | ,, |
| డిస్ట్రాయర్లు | 96 | 45 |
| టార్పిడో బోట్లు | 26 | ,, |
| సబ్మెరైనులు | 29 | ,, |
| మొత్తము | 176 | 73 |

ఈ రాష్ట్రముల యన్నిటి యైక్యమునకై పదునాలుగు కలిగి ఆయా రాజధానుల ముఖ్యపట్టణము లగు నేపిల్సు రోము లాంబార్డీ మున్నగు పట్టణములలోని ప్రభుత్వములవారు లేఖలు మగ కుట్రలు పన్నుటలోదనో, యుద్ధములు చేయుటలోదనో కాలము వెళ్లబుచ్చిరి. 19వ శతాబ్దము ప్రారంభమునందే కలహములలో ముఖ్య నాయకుడును ఇటలీ పోరాటకారకుడును అయిన మహాపురుషుడు గ్యిసెప్పిమజ్జిని 1848వ సం. పు ఫ్రెంచి కలహములలో లాంబార్డీ వెనీసు మున్నగు పరగణాలవారు తిరుగబడి ఆస్ట్రియా సైన్యమును వెరోనా పర్యంతము పారద్రోలిరి. సార్డినియా రాజగు చార్లెసు అల్బర్టు ఆస్ట్రియాపై యుద్ధము ప్రకటించి మొదట జయించినను, పిమ్మట నోవరాయొద్ద 1849వ సం. న జరిగిన యుద్ధములో నోడింపబడెను. అప్పు డాల్బర్టు తన కుమారుడైన విక్టర్ ఇమాన్యుయలునకు సింహాసనము వదలివేసెను.

ఇంతలో పోపు రోమునుండి తరిమివేయబడి, మాజిని గారిబాల్డిలచే ప్రజాస్వామ్య ప్రభుత్వము స్థాపింపబడెను. కాని 1849వ సం. న పోపు ఫ్రెంచివారి సహాయము పడసి, వారి సంరక్షణక్రింద 1850వ సం. నుండి తన నిరంకుశాధికారము సాగింప మొదలిడెను. సిసిలీ నేపిల్సులలోని యరాజక సంఘములు కూడ నణచివేయబడినవి. కాని రహస్యపు సంఘములు మాత్రము తమ పనిని తాము చేయుచునే యుండెను. 1859వ సం. న ఆస్ట్రియావారితో ఫ్రెంచివారును సార్డినియావారును చేసిన యుద్ధమునకు పిమ్మట, ఆస్ట్రియావారు లాంబార్డీని సార్డినియా కీయవలసినవారైరి. ఆ సంవత్సరములోనే, రోమాగ్నా మోడెనా పార్మా టిస్కెనీ మున్నగునవి కూడ చేర్చుకొనబడెను. కాని సావాయి నీస్ పరగణాలను మాత్రము ఫ్రెంచివారి కియ్యవలసివచ్చెను. దక్షిణమున సిసిలియనులు కలహించిరి. జెనోవానుండి వెయ్యిమంది సైనికులతో గారిబాల్డి సహాయముగ వచ్చి సిసిలీలో నున్న బోర్బన్ ప్రభుత్వమును ద్రోసివేసెను. విక్టర్ ఇమాన్యుయల్ పక్షమున గారిబాల్డి యాజ్ఞాపకుడుగ ప్రకటింపబడెను. ఆగష్టునెలలో గారిబాల్డి నేపిల్సునకు పోయి యక్కడి ప్రభుసైన్యము నోడించి రెండవ ఫ్రాంసిస్సును గెయిటాకు తరిమివేసి 7వ సెప్టెంబరున ముఖ్యపట్టణము ప్రవేశించెను. ఇంతలో సార్డినియా కూడ నీ పోరాటములో చేరి జయమును కొనసాగించెను. అంతట గారిబాల్డి తాను జయించిన భూములను రాజభటుల కప్పగించి కాప్రెరాకు వెళ్లెను.

విక్టరు ఇమాన్యుయల్ ఆల్ప్సు పర్వతములనుండి సముద్రపర్యంతము గల యిటలీదేశ మంతటికిని రాజుగ ప్రకటింపబడెను. కాని వెనీసుపరగణాయును రోమను రాష్ట్రమును నివి రెండును మాత్రము బయటనే మిగిలియుండెను. 1866వ సం. న ఆస్ట్రియావారితో ప్రష్యాకు యుద్ధము కలిగినప్పుడు జరిగిన స్నేహసంధిలో వెనీసు ఇటలీకి చేరెను. 1870వ సం. లో ఫ్రాంకోజర్మను యుద్ధము సాగుచున్నప్పుడు ఫ్రెంచివారు తమ సైన్యములను ఫ్రాన్సునకు తీసికొనిపోవునట్లు కను పోపును కాపాడుచునే యుండిరి. అప్పుడు ఇటాలియను సైన్యములు రోమును తీసికొనెను. 30-6-1871 లో ఇటలీ ముఖ్యపట్టణము ఫ్లారెన్సునుండి రోమునకు మార్చబడెను. 1878వ సం. లో విక్టర్ ఇమాన్యుయలు చనిపోగా, అతని కుమారుడు మొదటి హంబర్టు రాజ్యమునకు వచ్చెను. 1900 సం. లో నితడు చంపబడెను. ఇతని పుత్రుడు మూడవ విక్టర్ ఇమాన్యుయల్ సింహాసనమునకు వచ్చెను. కొన్ని సంవత్సరములనుండి శాంతిస్థాపనార్థ మాస్ట్రియా జర్మనీలతో నిటలీకి సంధి యుండెను. అది యీ యుద్ధములో నిటలీ వారిచే నిరాకరింపబడెను.

ఈ దేశముయొక్క 1914వ సం. పు లెక్కల ప్రకారము 35,000,000 మంది జనులు కలరు; 134,324,000 సవరనుల సరకులు దిగుమతి చేయబడెను; 86,772,000 సవరనుల సరకు లెగుమతి చేయబడెను; ఆదాయము 114,000,000 సవరనులు; వ్యయము 103,000,000 సవరనులు; ఋణము 593,590,398 సవరనులు; 1,430,475 టన్నుల పరిమాణము గల 637 స్టీమరులును, 237,821 టన్నుల పరిమాణము గల 523 ఓడలును గలవు; 310,000 మంది గల ప్రధానసైన్యమును 250,000 మంది గల మూలబలమును గలవు.

నౌకాబలము

| నౌకాభేదము | ప్రస్తుత మున్నవి | తయారగుచున్నవి |
|---|---|---|
| యుద్ధనౌకలు | 9 | 5 |
| ఆర్మర్డు క్రూజర్లు | 11 | ,, |
| లైట్ క్రూజర్లు | ,, | 3 |
| స్కౌటులు | 3 | ,, |
| డిస్ట్రాయరులు | 25 | 10 |
| టార్పిడోలు | 76 | 24 |
| సబ్మెరైనులు | 12 | 8 |
| మొత్తము | 136 | 40 |

ఉ. ఎవ్వని బాహువిక్రమము హిందుజనాళి శిరస్సుమంబులన్
నొవ్వఁగనీక సంతతవినోదము సల్పుచునుండె ధాత్రిలో
నవ్వసుధాతలేంద్రు సకలాధిపు జార్జి యురస్థ్సమాలికన్
బువ్వులు గందనీక గెలుపుం గలిగింపుము శ్రీజనార్దనా!

## బ్రిటిషుసైన్యోద్యోగ చిహ్నములు




ఫీల్డుమార్షలు మొదలు బ్రిగేడియరు జనరలువఱకు భుజముమీఁద ధరించునవి




కర్నలు మొదలు రెండవ లెఫ్టినెంటువఱకు భుజముమీఁద ధరించునవి. ౧,౪లలోని నక్షత్రములు కిరీటములు లోహముతో చేయఁబడినవి




కర్నలు మొదలు రెండవ లెఫ్టినెంటువఱకు చొక్కాయి చేతులయొద్ద ధరించునవి




హైలాండు పటాలములలో కర్నలు మొదలు రెండవ లెఫ్టినెంటువఱకు చొక్కాయిక్కి చేతులయొద్ద ధరించునవి
3, 4 నెంబరులలోని నక్షత్రములను, కిరీటములను జల్తారుతో చేయఁబడినవి.

రుష్యాచక్రవర్తి, యువరాజు

THE MPRESS OF RUSSIA AS COLONEL-IN-CHIEF



యోధవేషధారిణి, రుష్యాచక్రవర్తిని

D

రుష్యాచక్రవర్తిని

THE GRAND-DUCHESS OLGA AS COLONEL-IN-CHIEF



యోధవేషధారిణి, రుష్యారాకుమారి



A RUSSIAN PRIEST BLESSING THE SOLDIERS

COSSACKS CROSSING THE VISTULA ON THEIR FAVOURITE HOR



కోస్సకులు గుఱ్ఱములమీఁద నిలువఁబడి విస్టులానదీప్రవాహమును దాఁటుట

# చిత్రపటముల వివరణము

అబ్రుజ్జి ప్రభువు:—ఇటలీ యుద్ధనౌకాంగములో వైసు అడ్మిరలు. కొన్ని ఇటాలియను యుద్ధనావలకు సేనాధిపతి. హిందూదేశమునకువచ్చి హిమాలయ పర్వతములలోని అత్యున్నత శిఖరముల కెక్కి పర్వతాన్వేషణమును చేసెను.

అశ్వసేన:—ఈసైన్యము పదాతులు కనపడకుండ వారినిదాచుటకును, వారుపరుగెత్తునప్పుడు రక్షించుటకును, పదాతులు పోరగానే శత్రుసేనలపైబడి జయమును పూర్తిగా గ్రహించుటకును, శత్రుసేనల అంతు యుద్ధమునకు ముందుగా తెలిసికొనుటకును, ఉపయోగింపబడును. ఈసైనికులకు తుపాకి, ఖడ్గము, ఈటె యుండును. ఒక్కదినమునకే సైన్యము 30 మొదలు 50మైళ్ళు నడచును. 326 అశ్వసైనికులు, ఒక్క ఆఫీసరు కలిపి ట్రూప్ అని పిలువబడును. ఇటువంటివి మూడు ట్రూపులు ఒక్క స్క్వాడ్రను. మూడు స్క్వాడ్రనులు ఒక్క లెఫ్టినెంటు కర్నలు క్రిందనుండి రెజిమెంటు యనిపించుకొనును. రెండుమూడు రెజిమెంటులు ఒక్క బ్రిగేడియరు జనరలుక్రిందనుంచబడి బ్రిగేడుఅని పిలువబడును. నాలుగు బ్రిగేడులు కలిసి ఒక్కడివిజను యగును. డివిజనులో 3000 మొదలు 4000 వరకు గుఱ్ఱపురౌతులుండురు.

ఆకాశ విమానములు:—యుద్ధ ప్రారంభమున ఫ్రాన్సుకు 16 గాలిఓడలు 834 ఆకాశవిమానములు, గ్రేటుబ్రిటనుకు 6 గాలిఓడలు 250 విమానములు, జర్మనీకి 30 గాలిఓడలు, 400 విమానములు, ఆస్ట్రియాకు 7 ఓడలు, 100 విమానములు, రష్యాకు 10 ఓడలు, 160 విమానములు, ఇటలీకి 8 ఓడలు, 220 విమానములు, సర్వియాకు 20 విమానములు ఉండెను. ఇప్పు డన్ని దేశములవారును వీని సంఖ్య నపరిమితముగా వృద్ధిచేసి యున్నారు.

ఆలన్బీ మేజరు జనరలు:—ఇన్నిస్కిలింగు అశ్వసైన్యములో చేరి మేజరుజనరలు పదవిని బొందునంత వృద్ధిలోనికి వచ్చెను. జూలూల్యాండ్, దక్షిణాఫ్రికా యుద్ధములలో రాణిగారిపతకమును నాలుగు కొలుసులతోను, రాజుగారి పతకమును రెండు కొలుసులతోను బడసెను. యుద్ధమునకు ముందు అశ్వసేనాధిపతిగా ఇంగ్లండునందుండెను. మాన్సు యుద్ధములో, ఇంగ్లీషువారు వెనుకకు తగ్గవలసి వచ్చినప్పుడు పదాతులు హతము కాకుండ తన యశ్వసేనతో శత్రువులను దాకి సర్ జాన్ ఫ్రెంచిగారి కపరిమితమయిన సహాయ మొనరించెను. సొమ్మెనది యొద్ద శత్రువులతో దలపడి, వారి నాపి తరువాత వెనుకకు తగ్గిపోయెను.

అల్బర్టు:—బెల్జియమురాజు. జర్మనుల బాధల ననుభవించుచున్న ప్రజలతో పాటీయనయు నానాకష్టములను గుడుచుచున్నాడు. మాలిన్సు నగరముపై జర్మనులు శతఘ్నులను కాల్చుచున్నప్పుడు సైనికోద్యోగియు లీయనను సురక్షితమైన ప్రదేశమునకు వెళ్లుమని ఎంతో ప్రతిమాలవలసివచ్చెను. సాధారణ సైనికుని యుడుపులను ధరించి ప్రాణములు పోవునను భయము లేక రణరంగమంతయు తిరుగుచుండును. ఈయన డిసెంబరు 17,1907 వ సం.లో సింహాసన మెక్కెను. యూరపురాజులలో నింతపొడుగువాడు లేడు. యంత్రాదుల నడపువిద్యను బాగుగా నేర్చెను. రయిలింజనులను తనదేశమందు స్వయముగా నడపిన మొదటిరాజు. పూర్వము సైన్యములో కొలువుచేసెను.

తన భర్తతోపాటు రాణియు నానాకష్టములను పడుచున్నది. వీరి ముగ్గురుబిడ్డలును ఇంగ్లండులో కర్జను ప్రభువుగారి గృహమునం దుంచబడినారు. ఈమె జర్మనీలోనొక భాగమగు బవేరియాకు ప్రభువగు కారల్ థియడోరు కుమార్తె. ఈమె బెల్జియములో దేవదూతయగురాణి యని పిలువబడుచున్నది.

ఆస్క్విత్ రైట్ ఆనరబిల్:— యార్కుషయిరు నివాసి. జీవితమునందు వృద్ధికివచ్చుటకు స్వశక్తి తప్ప మరియొకసహాయమును లేదు. లండనునగర పాఠశాలలో జదివి, బాలియలు కళాశాలలో విద్యార్థివేతనమువలన జదివి, సుప్రసిద్ధ బ్యారిష్టరయి, పార్లమెంటులో ప్రవేశించి నిరుపమానశక్తివలన ముఖ్యమంత్రియయ్యెను. ప్రధానమంత్రిగారు ఈయుద్ధపుదినములలో అన్ని కక్షులవారి మన్ననలకును బాత్రుడాయెను.

## సైన్యవిభాగములు

ఆర్మీకోరు:—బ్రిటిషుసేనలో ఒక్కకోరు అనగా 38,000 మంది సైనికులు, 152 ఫిరంగులు. కోరు రెండు డివిజనులుగా విభజింపబడియుండును. అందశ్వసేనయు నుండును. ఫ్రెంచి ఆర్మీకోరులో 34 వేలు మొదలు 48 వేల వరకు పదాతులు, 1200 మొదలు 1800 వరకు గుఱ్ఱపుదళము, 5000 మొదలు 6000 వరకు ఫిరంగులను మాత్రమే ప్రయోగించుసైన్యము ఉండును. ఫిరంగులు 148 మొదలు 160 వరకుండును. రష్యాకోరులో 600 మంది అశ్వసైనికులు, 32,000 కాల్బలము, 4500 శతఘ్నిసేన, 152 ఫిరంగులు, ఉండును. జర్మను కోరులో 1200 గుర్రపుదళము, 30,000 పదాతులు, 6000 ఫిరంగిసేన, 160 ఫిరంగు లుండును. ఆస్ట్రియను కోరులో:---1600 గుఱ్ఱపురౌతులు 42,000 కాల్బలము, 5000 శతఘ్నిసేన, 120 ఫిరంగులు ఉండును. ఈసేనలుగాక మోటారుసైకిలు లెక్కిపోరు సైనికులు, మోటారుబండ్లమీద నుండి పోరువారు వేరుగా గలరు. బ్రిగేడు:---ఇందు పదాతులు, అశ్వసేనలు ఉండును. పదాతులు 4000 మొదలు 7000 వరకును, అశ్వసేన 1000 మొదలు 2000 వరకును ఉండును.

రెజిమెంటులో 2000 మొదలు 4000 వరకు పదాతులు. 500 మొదలు 1000 వరకు అశ్వసేనయు నుండును.

కంపెనీ యనగా 120 మంది సైనికులుండు పటాలము.

ఆర్మీమెడికలు కోరు:---యుద్ధములో దెబ్బలు తినినవారికి శస్త్రములు చేయుట, ఔషధమిచ్చుటయు ఈ యుద్యోగులపని. ఇంగ్లీషు సైన్యములో 5000 మంది యుద్యోగులు, పరిచారకులునుగలరు. కానియీమెడికలు ఆఫీసరుల సంఖ్య మహాసంగ్రామముచే అనేకరెట్లు హెచ్చు పెంచబడినది.

ఆర్మీఆర్డినెన్సుకోరు:---ఇందుండువారు కమ్మరపనివాండ్రు, కంచరపనివాండ్రు, ఫిట్టరులు, ఫీలరులు, కాలరుమేకరులు, గుమాస్తాలు మొదలయినవారును వారిపై యుద్యోగులును. వీరిపని యుద్ధభూమినుండి తిరిగివచ్చిన తుపాకులు, ఫిరంగులు వగయిరాలను మరమ్మతుచేయుట, క్రొత్తతుపాకులను, ఫిరంగులను, మందుగుండు సామానులను, ఇతరయుద్ధ పరికరములను క్రమముగా మూటలుకట్టి యుద్ధభూమికి బంపుట.

ఆర్మీసర్వీస్ కోర్:---భోజన పదార్థములను సైనికులకు బంపుట ఈ కోరుయొక్కవిధి. పయిగా గుడ్డలు కుట్టుట, గుర్రములకు నాడాలుకొట్టుట, జీనులనుకుట్టి సిద్ధముచేయుట వడ్రంగిపని వీరిది.

ఇటలీరాజు:—1869లో జన్మించెను. 1900లో జంపబడిన తనతండ్రికి ననంతరము రాజ్యాధిష్ఠాతయయ్యెను. 1896లో మాంటినీగ్రో రాకుమారి ప్రిన్సెస్ హెలీనును పెండ్లియాడెను. ఈయుద్ధమునకు జనులను పురికొల్పుచు జేసిన ప్రసంగములు వారిహృదయముల నమితముగా రమింప జేసినవి.

ఇవనోఫ జనరలు.—జరోస్లావును పట్టుకొనిన జర్మనుసేనానాయకుడు.

ఇంగెనోల్ అడ్మిరలు వాన్:—జర్మను నౌకాసేనాధిపతి. 40 సంవత్సరములు కొలువుజేసెను. కెయిజరుగారికి ప్రియతముడు. జర్మను యుద్ధనౌకాబలమును వృద్ధిచేసి గ్రేటుబ్రిటను బలమయిన తరువాత లోకములో రెండవదిగా జేసినవాడు.

### ఎమ్డెను యుద్ధనావ

కోకోస్ కీలింగు దీవులు:—ఎమ్డెన్ యుద్ధనావ యిచ్చట సిడ్నీ క్రూయిజరుచే ముంచబడెను. 1609లో కెప్టెన్ కీలింగువలన కనుగొనబడెను. ఈ దీవులు సింహళమునుండి ఆస్ట్రేలియాకు వెళ్లు సముద్రమార్గమునందున్నవి. ఈ లంకలు రాస్ అను స్కాచి కుటుంబమువారి హక్కు. సిడ్నీ రాస్ అనునతడు గవర్నరు. శీతోష్ణస్థితి రమణీయము. కాని తుపానులు ఘోరనష్టమును కలుగజేయుచుండును.

ఎమ్డెనుయుద్ధనావ చైనాలో జర్మనివారిదేశమగు కైయోఛాహార్బరునుండి ఆగస్టునెలలో తప్పించుకొని బంగాళాఖాతములోజేరెను. దీనిబరువు 3600 టన్నులు. ఇది గంటకు 24 మైళ్లు పరుగెత్తును. నాలుగు ఇంచి ఫిరంగులు12ఉండెను. చెన్నపట్టణముమీద 15 నిమిషములు గతించిన సెప్టెంబరునెల 22-వ తేది రాత్రి 9 గంటలకు సుమారు 25 ఫిరంగులను గాల్చెను. బర్మా ఆయిల్ కంపెనీ వారివి రెండు కిరోసినాయిలు తటాకములకు నిప్పంటించి నాశముచేసెను. హైకోర్టు ప్రాంత్యమునను, చూళలోను, హార్బరులోని స్టీమరులమీదను గుండ్లు పడెను. 8 మంది జనులు మృతులయిరి. 30 మందికి గాయములు తగిలినవి. జనులు చెన్నపట్నమును భయముచేత విడువ మొదలిడిరి. ఎమ్డెనునుగురించి లెక్కలేనన్ని పుక్కిటిపురాణములు బయలుదేరెను. ఎమ్డెను ముచ్చటలలో దేశమంతయు మునిగిపోయెను. నవంబరు మాసములో కోకోస్ద్వీపమునందలి(వైర్ లెస్)తీగ లేని తంత్రీ సమాచారపు కార్యాలయమును పాడుచేయుటకయి ఎమ్డెను వెళ్లగా, ఆస్ట్రేలియావారి సిడ్నీయను క్రూయిజరుచే 10నిమిషములలో నోడింపబడి,ఒడ్డునకు తరిమివేయబడి, కాల్చివేయబడెను.చాలమంది సైనికులిందు చనిపోయిరి. ఎమ్డెన్ కెప్టెనగు ముల్లరుకును, అందున్న జర్మను రాకొమారుడు ప్రిన్సు ఫ్రాంసిస్ జోసెఫునకును గాయములు తగులలేదు. ఖయిదీలుగా బట్టుకొనబడిరి. సిడ్నీనావలో నలుగ్గురు మృతినొందిరి. 15 మందికి గాయములు తగిలినవి.

ఎమ్డెను 23 నావలను ముంచెను. అది కలిగించిన నష్టము 1 కోటి 50 లక్షలరూపాయలకు తక్కువ యుండదు. మారువేషము వేసికొని, సింగపూరువద్ద జెంఛెగ్ అను రష్యను క్రూయిజరును, మాసుకెట్ అను ఫ్రెంచిటార్పిడో బోటును ముంచివేసెను. దీనిని పట్టుటకయి సముద్రముల నన్నింటిని ఫ్రెంచి, రష్యా, జపాను. ఇంగ్లీషు క్రూయిజరులు అనేకదినములు శోధించెను. బెనోమ్రు, ఛిల్కాన, క్లాన్‌గ్రాంటు, క్లాన్‌మథేసన్, డిప్లొమాట్, ఇండస్, కామాంగటమారు (జపాను) కిల్లిన్, కింగు లడ్, లోవట్, రిబేరియ, ట్రాబొక్, ట్రోయిలస్, టైమెరిక్ అనునావలు ముంచబడిన వానిలో ముఖ్యమయినవి. బుర్సాక్, ఎక్సుఫర్డు, అను రెండు బొగ్గు స్టీమరులలోనిబొగ్గు సంగ్రహింపబడి అవి ముంచబడెను. కాబింగా యను స్టీమరును సెయింటు ఎగ్బర్టు అనుస్టీమరును పట్టుకొని, వానిని ముంచక, ఇదివరకు ముంచిన స్టీమరులలోని నావికులను, ప్రయాణికులను వంచు కూర్చుండబెట్టి దగ్గరిరేవులకు బంపివేసెను.

ఎన్వరు పాషా:—తుర్కీదేశమునకు యుద్ధాంగ మంత్రి. జర్మనికి ముఖ్యమిత్రుడు. ఈ యుద్ధములోని కితడే తుర్కీనిదించెను. అశ్వసైన్యమును నడపుటయందు మంచిప్రవీణుడు. రెండవబాల్కను యుద్ధములో ఏడ్రియనోపిలును బల్గేరియనులనుండి లాగికొని తిరిగి దానిని తురుష్కుల వశము చేసెను. ఇందుకయి తురుష్కసామ్రాజ్యమునందంతటను అభినందనములకు పాత్రుడాయెను.

ఎం. గయోలిట్టి:— ఇటలీకి విదేశాంగమంత్రి. ఈ ఇటలీని యుద్ధములోనికి దించుటకు గారకులయిన వారిలో నొక్కడు.

ఐరన్ క్రాస్:—బ్రిటిషు సైనికులకు విక్టోరియా క్రాసు ఎంత యమూల్యమయినదో జర్మనుసైనికులకు ఐరన్ క్రాసంత శ్రేష్ఠతమ మయినది. ఇది గొప్పయుద్ధములో జయించినప్పుడు, గొప్పశత్రువును పట్టినప్పుడు,కోటలను ధైర్యముతో గాపాడినందుకు నొసంగబడు చుం

జెడిదియఁట. ఈయుద్ధములో 38,000 ఐరన్ క్రాసులను కెయిజరుగారు సైనికులకు పంచిపెట్టిరట. ఈ క్రాసు ఇనుముతోఁ జేయఁబడి కొన వెండితోఁ పూయఁబడి యుండును.

ఒకూమా ప్రభువు:— జపాను ముఖ్యమంత్రి. 1838 లో జన్మించెను. జపాను నింత గొప్ప సామ్రాజ్యముగా జేసిన వారిలో నొక్కఁడు. కోశాధ్యక్షుఁడు, విదేశాంగ మంత్రి, వ్యవసాయ మంత్రి, వర్తక వ్యాపార మంత్రి మొదలగు పనులను జేసెను. జర్మనీతో యుద్ధమునకు దిగి, కైయూచా రాష్ట్రమును వశము జేసికొని, జర్మనీవారిని పసిఫిక్ సముద్రమునుండి తరిమివేసెను. చైనాను బలవంతపెట్టి లేని కష్టమయిన సంధిని జేసికొనెను.

ఓస్టా ప్రభువు:—ఇటలీరాజుగారి పినతండ్రికొమారుఁడు. ఇటలీవారి యయిదవసేనల కీయుద్ధమందు నాయకుఁడు.

కప్పములు:—జర్మనులు పట్టుకొనిన పట్టణములలో నీక్రిందివిధముగా కప్పములనుగొనిరి. ఇది ప్రాచీనాచారముగాని ఆధునికాచారము కాదు. డబ్బులేక పోవుటచే బెల్జియనులననివిధముగా దోఁచిరని అందరనుచున్నారు. సొమ్ము నియ్యనియెడల పట్టణములను కాల్చి భస్మము చేసెదమనిరి.

| | రూపాయలు |
|---|---|
| బ్రుసెల్సు | 12,00,00,000 |
| లీజ్ రాష్ట్రము | 3,00,00,000 |
| లీజ్ నగరము | 60,00,000 |
| లావేన్ | 60,000 |
| బ్రాబంటు రాష్ట్రము | 27,00,00,000 |
| లిల్ | 42,00,000 |
| ఆర్మెంటయర్సు | 3,00,000 |
| నమియన్సు (1 లక్ష సిగరెట్లు సహా) | 6,00,000 |
| లెన్సు | 4,20,000 |
| కాంబే, బార్కో-నగరములు | 6,00,000 |
| టర్కాండి | 6,00,000 |
| మొత్తము. | 43,27,80,000 |

ఘెంటు 1 లక్ష సిగరెట్లు, 2200 గాలనుల కిరోసినాయిలు, 220 టన్నుల పానీయపదార్థములు, 150 టన్నుల ఓట్లు, 100 బైసికెలులు, 10 మోటారు సైకెలులు.

కందకములు;—మొట్టమొదట నివి కొలఁదిపాటి గుంటలుగా నుండెను. ఈయుద్ధములో ననేక మైళ్లవఱకును భూమిలో త్రవ్వఁబడి ఒకకందకమునుండి యింకొక కందకమునకు మార్గమేర్పఱుపబడి యుండుటయేగాక టెలిఫోనులతోను, విద్యుద్దీపములతోను, వంటకు సదుపాయములతోను, పడుకకుతగిన పీఠ్లతోను అమర్పఁబడి యున్నవి. చాలకందకములు సిమెంటుతో కట్టబడి సిద్ధము చేయబడినట్టివి. ఈకందకముల యుద్ధము దీర్ఘకాలము పట్టును. కందకములలోని శత్రువుల నోడించిగాని వారినిదాఁటి పోవుటకు ఎదుటివారికి వీలులేదు.

క్రప్ నిర్మాణము:—యుద్ధపరికరములను నిర్మించుటయం దింతకంటె పెద్దకర్మాగారము భూలోకములో మరెచ్చటను లేదు. జర్మనీదేశములో వెస్టుఫేలియా రాష్ట్రములోని ఎస్సెన్ అనుపట్టణమునం దిది గలదు. మొట్టమొదట నొక పయిసయినను లేని పీటర్ ఫ్రెడరిక్ క్రప్ అనువానివలన స్థాపింపబడెను. ఈతనికుమారుఁడు అతుకులులేనిరయిలు చక్రములను జేయుపద్ధతిని కనుఁగొని దానివలన ననేకలక్షలు ఆర్జించెను. ఆసొమ్మంతయు నీకర్మాగారములో ఫిరంగులు చేయుపనికయి వినియోగింపబడెను. మూఁడుతరములవారిబుద్ధిబలమును, పరిశ్రమయు నీకర్మాగారము నింతమహోన్నతస్థితికి దీసికొనివచ్చినవి. 1870లో ఫ్రెంచివారిపై పూర్ణజయమునుగొనినవి ఫిరంగులే!! ఈ కర్మాగారము ప్రజలపై నిక నావికభాండార మని పిలువఁబడుచున్నది. ఈక్రప్పు నిర్మాణములో నఱువది కర్మాగారములు మొత్తమునిందు గలవు. ఒకకర్మాగారమునుండి యింకొకకర్మాగారము

నకు సామానును తీసికొని వెళ్లుటకు 30 మైళ్లపొడుగున రయిలు ఆవరణములోపల కలదు. ఇచట సిద్ధముచేయ బడిన సామానును బాహ్యప్రపంచమునకు తీసికొని వెళ్లుటకయి ప్రత్యేకముగా నిర్మింపబడినరయిలు 40 మైళ్ల పొడవున కర్మాగారములచుట్టును గలదు. యుద్ధమునకుపూర్వము 40,000 పనివాండ్రును, 4000మంది యుద్యోగులును నిచ్చట పనిజేయుచుండిరి. ఇప్పుడు 1,50,000 మంది పనివాండ్రు దూరము పారు ఫిరంగులనుమాత్రమే (అన్ని పనులనువదలి) చేయుచున్నారంట. ఇవిగాక జర్మనిలోని వీరి సొంతబొగ్గుగనులను త్రవ్వి కర్మాగారములకు పంపుటకయి 10,000 మంది క్రప్పువారి కూలివాండ్రుగలరు. ఆనెన్, గులసములలో వీరికిగల రోలింగుమిల్లులలోను, రైన్‌హాసెన్, మాస్‌బర్గు, న్యూవిడ్, ఎంగరు గ్రామములలో వీరికున్న బ్లాస్టుఫర్నేసులలోను 15,000 మంది కూలివాండ్రు పనిచేయుచుందురు. కీలునగరములో వీరికున్న నౌకానిర్మాణ కర్మాగారమునందు 7000 మంది పనిచేయుచున్నారు. స్పెయినులో వీరు కొనిన యినుపగనులలో 5000 మంది త్రవ్వుచున్నారు. ఈవంశములో నాలుగవవాడగు ఫ్రా॰ క్రప్ గారే వీనికన్నింటికిని ప్రొప్రయిటరు.

క్లక్, జనరలువాన్:— 68 సంవత్సరముల వయస్సు. ప్యారిసును పట్టుకొనుటకయి ఈయుద్ధములో కెయిజరుగారివలన ఉత్తరప్రాంతమునుండి 2 లక్షల సైన్యముతోc బంపcబడెను. ప్యారిసువఱకు పోcగలిగినను మార్నెవద్ద మిత్రమండలివారిచే నోడింపcబడి తఱిమివేయcబడెను. అందుచే కెయిజరుగారియనుగ్రహమును గోలుపోయెనcట.

కానేవ జనరలు:—ఇటలీకి సర్వసేనాధిపతి ‘ఇటలీ కిచనర’ని పిలువబడుచున్నాడు. బుద్ధిశాలి, కీర్తి నొందిన సేనాని.

కిచెనరు ప్రభువు:—ఇప్పటి యుద్ధాంగమంత్రి. ఇండియా కేడుసంవత్సరములు సర్వసేనాధిపతిగా నుండెను. యుద్ధమునకు పూర్వము ఈజిప్టులో కాన్సల్ జనరలుగా నుండెను. ఈయన గతించిన 40 సంవత్సరములనుండియు పోరాడని బ్రిటిషువారియుద్ధము లేదు. లెఫ్టినెంటు పదవినుండి స్వశక్తివలన నిప్పుడనుభవించుచున్న మహోన్నతపదవిని బడసెను. బోయరుయుద్ధమును సాంతముగాజయించి సంధిచేసినదీయన. అప్పుడు పార్లమెంటువారు 7 లక్షల 50 రూపాయలు బహుమతిగానిచ్చిరి. మొట్టమొదటనుండియు జర్మనితోc బోరుటకయి అనేకలక్షలసైన్యము గావలయునని గుర్తెఱిగి 11 మాసములలో 20 లక్షల సైన్యమును సిద్ధముచేసి రణభూమి కంపెను. ఈయనకార్యనిర్వాహణశక్తి అపారము. ఈయుద్ధములో బ్రిటిషువిజయభారము కిచనరుగారి భుజములపై గలదు. ఈయనకున్న దేశీయ, విదేశీయ బిరుదములకు లెక్కలేదు. వయస్సు 65 సంవత్సరములు.

క్వీక్‌ఫైరింగ్ ఏర్‌గన్:—ఫ్రెంచి ఏకపక్ష ద్విపక్ష విమానములలో నీఫిరంగులు తీసికొనిపోబడుచున్నవి. నేలమీదనుండు శత్రుసేనలను, ఆకాశమున నెగురు శత్రువిమానములను వీనితో గాల్చెదరు.

కీలుకాలువ:—బాల్టికు సముద్రతీరముననున్న కీలుహార్బరు మొదలుకొని హాంబర్గు నగరము వఱకును త్రవ్వబడినది. ఇటీవల డ్రెడ్నాటు యుద్ధనావలు సఖ్యముగ నడచుటకును, లంగరువేసికొనుటకును, రెండింతలు విశాలము చేయబడి కెయిజరుగారి వలన 14వ జూన్ 1914న తెరువబడెను. పొడుగు 60 మైళ్లు, లోతు 360 అడుగులు, వెడల్పు పైభాగమున 334 అడుగులు. కాలువలోపలి భాగమున వెడల్పు 147 అడుగులు. కాలువకు మొదటను కడపటను నున్న లాకులపొడుగు 1082 అడుగులు, వెడల్పు 147 అడుగులు, లోతు 45 అడుగులు. 60 మైళ్ల పొడుగునను కాలువ విద్యుచ్ఛక్తితో రాత్రివేళ వెలిగింపబడుచున్నది. బాల్టికుసముద్రమునుండి యుత్తర సముద్రమునకు జర్మని తనయుద్ధనావ లన్నింటి నిప్పుడు పదునారు గంటలలో బంపగలదు. విపత్కాలమున నే యుపాయము లేకుండ యుద్ధనావ లన్నింటిని ఈ కాలువలో పెట్టుకొని కాపాడుకొన వచ్చును.

కీస్, కమడోర్:—ఇప్పుడు సబ్మెరయిను నావల కధిపతిగా నున్నాడు. చైనా, దక్షిణాఫ్రిక, తూర్పు ఆఫ్రికాలలో యుద్ధమును చేసెను. పైకి వచ్చుచున్న నౌకాసేనాధిపతులలో నొక్కడు. హెలీగోలాండు బైటు యుద్ధములో మొదటివాడు.

కెయిజరుగారి పుత్రులు:—ఆరుగు రున్నారు. యుద్ధభూమియం దున్నవారు (1) యువరాజు (2) ప్రిన్సు ఈటెల్ ఫ్రెడరిక్ (కర్నలు) (3) ప్రిన్సుఆస్కార్ (5-వ లైఫుగార్డ్సుపటాలము) (4) ప్రిన్సు అడల్‌బర్టు అను నాలుగవ వాడొక యుద్ధనావలో దెబ్బతిని మృతినొందెనని వదంతిగలదు. ప్రిన్సుజోఖిం అను కడపటివాడుఒకపర్యాయము ఫ్రెంచివారిచేతిలో పడకుండ ఆకాశవిమాన మెక్కి పారిపోయెను. అయిదవవా డెచ్చట నున్నాడో తెలియదు.

కోసక్కులు:—రష్యాసామ్రాజ్యమునందు దక్షిణ రాష్ట్రముల సరిహద్దులలో నుండువారు. వారు లోకములోని అశ్వసైనికులలో సుప్రసిద్ధులు. ఈ సేన మొత్తము 1,80,000. వారికున్న అశ్వములు 1,70,000. ఫిరంగులు 240. ప్రభుత్వము వారిచ్చిన జమీనుల ననుభవించుచు వీరు సైనికసేవ చేయుచుందురు.

గంగాసింగునేగి:—గార్వాలు పటాలములలో సైనికుడు. జర్మను కందకములలో జొరబడి అనేకమందిని తా ననేకగాయములు తినినను జంపెను. అందు కయి శ్రీరాజచక్రవర్తిగారు విక్టోరియా క్రాసును స్వహస్తములతో నీతని వక్షస్థలమునకు రణరంగమున గ్రుచ్చిరి.

గ్లాడ్‌స్టన్ ప్రభువు:—మహామంత్రి గ్లాడ్‌స్టన్ గారి పుత్రుడు. ఇంగ్లండుకు స్వదేశాంగ మంత్రిగానుండి దక్షిణాఫ్రికాకు గవర్నరు జనరలుగా వెళ్లెను. వీరి యుద్యోగ కాలమప్పుడే నిరపరాధనిరోధకమును గాంధిగారు ప్రారంభించుటయు, తరువాత వ్యవహారము పరిష్కారమగుటయు దటస్థించెను. వీరి యుద్యోగ కాలము ముగిసినందున నిప్పు డింగ్లండుకు తిరిగి వచ్చినారు.

గూర్ఖాలు:—నేపాలుదేశమునుండివచ్చు పర్వత సైనికులు. వారి సాహసము సుప్రసిద్ధము. వారి ఖడ్గము లగు కుక్రీలతో నొకమనుజుని రెండుగా శీఘ్రకాలములో నరకగలరు. వారి తుపాకిగురి అమోఘము. వీరి పటాలములు 10 గలవు. ఈపటాలములో వీరి మొత్తపుసంఖ్య 20,000. వీరందరును యుద్ధమునకు వెళ్లిరి. హిందూదేశమును ఇంగ్లీషువారికి 1814 మొదలు జయించి పెట్టుటలో వీరు చేసిన యుపకారము మెండు.

గ్రే, సర్ ఎడ్వర్డు:—పది సంవత్సరములనుండి బ్రిటిషు విదేశాంగమంత్రి. ఈయుద్ధము జరుగకుండ నెన్నో ప్రయత్నములను త్రికరణశుద్ధితో చేసెను. కాని ఫలము లేకపోయెను. నైట్‌ఆఫ్‌ది గార్టర్ అను సాధారణముగా నెంతగొప్పవారికయిన నొసంగబడని బిరుదీయన కీయబడెను. జర్మనులు యుద్ధమునకు పూర్వమును, తరువాతను జేయుచున్న దురాగతముల విషయమయి కొన్నిపుస్తకములను వ్రాసి పార్లమెంటువారి యెదుటను, నాగరికలోకము యెదుటనుబెట్టి వారిని పరిహాస పాత్రులనుగా జేసెను.

చర్చిలు విన్స్టన్:—యుద్ధనావాంగ మంత్రిగా నుండెను. సైన్యములో గొన్ని సంవత్సరములు కొలువు చేసి, సాహసవంతుడను కీర్తి నార్జించి, పార్లమెంటు మెంబరయి, సహాయకార్యదర్శిగా నుద్యోగములను జేసి చివరకు గొప్పమంత్రి యయ్యెను. ఈయన మేధాశక్తి నిరుపమానమైనది. లోకసంచారి యగుటచే నిసంబంధమున గొన్నిగ్రంథములను వ్రాసెను. తన తండ్రి లార్డు రాండోల్ఫు చర్చిలుగారి చారిత్రమును మూడు గ్రంథములుగా రచించెను. ఇంతవరకును నలుబది సంవత్సరములు 1914 నవంబరు 30-వ తేదిన నిండినవి. ముఖ్యమంత్రి కాగల సూచనలన్నియు గలవు.

జగో; హార్ వాన్:—50సంవత్సరములవయస్సు. జర్మను విదేశాంగమంత్రి. రాచకార్యములను నడపుటయందు ప్రవీణుడు. ఇంగ్లండునెడ యుద్ధారంభము వఱకును అనురాగమున్నట్లు నటించెను. రోములో జర్మనురాయబారిగా నుండెను.

జాక్సను అడ్మిరలు:— మధ్యధరా సముద్రములోనున్న బ్రిటిషు యుద్ధనౌకల కధిపతి. ఇప్పుడు నౌకాయుద్ధాంగ మంత్రికి సహాయుడుగా నున్నాడు.

జినోవా ప్రభువు:—ఇటాలియను యుద్ధనావలు కొన్నింటికి అడ్మిరలు. 1854-లో జన్మించెను. ప్రిన్సు ఫర్డినాండు మృతినొందిన పిమ్మట రెండవ జినోవా ప్రభువయ్యెను.

జెల్లికో అడ్మిరలు:—ఇప్పుడు సముద్రముమీద నున్న బ్రిటిషు యుద్ధనావల కన్నింటికి అధిపతి. 1872 లో నౌకా సేనలో బ్రవేశించెను. ఈజిప్టియను యుద్ధములోను, బాక్సరు యుద్ధములోను సముద్రముమీదను నేలమీదను బోరెను. చైనా బాక్సరుల తుపాకి గుండొకటి ఈయనయూపిరితిత్తులలో బ్రవేశించినను బ్రతుకగలిగెను. కంట్రోలర్ ఆఫ్ నేవి, డైరక్టర్ ఆఫ్ నేవల్ ఆర్డినెన్సు, మొదలగు నుద్యోగములను జేసెను. 1912 మొదలు రెండవ "సముద్రప్రభువు" గానున్నాడు. ఈయుద్ధము మొదలు కాగానే సర్వసేనాధిపత్యమొసంగబడెను. ఫిరంగులను సరిగా గురికి గొట్టుటలో స్వయముగా నతిప్రసిద్ధుడేగాక అందరు నావికసైనికులను ప్రవీణులనుగా జేయగలిగెను.

జోఫ్రే జనరలు:—ఫ్రెంచి సర్వసేనాధిపతి. రెండవ లెఫటినెంటుగా సేనలో బ్రవేశించి, ప్యారిసు ముట్టడిలో 1870 లో బోరాడెను. టింబక్టూ పట్టణమును బట్టుకొనినవారిలోను, ఇండూ చైనాలో బోరిన వారిలోను నొక్కడు. మెడగాస్కరుకు మూడుసంవత్సరములు గవర్నరుగానుండి ఆద్వీపపుసంరక్షణములను వృద్ధిచేసెను. క్రింది వారిని పనిని జేయించుటయందు కఠినుడే యని చెప్పవచ్చును. ఫ్రెంచివిన్యాసములలో నయిదుగురు జనరలులు క్రమముగా బనిచేయలేదని యుద్యోగమునుండి తొలగించెను. గణితశాస్త్రమునందు గొప్పప్రావీణ్యము గలదు. ఇతనిసంకల్పము లమోఘములు, మనోదార్ఢ్యము ఉక్కువంటిది. తొందరపడడు. నెమ్మదిగా తనసంకల్పముల నీడేర్చును. ఫ్రెంచిసేన కాతని యందు పితృవాత్సల్యమున్నది. సముద్రములో దూకుమనినను దూకుదురు. జర్మనులను నెమ్మది నెమ్మదిగా ముట్టడించుచు, కాలము తనపక్షమున నుండుటచేత నోడింపగలనను ధైర్యమును గలిగియున్నాడు.

టార్పెడో:—ఉక్కుతో జేయబడిన ఆయుధము. 300 రతుల తుపాకిప్రత్తితోను, మరియితర పేల్లు పదార్థములతోను పోదుగబడును. ఈటార్పెడో 28 హండ్రెడు వెయిట్ల బరువును 24 అడుగుల పొడుగును గలిగియుండునుగాన నది యొకపెద్ద యంత్రమనియే చెప్పనగును. ఇవి పెద్దపెద్ద యుద్ధనావలందును, డిస్ట్రాయరులు క్రూయిజరులు, టార్పెడోబోటులు, సబ్మెరయినుల యందును నుండు టార్పెడో గొట్టములనుండి ప్రయోగింపబడుచుండును. 800 గజములు మొదలు 7000 గజములవరకివి పారగలవు. 7000 గజములు (సుమారు నాలుగు మయిళ్ళు) పోవుటకు 4 నిమిషములు పట్టును. ప్రయోగింపబడిన నావకుతగులగానే టార్పెడోయొక్క ముక్కు చితికి లోపలనున్న ప్రత్తికి నిప్పంటించి పిడుగువలె ప్రేలునట్లు చేయును. ఆదెబ్బకు నావ బ్రద్దలగును.

టిర్ అడ్మిరల్ వాన్:- జర్మనుయుద్ధనౌకాంగ మంత్రి. గతించిన 25 సం. ల నుండియు పెక్కువందల కోట్ల రూపాయలను వ్యయము జేయించి జర్మను నావికా దళమును ఇంగ్లీషువారి దళము తప్ప లోకమునందద్వితీయముగా జేసెను. సబ్మెరయినులు చేయుచున్న దుష్కృత్యములను బ్రేరేపించుచున్న దీయనయె.

టిర్విట్ కెప్టెన్:—హెలిగో లాండు బైటు యుద్ధములో జర్మనునావలను ముంచిన ఆంగ్ల నౌకాధిపతులలో నీయన యొక్కడు.

ట్రీష్కి:— 19 వ శతాబ్దములో జర్మనుదేశ చరిత్రము అనునొక సుప్రసిద్ధగ్రంథమును వ్రాసి వన్నెకెక్కెను. ఈయనవ్రాతలు జర్మనులలో దేశభక్తి నమితముగా బురికొల్పినవి. 1834 లో బుట్టెను. ఇతడు 1896 లో మృతినొందెను.

డెల్కాసి. ఎం:— ఫ్రాంసునకు యుద్ధాంగమంత్రిగను, అధినివేశ మంత్రిగను నుండెను. 1905న రాజీనామా నొసంగెను. యుద్ధారంభమున విదేశాంగమంత్రిగా నెన్నుకొనఁబడెను. ఈతఁడనిన జర్మను ప్రభుత్వము వారికి బహుకంటకము. ఫాషోడా సంబంధమున ఇంగ్లీషు వారికిని ఫ్రెంచివారికిని గొప్పతగవును పరిష్కరించి ఆంగ్లో-ఫ్రెంచిమైత్రికి కారకుఁడయ్యెను.

డైనమైటు బాంబు:— ఒక్కబాంబు 90 రతులుండును. శత్రుసేనల బరిమార్చుటకు, కర్మాగారముల గూల్చుటకు, వంతెనల ధ్వంసము చేయుటకు, నగరములను నాశము చేయుటకు నిది యుపయోగింప బడును. వైమానికులకు మూఁడుముప్పులు గలవు. (1) అకస్మాత్తుగా వారివిమానము నిర్మాణలోపమువలన గూలుట. (2) శత్రుఫిరంగులు తగిలి నాశనమగుట (3) విమానములోనున్న తుపాకిమందే ప్రేలి విమానము భస్మమగుట. కాని యీ యుద్ధమందు వైమానికులు చేయుచున్న సాహసకార్యములు వర్ణనాతీతములు.

నికోలస్. గ్రాండ్ డ్యూక్:— రష్యా సర్వసేనాని రుష్యాచక్రవర్తిగారికి జ్ఞాతి. అశ్వసైన్యాధిపతులలో గొప్పప్రఖ్యాతి గలదు. వ్యూహములను పన్నుటయందు ద్వితీయుఁడు. ఇదివఱకు పెక్కు గొప్పసైనికోద్యోగములను జేసెను. ఈయుద్ధములో మిత్రమండలివారి ఆశలన్నియు ఈయనమీఁదఁ గలవు. వయస్సు 58 వత్సరములు

సెప్లిన్:— జర్మనీలో బుట్టినవారిలో నతిసాహసికుఁడయిన ప్రాతగాఁడు. ఆధునిక జర్మను విజ్ఞానము లోకమంతటను ప్రసరింపవలయునను సిద్ధాంతాలిన తలంపులకును, ప్రయత్నములకును ఈతని వ్రాతలే మూలాధారములు. 1844 లో జన్మించెను. ఖాన్ విశ్వవిద్యాలయమునం దుపాధ్యాయుఁడుగా నుండెను. పుట్టినప్పటి నుండియు నేదో యొకకఠినబాధ ననుభవించుచుండెడి వాఁడు. 1900 వ సం.లో నొక ఉన్నత విద్యాలయమునందు కీర్తిశేషుఁడాయెను.

నౌకాఫిరంగులు:— 16 ఇంచి ఫిరంగులు 22 మైళ్ళు, 15 ఇంచి ఫిరంగులు 15 మొదలు 21 మైళ్ళు 13. 5 ఫిరంగులు 12 మైళ్ళు, 12 ఇంచివి 10 మైళ్ళు, 11 ఇంచివి 10 మైళ్ళు, 9.4 ఫిరంగులు 9 మైళ్ళు, 9.2 ఫిరంగులు 9 మైళ్ళు 8.2 ఇంచివి 8 మైళ్ళు, 7.5 ఇంచివి 7 మైళ్ళు 6 ఇంచివి 6 మైళ్ళు దూరమును పోవును.

నౌకాసేనాధికారి పదవులు:— మొదటివానిని 'అడ్మిరల్ ఆఫ్ ది ఫ్లీట్' అని పిలిచెదరు. రెండవవాఁడు అడ్మిరల్ అతనిక్రిందివాఁడు వైస్ అడ్మిరల్. ఇంతకు తక్కువదర్జాకేర్ అడ్మిరల్, దీనితరువాతిది కమ్మొడోర్, పిమ్మట కెప్టెన్, కమాండర్, లెఫ్టినెంటు, సబ్ లెఫ్టినెంటు, అను నధికారపు పదవులు గలవు.

వల్లని జనరలు:— మార్నె యుద్ధమునకుముందు మూఁడవ ఆర్మీకోరుకు సైన్యాధిపతిగా నియమింపబడెను. ఇచ్చట తనసాహస కార్యములవలన సర్ జాన్ ఫ్రెంచి గారు వ్రాసినట్లు మంచి శక్తివంతుఁడని ప్రకటింప గలిగెను

ప్రతాపసింగు; మహారాజాసర్:— ఇడారుమహారాజు. జోధపురమునకు రాజప్రతినిధిగా నుండెను. చైనా యుద్ధమునందును, తిరాదండయాత్ర యందును మరి యితర యుద్ధములలోను బోరిన రాజపుత్ర సింహము. 70 సం॥లు నిండినను జర్మనీమీఁద పోరుట తనవిధియని, యనేక కష్టములను గుడుచుచు పశ్చిమ రణరంగము నందున్నారు.

పింఛనులు:— చచ్చిపోయిన, లేక రోగమువలనగాని దెబ్బలవలనగాని మృతినొందిన నావికుల లేక సైనికుల భార్యలకు వారము 1-కి రూ 5-10-0 లు, వారి మొదటి బిడ్డకు వారము 1-కి రూ 3-12-0 తరువాత నున్న బిడ్డలకు తల 1-కి రూ 1-14-0 లు పింఛనుగా నొసంగబడును. మరి దారిద్ర్యపు స్థితిలోనుండి వృద్ధాప్యవేతన కమిటీవారు సిఫారసు చేసినచో భార్యకు వారము 1-కి రూ 9-6-0 ల వరకు పింఛ నొసంగవచ్చును. ఈమె తిరిగి వేరొకనిని పెండ్లి చేసికొన్నచో

CARRIED INTO THE OPERATION ROOM



సైనికుడు శస్త్రాలయములోనికి గొంపోబడుట

GIVING HIM MEDECINE



ఔషధ మొసంగబడుట

A WOUNDED SOLDIER CARRIED FROM THE FIELD



గాయపడిన సైనికుడు రణరంగమునుండి రెడ్ క్రాస్ వారిచలన
మంచముగుండ తీసికొనిపోబడుట

TAKING HIM TO HIS BED ROOM



పడకవద్ద కాతడు తీసికొనిపోబడుట

GERMAN PRISONERS PAYING RESPECTS TO THEIR MAJESTIES



జర్మను ఖయిదీలు వైద్యశాలలో రాజదంపతులను దర్శించుటకయి వచ్చుట

THEIR MAJESTIES' DEPARTURE



శ్రీ రాజదంపతులు విడిదికి వెళ్లుట

THE INTERIOR OF LADY HARDINGE HOSPITAL IN BOMBAY



బొంబాయి లేడీ హార్డింజి ఆసుపత్రిలో పడకలున్న భాగము. రణరంగమునుండి వచ్చిన రోగులు ఇచట చికిత్స చేయబడుచున్నది

OPPORTUNE HELP



ఒక రెడ్‌క్రాస్ దాయి దెబ్బతిని పడియున్న భటునికి చేసెడు సహాయముచేయుట

GERMAN SHELL ON A RED CROSS HOSPITAL



రెడ్‌క్రాస్ వైద్యాలయము మీద జర్మనులొక ఫిరంగిగుండును వేయుట

సైనికులకు పరిచర్యలు చేయుటకయి వెళ్లిన స్త్రీ పురుషు లెంతో ధైర్యవంతులయి యుండవలయును. వారిసేవ యెల్లప్పుడును ప్రాణోపద్రవములతో గూడియున్నట్టిది. గాయ పడిన సైనికులను వీరు ఫిరంగిగుండ్లొకప్రక్క మీద పడుచున్నను వెళ్లి తీసికొని వచ్చుచుందురు. వీరు ప్రాణములకు పయితము పరకుచేయక సేవచే దృఢవ్రతముగా నైకొనుట కడుంగడు శ్లాఘనీయముగదా! వైద్యశాలలమీద గాల్చగూడదని నియమములున్నను జర్మనులు లెక్కసేయక ఇట్టి పరిచారకులను, రోగులను ఫిరంగులువేసి చంపుచున్నారు.

THE GUNS OF THE "SYDNEY" IN ACTION



SURVIVORS FROM THE "EMDEN"



ఎమ్డెను తగులబడుచుండగా బోట్లెక్కి నావికులు తప్పించుకొనుట



సిడ్నీ యుద్ధనావనుండి ఎమ్డెనుమీద ఫిరంగులు ప్రయోగింపబడుట

పింఛను ఆపబడునుగాని రెండు సంవత్సరముల పింఛను 585 రూ.లు పెండ్లి కాగానే కట్నముగా గవర్నమెంటు వారివలన నొసంగబడును. ఆపెబిడ్డల కొసంగబడు పింఛను యివ్వబడుచునే యుండును. కుమార్తెల కీ పింఛను 16 సం. ల వయస్సువఱకు, బాలురకు 14 వఱకు మాత్రమే యియ్యబడును. బాలుడు 16-వ యేటవఱకు చదువుకొన దలచెనేని అంతవర కియ్యబడును.

యుద్ధమువలన పూర్తిగా నంగవిహీనులయిన సోల్జరులు, సెయిలరులకు బ్రహ్మచారులుగా నుండిరేని వారము 1-కి రూ 16-8-0 లు ఉపకారవేతన మొసంగబడును. వీరిలోనే పెండ్లియయి బిడ్డలు లేనివారికి రూ 12-6-0 లు వారమున కీయబడును. బిడ్డలు సయితమున్నవానికి వారము 1-కి రూ 17-4-0 లు యివ్వబడును.

పోపు:—లోకములోనున్న రోమనుకాథలిక్కు మతస్థులందరకును నధ్యక్షుడు. పూర్వము యూరపు ఖండమునంతయు నీపోపులు బొటనవ్రేలిమీద త్రిప్పిరి. ఇప్పుడదిపోయినను వారికి చాల ప్రాబల్యము ఈలోకములో కలదు. ఈప్రకృతపు పోపుగారిపేరు పయస్. ఈయుద్ధములో సంధి చేయింపవలయునని చాల ప్రయత్నములు చేసెనుగాని లాభము లేకపోయినది.

ఫిషర్. లార్డ్:—1854 లో ఆంగ్ల నౌకాసేనలో ప్రవేశించెను. క్రిమియనుయుద్ధము, చైనీసు యుద్ధము, అలెగ్జాండ్రియా ముట్టడులలో సముద్రనౌకాధికారిగా నుండెను. తరువాత ననేకోద్యోగములను జేసి 1904 మొదలు 10 వరకును నౌకాసేన కధ్యక్షుడాయెను. బ్రిటిషు యుద్ధనావల నభివృద్ధికి దెచ్చుటయం దీయన చేసిన కృషి లెస్స. సముద్రయుద్ధానుభవములో నీతనికి మించినవారు లేరు. 74 సంవత్సరములు నిండినను ఈయుద్ధమారంభము కాగానే సముద్రయుద్ధాంగ మంత్రి తరువాత రెండవ యుద్యోగ మొసంగబడెను. ఈయనకును, సముద్రయుద్ధాంగ మంత్రియగు చర్చిలుగారికిని డార్డనెల్సు జలసంధిని బట్టుకొను విషయమయి భేదాభిప్రాయము లంకురించి ఇద్దరును వారివారిపదవులకు రాజీనామానిచ్చిరి.



## ఫిరంగులు.

ఫీల్డుగన్సు:— ఇవి గుఱ్ఱములవలన లాగబడును. 13½ రతుల బరువుగల ఫిరంగి గుండ్లు మొదలు 35 రతుల గుండ్లవఱకును 5500 మొదలు 9000 గజముల దూరము ప్రయోగింపబడగలవు. హావిజరులు:—వీటినుండి విడువబడుగుండ్లు ఆకాశము నైపునకు వెళ్ళి, పగిలి, శత్రుసేనలమీద గురియును. ఇందు 300 సీసపు చిన్నగుండ్లుండును. ఈగుండ్ల పైవానికంటె కొంచెము ఎక్కువగా బరువుండును. ఇంతకంటె పెద్ద గుండ్లను ప్రయోగించు ఫిరంగులను హెవి ఆర్టిల్లి. అని పిలిచెదరు. గుండు బరువు 60 మొదలు 90 రతులు. పోవుదూరము 10,000 గజములు. సీజ్ఆర్టిల్లరి:— ఈ ఫిరంగులు కోటలను ముట్టడించుటయం దుపయోగపడును. వీనినుండి 250 మొదలు 2000 రతులవఱకు బరువుగల గుండ్లు ప్రయోగింపబడుచున్నవి. జర్మనులు లీజ నామూరు అంట్వెర్పు కోటలను పట్టుకొనినప్పుడు 880 మొదలు 2000 రతులవరకు బరువుగల యీ గుండ్ల నుపయోగించి వానిని పట్టుకొనిరి. ఈమధ్య జర్మనులును, ఫ్రెంచివారును ఒక్క టన్ను బరువును 5 అంగుళ ఎత్తునుగలిగి, 8 మైళ్ల దూరము పోగల గుండ్లను గొప్ప ఫిరంగులనుండి ప్రయోగించిరి. ఈ విచిత్రము లోకము నాశ్చర్యమగ్నమానసము చేసినది. ఇట్టి పెద్ద ఫిరంగులు మోటరు బండ్లమీద నుంచబడి కాల్చబడుచున్నవి. వీటిని రయిలుమీద మోసికొని వచ్చెదరు గాని ఏగుఱ్ఱములును లాగలేవు. మెషీన్ గన్:—ఇది తుపాకులలో బెట్టుతోటాలనే వరుసక్రమముగా గాల్చును. ఒకసారి విడువబడిన తోటాల వలన గలుగు చలనము వలననే యితరతోటాలు యంత్రములోని కెక్కునుగాని చేతితో కూర్చవలసిన పనిలేదు. గురి బహుసరిగా నుండును. చేతితో మోసుకొని పోవచ్చును. బహుప్రాణోపద్రవ కరమయిన యంత్రము. నిమిషమునకు 228 తోటాలను విడువగలదు. తుపాకి:—దీనిని ఆధునిక రైఫిల్ అని పిలిచెదరు. ఇంగ్లీషు సైనికుల తుపాకిలోని గుండు 2500 గజములు లేక 1 మైలు, 3 ఫర్లాంగుల,

106 గజముల దూరము పోగలదు. దాని బరువు 8 రతుల 10 ఔన్సులు. పది తోటాల నొక్కపర్యాయ మందెక్కించియుంచవచ్చును. ఇటువంటి రైఫిలులే యూరపు సేనల కన్నింటికిని గలవు గాని ఒక్కపర్యాయము పదింటి తోటాలు ఎక్కించుటకు వీలు లేనట్లుగా వారు నిర్మించుకొనిరి. తుపాకి గుండు :—ఇది రాగి, తుత్తునాగముతో చేయబడును. ప్రేల్చబడునప్పుడు రాగి తుపాకి కంటుకొనకుండ పయిభాగము నికెలుతో (మన దేశములోని అణా నాణెము చేయబడు లోహము) గప్పబడును. బ్రిటిషువారి తుపాకిగుండు 1¼ తులము బరువుండును.

ఫ్రెంచి. ఫీల్డుమార్షల్ సర్ జాన్ :—వయస్సు యిప్పుడు 62 సంవత్సరములు. మొట్టమొదట నౌకా సేనలో ప్రవేశించి తరువాత అశ్వ సేనోద్యోగిగా చేరెను, బోయరుయుద్ధమునందు జనరలు బుల్లరు క్రిందను, లార్డురాబర్ట్సు క్రిందను బాగుగా సేవచేసి వారి మన్ననలకు పాత్రుడాయెను. 1907-మొదలు 1911 వఱకు సైన్యములో ఇన్‌స్పెక్టరు జనరలు పదవిని నిర్వహించెను. 1913లో ఫీల్డుమార్షలను అత్యోన్నత సైనికగౌరవ మొసంగబడెను. ఆధునిక యుద్ధవిధానమును బాగుగా నడుపుటయం దీయనతోడివారు ఇంగ్లీషుసేనాధిపతులలో బహుకొద్దిగా గలరు. ఈ యుద్ధమును నతి జాగరూకతతోను, ధైర్యసాహసములతోను నడుపుచున్నారు.

బికనీరు మహారాజ :—ఆంగ్ల సైన్యమునందు కర్నల్ ఇన్ ఛీఫు పదవియందున్న రాజపుత్ర యోధుడు. యుద్ధభూమిలో పోరి కొంతకాలము స్వదేశమునకు వచ్చియున్నారు. రాజ్యకార్యవేత్త. దేశమును చక్కగా పరిపాలించుటయేగాక శాసనసభను గూడ ప్రజల కొసంగెను. బికనీరులో ఎడారు లుండుటవలన ఒంటెలసేనలు తయారు చేయబడును. వీరి ఒంటెలసేన లిప్పుడు ఈజిప్టు, అరేబియాలలో పోరి వీరికి కీర్తి నార్జించుచున్నవి.

బియాటి. అడ్మిరల్ :--1884లో బ్రిటిషునౌకాసేనలో ప్రవేశించెను. నైలునదీ యుద్ధమందు, పీకింగును పట్టుటయందును పోరెను. రెండు పర్యాయములు గాయముల దినెను. 38-వ సంవత్సరము నిండకమునుపే వైస్‌అడ్మిరలు అను గొప్పపదవిని పొందెను. ఇప్పుడు మొదటి బ్రిటిషు స్క్వాడ్రను కధిపతి. హెలీగోలాండు బైటులో అయిదు జర్మను డిస్ట్రాయరులను ముంచి ఘనతకెక్కెను. ఇంగ్లండులో తూర్పుతీరపు పట్టణములను కొన్ని నెలల క్రిందట గాల్చుటకయి వచ్చిన బ్లుచ్చెరను జర్మను బాటిల్ క్రూయిజరును ముంచి, మరిమూడింటికి గొప్పనష్టము కలుగజేసెను. ఈయన పతాకమెరుగు లయన్ యుద్ధనావలోని బాయిలరు శత్రువుల గుండుచే బ్రద్దలగుటవలన మరమ్మతుకయి పంపబడెను. ఈ సముద్రయుద్ధములో జయించుటవలన బియాటీగారి కీర్తి మరింత వృద్ధియయినది.

బెత్మన్ హాల్వెగ్. హెర్ వాన్ :—జర్మని ముఖ్యమంత్రి "సంధులు పనికిమాలిన కాగితపుముక్కలు. మేమాగజాలము. పారిసు పట్టుకొనవలయును. అందుచే లక్సెంబర్గ్, బెల్జియముల గుండ సమీపమార్గమున మేము వెళ్లకతీరదు" అని జర్మను పార్లమెంటులో నుడివి జర్మను మర్యాదయందు నమ్మక మింతవఱకును గల వారి భ్రాంతిని పొగడోలెను.

బోనర్ లా :—కన్సరు వేటివుల నాయకుడు. అన్నికక్షులవారును మంత్రులుగా నియమింపబడిన తరువాత అధినివేశమంత్రిత్వ మొసంగబడెను. మంచివక్త. ముఖ్యమంత్రి కావలసినట్టివాడు.

మందుగుండుసామాను :—ఒక్కసైనికునికి 120 తూటాలును అశ్వసైనికునికి 100ను ముందుగా ఇచ్చి యుద్ధములోనికి పంపుదురు. ఒక యంత్రఫిరంగికి 21,000 మొదలు,30,000 వఱకు సాధారణమయినతూటాలుతీసి కొనిపోబడును. హావిజర్ పెద్దఫిరంగులకు 100 రతుల షెల్లులు 50 గొంపోబడుచుండును. యుద్ధభూమికి వెనుక సప్లయిచేయుట కనేక డిపోలుండును. ఈ డిపోలనుండి మందుగుండ్లు, శరీరములో రక్తమెట్లు ప్రవహించుచుండునో ఆవిధముగా నిరంతరము బంపబడుచుండును.

ఫిరంగులు :--అనేక రకములవి. అన్నిరకముల ఫిరంగులును

ఆస్ట్రియాకు 2500, బెల్జియమునకు 204, ఫ్రాన్సుకు 4200, గ్రేటుబ్రిటను ఇండియాకలిపి 1070, జర్మనీ 5500, ఇటలీ 2200, రష్యా 6000, సర్వియ 500, టర్కీ 600, జపానుకు 2000 లును గలవు. యుద్ధారంభమునుండి ఈ సంఖ్య విశేషము పెరిగియున్నది.

మర్రె. జనరలు:—సర్ జాన్ ఫ్రెంచిగారి సహోద్యోగులలో సభ్యతుడు. జూలు యుద్ధమునందు బోరెను. దక్షిణాఫ్రికా యుద్ధములో అపాయకరమయిన గాయములను దినెను. ఎడతెగక యెల్లప్పుడు పరిశ్రమ చేయుచుండును

మాడన్. అడ్మిరల్:—అడ్మిరల్ జెల్లికోగారి సహోద్యోగులలో ప్రథముడు. ఆయన బావమరిది. 1882 ఈజిప్టుయుద్ధమం దుండెను. 1905 లో నేవల్ అసిస్టెంటు కంట్రోలరుపనిని జేసెను. ఇంక చాలగొప్ప పనుల నిర్వహించెను.

మాంటినీగ్రోరాజు:—74 సంవత్సరముల వయస్సుగల సుప్రసిద్ధరాజు. యూరపులోని రాజులకందరికంటె తక్కువభూమికలదు కాని పరాక్రమవంతుడు. తుర్కీని బాల్కనుయుద్ధములో నోడించినవారిలో నొకడు. అప్పుడు రాజ్యమును వృద్ధి జేసికొనెను. ఇప్పుడు ఆస్ట్రియామీద యుద్ధమునకు దిగెను. కవి. తనప్రజలకు కీర్తనలను పాడుటకయి వ్రాసిపెట్టుచుండును. సాధారణమయిన గుఱ్ఱము నెక్కి అనేక చోటుల సంచారము సామాన్యపౌరునివలె జేయుచుండును. ఈయన కుమార్తె ఎలేనా రాకొమారి ఇటలీరాజును పెండ్లాడినది.

మారిస్. ప్రిన్సు:—జార్జిచక్రవర్తిగారికిదాయాది. 23 సంవత్సరముల వయస్సు. కింగ్సురాయిల్ రైఫిల్సు కోరులో లెఫటినెంటుగానుండి గాయములుతిని మృతినొందెను.

మూర్. రేర్ అడ్మిరలు:—ఇప్పుడు మూడవ సముద్రప్రభువు. ఈజిప్టు సముద్రయుద్ధమునందు కొలువుచేసెను. 1907లో నేవలు అసిస్టెంటు పదవిని, 1908లో ఛీఫ్ఆఫ్ ది స్టాఫుపదవిని నిర్వర్తించెను. వయసు 63 సంవత్సరములు.

మూపూరప్ప. రాయ బహాదూర్:— మదరాసు దక్షిణమహారాష్ట్ర ఇనుపదారి ఏజెంటుగారికి పర్సనల్ అసిస్టెంటు. ఈగొప్పపదవి లభించిన రెండవ హైందవుఁడీయన.

మానిటరులు:—లోతులేని నీటిలో ఒడ్డుకుసామీప్యముగా ప్రయాణముజేయుచుండు ఒకతరగతి గన్ బోటుయుద్ధనావలు. వీటి బరువు స్వల్పముగా నుండును. వీనిలోని 6 ఇంచి ఫిరంగులనుండి 100 రతులగుండును 5 మైళ్లదూరమునకు వేయవచ్చును. ఇంగ్లీషువారి సెవరిన్, మెర్సి, హంబరను మానిటరులు బెల్జియము తీరము జేరకుండ జర్మనులమీద గాల్చి వారికి జాల నష్టమును గలిగించెను.

మోల్కి. జనరలు వాన్:—జర్మను జనరలు స్టాఫకు ముఖ్యుడు. 1870 లో ఫ్రెంచివారి నోడించిన జనరలు మోల్కికి సోదర కుమారుడు.

యుద్ధనిధులు:—ఈయుద్ధమువలన నష్టమును బొందుచున్నవారి సహాయార్థమయి అనేకనిధులు స్థాపింపబడినవి. ఈనిధుల కన్నింటికిని ప్రజలే ధనసహాయమును చందాలమూలకముగా జేయుచున్నారు. అందులోని క్రిందివి కొన్ని. (1) యువరాజుగారి యుద్ధనిధి. దీనికింతవరకు వసూలయినసొమ్ము $4\frac{1}{2}$ కోట్ల రూపాయలు భర్తలుపోయిన భార్యలకు, అనాథలయిన బిడ్డలకు, కుమారులు పోయిన తల్లితండ్రులకు, సైనికులమీద నాధారపడియున్న సామీప్యబంధువులకు ఈసొమ్ము వినియోగింపబడును. (2) మేరిరాణిగారి కుట్టుపని సమ్మేళనము. ఇందలి స్త్రీలు సైనికులకు నావికులకు వారువదలివెళ్లిన సంసారములకు గుడ్డలనుకుట్టి ఉచితముగా నొసంగుదురు. (3) బ్రిటిషు రెడ్ క్రాసు సొసయిటి. రణరంగమున దెబ్బలుతినినవారికి సమస్త యుపచారములను చేయుదురు. వీరివలన ననేకవైద్యశాలలు పోషింపబడుచున్నవి. (4) బెల్జియము సహాయనిధి. ఆదేశపు దిక్కుమాలిన ప్రజలకు సహాయముజేయునది. (5) సర్వియను సహాయనిధియునిట్టిదియే (6) మేరీ రాకొమారినిధి. ఇది క్రిస్మస్ బహుమానములను సైని

కులకును, నావికులకును గతడిసెంబరు నెలలో పంపుటకై స్థాపింపబడినది. ఈ రాకుమారి వీరందరికిని మిఠాయిలను, పొలడబ్బాలను, పొగాకును, కొన్నిగుర్తులను క్రిస్మస్ పండుగరోజుకు పంపెను. (7) ఇండియనుసోల్జరుల ఫండు. ఇది భారత సైనికులకు అపరదేశమందు కావలసిన యుడుపులను తినుబండారములను పంపుటకయి స్థాపింపబడినది. (8) ఇంపీరియల్ రిలీఫ ఫండు. ఇది ఇండియానుండి వెళ్లిన సైనికుల సంసార పోషణమునకయి రాజప్రతినిధి హార్డింజి ప్రభువువలన స్థాపింపబడెను. దీనికి మహారాజులు మొదలు పేదకాపులవరకును చేతనయిన సహాయము జేసిరి. సుమారొక కోటి రూపాయలవరకును ఈనిధికి సొమ్ము పోగయినది.

యువరాజు. జర్మను:—1882 లో జన్మించెను. ఫుట్‌గార్డ్సులో లెఫ్టినెంటుగా నుండెను. బాన్ విశ్వవిద్యాలయము నందభ్యసించెను. 1910 లో హిందూదేశమును జూచివెళ్ళెను. ఈప్రయాణములను గురించి యొకపుస్తకమును సచిత్రము వ్రాసెను. ప్యారిసుపట్టుకొనుటకయి ఈయుద్ధములో బంపబడిన సేన కధ్యక్షుడుగానుండెనుగాని సంకల్పము ఈడేరలేదు. ఈయుద్ధములో నంత గొప్పగా జోరికీర్తి వహించినట్లులేదు. ఇప్పుడు తూర్పురంగమున రష్యాపై పోరుచున్న సైన్యమున కధిపతిగా నున్నాడని వినికిడి కలదు.

రావిల్సన్. జనరలు:—బర్మా,సూడాను, దక్షిణాఫ్రికాలలో గొలువుచేసెను. ఇంగ్లండులో సేనానివాసములగు ఆల్డరుషాటు, సాలిస్‌బరీ మైదానములలో సైన్యాధికారిగానుండెను. 1887లో ఇండియాసర్వసేనాధిపతియగు సర్ ఫ్రెడరిక్ రాబర్ట్సుగారికి సహాయోద్యోగి. ఈయుద్ధములో 1915 మార్చి 9 వ తేదిన న్యూషాపెలులో జర్మనులను తన నాలుగవ సైన్యముతో తాకి వారి నాప్రదేశమును విడిచి పోవునట్లు చేసెను.

రాయలు ఇంజనీయరు పటాలములు:--- ఇందు 10,000 సైనికులు, (సాపర్సు, మైనర్సు) 1000 ఆఫీసరులు గ్రేట్‌బ్రిటనునకు గలరు. వీరు చేయవలసినపని యుద్ధభూమిలో కందకములు వగయిరాలను త్రవ్వి డానినిపోరు సలుపుటకయి సిద్ధముగా నుంచుట. నదులు వగయిరాలుదాటుటకయి వంతెనలుతాత్కాలముకట్టుట, చెట్లను నరుకుట, టెల్లిగ్రాపుతీగలను, టెలిఫోనులను భూమిలో నెలకొలుపుట, తదితర యింజనీయరింగుపనులను జేయుట. ముందుగా వీరువెళ్ళి పనిజేయవలసినవారగుటచే వీరిజీవిత మెల్లప్పుడుగొప్ప యుపద్రవములతో గూడుకొని యుండును.

రుష్యాచక్రవర్తి:---1868 మే6వ తేదిజన్మించెను. జార్జిచక్రవర్తిగారి తల్లి ఈయనతల్లి అక్కచెల్లెండ్రు. నిరంకుశాధికారియయినను ఈయుద్ధముచే ప్రజలకభేద్యమగు ప్రేమాబంధములచే బంధింపబడియున్నారు. వారికి రాజ్యపాలనమందు నూతనాను భోగముల గల్పించెను. రణరంగమునకు స్వంతగా వెళ్ళుచుండును. సారాయి అమ్మకమును దేశములో నాపి 100 కోట్ల రూపాయలకు పయిగా రాజాదాయమును పోగొట్టెను. ఈయొక్క సంస్కరణమాయనకీర్తి నెల్లకాలములకును వ్యాపింపజేయగలదు. ఈయన భార్యయు,ప్రధమపుత్రికయు, రుష్యాపటాలములలో గౌరవోద్యోగులగుటచే యోధవేషములను పటములలో ధరించియున్నారు.

రెన్నెన్‌కాంఫ్. జనరలు:—జనరలు కురుపాట్కిను క్రింద జపానువారిమీద రష్యాజపాను యుద్ధములో బోరెను. అశ్వసేనాధిపత్యమునందు గొప్పనిపుణుడని ప్రతీతికలదు. యుద్ధారంభమున తూర్పుప్రష్యాలో ప్రవేశించి జర్మనులను గూంబెన్నెన్ వద్ద నోడించెను. కాని తరువాత జనరలు హిండెన్‌బర్గుచే పూర్తిగా నోడింపబడి తరిమివేయబడెను.

రెడ్మాండు. జాన్:— ఐరిషు జాతీయ నాయకుడు. అత్యంత దేశభక్తుడు. ఐర్లండునకు స్వపరిపాలనము నొసంగు శాసనమును జేయించెను. ఆ శాసనము యుద్ధానంతరమున నాచరణములోనికి దేబడును. యుద్ధమారంభమయిన పిమ్మట ఐర్లండు దేశమంతటను దిరిగి ఉపన్యాసములిచ్చి, అనేకవేలమంది స్వదేశీయులను యుద్ధమునకు సిద్ధము జేయించి పంపెను. వారయిర్లండునకు శాశ్వత కీర్తి నార్జించుచున్నారు.

లక్సెంబర్గు రాష్ట్రము:—ఫ్రాంసు బెల్జియము, జర్మనీలకు మధ్యనున్న యొక చిన్న రాష్ట్రము. వైశాల్యము 1000 మైళ్లు. జనసంఖ్య 2½ లక్షలు. పార్లమెంటు కలదు. పాలకురాలు గ్రాండ్ డచెస్ మేరీ అనునామె. జర్మనులు ఫ్రాంసుపయిన పడుటకయి సంధుల నుల్లంఘించి ఈరాష్ట్రమును ప్రవేశించిరి. ఆదివారము ఆగస్టు రెండవ తేదిన ఈరాష్ట్రములో ప్రవేశించుచున్న జర్మను సైన్యము నెదుటతనమోటారుబండి నెక్కి రావలదని ఈమె అడ్డముగా నిలిచెను. పిస్తోలుతో జర్మనులీమెను చంప బోయిరి. ఇది అక్రమమని ఈమె కెయిజరుగారికి తెలియ జేసెను. ఈమె మొరల నెవరును విననది లేదు. జర్మనీకి ఖయిదీగా తీసికొని పోబడినదను వదంతి గలదు. ఈ రాష్ట్రమునంతయు జర్మనులు బెల్జియమును వశము చేసికొనినట్లు వశముచేసికొని యేలుచున్నారు.

లాయిడ్ జార్జిగారు—1890లో పార్లమెంటులో ప్రవేశించెను. సాలిసిటరుగా జీవిత మారంభించెను. సంగ్రామప్రసంగములయందు పెట్టినది పేరు. కోశాధ్యక్షుడుగా నుండి, ఇప్పుడు యుద్ధపరికరముల మంత్రిగా నియోజింపబడెను. మహావక్త. వృద్ధాప్యవేతనముల నింగ్లండులోని బీదల కిప్పించెను. జబ్బుపడిన పనివాండ్రకును, అవయవములు కర్మాగారములలో పోయినవారికిని ఉపకారవేతనము లిచ్చుపద్ధతిని ఆచరణములోనికి దెచ్చెను. ఈయన కుమారు లిద్దరు యుద్ధభూమిలో నున్నారు.

లూసిటానియా:—32,500 టన్నుల బరువుగల వర్తక నావ. దీనివంటి నావలు లోకములోనయిదారు కంటె నెక్కువ లేవు. నిర్మించుటకయిన వ్యయము 1కోటి 85½ లక్షల రూపాయలు. మే 7 వ తేదీన ఇర్లండు తీరమునకు 20 మైళ్లు దూరములో నుండగా జర్మను సబ్మెరయిను టార్పెడో వేసి ముంచెను. ఇందు 1959 మంది ప్రయాణికు లుండిరి. 900 మంది రక్షింపబడిరి. మిగిలినవారు మరణించిరి.

లేమన్. జనరలు:—లీజికోటల ననేకదినములు జర్మనుల వశముకాకుండ జేసి లోకప్రసిద్ధినొందిన సేనానాయకుడు. నగరము శత్రువుల వశమయినపిమ్మట లోసింస్ కోటలోనికి వెళ్లి ఫ్రెంచివారి సహాయము వచ్చునేమో యను ఆశతో చాలరోజులు పోరాడెను. జర్మను లొక్కొక్క కోటను పిండిపిండిజేసి ఈకోటను వశముచేసికొనినప్పుడు కోటకప్పు కూలుటవలన కాళ్లకు దెబ్బతగిలి స్మారకములేక పడియుండెను. తరువాత జర్మను జనరలువద్దకు తీసికొనిపోగా లొంగిపోతినని సూచించుట కాతనికి తనఖడ్గము నందించెను. ఆయన విశాలహృదయముతో "నీవే ఉంచుకొనుము. నీ ఖడ్గము సైనికమర్యాదల నుల్లంఘించియుండలేదు." అని యనెనట. లేమన్ గారిప్పుడు జర్మనీలో ఖయిదీగా నున్నారు.

వాండరుగోల్జు. ఫీల్డుమార్షాల్:— జర్మనుసేనలో గొప్ప నాయకుడు. బెల్జియముకు గవర్నరు జనరలుగా నియోగింపబడెను. కాని యిప్పుడు కాన్ స్టాంటునోపిలులో తురుష్కసైన్యముల కధిపతిగానుండి యుద్ధమును నడపుచున్నాడు. డార్డనెల్సు జలసంధి కిరుప్రక్కలనున్న కోటల నెంతో గట్టిపరచెను.

విక్టోరియా క్రాస్:—క్రిమియను యుద్ధమయిన తరువాత1850సం.లో నిపతక మేర్పఱుపబడెను. అద్భుత ధైర్యకార్యములకు మాత్రమే సత్కృతుగా సైనికులకు నావికులకు ఒసంగబడుచుండును. బ్రాంజులోహముతో చేయబడును. విక్టోరియా క్రాసు సంపాదించిన వాడు బ్రిటిషు సామ్రాజ్యమునందంతటను గౌరవింపబడు చుండును.

వియోగవేతనము:—భర్తలు సేనలోగాని నావలలోగాని యుద్ధముజేయుచున్నంతకాలమును వారికొసంగబడు జీతములుకాక భార్యలకు వారము 1కి బ్రిటనులో రు.9-6-0లు వేతన మొసంగబడును. ఇందులో రు. 2-10-0 లు మాత్రము సైనికుని జీతమునుండి తీసి యియ్యబడును. నలుగురుబిడ్డలవరకు బిడ్డ 1కి రు. 1-14-0 లును, అటుపయినున్న బిడ్డలకు రు 1-8-0 లును వారమున కొసంగబడును.

వియాలి, అడ్మిరలు:—ఇటలీవారి యుద్ధ నౌకాశాఖాధ్యక్షుడు. ఈయుద్ధములో ఆస్ట్రియావారి యుద్ధ

నౌకలు నిర్మించుప్రదేశము నప్పుడే పట్టుకొని, 14 అన్ని రకముల యుద్ధనావలను ఇటలీకి దీసికొని, పోయెను.

విమానములందుండు ఆయుధములు:---ఉక్కుటమ్ములు:—ఒక్క అమ్ము 2½ తులముల బరు వుండును. 1000 అమ్ముల నొక్క పెట్టెలోపెట్టి శత్రుసైన్యముల మీఁద ఫ్రెంచి వైమానికులు చల్లుచుందురు. భూమి మీఁదికి వచ్చునప్పు డొక్కొక బాణము 100 రతుల బలముతో వచ్చి స్వారిని, గుఱ్ఱమునుగూడ చీల్చుకొని పోవును. ఇట్టిపెట్టె లనేకములు ప్రతివైమానికుఁడును గొంపోవుచుండును.

సబ్మెరయినులు:— మొట్టమొదటి సబ్మెరయిను ఇంగ్లీషువారివలన1901-వ సం. నవంబరు 2వ తేదినిర్మింపబడెను. మొట్టమొదట వీని శక్తినిగురించి చాలమంది కనుమానములు కలిగినను ఈ యుద్ధములో సబ్మెరయినులు చేయుచున్న ఘోరకార్యములవలన అట్టి అనుమానము లన్నియు అంతరించినవి. ఇది ఉక్కుతో చేయబడి పొగచుట్ట ఆకారమును గలిగియుండును. నీటిలోనికి మునుగుటకయి బోటులోపల నున్న తలుపులను తెరచెదరు. అప్పుడు నీరు కొన్ని తటాకములలో నిండును. అంతట పడవ మునుగును. నీటిని పదినిమిషములలో పారబోయగల సాధనమువలన తేలికగా కావలసివచ్చినప్పుడు బోటు సముద్రముపయికి వచ్చును. కిరోసినాయిలు నుండుటవలన సబ్మెరయినులు నడుపబడుచున్నవి. కాని బొగ్గువలనగాదు. నీటిలో మునిగియున్నప్పుడిందుండు విద్యుచ్ఛక్తి యింజను పనిచేయును. సబ్మెరయినులలోని కిరోసినాయిలు చెరువులు నిండియుండెనేని మూడువేల మైళ్లు గంటకు 21 మైళ్ళ చొప్పున ప్రయాణముజేసి రాగలవు. వీనిలో నీటిబరువు 2000 టన్నులుండును. సుమారు నలువదిమంది మనుష్యులకు పీల్చుటకయి కావలసిన గాలి కొన్నిగదులలో వత్తియుంచబడును. కాన వారికి నిర్మలవాయువు లేదను భయములేదు. ఈబోటులకు కొనింగు టవరను శిఖరముండును. అది యొక తెరచాప కొయ్యవలె నీటి పైభాగమున నెల్లప్పుడును కనబడుచుండును. దీనిలోనే పెరిస్కోప్ అను ఒక యంత్రము కలదు. ఈ పెరిస్కోపు సులోచనములవంటిది. నీటి పైభాగమునం దేమి జరుగుచున్నదియు దీనివలన బోటులోనివారు తెలిసికొనుచుందురు. ఒకవేళ పూర్తిగా శత్రువులకు కనపడఁగూడదనినచో శిఖరమునుగూడ నీళ్ళలో ముంచవలయును. అప్పుడు సబ్మెరయిను కన్నులు మూసికొనిపోవు మనుజునివలెనే సముద్రములోపల నడవవలయును. వీనియందు 6 టార్పెడో గొట్టము లుండును. ఆగొట్టములనుండియే టార్పెడో శత్రునావపయిని ప్రయోగింపబడును. ఒక్క టార్పెడో విలువ 1 లక్ష రూపాయలు మొదలు 1 లక్ష 50 వేల రూపాయలవర కుండునట. 12 రతుల గుండును ప్రయోగింపగల నాలుగు ఫిరంగులును వీనియందుండును.

సాంసనోఫ్. జనరలు:—అగస్టు 1914లో తూర్పు ప్రష్యాపైన వెడలిన జనరలు రెన్నెన్ కాంపునాఁకి చాల సాయము చేసెను. ఇంతకుముందు రష్యా జపాను యుద్ధములో కీర్తిగడించినవాఁడు. టానెన్ బర్గవద్ద జరిగిన ఘోరయుద్ధములో మృతినొందిన రష్యను జనరలులు ముగ్గురిలో నొక్కఁడు.

సాలాండ్ర. సినర్:—ఇటలీకి ముఖ్య మంత్రి. పోపు మొదలగు మతాధిపతులును మరి యితర గొప్పవారును యుద్ధము వల దని తమశక్తి కొలఁది నివారించినను, లెక్కసేయక ఇటలీనుండి యిదివఱకు ఆస్ట్రియా యపహరించిన రాష్ట్రములను తిరిగి సంపాదించి ఇటలీకి శాశ్వతకీర్తి నార్జించుటకయి యుద్ధములోనికి దిగెను. ప్రజల కాతనియందు గౌరవము మెండు.

స్మిత్ డోరియన్. జనరలు:—వయస్సు 56 వత్సరములు. తన జీవితకాలములో నిప్పటికి పది యుద్ధములలోనయిన బోరిన రణవీరుఁడు. దక్షిణాఫ్రికా యుద్ధములో ప్రసిద్ధిపడసెను. మాన్సునుండి ఇంగ్లీషుసేనను నీ యుద్ధములో హతముగాకుండ బహు తెలివి తేటలతో రక్షించి మార్నె వరకును తీసికొనిపోయిన ధీరుఁడు. ఇంగ్లీషువారి రెండవసేన కధ్యక్షుఁడు.

సింగ్టా:—1898 లో ఇద్దరు జర్మనుమిషనరీలను చైనావారు చంపినారను మిషమీద వారితావునుండి జర్మనీవారు 117 చతురపుమైళ్ళభూమి నపహరించిరి. అదియే కియోఛావుజిల్లా. దానికి ముఖ్య రేవుపట్టణము సింగ్టా. దీనిని జర్మనులు బహు దిట్టముగా బలపఱచి యుద్ధనావల కునికిపట్టుగా పసిఫిక్ సముద్రములో జేసిరి. చేపలగ్రామమునుండి ఐశ్వర్యవంతమయిన రేవుపట్టణముగా మారెను. చక్కని భవనములును, బాటలును గలవు.

సైనికోద్యోగ చిహ్నములు:— ఈ చిహ్నములను కోటుకు చేతులవద్దగాని, భుజమువద్దగాని, వక్షస్థలమునగాని ధరించెదరు. సెకండు లెఫటినెంటుకు 1 నక్షత్రము, లెఫటినెంటుకు రెండు నక్షత్రములు, కెప్టనుకు మూడు, మేజరుకు కిరీటము, లెఫటినెంటు కర్నలుకు 1 కిరీటము 1 నక్షత్రము, కర్నలుకు 1 కిరీటము రెండు నక్షత్రములు, బ్రిగేడియరు జనరలుకు వక్షస్థలమున అడ్డముగా దాటునట్టి ఖడ్గములు, మేజరు జనరలుకు ఖడ్గములు, నక్షత్రము, శంగోలును, లెఫటినెంటు జనరలుకు పైవన్నియు పయిగా నొక కిరీటము, జనరలుకు లెఫటినెంటు జనరలుకున్నవి గాక పయిన నొక నక్షత్రము, ఫీల్డు మార్షలుకు అడ్డ శంగోలులు, కిరీటము, పతకముల మాల యుండును.

ష్రాప్నెల్:—ఇది షెల్లు మోస్తరుగానే యుండును గాని పైకప్పు బహుపలచగానుండి ఎక్కువ సీసపుగుండ్లు పోయుటకు వీలుండును. బ్రిటిషు ష్రాప్నెలులో 375 గుండ్లుండును. గురికి కొంచెము దూరముండగా భగ్గున బ్రద్దలయి గుండ్లను నానాముఖముల చల్లును. మనుష్యులను చంపుటయందు ష్రాప్నెలు బహు ప్రయోజనకారిగాని యిండ్లకెట్టి యపాయమును గలుగ జేయజాలదు.

షెల్లుపిస్తలు:—జెప్పెలిను మోడలపయి ప్రయోగించుటకు నిర్మింపబడినవి. ఒక్కగుండు వీనినుండి జెప్పెలినుకు దగిలినయెడల నది నిరర్థకమగును.

షెల్లు:—ఇది లిడ్డయిటుతో గాని తుపాకిమందుతోగాని చేయబడును. 10 రతులషెల్లుమొదలు 1టన్ను బరువుగల షెల్లువఱకును ఫిరంగులనుండి ప్రయోగింపవచ్చును. ఈ షెల్లులు విడువబడిన పిమ్మట భూమిమీదపడి ఆదెబ్బకు బ్రద్దలయి లోపల 100 మొదలు 1000 వఱకుండు సీసపుగుండ్లను శత్రువులమీదను, గుఱ్ఱములమీదను వెదజల్లి చంపివేయును. పెద్దషెల్లులు ఇండ్లను ధ్వంసముచేయగలవు. రెండవ రకపు షెల్లులు ఫిరంగినుండి విడువబడగానే వానికొకప్రక్కనుండు దారమునకు నిప్పంటుకొనును. ఆనిప్పు అర సెకండులోనో, ఒక సెకండులోనో, లేక కొన్ని సెకండులలోనో షెల్లులో ప్రవేసించి దానిని బ్రద్దలగునట్లు చేయును.

హాలండు రాణి:— ఈమె పేరు విల్హెల్మియా. ప్రిన్సు హెన్రీని పెండ్లియాడెను. హాలండు, జర్మనీకి సామీప్యమున నుండుట చేత ఎప్పుడేమి మూడునోయని సైన్యమును, యుద్ధనౌకలను సిద్ధము జేసికొని యున్నది.

హాల్డేను ప్రభువు:—బ్రిటిషు యుద్ధాంగమంత్రిగా 6 సం. లుండి ఈ యుద్ధమునకు సేనను బాగుగా తరిఫీయతు చేయించెను. జర్మను భాషలో గొప్పగా పరిశ్రమ జేసిన పండితుడు. తత్వశాస్త్రమునందు పేరు పొందిన వేత్త. మూడు సంవత్సరము లార్డు ఛాన్సెల్లరు (ప్రీవీకౌన్సిలులో మొదటి న్యాయాధిపతి) పనిని జేసెను. ఇప్పుడు మంత్రులలో మార్పు జరుగుటవలన నా పనిని మానుకొనెను.

హార్కోర్టు లూయి:—ఈయన తండ్రి గ్లాడ్ స్టన్ గారి కాలమందు మంత్రిగా నుండెను. ఈయన యు లిబరలు ప్రభుత్వములో బ్రిటిషు అధినివేశములకు మంత్రిగా నుండెను. ఇప్పుడన్ని కక్షులవారును మంత్రులగుటవలన నీయన తన యుద్యోగమును బోనర్ లాగారికొప్పజెప్పెను.

హామిల్టను. జనరలు సర్ ఐయన్:—ఆఫ్ఘను యుద్ధము, బోయరు యుద్ధము, చిత్రల్ దండ యాత్రలలో నుండెను. సైనిక వ్యవహారములను గురించి ఉత్తమ గ్రంథములను వ్రాసెను. ఇప్పుడు డార్డనెల్సు జల

సంధి కోటలపయికి పంపబడిన మిత్రమండలి సేన కధ్యక్షుడు. కాన్‌స్టాంటినోపు లీయన చేతిలో బడవలసి యున్నదట.

హిండెన్‌బర్గు. ఫీల్డుమార్షాల్:— 1870 లో ఫ్రెంచివారితో బోరిన సైనికులలో నొక్కడు. యుద్ధారంభమున నుపకారవేతనమును గైకొనుచుండెను. కెయిజరుగారు రష్యా నోడించు పనిని బెట్టి తూర్పు సేన కధ్యక్షుడుగా జేసెను. టన్నెంబర్గు వద్ద జనరలు రెన్నన్ కేంపు నోడించెను. రష్యను సేనలను తూర్పు పరిష్యాలో నోడింప జేసి సరస్సులలోనికి త్రోసెను. పోలండులో రష్యనులకయి కురికి వార్సాను పట్టుకొను నంత విజయమును పొందెను. రష్యనులను విస్చులా వార్టా ప్రాంతములందును తరిమివేసెను. కాని రష్యను లీతని సైన్యమును రెండుగా జీల్చి చాలభాగమును నాశము జేసిరి. ఈతడు తూర్పు రంగమున పొందిన జయములతో జర్మనీ దేశమంతయు ప్రతిధ్వనించుచున్నది. ఈతనిని దేవతగా ప్రజలు పూజించుచున్నారు. హిన్డెన్‌బర్గుగారి నభినందించుచు పంపబడిన తంత్రి వార్తలను నందచేయుటకయి టెలిగ్రాఫు శాఖ వారికి శక్తి లేక పోయినదట.

హేగ్. సర్ డౌగ్లస్:— ఫ్రాంసులో ఇంగ్లీషు వారి మొదటి సైన్యమున కధిపతి. ఏస్ యుద్ధములో బ్రిటిషుసేన నతిసాహస పరాక్రమములతో బోరించెను. ఈయుద్ధమును నడపుచున్న బ్రిటిషుజనరలులలో సర్‌జాన్ ఫ్రెంచిగా రంతవాడు. ఇంతకుముందు సూడన్, బోయరు యుద్ధములలో పోరు సలిపెను. ఇండియాలో సర్వ సేనాధిపతి యుద్యోగమును మూడేండ్లు జేసెను. యుద్ధారంభమునకు బూర్వము అల్డరుషాటులోని సేనల కధిపతిగానుండెను. ఈయనస్కాట్లండువాసి.

హైందవ మహారాజులు:—70 సం.ల వయస్సుగల సర్ ప్రతాపసింగు, అతని అన్న కొమరుకు 16 సం. ల ప్రాయమున్న జాడుపూరు మహారాజు, బికనీరు, జాంనగరము, ఇడన్ మహారాజులును మరికొంత మంది యు శత్రువులతో బోరుటకు వెళ్లిరి.

హైందవ సేన:— పదాతులు 138 బటాలియనులు, 40 రెజిమెంటులు, సాపర్సు మైనర్సు 27 కంపెనీలు, పర్వత బేటరీలు 12 ను గలవు. మొత్తపు సంఖ్య 1,59,000 మంది సైనికులు. రిజర్వులో నుండువారు 35,000. పదాతులకు జీతము నెల 1-కి 11 రూపాయలు. ఈ జీతములో పొట్టబోసికొని కొన్ని సైనిక యుడుపులనుగూడ కొనవలయును. సాధారణముగా 32 సంవత్సరములు వీరు కొలువుచేసి పింఛను పుచ్చుకొనెదరు. గుఱ్ఱమును స్వంతముగా దెచ్చుకొని దానిని పోషించుకొనుచుండు రాతునకు నెల 1-కి 35 రూపాయలు జీతమొసంగబడును. గుఱ్ఱము లేనివానికి 13½ రూప్యములు.

# టర్కీ రాజ్యము

టర్కీ రాజ్యముయొక్క ప్రాచీనచరిత్ర మహోత్కృష్టమైనది. సర్వియా మాంటినీగ్రో ఆష్ట్రియాల చరిత్రములను పఠించినవారికిది స్పష్టము కాగలదు. దీనికి సంబంధించినది యూరపులోని టర్కీ మాత్రమె కాదు; ఆసియాలోని టర్కీయు, ఆఫ్రికాలోని ట్రిపోలీ కార్యాలయము కూడ దీనికి చెందియుండినవియే. యూరపులోని టర్కీలో బాల్కను ద్వీపకల్ప మంతయు చేరియుండెడిది. ఏషియాలోని టర్కీలో అరేబియా, అర్మేనియా, ఏషియామైనరు, పెలస్తయిను, సిరియాలు చేరియున్నవి. 1898వ సం. లో వీరికి చెందియుండిన క్రీటుదీవు గ్రేటుబ్రిటను ఫ్రాన్సు ఇటలీ రష్యాల యాజమాన్యముక్రిందను, టర్కీవారి నామమాత్రపు టధికారముక్రిందను స్వాతంత్ర్య మీయబడెను. ఈ రాష్ట్రీయులలో పెక్కుండ్రు బలిష్ఠులును స్వామిభక్తులును స్వతస్సిద్ధ శూరులును నగువారు ఏషియామైనరులోఁ గలరు. వీరి సంఖ్య కనేక లక్షలుండి, తక్కిన తుర్కీ రాష్ట్రప్రజలలో ప్రతి జాతివారికంటెను మొత్తముకంటెను హెచ్చుడుగఁ గలరు. సామాస్ సైప్రస్ నివాసులవలెఁ గాక, వీరు స్వయముగా తుర్కీ ప్రభుత్వము (పోర్టే) క్రింది పరిపాలనలో నున్నవారు. దీని ప్రాంతములందు ఎఱ్ఱసముద్రము పక్కనే సింధుశాఖ గలదు. ఈజిప్టు నామమాత్రముగ టర్కీప్రభుత్వమునకు చేరిన దయినను 1841వ సం. నుండి యది స్వతంత్రముగనే యుండి తుదకు 1881వ సంవత్సరములో బ్రిటీషువారి యధీన మయినది.

1912-13వ సం. లో జరిగిన టర్కీ బాల్కను యుద్ధములో యూరపులోని భాగము చాలవఱకు కంకరించినది. ప్రస్తుతపు యూరోపియను టర్కీక్రింద యేజియన్ సముద్రతీరమందలి ఈనాస్ కద్దనుండి ఏడ్రియానోపిలుమీదుగ నల్లని సముద్రతీరము నందలి మిడియాజలకును గల రేఖకు దక్షిణభాగమున నుండు దేశము మాత్ర మున్నది. 1911-12వ సం. లో ఆఫ్రికాలో టర్కీకిఁ గల ట్రిపోలీ కిరీనెయికాలను ఇటలీవారు లాగుకొనిరి. టర్కీ ప్రస్తుతయుద్ధములో 1914వ సం. నవంబరు నెలలో శత్రుమండలివారి పక్షమున చేరినది. ఈయుద్ధములో వీరికి కలుగఁబోవు ఫలితముయొక్క చిహ్నములు అనుదినమును తంత్రీవార్తలవలన పాఠకు లూహించుచునే యున్నారు.



సూయజుకాలువను గాపాడుచున్న [illegible] వారి సైనికుడు

# ఇటలీ—యుద్ధరంగము

ప్రస్తుత మాస్ట్రియా దేశములోని భాగములగు ట్రీస్టు, టైరోలు పరగణాలు పూర్వము ఇటలీ దేశమునకు చెందినవి. ట్రీస్టు పరగణా ఇటలీ సరిహద్దులకు తూర్పున, టైరోలు ఇటలీకి పడమట గలవు. ట్రీస్టు పరగణాకు వెనిస్‌నుండి సేన పంపబడినది. టైరోలుకు ట్రెంటినోనుండి పంపబడెను. ఇటలీ బలహీనముగా నున్నప్పుడా పరగణాలను ఆస్ట్రియా అపహరించెను. ఆల్సేసు-లోరయిను పరగణాలను జర్మనులవద్దనుండి సంపాదించుటకయి ఫ్రెంచివా రెంతగొప్ప దీక్షవహించి యున్నారో అంతే దీక్షను ఇటాలియనులు తమ రెండు పరగణాలను సంపాదించుటకయి ఇంతకాలమునుండియు వహించిరి. ఈ రెండుపరగణాల ప్రజలలో 100 కి 80 పాళ్లు ఇటాలియనులే యని వ్రాయనవసరములేదు. ఈయుద్ధ ప్రారంభమునుండియు ఇటలీదేశము ఆస్ట్రియా జర్మనీలతో జేరక తనపరగణాలను సంపాదించుకొనుటకయి యుద్ధప్రయత్నాములను చేయుచు, ఆస్ట్రియా ఎట్టిరాజీకయినను వచ్చునేమో యని రాయబారములు 10 మాసముల వరకును చేసెను కానివారికిసంధి షరతులు కుదరనందువలనను, ఇటలీ ప్రజలు యుద్ధము యుద్ధమని ఘోషించుచుండుటవలనను మంత్రులిక యెంతమాత్ర మాగుటకు వీలులేక కత్తిని దూయవలసిన వారయిరి. ఆస్ట్రియా కింకొకప్రక్కనుండి బలవంతమగు శత్రువు లెదుర్కొనుట వలన రష్యా యొక్క భారము కొంతవరకు తగ్గగలదు. మిత్రమండలి వారి పక్షమున నొక గొప్ప దేశము చేరుటవలన వారి పక్షము మరింత బలపడినది.



ఇటలీకి తూర్పున జ్యూలియన్ ఆల్ప్సు కొండలు, ట్రీస్టు రాష్ట్రముకలవు. ఈ కొండలు సముద్రపు టొడ్డున నున్న ట్రీస్టునగరము వర కేటవాలుగా దిగును. ఈ కొండలలోనే ముఖ్యమయిన ఇటాలియను సేన ప్లెజ్జో, 7800 అడుగుల యెత్తున నున్న మాంటునీరో, కొలారియ, కాపోరెట్టో, టోల్మినో, ఇసోంజోనదీ ప్రాంతము, సాన్‌ఫ్లోరియన్, గోరిజియ, గ్రాడిస్కా, మాన్‌ఫాల్కోన్ అను చోటుల చేర్చబడియున్నది. మాన్‌ఫాల్కోను మీద ఇటాలియను యుద్ధనావలును ఫిరంగులను గాల్చి టార్పెడో స్థానములను పాడుచేసెను. ఈ తూర్పు సైన్యము యొక్క గమ్యస్థానము ట్రీస్టు నగరము. ట్రీస్టు రాష్ట్రము. ఇసోంజో నదీతీరము. ఇప్పటికి సేన అనేక వేల అడుగులను యెత్తునున్న కొండలకు ప్రాకి గొప్ప సైన్య సాహసములతో ఆస్ట్రియనుల పైనదహరించిన తన్ని తొప్పుల నోడించి పారదోలుచున్నది. ట్రీస్టు నగరపు రయిలు బాంబులవలన పాడు చేయబడుట వలన బాహ్య ప్రపంచముతో సంబంధము లేకుండ చేయబడినది. ఇది పూర్వము ఇటాలియనుల దేశమగుట వలన ఇటాలియనుసేన ఎచ్చటికి వెళ్లినను సోదరులవలె నాదరింపబడుచున్నారు. ఈ యుద్ధములో నతి కఠినమయిన దెబ్బ లిప్పటికి ఈ తూర్పుసేనవలననే ఆస్ట్రియనులకు తాకుచున్నవి. గలీషియా రంగమునుండి సేనను ఫిరంగులను పోయుటకయి ఈ రంగమునకు తీసికొని రావలసి వచ్చినది. ఆస్ట్రియాకు యుద్ధనావల స్థానమగు పోలామీద ఇటాలియను విమానములు బాంబులను వేసి చాల నష్టమును గలుగజేసినవి.

ఇటలీ పశ్చిమసేన ట్రెంటినో రాష్ట్రమునుండి బయలుదేరి కాని పయిననున్న ఆస్ట్రియా వారి టైరోలు రాష్ట్రములో జొరుటకు ప్రారంభించినది. కాని 10,000 అడుగుల యెత్తున యిచ్చట కార్నిక్ ఆల్ప్సు కొండలుగలవు. రయిలు మార్గములులేవుగదా, మంచి బాటలుయినలేవు. దేశము పర్వతమయ మగుటచేత ఆస్ట్రియను లనేక సంవత్సరముల నుండియు దృఢమయిన కోటలను గట్టి, కందకములను త్రవ్వి, ఫిరంగులను నెలకొలిపి, ఇటలీని యెదుర్కొనుటకయి సన్నద్ధమయి యున్నారు. అందుచే యిచ్చట యుద్ధము బహు నెమ్మదిగా జరుగును. ఎవరికి హెచ్చు దూరము పోగల ఫిరంగులును, పుష్కలముగా యుద్ధ పరికరములును నుండునో వారిదే ఈ దిక్కున విజయము. ఈ టైరోలు-ట్రెంటినో ప్రాంతమున నిటాలియనులు ఆలాను పట్టుకొని స్థిరవాసమేర్పరచిరి. ఇద్రో సరస్సుమీదనున్న స్టోరో నాక్రమించుకొనిరి. గార్డా సరస్సుకు తూర్పున నున్న ప్రదేశములో చేరిరి. ట్రెంటు కయిదు మైళ్ల దూరమునన్న బోర్గోను పట్టుకొనిరి. వారి ఫిరంగులసేన లావరోనీ-ఫోల్గారియా పంక్తులమీద గాల్చుచున్నది. ఆస్ట్రియా వారి రోవరెడో కోటమీద గాల్చగల వేరొక కొండను వశము చేసికొనినది. కాని యింతవరకును పశ్చిమమున జరిగిన పోరాటములు చిల్ల పోరాటము లనియే చెప్పవలయును. రోవరెడో ట్రెంటుకోటలు ఇటాలియనులకు పడినప్పుడు టైరోలు రాష్ట్రములో కాలూనుకొన్నవారని చెప్పవచ్చును. ఇచ్చట బెల్జియము ప్రాంతములోవలె కందకముల యుద్ధము ప్రారంభమగును. అప్పు డెన్ని మాసములు పోరినను ఏపక్షము వారికయినను 10 మైళ్ల దేశము దొరకుట దుర్లభము.



KING OF ITALY

ఇటలీ రాజు



QUEEN OF ITALY

ఇటలీ రాణి



DUKE OF ABRUZZI



THE POPE



DUKE OF AOSTA

ఓస్టప్రభువు. సేనానాయకుడు



DUKE OF GENOA

జెనోవాప్రభువు. అడ్మిరలు



ADMIRAL VIALE

అడ్మిరలు వియేలి. యుద్ధనౌకాశాఖాధ్యక్షుడు



GENERAL CANEVA

జనరలు కనేవ. సర్వసైన్యాధిపతి



GNOR SALANDRA

సినర్ సాలండ్ర. ముఖ్యమంత్రి



M. GIOLITTI

ఎం. గైయోలిట్టి. విదేశాంగమంత్రి

# అమృతాంజనము





నాగపూరు ప్రదర్శనమునందు




యీపతకము మొసగబడినది.

నకిలు మందులను గొనిన మోసముగలుగును.

తలనొప్పుల మాన్పును.
అన్ని నొప్పుల బారద్రోలును.
వాపులవాపు మాపును.
దురదను తొలగించును.
వేలకువేలు విక్రయము.
వాయుపోట్లు బాపును.
బెణుకుల భేదించును.




దగ్గును తగ్గించును.
తేలుబాధను తీసివేయును.
వెల 0-8-0 లు మాత్రమే.
ఎముకసల వెడలగొట్టును.
కీళ్ళపోట్లు పోగొట్టును.
పడిశముల పగిలించును.
పక్షవాతమును పోగొట్టును.

పంచభాషల గుర్తుగల యీఅమృతాంజనమునే చూచి కొనవలయును.

అమృతాంజనమును కొననివారు లేరు.

అమృతాంజనము జగత్ప్రసిద్ధిని గాంచియున్నది.

చిరునామా:—

అమృతాంజనండిపో,

7, తంబుసెట్టివీధి, మదరాసు.

# వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులు ఏ. వి. ఎస్; ఏ. ఎం. బి. వారి

## సుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధములు




జీవామృతము.

ఏకారణముచేత నైనను శరీరదార్ఢ్యము తగ్గినప్పుడు రెండు సీసాల మందు సేవించిన తోడనే యథాస్థితి శరీర బలము వర్ధిల్లును. ధాతువులను శక్తిమును వృద్ధి చేయును.

వెల సీసా 1-కి రు. 3—0—0.
వెల డజను 1-కి రు. 32—0—0.



## అమృతామలక తైలము.

జ్ఞానవంతులకు మెదడు వజ్రాయుధము. ఈ అమృతామలక తైలాభ్యంజనముచే సీఘ్రముననే వాడిగలుగును.

ప్రధానాంగమగు శిరస్సు చల్లబరుపబడుటచే సర్వావయవములకును సంతుష్టిగలుగును.

6 ఔన్సుల సీసా 1-కి రు. 0—12—0.
6 ఔన్సు సీసాలు 12 రు. 8—0—0.

## ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల

వైద్యవృత్తి నవలంబింప దలంచినవారికే గాక సాంప్రదాయ వైద్యజీవనముగల వారలకు సయితము మిక్కిలి ఉపయుక్తములు. ఇందొక్కొక్క గ్రంథము నొక్కొక్క విషయమును కరతలామలకముగ నొనర్చును. విశేష విషయముల నెఱుంగగోరువారు మాపుస్తకములపట్టిక కొఱకు వ్రాసికొనిన పంపబడును. పుస్తకముల నన్నింటిని గొన గోరువారు మాగ్రంథమాలకు శాశ్వత చందాదారులగుట మంచిది.

ఇప్పటికి తయారైన గ్రంథములు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| మాధవనిదానము | రు. 3—0—0 | 3—0—0 |
| అర్కప్రకాశము | ,, 1—8—0 | 2—0—0 |
| ఆయుర్వేదపరిభాష. | ,, 1—2—0 | 1—8—0 |
| పథ్యాపథ్యము | ,, 0—12—0 | 1—0—0 |
| భేషజకల్పము | ,, 0—12—0 | 1—0—0 |
| అగస్త్యవైద్యము | ,, 0—3—0 | 0—4—0 |
| వస్తికర్మము | ,, 0—3—0 | 0—4—0 |
| ఆయుర్వేదాంగశల్యతంత్రము | 0—3—0 | 0—4—0 |
| ఆయుర్వేద చరిత్రము | ,, 0—3—0 | 0—4—0 |

సుశ్రుతసంహిత - చరకసంహిత (అచ్చులోనున్నవి)

మహర్షి ప్రోక్తములగు అనేకాయుర్వేదీయ ఔషధములు ఎల్లప్పుడు సిద్ధముగనుండును.

### కేటలాగు ఉచితము.

టెలిగ్రాఫిక్ అడ్రసు:—
పండిట్, మదరాసు

ఆయుర్వేదాశ్రమం. మదరాసు, 55 ఆచారప్పన్ వీధి, జార్జిటవున్ మదరాసు.

సుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధములు

☞ ప్యాకింగు పోస్టేజి, వేరు.